నట్లును తత్పూర్వ మది ఎవ్వరికి తెలియనట్లును కలదు ఇక్కడ కూడా శంకరుడు పార్వతి చెప్పిన ఈ కథ అతి రహస్యమనియు అపూర్వ మనియు చెప్పబడినది. "ప్రియాయై గిరిశ స్తస్యై గూఢం వ్యాఖ్యాతవాన్ స్వయం-" కాని ఇట్లు చెప్పుట ఆనాటి పద్ధతి కాబోలు.

ఇది ఎట్లున్నను ఈ అధ్యాత్మ రామాయణము మహిమో పేతమని బ్రహ్మాండ పురాణముచే అగ్గింపబడియున్నది. అనేక ఫలములు చెప్పుచు "అధ్యాత్మ రామాయణ సంకీర్తన శ్రవణాదిజం ఫలం వక్తుం న శక్నోమి కార్త్స్న్యేన మునిసత్తమ" అనును. ఇది ఎంతటి గ్రంథ మైనను రామకథ వాల్మీకిదే యనుట నిస్సందేహము. ఆ రామాయణ మును బట్టియే ఇది వ్రాయబడినట్లు అధ్యాత్మరామాయణ మందలి శబ్ద ప్రయోగములు కథా గమనము ఇత్యాదులు విశదము చేయును.

ఇది వెనుక చెప్పిన ఉపనిషత్తులు బ్రహ్మాండ పురాణము వలెనే వాల్మీకి రామాయణమును విప్పి చెప్పునదిగా మాత్రమే ఉన్నది. వాల్మీకి దేనిని గోప్యముగా ఉంచెనో దానిని ఈ గ్రంథములు వివరించి నవి. ఇందు రాముడే సందర్భానుసారముగా తన పరతత్త్వమును భక్తులకు బోధించుచుండును. తన మంత్రమును, ఉపాసనావిధులను చెప్పుచుండును. ఉదా॥ "సౌమిత్రి రేకదా రామం ఏకాంతే ధ్యాన తత్పరం...అబ్రవీత్...ఇదానీం శ్రోతు మిచ్ఛామి క్రియా మార్గేణ రాఘవ, భవదారాధనం లోకే యథా కుర్వంతి యోగినః-" అప్పుడు రాముడు ఆ విధానమును చెప్పి "ఏవ ముక్తప్రకారేణ పూజయే ద్విధి-వద్యది, ఇహాముత్ర చ సంసిద్ధిం ప్రాప్నోతి మదనుగ్రహాత్" అని చెప్పును. అది ముగిసిన వెంటనే "పునః ప్రాకృతవ ద్రామో మాయా మాలంబ్య దుఃఖితః హా సీతేతి వదన్ నైవ నిద్రాం లేభే కథంచన-" రాముడు మాయలో బడి దుఃఖించును (అ. రా. కిష్కిం. కాం. 4 స) వీరందరు వాల్మీకికి వ్యాఖ్యాతప్రాయులే.

దేవీ భాగవతకర్త మరొక వాల్మీకిహృదయ వ్యాఖ్యాత. అధ్యాత్మ రామాయణకర్త వలెనే ఇతడును రామాదుల రహస్య వృత్తాంతమును ఆవిష్కరింప యత్నించును. కానీ అధ్యాత్మ రామాయణము పురాణములందు ప్రశంసింప బడినది కనుక దేవీ భాగవతము కంటె ప్రాచీనము కావచ్చును దేవీ భాగవతము తంత్ర గ్రంథములైన అగస్త్య పరాశర ఉమాది సంహితలకు సమకాలీనమో లేక కొంచెము తర్వాతిదో కావచ్చును. నానావిధ తంత్ర గ్రంథములందలి దేవీ విద్యావిషయములను క్రోడీకరించి లలిత మార్గమున చెప్పిన ఉత్తమోత్తమ గ్రంథము దేవీ భాగవతము—ఈ గ్రంథమున సీతా రామాదుల రహస్య వృత్తము లెట్లు వ్యాఖ్యానింపబడినవో చూతము:- సీత పరాశక్తిగా గ్రహింపబడినది. "ఇమాని అష్టశతాని స్యుః పీఠాని" అని 108 దేవీ పీఠములు చెప్పుచు "మందా హిమవతః పృష్ఠే గోకర్ణే భద్రకర్ణికా చిత్రకూటే తథా సీతా వింధ్యే వింధ్యాధివాసినీ" అని (దే. భా. 7 స్కం- 30 అ- 60 శ్లో) చెప్పును. సీత సాక్షాత్తు గాయత్రిగా గుర్తింపబడినది. త్రిజటా స్వప్నము గాయత్రీ మంత్ర వర్ణన అని నేను వివరించిన ప్రకరణమును ఇచ్చట అనుసంధించుకొన వలెను. (గాయత్రీ పటలమందలి అష్టోత్తర శతనామ స్తోత్రము విశ్వామిత్రునిచే రామునికి చెప్పబడినది. అందు "శుభ్రాంశవాసా సుశ్రోణీ సంసారార్ణవతారిణీ (160) సీతా సర్వాశ్రయా సంధ్యా సఫలా సుఖదాయినీ వైష్ణవీ విమలా కాలా మహేంద్రీ మాతృరూపిణీ") దే. భా 12 స్కం. 6 అధ్యాయమున గాయత్రీ నామావళీ చెప్పుచు, "జాతరూపమయీ జిహ్వా జానకీజగతీజరా(57 శ్లో)దండకారణ్యనిలయా దండినీ దేవపూజితా మానవీ మధుసంభూతా మిథిలాపుర వాసినీ" (124 శ్లో) రామచంద్ర పదాక్రాంతా రావణచ్ఛేదకారిణీ (137 శ్లో) వ్యాసప్రియా వర్మధరా వాల్మీకి పరిసేవితా (144 శ్లో), ఇట్లున్నది. (సీత నిట్లు గాయత్రిగా చెప్పుటకు రామాయణమం దేదో యాధార ముండవలెనుగదా! కనుకనే యిట్టివి వచ్చినవని భావము).

దేవీ భాగవతము రామకథను చెప్పినది. అది యెట్లున్నదనగా సీతను శ్రీమహాలక్ష్మి యని చెప్పును. "సాచ కాలాంతరే సాధ్వీ బభూవ జనకాత్మజా సీతాదేవీతి విఖ్యాతా యదర్థే రావణో హతః-లేభే రామం చ భర్తారం పరిపూర్ణతమం హరిం రమాసురుచిరం రేమే రామేణ సహసుందరీ" రావణుడు హరించిన సీత మాయాసీతఅనియు అరణ్యవాసమున వాస్తవ సీతను అగ్ని తీసుకొనిపోయి ఆ మాయా సీతను రామునకిచ్చి సీతాగ్నిప్రవేశ సందర్భమున తిరిగి వాస్తవ సీతను రామున కిచ్చినట్లు చెప్పబడినది. ఈ వ్యాఖ్యాన ప్రాయవచనమునకు వాల్మీకియే యాధారము. వాల్మీకి యుద్ధకాండమున అగ్నిప్రవేశము చేసిన సీతను అగ్నిదేవుడు మఱల రామునకిచ్చెనని చెప్పుచు సీత నిట్లు వర్ణించెను.

"తరుణాదిత్య సంకాశాం తప్త కాంచన భూషణాం
రక్తాంబర ధరాం బాలాం నీలకుంచిత మూర్ధజాం" (121స-శ్లో)

ఈ శ్లోకమును దేవీస్తోత్రములందు కలిపి వేసినచో రామాయణ శ్లోకమని గుర్తించుటకు వీలుకాదు. తంత్ర గ్రంథములతో పరిచయ మున్నవారు ఈ శ్లోకమందలి ఆదిత్య, కాంచన, రక్తాంబర, బాలాది శబ్దములు దేవీ ప్రసంగమున వచ్చునవని పోల్చుకొనగలరు. కనుక యిది గ్రహించి దేవీ భాగవతకర్త అగ్నిదేవుడు సాక్షాత్తు పరాశక్తిని శక్తి మంతుడగు రామునకిచ్చినట్లు మలచి చెప్పెను. ఆ గ్రంథమున అరణ్య వాసమున వాస్తవ సీతను అగ్ని తీసుకొనిపోవుట రామునకే తెలియు నట.

"దదర్శ తత్ర వహ్నించ విప్రరూపధరం హరిః-
జగత్ప్రసూం మయి న్యస్య ఛాయాం రక్షాంతికేధునా
దాస్యామి సీతాం తుభ్యం చ పరీక్షాసమయే పునః"

అని అగ్ని రామునకు చెప్పును. ఈ విషయము లక్ష్మణునకును తెలియదట.

"లక్ష్మణో నైవబుబుధే గోప్య మన్యస్య కా కథా"—

దేపి భాగవతకర్త రాముడనుటకు బదులు తరుచుగా 'హరిః' అనుచుండును.

"సహాయాన్ వానరాన్ కృత్వా బబంధ సాగరం హరిః"

అనగా వాల్మీకి రహస్యముగా నుంచిన వస్తువును వీరందఱు వ్యాఖ్యాన రూపమున బట్టబయలు చేసిరి. బట్టబయలుగా ఉన్నదాని కంటె గుప్తముగా ఉన్నదానికై లోక మెగబడుట సహజము కదా.

# వాల్మీకిలో వింతలు

## I

వేదమున కేది పరమార్థమో దానిని ప్రతిపాదించుటకే ఈ దేశమున శాస్త్రములు, పురాణములు, కావ్యములు ఉద్భవించినవి. ఆ కవులు వేదశాస్త్రపారంగతులు, పరమార్థ పరాయణులు. ప్రభుసమ్మితముగా ఏది చెప్పబడెనో, సుహృత్సమ్మితము ఏది చెప్పబడెనో దానినే కాంతాసమ్మితముగా చెప్పుటకు కవియను రూపాంతరము ధరించిన మహర్షు లవతరించిరి. వారు పరమార్థము కొరకే శబ్దార్థముల నాశ్రయించిరి. అనగా వారు శబ్దార్థ జనితసంసారలంపటులు గారు. కనుక పూర్వకావ్యములందు ఆ శాస్త్రార్థములే ధ్వనించుచుండుట సహజము. ఇట్టి కావ్యములందు కవ్యుద్దిష్ట పరమార్థములను గ్రహింపక కవిత్వము నాస్వాదించితి మనుకొనుట అజ్ఞానముగానీ, ఆత్మవంచనగానీ కావలెను. ఆదికావ్యము ఇట్టి సంప్రదాయమునే నెలకొల్పెను. సహజముగ వాల్మీకిమహర్షి కాలమున ఇంత విస్తారమైన సాహిత్యము లేదు. అప్పటి కావ్యము కేవలము వేదోపనిషత్తులపుత్రిక. శ్రౌతవాఙ్మయమందలి శబ్దములు, భావములు, పద్ధతులు, దేవతలు ఇత్యాదిసర్వము కావ్యమునందు ప్రవేశించెను. దీనికి రామాయణమే ప్రత్యక్షనిదర్శనము. వేదోపనిషత్తులకు రామాయణ కావ్యమునకు గల సంబంధ మెట్టిది అని పరిశీలించినచో అది ఆశ్చర్యకరముగ ఉండును.

రామాయణ హృదయమగు సుందర కాండమునే తీసికొందము. ఈ కాండము వంటిది కవితాదృష్టితో చూచినచో నభూతో నభవిష్యతి ఆ మహిమకు దేవతలునైతము మూర్ఛితులు కావలెను. అసలు రఘూ

స్యము వ్యాస నలోపాఖ్యాన మేఘసందేశ నైషధములు దీని పుత్రికలే! ఆ విచిత్రోదంతమును సోపపత్తికముగా మరొకసారి వివరింతును సుందరకాండములో మూడువంతులు మూకచిత్రమువలె నుండును. హనుమంతుడు లంకాపట్టణమును చూచుట అట్టి ఘట్టమే. అశోకవనికా వర్ణన మొకటి, శబ్దప్రయోగ భావపణిత్యాదు లందు విచిత్రముగా ఉండును. లంకానగర పుష్పకాదులుసైత మిట్లే ఉండును. సీతారావణుల ప్రథమసంభాషణ ఆశ్చర్యకరము! "నివర్తయ మనోమత్తః స్వజనే క్రియతాంమనః-న మాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధిమివ పాపకృత్" అని రావణునకు సీతయొక్క మొదటిమాట! ఆ మాట ఎట్లున్నది? వేదానుశాసనమువలె ఉన్నది. 'నిజాజ్ఞారూప నిగమాయై నమః. సంభాషణాచమత్కారము లెన్నో గలవు. రావణుడు సీతను ప్రలోభపెట్టుటకు ప్రయత్నించుచూ చెప్పినమాట చూడుడు- ఆధునిక కవులు మనోహరమని నేడు ఆరాధించుపద్ధతికన్న మిన్నగా ఉన్నది-"ఇదంతే చారుసంజాతం యౌవనం హ్యతివర్తతే-యదతీతం పునర్నైతి స్రోతః శీఘ్ర మపామివ"—అని నీ అందమైన యౌవనము, శీఘ్రముగా కారిపోవుచున్న నీటివలె గతించిపోవుచున్నది. పోయినది తిరిగిరాదు (కనుక నన్ను వరించి సుఖింపుము). ఒక అందమైన ఉపమానము చూడుడు— "ప్రాస్పందత్తైకం నయనం సుకేశ్యా-మీనాహతం పద్మ మివాభితామ్రం"-సీతకు శుభశకునములు తోచినవి. దానిని ఋషి చెప్పుచున్నాడు—తామరకొలనులో విహరించుచున్న చేపతోక తగిలి కదలిన ఎర్రతామర పువ్వువలె సీత ఎడమకన్ను అదరెను. వాల్మీకియొక్క కవితాప్రతిభ ఎట్టిదో తెలుసుకొనుటకు ముఖ్యముగా సుందరకాండము చూడవలెను. ఉపమా కాళిదాసస్య కాదు, వాల్మీకేః అనవలెను ఆ మహర్షినుంచి కాళిదాసు తీసికున్న అనేకసంపదలలో ఉపమ ఒకటి వాల్మీకి ఉపమ గైకొని కాళిదాసు రఘువంశము వ్రాసెను. ఆయన అర్థాంతరన్యాసము గైకొని మేఘసందేశమును వ్రాసెను. సుందర

కాండమందలి అర్థాంతరన్యాసములు లోకోత్తరములుగదా! "వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి" - "అనిర్వేద శ్రియో మూల మనిర్వేదం పరం సుఖం-అనిర్వేదోహి సతతం సర్వార్థేషు ప్రవర్తకః" ఇత్యాదులు. ఇక ఆయన శబ్దసంయోజనాఫణితి అద్వితీయము. ధర్మ సాధ్వసశంకితః, నిద్రాబలపరాజితాః, వృత్త శౌండీర్య గర్వితం (సీతా వచనం) ఇట్లుండును-ఆయన కవితా లక్షణము. కేవల కవితా రామ ణీయకములు చూచుచో ఒక మహాసముద్ర మగును.

కానీ ప్రస్తుతము నాపని అది కాదు. వాల్మీకికి శ్రౌతవాఙ్మయ మునకు గల సంబంధ మెట్టిది? అను విషయము వివరించుట. కొన్ని ప్రధాన విషయములు ప్రత్యేకముగ వివరించుటకు వదలివేసి యిప్పుడు కొన్ని చమత్కారములను మాత్రమే చూపెదను-చాలావరకు వాల్మీకి తన ఉపమానములను, శబ్దములను, భావములను శ్రుతుల నుండియే గైకొనెను. ఎట్లు ?

సీత రావణుని నిందించుచు "తోయ మల్ప మివాదిత్యః ప్రాణా నాదాస్యతే శరైః" అనును. అనగా సూర్యుడు నీటి బిందువులను వలె, రాముడు నీ ప్రాణములను బాణములతో తీసివేయును. ఋషికి యీ ఉపమాన మెట్లు స్ఫురించినది? ఇచ్చట ప్రాణములు జలము అను నది మూల భావము. ఆ భావము ఉపనిషత్తులందు కలదు. తైత్తిరీయ మున "ఆపో వా ఇదగ్ం సర్వం-విశ్వా భూతా న్యాపః — ప్రాణా వా ఆపః" అని కలదు. "ఆపోమయః ప్రాణో న పిబతో విచ్ఛేత్స్యతే అని ఛాందోగ్యము. (ఇదంతయు జలమేగదా, శరీరము లన్నియు జలమే. ప్రాణములు జలమే గదా.)

మరొకటి-చంద్రుడు ఆకాశమున సంచరించుచున్నాడు. ఎట్లు? గోష్ఠమునందు మదించిన వృషభమువలె--"దదర్శ ధీమాన్ దివి భాను మంతం, గోష్ఠే వృషం మత్తమివ భ్రమంతం"-కావ్యపరముగ ఇది మిక్కిలి రమణీయమైన ఉపమానము. చీకటి ఉన్న పశువుల శాలలో

తెల్లని ఆబోతు సంచరించుచుండుట నల్లని ఆకాశమున తెల్లనిచంద్రుడు సంచరించుచుండుట సమాన దృశ్యములు. కానీ ఋషికి ఈ ఊహ ఎట్లు వచ్చినది? వాక్కు గోవు అనుట శ్రుతి సిద్ధము. వాల్మీకి శ్రుతి సన్నిహితుడు. కనుక ఈ ఊహ స్ఫురించెను. ఋగ్వేదీయ సరస్వతీ రహస్యోపనిషత్తునందు "దేవీం వాచ మజనయంత దేవా స్తాం విశ్వరూపాః పశవో వదంతి-సానోమంద్రేష మూర్జం దుహానా ధేనుర్వాగస్మా నుపసుష్టుతైతు"-ఇట్లే యజుర్వేదమునందును కలదు. నైషధము నందు "ప్రేయోదూత పతంగ పుంగవగవీ-" (3స-130 శ్లో) అని ఈ భావము నాధారము చేసికొనియే చెప్పబడినది. గవీ అనగా వాక్. ఋషి దృష్టియందు చంద్రుడు సాక్షాత్తు శక్తికి శాస్త్రమందు నిర్దేశింపబడిన సంకేతము. కనుకనే ఆయన "రరాజ చంద్రోభగవాన్ శశాంకః" అనెను. అట్టి చంద్రుని వృషభమునకు పోల్చెను. ఈ వృషభ మెట్టిది? ఇది ఉపనిషత్తులం దున్నది! "చతుశ్శృంగో వమీద్గౌర ఏతత్, చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తా సో అస్య త్రిథాబద్ధో వృషభో రోరవీతి మహోవీరో మర్త్యాగ్ం ఆవివేశ."—మరొకటి "యశ్ఛం దసామృషభో విశ్వరూపః"-ఇదీ ఋషియొక్క వృషభము! కనుక వృషభమనగా బ్రహ్మోపలక్షక మగు ఓంకారము. ఇట్టి వృషభము గోష్ఠమునందు భ్రమించుట ఏమిటి? గావ స్తిష్ఠం త్యత్ర ఇతి గోష్ఠం-అని శబ్దోత్పత్తి. గోవు లందుండును కనుక గోష్ఠము. కానీ గోవు లనగా పశువులే గాదు, ఆ మాటకు అనేక అర్థములు గలవు. ప్రధానముగ వాక్కులని. కనుక గోష్ఠం అనగా వాక్కులుండు చోటు. వాక్కులుండుచోటు కంఠము. కంఠముఆకాశ తత్త్వ స్థానమైన విశుద్ధచక్రమునకు నెలవు. పరాశక్తియొక్క రూపాంతరమైన వైఖరీ వాక్కు అచ్చటనే అభివ్యక్త మగుచున్నది. కనుక గోష్ఠే వృషం మత్త మివ భ్రమంతం—అనగా వాక్ప్రపంచము గల ఆకాశతత్త్వస్థానమైన కంఠ సీమయందు ఓంకారమువలె, భగవంతు

డైన చంద్రుడు ఆకాశమునందు భ్రమించుచున్నాడని ఋషి హృదయము. ఈ వృషభమును ఉపమానమునకు గైకొను ఊహ ఇట్లేర్పడెను. ఈ భావమునే కాళిదాసూ రఘువంశమున "ప్రణవ శ్ఛందసా మివ" అనెను.

మరొకటి--సీతను ప్రలోభపెట్టుటకు రావణు డెన్నియో ప్రియములు చెప్పును. ఆమె సౌందర్యము తన్నాకర్షించినవిధము చెప్పుచు "మనోహరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా" అనును. అనగా ఓ సీతా గరుత్మంతుడు సర్పమును హరించునట్లు నీవు నా మనస్సును హరించుచున్నావు. దీని కావ్య రామణీయకము చెప్పుటకు మాటలు చాలవు. సీతను దక్కించుకొనుటకై సర్వనాశనమునకై నను సిద్ధపడిన రావణుని హృదయమును సీతసౌందర్య మెంత బలీయముగా ఆకర్షించెనో తెలుపుటకు ఇంతకంటె శక్తిమంతమైన ఉపమాన ముండబోదు. ఛక్కడో ఆకాశమార్గమున ఉన్న గరుత్మంతుడు నేలమీద సర్పమును తన నిశిత దృష్టితో చూచిన వెంటనే బాణమువలె నేలపై వాలి దానిని హరించుట మిక్కిలి విశిష్టమైన దృశ్యము. ఇది కేవలము అలంకారమేనా? కాదు. అలంకారధ్వని. గరుత్మంతునిచే హరింపబడిన సర్పము గతి ఏమగును? అది చచ్చుట తథ్యము. కనుక ఈ ఉపమానముచేత ఋషి భవిష్యత్తును సూచించుచున్నాడు. దానిని రావణుని చేతనే చెప్పించుట మరింత చమత్కారముగా ఉన్నది. ఇట్టి చమత్కార మెట్లున్నను ఈ భావ మెచ్చటిదో పరిశీలించినచో చిత్రముగా ఉండును.

సుదర్ణః అను శబ్దము ఎచ్చటిది? తైత్తిరీయమున త్రిసుపర్ణ మంత్రములని మూడు గలవు. అవి పరబ్రహ్మప్రతిపాదకములు. "బ్రహ్మమేధయా మధుమేధయా బ్రహ్మమేవ మధుమేధయా..." ఇత్యాది. ఈ త్రిసుపర్ణ శబ్దమునకు మామూలుగా చెప్పు అర్థము, మూడు మంచి రెక్కలుగలవాని మంత్రములు అని. మూడు రెక్కలు గలవాడు

పరమాత్మ అని వారిభావము. కానీ పరమాత్మకు మూడురెక్క లున్న వని వేదోపనిషత్తు లెచ్చటను చెప్పలేదు. కాని, వారు చెప్పు మూడు రెక్కలును బ్రహ్మ విష్ణు మహేశ్వరులు లేక విశ్వతైజసప్రాజ్ఞులు. వీరందరు శక్తియందు ప్రతిబింబించిన బ్రహ్మచ్ఛాయలు. కనుక వారు, త్రి అనుదానిని మంత్రశబ్దమునకు గాక సుపర్ణః అను శబ్దమునకు సంధించి అర్థము చెప్పుచున్నారు. రెక్కలు రెండుండుట సహజముగదా, మూడనుటెట్లు పొసగును ? అని ఆక్షేపించిన మీ వృషభమునకు నాలుగు కొమ్ము లెట్లున్నవి అందురు. కానీ గుర్తింపవలసినది వృషభమునకు నాల్గు కొమ్ములని వర్ణించినది శ్రుతి. మూడు రెక్క లన్నది వీరు, శ్రుతి కాదు అసలు సుపర్ణుని రెక్క లేవో మన మూహింపనవసరము లేదు. ఆ ఉపనిషత్తే మరొకచోట చెప్పినది చూడుడు - "ఋతం దక్షిణః పక్షః సత్యముత్తరఃపక్షః తస్య ప్రియమేవ శిరః మోదో దక్షిణః పక్షః ప్రమోద ఉత్తరఃపక్షః ఆనంద ఆత్మా బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అని బ్రహ్మ వల్లి. ఇతడే సుపర్ణుడు. ఋతమోదాదులు దక్షిణపక్షము, సత్యప్రమోదాదులు ఉత్తర పక్షము, ప్రియమే శిరము, ఆత్మ ఆనందము అయిన పర బ్రహ్మము సుపర్ణుడు. "భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః" అను వేదమంత్రమునందును, "స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః... పూషా విశ్వవేదా" ఇత్యాది చెప్పుచోట చెప్పబడినవన్నియు పరమాత్మ స్వరూపుడగు ఇంద్రుని విశేషణములుగా చెప్పబడినవి. అట్లే అచ్చటి "స్వస్తినః తార్క్ష్యో అరిష్టనేమిః" అనునది కూడా. అట్లే "ఏకం సద్విప్రా బహుధా వదంతి" అనునదియును. కనుక ఇదీ సుపర్ణశబ్దముయొక్క వాస్తవ స్వరూపము. అట్టి సుపర్ణుని యొక్క మూడు మంత్రములు త్రిసుపర్ణ మంత్రములు. కనుక ఋషి యొక్క శ్లోకమున సుపర్ణః అనగా పరమాత్మ. పన్నగము అనగా మనస్సు. పద్భ్యాం న గచ్ఛతీతి పన్నగః-పాదములచేత పోవనిది. మనస్సు పోవును కానీ, దానికి పాదములు లేవు. కనుక ఈ శబ్దము

పామునకేగాక మనస్సునకును వ్యంగ్యముగా వర్తించును. కనుక సుపర్ణః పన్నగం యథా అనగా పరమాత్మ మనస్సు హరించినట్లు సీతా నీవు నా మనస్సును హరించుచున్నావు. పరమాత్మ మనస్సును హరించుట ఏమిటి? మనస్సు విషయ సముచ్చయము. ప్రత్యాహార క్రియచేత సర్వవిషయములను యోగి విగళితముచేయగా మనస్సు లయ మగును అనగా నశించును. అట్లు మనస్సు లయించినంతనే ఆత్మ సాక్షాత్కార మగును. కనుక పరమాత్మ సిద్ధించె నన్నచో మనస్సు నశించిన దన్నమాటే. "గరుత్మంతుడు సర్పమును హరించె నన్నచో పన్నగము చచ్చినదన్నమాటే" వలె-సీత సాక్షాత్తు పరాశక్తి. ఆమెయందు బద్ధ మనస్కుడగు రావణుడు జీవుడు. "త్రైలోక్య వసు భోక్తారం రావణం రాక్షసేశ్వరం" అనబడినది. త్రైలోక్యవసువులకు అనగా సంపదలకు అనగా అన్నాది భోగద్రవ్యములకు భోక్త జీవు డనుట శాస్త్రము. కనుక వాని మనస్సును పరాశక్తి అనగా పర బ్రహ్మము హరించుట సమంజసమే ఈ శాస్త్ర విషయము ఆధార ముగా ఋషి "మనోహరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా" అనెను. ఇట్లే సముద్రలంఘనసమయమున ఆకాశమున పోవుచున్న హనుమంతుడు తనను "సుపర్ణ ఇవ చాత్మానం మేనే స కపికుంజరః" అనుకొనెనట. అట్లెందు కనుకొనెను? ఇది యోగశాస్త్ర విషయము చెప్పుచున్న సందర్భము. కనుక యోగము ననుష్ఠించుచున్న హను మంతుడు నేను సుపర్ణుడను అనగా నేను పరమాత్మను అని బ్రహ్మ భావన చేయుచు ప్రాణాయామము చేయుచున్నాడు. వీత మోహ ఇవాత్మవాన్, మేధావీ- అని ఋషిచే వర్ణింపబడిన హనుమంతుడు నేను సుపర్ణుడను అనుకొనినచో దాని అర్థ మిదిగాక మ రేదగును?

మరొకటి-సీత రావణునితో మాట్లాడుటేదుర్ఘటమగు విషయము. కాని "కాలోహి దురతిక్రమః" కనుక అట్టి దురవస్థ వచ్చినప్పుడు ఆమె గడ్డిపోచను అడ్డుగా చేసికొని వానితో మాట్లాడినట్లు "తృణ మంత

రతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా" అని ఋషి చెప్పెను. ఈ తృణము నిట్లు చేకొనుట యందలి భావమేమిటి? రావణుని తృణప్రాయముగ చూచుట అనియు, మరొకటి అనియు వూహింతురు. కానీ తృణము, పాపములను హరించి పవిత్రతను గలిగించునదని శ్రుతి చెప్పుచున్నది. తైత్తిరీయమున స్నాన మంత్రములు మూడు గలవు. శిరస్సున తృణముంచుకొని ఈ మంత్రములు చెప్పుచు స్నానము చేయవలెను "సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా సర్వగ్ం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్ననాశనీ" ఇత్యాది సహస్రపరమా—వేనకు వేలు శ్రేష్ఠమైన వానికంటె శ్రేష్ఠమైన, దేవీ—దేవియగునది, శతమూల, శతాంకుర అను దూర్వాతృణము నాయొక్క పాపములను హరించుగాక అని ఈ మంత్రార్థము. తృణమును శ్రుతి ఇట్లు చెప్పుచుండుటచేతనే ఋషి, సీత "తృణ మంతరతఃకృత్వా" రావణునితో మాట్లాడెను అని చెప్పెను. అనగా రావణునితో మాట్లాడుటచేత సంభవించిన పాపము తృణముచే శమింప జేయబడుగాక అని సీత భావము.

ఋషియొక్క శబ్దప్రయోగములు సైతము ఇట్లే ఉండును. అవి ఉద్దేశపూర్వకము గావచ్చును, కాకపోవచ్చును. కానీ నిగమాగమ భాష అప్రయత్నముగ దొర్లుచుండును. మందోదరిని వర్ణించిన శ్లోకము చూడుడు. "గౌరీం కనకవర్ణాంగీం ఇష్టాం అంతఃపురేశ్వరీం..." అట్టి మందోదరిని చూచి హనుమంతుడు "తర్కయామాస సీతేతి" సీత యనుకొనెనట. అనగా ఈ మందోదరి ఎవరో? గౌర్యై నమః. అంతఃపురేశ్వరీం అనగా త్రిపురములు. స్థూలసూక్ష్మకారణ శరీరములు, వాటికి ఈశ్వరి అనగా పరాశక్తియే. ఈ సందర్భమునకీ వివరణ యింతమాత్రము చాలును. మరొకటి—అశోకవనమున తామర కొలనును "ఇయం చ నళినీ రమ్యా ద్విజసంఘనిషేవితా" అనును. వెంటనే మనకు "ద్విజబృందనిషేవితాయై నమః అను లలితా

సహస్రనామావళి జ్ఞప్తికి వచ్చును. రావణగృహావర్ణనలో—నియుజ్యమానాస్తు గజా స్సుహస్తా స్సకేసరా శ్చోత్పలపత్రహస్తా బభూవ దేవీచ కృతా సుహస్తా లక్ష్మీ స్తదా పద్మిని పద్మహస్తా" అని కలదు. మనకు వెంటనే శ్రీసూక్త ధ్యానశ్లోకములోని "పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి" ఇత్యాది స్ఫురించును. రావణుని సంపదను వర్ణించుచు "యాహి వైశ్రవణే లక్ష్మీ ర్యా చేంద్రే హరివాహనే సా రావణగృహే సర్వా నిత్య మేవానపాయినీ"—అని చెప్పినశ్లోకమందు శబ్దములు శ్రౌతభాషా పరిమళము గలవేగదా!

మరొకచోట సీతనుగురించి హనుమంతు డిట్లని చింతించును—"మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా యది సీతాపి దుఃఖార్తా కాలోహి దురతిక్రమః." పెద్దలచేత శిక్షింపబడినది, లక్ష్మణునికి పెద్దవాడైన రామునికి ప్రియమైనది అగు సీతయే ఇట్లు దుఃఖా ర్తయైనచో కాల మెంత అనుల్లంఘనీయమో అని ఆశ్చర్యపడెను. ఇచ్చట లక్ష్మణస్య గురుప్రియాఅను శబ్దసంయోజన ఎట్లు ఘటిల్లెను! ఆగమ భాషా సంప్రదాయపరిపాటి గలవా డగుటచేతనే అట్లు "గురుప్రియా" అను శబ్దములు దొర్లినవి. "గురుప్రియా" అనగానే చప్పున స్ఫురణకు వచ్చునది "గురుప్రియాయై నమః" అను లలితా సహస్ర నామావళి. ఒక వేళ ఋషిహృదయ మదేనేమో!

మరొకటి—ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య రామస్య విదితాత్మనః అని రాముని అనెను. అట్లే బాలకాండములో ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః అని కలదు. సుందరకాండలో ఈ కృతజ్ఞశబ్దము రావణునికి కూడా ప్రయోగింపబడినది. "ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మ విశారదః" అని విభీషణుడు దూతవధనివారణ సందర్భమున రావణుని గూర్చి అనును. ఈనా డిది యుగలక్షణానుసారముగ ఎంత అప్రధాన శబ్దమైనను, రామ రావణాది మహాత్ములకు ఆనాడు వర్తించిన శబ్ద మిది, అదెంత ప్రధానమైన శబ్దమో దానినిబట్టి

ఊహింతురుగాక ! ఇంత విశిష్టమైనశబ్దము "కృతజ్ఞాయై నమః" అని లలితాసహస్రనామావళిలో గలదు. అనగా ఋషియే కవిత చెప్పుటకు పూనుకొనినచో శ్రౌత భాండారము నుండి ఈ సంపద లన్నియు తమంతట తామే దొర్లుచున్నవి.

ఇట్లెన్నో చిత్రములు గలవు. చిత్రములు లేని తావే లేదు. గ్రంథవిస్తరభీతి ఒకటి ఉండవలెనుగదా ! కనుకనే కతిపయ దృష్టాంతములు చూపితిని. ఈ దృష్టితో గ్రంథమును చూచినచో ఆనందదాయకము కాగలదు.

# వాల్మీకి శబ్దములు

## II

కావ్యమున శాస్త్రచర్చ అప్రస్తుత మనువారు వాల్మీకిలోని శబ్దములయొక్క, భావములయొక్క స్వరూప స్వభావముల నెరుగ జాలరు. అవి ఎట్లు ప్రయోగింపబడినవో, ఎందుకు ప్రయోగింపబడినవో పరిశీలింపవలసిన అక్కర వారికి లేదు; కనుక కేవలము వాచ్యార్థము లిచ్చు రామణీయక లేశముతో సర్వము పొందినవారివలె ప్రవర్తించు చుందురు. వారి చేతిలో అనేక ఆర్ష శబ్దములు భావములు పొందవలసి నంత గౌరవమును పొందుటలేదు. వాల్మీకి సీతాదేవికి శ్రీ మహాలక్ష్మి యను ధ్వనిని కావ్యమం దనుస్యూతముగ నిర్వహించెను. సుందర కాండమున ఇది అతి ప్రచురముగా గోచరించును. అట్టి ధ్వనితో ఋషి వాడిన శబ్దములయొక్క శాస్త్రార్థస్ఫూర్తి. సామాన్యార్థమే దీనికి గల దనువారికి ఎట్లు స్ఫురించును?

అట్టి శబ్దములందు సుందరకాండమందలి విద్యాశబ్ద మొకటి. సీతను ఋషి పలుమార్లు విద్యతో పోల్చెను. అది సామాన్యార్థములోనే గ్రహింపబడుచున్నది. కాని పూర్వాపరములు చక్కగ ఆలోచించి ఈ శబ్దము ప్రయోగింపబడిన శ్లోకములను చర్వణము చేసినచో విద్యా శబ్దము కేవలము శాస్త్ర పరిభాషగా వాడబడినదని విశదమగుచున్నది. రెండు శ్లోకములు తీసికొని దీని తత్త్వము వివరింతును.— సుందర కాండ 15 స. 35 శ్లో. నందు అశోకవనమున కృశించి శోకధ్యాన పరాయణ అయిఉన్న సీతను ఋషి, "కృశాం మలిన దిగ్ధాంగీం విద్యాం ప్రతిపదీ మివ" అని వర్ణించెను. (ఈ పాఠము కొన్నింటిలో లేదు) అనగా సీత ప్రతిపద్విద్యవలె కృశించినది అని అర్థము. సీతను

మన మెవ రనుకొనవలెనో ఋషి ఇచ్చట సూచించుచున్నాడు. "విద్యాం ప్రతిపదీ మివ"కు పాడ్యమినాటి విద్యవలె (క్షీణించి) అని చెప్పబూనుట, శ్రీకృష్ణు డనగా ఎవరు అను ప్రశ్నకు ఒక యాదవుడు అని చెప్పినట్లుండును. కృష్ణుడు యాదవుడు కాకపోలేదు; కానీ ఆ శబ్దముచేత తెలుసుకొనబడవలసిన దంతయు తెలుసుకొనబడలేదు అట్లే ఇచ్చట విద్య అనగా సామాన్యముగా పాఠశాలలందు గురువు యొద్ద నేర్చుకొను విద్య కాకపోలేదు. కానీ రామాయణ హృదయ మగు సుందరకాండమున అశోకవనమున కృశించిఉన్న సీతామహాదేవిని చెప్పుటకు ఋషియగు కవి పాడ్యమినాడు అభ్యసించు విద్యవలె కృశించి ఉన్నదని చెప్పునా? ఆ ఉపమానమునకును సీతకును గల సమాన లక్షణము కృశించి ఉండు టొక్కటే. అట్టి దొకటి ఉన్నదిగదా అని దేనినైనను ఋషి ఉపమానముగా గైకొనునా? ఔచిత్యము చూడడా? చూచినచో ఇట్లర్థము చెప్పుకొనుటకు అవకాశముండునా? ఆయన ఆ సన్నివేశమునకు ఆ పాత్రకు తగినంత ఉదాత్తమైన ఉప మానమునే గ్రహించును. అందును వేదశాస్త్రజుష్ట మగువారినే గ్రహించుట ఆయన లక్షణముగా రామాయణమునందు సుసిద్ధము. రావణుడు సీతను నిన్ను చంపెదనని బెదరించినప్పుడు "సూర్య స్సంధ్యామివౌజసా" అనగా సూర్యుడు తన తేజస్సుతో సంధ్యనువలె (చంపెదను) అనెను. పిల్లి ఎలుకను చంపినట్లు అనలేదు. అట్లే సీతను భుజముపై నెక్కించుకొని రామునివద్దకు కొనిపోయెదనని హనుమ సీతకు చెప్పునప్పుడు "ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుత మి వానలః" అనగా ఇంద్రునికి అగ్ని హవ్యమునువలె అనెను. ఋషి ఉపమానము లిట్లుండును.

కనుక- "కృశాం విద్యాం ప్రతిపదీ మివ-" అనగా విద్యాశబ్ద మునకు పాత్రయంతటి ప్రకృష్టమగు అర్థమే ఉండవలెనని ఊహించుట ధర్మము. ఇచ్చట విద్యాశబ్దమునకు పరాశక్తి యని అర్థము. ఋషి

ఈ ఉద్దేశముతోనే ఈ శబ్దమును వాడెననుకొనుటకు రెండు కారణములు గలవు. ఒకటి పూర్వాపర శ్లోకములందు పరాశక్తి నామములే అయిన స్మృతి, ఆజ్ఞ, కీర్తి ఇత్యాది శబ్దములే వాడి. ఈ ఒక్క శబ్దమునే సామాన్యార్థమున వాడుట అసంగతము; రెండు:- విద్యాశబ్దము సకల తంత్ర శాస్త్రగ్రంథములందును ప్రసిద్ధమై పరాశక్తికి పర్యాయపదముగా ఉండుట (దశమహావిద్యలని కాళీతారా షోడశీత్యాది పది శక్తులను చెప్పుదురు.) దేవీ భాగవతమున తత్కర్త వేదవ్యాస మహర్షి గ్రంథారంభ శ్లోకమునందే, "సర్వ చైతన్యరూపాం తాం ఆద్యాం విద్యాం చ ధీమహి బుద్ధిం యా నః ప్రచోదయాత్" అని ధ్యానించెను. (గాయత్రీ చ్ఛందము). దీనికి నీలకంఠ వ్యాఖ్య-" ఆద్యాం అనాది భూతాం- విద్యాం బ్రహ్మ విషయక శుద్ధ సత్త్వాంతర్ముఖ ప్రతిబింబ విశిష్ట వృత్తి రూపాం...ఏకైక శక్తి రంతర్ముఖతయా విలసంతీ విద్యాతత్త్వ రూపిణీ తదుపాధిక ఆత్మా తురీయ ఇత్యుచ్యతే...' ఇత్యాది. అందే మరి కొన్ని ప్రయోగములు- "చింతయంతు మహామాయాం విద్యాం దేవీం సనాతనీం" (పంచమోధ్యాయః); "విద్యాం శివాం సకలలోక హితాం వరేణ్యాం వాగ్బీజవాస నిపుణాం" (పంచమోధ్యాయః); ఈ విషయమే నిష్కృష్టముగా చెప్పబడుచున్నది. చూడుడు - విష్ణు కృత భువనేశ్వరీస్తుతియందు (చతుర్థోధ్యాయః); విద్యా త్వమేవ నను బుద్ధిమతాం నరాణాం, శక్తిస్త్వమేవ కిల శక్తిమతాం సదైవ, త్వత్ కీర్తికాంతి కమలామల తుష్టి రూపా..." బుద్ధిమంతులకు విద్యవు నీవే అని అర్థము. ఇంకను విద్యాశబ్దమునకు అన్యార్థము చెప్పబూను వారు బుద్ధిమతాం నరాణాం అనుమాటకు బాహ్యులగుదురు. ఇది సాక్షాద్విష్ణుసూక్తి. విద్యాయై నమః (ల. స. నా.)

మరి ప్రతిపదిం అనగా నేమి? "షోడశనిత్యానాం ప్రకృతి భూతాః కకారాదయః తాశ్చ షోడశనిత్యాః శుక్లప్రతిపద మారభ్య పౌర్ణమాస్యంత తిథిరూపాః కృష్ణప్రతిపదమారభ్య అమావాస్యాంత

తిథిరూపాః తా ఏవ చంద్రకళాభిధానాః చంద్రకళా ఏవ ప్రతిపాదిత తిశయ ఇతి సుప్రసిద్ధం" (సౌందర్యలహరి 32 శ్లో. లక్ష్మీధర వ్యాఖ్య). కనుక ప్రతిపత్ విద్యా అనగా పరాశక్తి. ఆమెయొక్క ప్రథమకళయే ప్రతిపత్ అనబడును. ఈ కళయందే మిగిలిన పంచదశకళలకు ఉత్పత్తి లయములు. ఈ షోడశ కళలు, షోడశనిత్యలు, షోడశతిథులు, షోడశీ మంత్ర వర్ణములు అభిన్నములని శాస్త్రము. ప్రతిపత్, తిథి అనుకొన్ననూ, అదియును పరాశక్తికే అన్వయించును. "ప్రతిపన్ముఖ రాకాంత తిథిమండల పూజితా" అను ల. స. నా నామమునకు వ్యాఖ్య వ్రాయుచు భాస్కరరాయలువారు "తిథిశబ్దో నిత్యాపరః" అనెను. ఈ ప్రతిపత్కళ సహస్రారమున ఉండును. అదియే ధ్రువకళ, ఆత్మకళ. అది దృశ్యాదృశ్యముగా అతి సూక్ష్మముగా "బిసతంతుతనీయసి"గా ఉండును. కనుక "విద్యాం ప్రతిపదీ మివ" అనగా పరాశక్తియొక్క ప్రతిపత్ కళవలె కృశించి యున్నదని గ్రహింపవలెను.

సీతకు ఈ చంద్రకళోపమానము బహుళముగా చేయబడినది. అది పునరుక్తిగాదు. ఆమె పరాశక్తి అని సూచించుటకే. 5. స 26 శ్లో. సుందరకాండమున "అవ్యక్తరేఖామివ చంద్రరేఖాం" అనబడినది. అవ్యక్తరేఖయే ఆత్మకళ. అవ్యక్త అనగానే ఈ శాస్త్ర విషయము చప్పున స్ఫురింపవలెను. అది పరిభాష కనుక. అవ్యక్తాయై నమః (ల. స. నా).

మరికొన్ని చోట్ల ఋషి ఈ విద్యాశబ్దమును స్త్రీ దైవత్య మంత్రము అను అర్థమున వాడెను. అట్టి చోట్ల కూడా వేదవిద్య అనియో ఏదో ఒక సామాన్యార్థమే చెప్పుచున్నారు "ఆమ్నాయానామయోగేన విద్యాం ప్రశిథిలామివ దుఃఖేన బుబుధే సీతాం హనుమాననలంకృతాం" (15 స. సుందర), సందర్భానుసారముగ చూచినచో ఋషి హృదయమున విద్యా అనగా ఇచ్చట మంత్రమనియే అర్థము. కానీ వేదవిద్య అనిగాని లేక సామాన్య విద్య అని గానివాచ్యార్థముగా

తీసుకొనవచ్చును. కానీపరమార్థమదిగాదు శ్రీ రుద్రయామళతంత్రమున శివకృతమని చెప్పబడిన ఆమ్నాయషట్కము మంత్రోపాసకులకు అవశ్య స్తోతవ్యము. దేవ్యుపాసనయందు నవావరణార్చన షడామ్నాయార్చనతో ముగియును. మహామంత్రము లన్నియు ఆరు భాగములుగా విభజింపబడినవి అవియే పూర్వ దక్షిణ పశ్చిమ ఉత్తర ఊర్ధ్వానుత్తరామ్నాయములు. ఈ షడామ్నాయ దేవతలు దేవీ చింతామణీ గృహద్వారములవద్ద కాపుందురు. వారి ప్రీతిపొందక దేవ్యనుగ్రహము సిద్ధింపదు- అట్టి ఆమ్నాయస్తోత్రము లేక శిథిలమైన విద్యయును. దుఃఖముచే కృశించిన సీతయును సమాన మనుటగాని యద్వా-నిర్ణీత కాలమున నిర్ణీతమయిన సంఖ్యాప్రకారము మంత్రమును జపించవలెను. దీనినే విధిపురశ్చరణ అందురు. అట్టి జపసంఖ్యయందు న్యూనాతిరేకములు రాగూడదు. అట్టి జపములేక శిథిలమైనమంత్రమువలె ఉన్న సీత అనికాని-ఋషి హృదయము. (వాల్మీకికి పూర్వమే తంత్రములున్నవి. రుద్రయామళ తంత్రము వేదమున కన్న ప్రాచీనమని కొందరు మూర్ఖ తాంత్రికు లందురట. ఇదంతయు ఆధునిక పరిశోధకులు వారి బోధలే ప్రమాణము లనుకొనువారు గుర్తింతురుగాక.)

వేదములకు పదపాఠక్రమాదులచేత గురుశిష్యపరంపరచేత ఆమ్నాయత్వము (పునఃపునరావృత్తి) సిద్ధించుచున్నది. ఈ పద్ధతి లేనిచో ఆ విద్య శిథిలమై యుండెడిది. అట్లే శిథిలమై అనగా ఖిలమై పోకుండుటకుగాను తంత్రశాస్త్రమందలి మంత్రములను కూడా పునరావృత్తి కలిగించుటకై అట్టి ఆమ్నాయవిభజన షడామ్నాయస్తోత్రము స్థాపింపబడియుండును. వేద విషయమునగాని తంత్ర విషయమునగాని ఆమ్నాయశబ్ద ప్రయోగతత్త్వ మిదే అనుకొనుట సమంజసము.

కనుక-యథా ఆమ్నాయానా మయోగేన ప్రశిథిలాం విద్యాం, తథా దుఃఖేన కృశాం సీతాం హనుమాన్ బుబుధే, అని అన్వయము. అచ్చట దుఃఖము ఒక ఉపపత్తి. కనుకనే "తర్కయామాస సీతేతి

కారణైః రుపపాదిభిః" అనబడెను. హనుమ సీతను దుఃఖముచేత పోల్చు కొనెను. సీతకును విద్యకును సమానధర్మములు కార్శ్యశైథిల్యములు. ఒకచోట కార్శ్యమునకు హేతువు దుఃఖేన మరొకచోట అమ్నాయా నామయోగేన-"విద్యా మివ విశ్యంతీం హతకాంతాం వధూ మివ" అను పశ్చిమోత్తర ప్రతిలోని పాఠము నా భావమును దృఢముచేయు చున్నది.

కానీ కొందరీ వాక్యమును పీకి తత్పూర్వశ్లోక పాదమైన "తస్య సందిదిహేబుద్ధిర్ముహుస్సీతాం నిరీక్ష్యతు' అనుదానితో చేర్చి, ఆవృత్తులు లేక శిథిలమైన విద్యనువలె సీతను మాటిమాటికి చూచుటచేత హనుమ బుద్ధి సందేహమునందెను, అని చెప్పిరి. ఇచ్చట-ఆవృత్తులు లేకపోవుట మాటిమాటికి చూచుట అనునవి సమాన ప్రక్రియలు కావు. ఆవృత్తులు లేకపోవుటచేత విద్య శిథిలము కావచ్చునుగాని మాటిమాటికి చూచుట చేత బుద్ధి సందేహము నెట్లుపొందును? కనుక అర్థము పొసగుటలేదు. ఈ పొసగక పోవుట చేతనే ఈ ద్విశ శ్లోకపాద సంయోజనమందు ఏదో పొరపాటు కలదని ఊహింపవలెను.

ఇట్టి బాధయే తర్వాత శ్లోకమునందును వచ్చును. అనగా పూర్వోక్త ప్రమాదఫలితమే అనంతర శ్లోకమునకును వ్యాపించినది. దుఃఖేన బుబుధే పాదమును, "సంస్కారేణ యథాహీనాం వాచమర్థాం తరం గతాం" అను తదనంతర శ్లోకపాదమునకు చేర్చి, వ్యాకరణ సంస్కారము లేక మరొక అర్థమును పొందిన వాక్యమును వలె అలం కారములేని సీతను హనుమ కష్టము మీద తెలిసికొనెను అని అర్థము చెప్పబడినది. అలంకారములేని సీతను గుర్తించుట కష్టముగాదు. సీత పతివ్రతగనుక అలంకార మున్నప్పుడే కష్టము. అలంకార రహిత గనుకనే హనుమంతుని సందేహమునకు ఆ లక్షణము సహాయకారి ఆయెను. మరొకటి - వ్యాకరణసంస్కారములేని వాక్కు, అనగా భాష, అర్థాంతరము నెట్లు పొందును? ప్రజలు మాట్లాడుభాష

వ్యాకరణ సంస్కారములేనిది (ఈనాడు వ్రాయుభాషకే లేదు). కాని అట్టి సంస్కార రహితమైన మాట్లాడుభాషకు అర్థాంతరము సంభవించు చున్నదా ? వ్యాకరణ సంస్కారమున్న గ్రాంథిక భాషయందును శ్లేషధ్వని ఇత్యాది అర్థాంతర స్ఫురణా ప్రక్రియ సంభవించుట లేదా ? అరాంతర మొక వైభవమేగాని కళంకము గాదుగదా? ఈ అర్థము చెప్పినవారు ఎంతవారైనను ఇది సమ్మతముగాదు కనుక ఇన్ని విప ర్యయము లున్న ఈ పద్ధతి కవ్యుద్దిష్టార్థము కాజాలదు.

ఇచ్చట సంస్కారము అనగా మంత్రసిద్ధికై సాధకు డవలంబింప వలెనని శాస్త్రము చెప్పిన సంస్కారములు. యమనియమాసనాది అష్టాంగయోగానుష్ఠానముచేత శరీరము, చిత్తము పరిశుద్ధములగును. మంత్రన్యాస, కళాన్యాస, షోఢాన్యాసాది న్యాసములును సంస్కార రములే. అవి ఈ పాంక్త శరీరమును దహించి మంత్రశరీరము నిచ్చును. కానీ ఇట్టి సంస్కారములచేత సాధకుడు హీనుడగును. అనగా కృశించును కానీ తేజస్సు పొందును. (హీనన్యూనా వూనగర్హ్యా అని అమరకోశము ఆప్టేకూడా) కనుక "సంస్కారేణ హీనాం" అనుట సీత కృశించియుండుటను సూచించుటకే. పూర్వాపర శ్లోకములందు అను- స్యూతముగ చెప్పబడుచున్న సీత కార్శ్యమును గుర్తింపవలెను. "ఉప వాసేన ధ్యానేనచ భయేన చ, పరిక్షీణాం కృశాందీనాం అల్పాహారాం తపోధనాం" అని సీత చెప్పబడినది. కనుక సంస్కార శబ్ద హృదయ మిది. ఇక వాక్కు విషయము : అర్థాంతరం గతాం అనగా అర్థాంతర మును పొంది స్వకీయార్థమును కోల్పోవుట గాదు. ఆ భావ మిచ్చట చెప్పబడలేదు. స్వకీయార్థ ముండగా విశేషార్థము నీయగల సమర్థత కల్గుట. స్వకీయార్థము వాచ్యార్థము, విశేషార్థము, ధ్వని. అట్టి వ్యంగ్య వైభవము సంస్కరింపబడిన భాషకే సిద్ధించు లక్షణము. సంస్కారము చేత సంక్షేపింపబడిన భాష విపులముగా ఉండక సార్థక పకదైకమాత్ర ముగా ఉండును. కనుక అట్టిభాషకే వ్యంగ్యావైభవసిద్ధి కలుగునుగాని,

శబ్దబాహుళ్యముగల భాషకు కలుగదు. సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతాం అనగా ఇది. ధ్వనిస్థానమున సీతయందు తేజస్సు గలదు. సంస్కారములచేత సాధకునకు తేజస్సు కలుగును; కాని అతడు కృశించును (ఎజ నిశాతనే) కనుక సంస్కారముచేత భాష యెట్లు కృశించునో అట్లు సంస్కారములచేత కృశించిన సీతను అని చెప్పుకొనవలెను. ఇచ్చట ఋషి సీతను తపస్విని అని వర్ణించుచుండుట జ్ఞాపకముంచుకొనవలెను. సమష్ట్యాం :- యథా సంస్కారేణ హీనాం (తస్మాదేవ) అర్థాంతరం గతాం వాచం, తథా సంస్కారేణ హీనాం సీతాం-తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిందితాం - ఈ గ్రంథమున శ్లోకమునకు రెండు పాదములుండు పద్ధతి పాటింపబడనట్లు గ్రహింపవలెను. లాహోరు ప్రతియందును ఇట్లే ఉన్నది. దీనిని గుర్తింతురుగాక. కనుక ఆమ్నాయ శ్లోకమున విద్యాశబ్దమునకు స్త్రీ దైవత్య మంత్రమని ఋషి ఉద్దేశము.

విద్యాశబ్ద మట్లే ప్రయోగింపబడిన మరొక శ్లోకము: "అహ మౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః "(21 స. 17 శ్లో.) సీత రావణునికి చెప్పినమాట. నేను శ్రీరాముని కొక్కనికే భార్యగా ఉపయోగించుదానను. ఎట్లనగా, వ్రతస్నాతుడు విదితాత్ముడు అగు విప్రునకు విద్యవలె - అని అర్థము. దీనికి చెప్పు సామాన్యార్థము - విద్యావ్రతస్నాతుడై ఆత్మవేత్త అయిన బ్రాహ్మణునకు విద్యవలె అని వ్రతస్నాతు డనగా బ్రహ్మచర్యము ముగించి గృహస్థాశ్రమము ప్రవేశింపబోవువాడు అనియును, విదితాత్ముడనగా ఎరుగబడిన ఆత్మ గలవాడని వాచ్యార్థములు కావచ్చును. కానీ ఇచ్చట అట్లయినచో ఒక విరోధము వచ్చుచున్నది. అహ మౌపయికీ భార్యా తస్యైవ అనుటచేత రామునకే భార్యగా ఔపయికిని అను ఏవార్థము కలదు. కనుక ఇచ్చట రెండు సూక్ష్మము లున్నవి. ఒకటి - తొలుత కొన్ని యోగ్యతలు గడింపబడ

వలెను- రెండు - పిదప తత్ఫలితముగా సిద్ధి కలుగును. ఫలిత యోగ్యతలకు ఇచ్చట కార్యకారణ సంబంధ మున్నది. కారణ మున్ననే కార్యము అట్టి తాత్పర్య మీ వాక్యమునం దున్నప్పుడే ఏవార్థము చెప్పబడవలెను; లేనిచో అక్కరలేదుగదా? సామాన్యముగా వ్యాఖ్యానములందు చెప్పబడిన అర్థము చెప్పుకొన్నచో ఈ భావము వచ్చునా? రాదు, ఎట్లు? వ్రతస్నాతత్వ ఆత్మవేత్తృత్వములు యోగ్యతలు విద్య ఫలితముగదా. అట్లయినచో తొలుత ఉండవలసినవి యోగ్యతలు పిదప కలుగునది విద్య. కాని సామాన్యముగ చెప్పుచున్న పద్ధతియందు చెప్పవలసిన కార్యకారణక్రమము - విద్య తొలుత, పిదప వ్రతస్నాతత్వను అటుపిమ్మట ఆత్మవేత్తృత్వము అనగా ఆత్మవేత్తృత్వము ఫలితము. విద్యావ్రతస్నాతత్వములు కారణములు. ఇట్లే అయినచో "విద్యేవ" విద్యవలె అని విద్యకు ఫలితస్థానమిచ్చి భార్యా తస్యైవ అని భార్యకు ఉపమానముగా ఎట్లు చెప్పవచ్చును? కనుక ఈ పద్ధతి సమంజసముగాదు. ఇచ్చట విద్యను ఫలితము జేసి వ్రతస్నాతత్వ విదితాత్మత్వములను కారణములు జేయవలెను. అప్పుడే తా నా రామునకే భార్యనను ఏ వార్థము వచ్చును. అనగా విద్య ఫలితమగును; భార్యకు విద్య ఉపమాన మగును. అప్పు డర్థ మెట్లుండవలె ననగా:- వ్రతస్నాతుడై విదితాత్ముడైన విప్రునకే విద్యవలె నేను రామునకే భార్యను. ఇప్పుడు విదితాత్మనః అనగా ఆత్మవేత్త కాదు. అట్లనుట పొసగదు. (అదే ఫలితము కావున) ఆత్మ ఎరిగినవానికి అని చెప్పుకొనవలెను. ఆత్మ అనగా వేదాంతపరిభాష గాదు: అంతఃకరణ ఎరిగిన లేక హృదయ మెరిగిన అని అనుకొనవలెను. వ్రతస్నాతు డనగా విధిపురశ్చరణాదికమైన వ్రతమునకు, మంత్రానుష్ఠానమునకు పూర్వము శుచియగుటకు చేయు అఘమర్షణ స్నానము. మంత్రహృదయ మెరిగినవానికి గాని మంత్రము సిద్ధింపదని శాస్త్రము. యద్వా - మంత్రము యొక్క ఋషి, ఛందస్సు, దేవత, శక్తి, బీజము, కీలకము ఇత్యాది షడంగ జ్ఞానము లేనిదే మంత్రము సిద్ధింపదు. అట్టి జ్ఞానము కలిగి

యుండుట విదితాత్మత్వము. శ్లోకార్థమునుబట్టి ఇట్లర్థము చెప్పుకొనవలసి వచ్చుచున్నది; లేనిచో ఋషి భావమునకు భంగము కలుగును.

వ్రతస్నాతత్వాది యోగ్యత ఉన్నవానికే భార్యగా నేను ఔపయికని అని సీత చెప్పినది. అనగా ఈ యోగ్యతలు ఆమెను పొందుటకున్న ఉపాయము. కనుక ఔపయికీ శబ్దప్రయోగము. ఈ ఔపయికీ శబ్దము వాల్మీకియే సృష్టించినదిగా తోచుచున్నది. ఇది కిరాతార్జునీయ, నైషధములందు కనుపించుచున్నది. వాల్మీకి పూర్వ ప్రయోగములు కనిపించుటలేదు. వాల్మీకి ఈ శబ్దమునకు కర్త అయినచో ఇట్టి రూపమును ఆయన ఏ భావముకొరకు సాధించెనో తెలిసికొనవలదా?

ఉపాయము తెలిసినవానికే వాంఛితము సిద్ధించును. ఇదీ మన శ్లోకమందలి ఏవార్థము, ఉపైతి వాంఛిత మనేన ఇతి ఉపాయః. ఇచ్చట సీత, విద్యలు వాంఛితములు; వాటిని పొందుటకు ఉపాయము రామత్వ, వ్రత స్నాతత్వాదులు. కనుక ఇట్లు ఉపాయము అను అర్థము చెప్పుటే ఋషి హృదయము. ఉపాయ ఏవ ఔపయికః అని లింగాభట్టీయము-కాని వ్యాఖ్యాతలు ఈ ఔపయికీ శబ్దమునకు యుక్తమని ఉచితమని అర్థముచెప్పిరి. అట్లు చెప్పినచో ఏవార్థలక్షణము శక్తిహీనమగును. అమరకోశకారుడు ఈ శబ్దమునకు వ్యాఖ్యాతల అర్థమునే చెప్పి, యుక్తము, ఔపయికము, లభ్యము ఇత్యాది ఆరు శబ్దములు సమానార్థకములని చెప్పెను. ఇతడు భారవి, కాళిదాస వరాహమిహిరాదులకు సమకాలీనుడై 6వ శతాబ్దపు వాడగు విక్రమాదిత్యుని ఆస్థానమున ఉండెనని చరిత్రకారులు చెప్పుదురు. ఇతడు వాల్మీకి యొక్క ఔపయికీ శబ్దహృదయము గ్రహించినట్లు తోచదు. ఇద్దరు ఉద్దండకవులు భారవి హర్షులు ఈ శబ్దమును వాడిన పద్ధతి చూచినచో వారు ఉపాయమను అర్థమునందే వాడినట్లు విశదమగును. వీరిరువురి యందు ఇట్లు ఐకమత్య ముండగా ఒక్క అమరకోశకారుడే భిన్నముగా ఉన్నాడు. అతడు సమానార్థకములన్న యుక్త లభ్యశబ్దము

లందును వాస్తవముగా చూచినచో సమానార్థకత లేదుగదా? కిరాతార్జునీయ ప్రయోగము చూడుడు- "శివ మౌపయికీం గరీయసీం ఫల నిష్పత్తి మదూషితాయతీం విగణయ్య నయంతి పౌరుషం విజితక్రోధ రయా జిగీషవః" (2స. 25 శ్లో). మల్లినాథుడు వ్యాఖ్యచేయుచు ఔపయిక ముపాయం అనెను; శ్లోకార్థమును సంగ్రహముగా చెప్పుచు "పౌరుష ముపాయేన యోజయంతీత్యర్థః" అని చెప్పెను. ఇట్లే హర్ష నైషధము "అచిరాదుపకర్తు రాచరే దథ వాత్మౌపయికీ ముప క్రియాం" (2 స. 14 శ్లో.) ఇచ్చటకూడా మల్లినాథుడు "ఉపాయ ఏవ ఔపయికః" అని చెప్పి, "ఆత్మౌపయికీం స్వోపాయ సాధ్యా మిత్యర్థః" అని చెప్పెను. కనుక మన ప్రకృతశ్లోకమున ఔపయికీ అనగా ఉపాయసాధ్యా అనియే అర్థము. ఉచితయుక్తాదులు ఎంత మాత్రమును సరిపోవు. కనుక అర్థము: వ్రతస్నాతుడై మంత్ర హృదయ మెరిగినవానికే విద్య అనగా మంత్రము సిద్ధించునట్లు నేను రామునకే భార్యగా సిద్ధించు ఉపాయము గలదానను—

ఇట్టి నా అభిప్రాయమును బలపరచుటకు ఒక ప్రబలమైన కారణమున్నది. ఈ విదితాత్మనః అనుదానిని ఋషి అనేక పర్యాయములు ప్రయోగించెను. ఎక్కడను ఆత్మవేత్త అను అర్థమున వాడ లేదు. అన్నిచోట్ల హృదయ మెరిగినవాడు అను అర్థమునసే వాడెను. (1) మహాతేజా రామేణ విదితాత్మనా (16 స. 10 శ్లో) (2) రామస్య విదితాత్మనః ఇయం సా దయితా భార్యా (16 స. 18 శ్లో) (3) రాజ సింహస్య రామస్య విదితాత్మనః (19 స. 7 శ్లో.) (4) రాజసింహానాం ముఖ్యస్య విదితాత్మనః (33స. 15 శ్లో) (5) ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః (30 స. 42 శ్లో) ఇంకా ఇట్లెన్నో గలవు. కనుక ఇన్నిచోట్ల హృదయ మెరిగిన వాడని ప్రయోగించి మన శ్లోకమునందే ఆత్మవేత్త అను అర్థమున వాడునా? కనుక విదితాత్మనః అనగా మన శ్లోకమున మంత్రహృదయ మెరిగినవాడనియు విద్యఅనగా మంత్రమనియు గ్రహించుట సమంజసము.

వీటి అన్నిటికంటె ఋషి మాటనే ప్రమాణముగా చూపెదను. 28 స. 5 శ్లో. న సీత, "భావం నచాస్యాహ మలం ప్రదాతుం, అలం ద్విజో మంత్రమివాద్విజాయ," అనెను. ద్విజుడు మంత్రమును అద్విజున కివ్వజాలనట్లు నేను రావణునకు నా హృదయము నివ్వజాలను అని అర్థము ఇక్కడ మంత్రము హృదయము సమానస్థానములందున్నవి. హృదయ మెవరికిత్తునో వానికి భార్యనగుదును. కనుక హృదయము పొందినవానికి సిద్ధి. ఈ భావమే అహ మౌపయికీ శ్లోకమున భంగ్యంతరముచే చెప్పబడినది.

అయితే రామునికి తెలిసిన ఉపాయము మరొకనికి తెలిసినచో సీత వారికి సిద్ధించునా? అనగా సిద్ధించుననియే సమాధానము. దేవీ సప్తశతియందు శుంభనిశుంభులు తమలో ఎవరినో ఒకరిని వరింపుమని జగన్మాతను కోరుచు సుగ్రీవుడను దూతను పంపిరి. "మాం వా మమానుజం వాపి నిశుంభ మురువిక్రమం భజ త్వం చంచలా పాంగీ-" దానికి దేవి గంభీరాంతః స్మితయై "యో మాం జయతి సంగ్రామే, యో మే దర్పం వ్యపోహతి. యో మే ప్రతిబలో లోకే స మే భర్తా భవిష్యతి" అని సమాధానమంపెను. కనుక ఇచ్చట ఉపాయమను అర్థము నిష్కళంకము.

రెండవ ప్రకరణము

# శ్రీ సుందరకాండ పేరెట్లు వచ్చినది ?

"తదున్నసమ్ పాండురదంత మవ్రణమ్,
శుచిస్మితమ్ పద్మపలాశలోచనమ్,
ద్రక్ష్యే తదార్యావదనమ్ కదాన్వహమ్,
ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్."

ఎత్తయిన నాసిక కలదానిని, తెల్లని దంతములు కలదానిని నిష్కళంకమైన దానిని, నిర్మలమందహాసము కలదానిని, పద్మపత్రముల వంటి కన్నులు గలదానిని, ఆ ఆర్యయొక్క ముఖమును ఎప్పుడు చూతునో- అని ఈ శ్లోకమున కర్థము. ఎవరో ఒక ఉపాసకుడు (భక్తుడు) ఇష్టదేవతా సాక్షాత్కారము ఎప్పుడగునో అని ఆవేదన పడుచున్న ట్లున్నది (ఈ శ్లోకార్థము) ఆర్యావదనం అనుట చేత ఆ దేవత జగన్మాతయగు పరాశక్తి యగునేమో అనిపించును. పద్మపలాశలోచనమ్ అనునది "యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ" అను ప్రయోగములను జ్ఞప్తికి తెచ్చును. "కదా కాలే మాతః కథయ కలితా లక్తకరసం పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజన జలం" అను సౌందర్యలహరి మనోవీధిలో మెరయును. శుద్ధాయై నమః, దరస్మేర ముఖాంబుజాయై నమః, విమలాయైనమః, పద్మనయనాయై నమః, తాపత్రయాగ్ని సంతప్తసమాహ్లాదన చంద్రికాయై నమః, రాకేందువదనాయై నమః (ల. స. నా).

ఇన్నిటిని స్ఫురింపజేయు ఈ శ్లోక మెచ్చటిది ? వాల్మీకీయ సుందరకాండమందు జనకుని కూతురు, రాముని భార్య, దశరథుని

కోడలు, అయిన సీత అను ఒక క్షత్రియకాంతను గురించి ఈ శ్లోకము చెప్పుచున్నది. ఆ సీతామహాదేవిని ఎప్పుడు చూతునో అని పరితపించుచు లంకలో సీతాన్వేషణము చేయుచున్న హనుమంతుని వాక్యమిది (19 వ-38 శ్లో) హనుమంతుడు సీతను పూర్వ మెప్పుడును చూడలేదు. కాని తదున్నసం అనుచు పూర్వము బాగుగా ఎరిగినట్లు వర్ణించుచున్నాడు! ఇదెట్లు సంభవము? ఒక క్షత్రియకాంతను గురించి చెప్పిన శ్లోకము ఇట్టి ధ్వనుల కాలవాలముగా ఉండుటేమిటి? వాల్మీకి కవి, రామాయణ మొక కావ్యము, చెప్పబడిన సీత ఒక మానవకాంత, హనుమంతుడు మహాకపి అనగా, ఒక పండితుడు వ్రాసినట్లు, పెద్దకోతి, అట్టివారిని గూర్చి వ్రాయుచు ఇట్టి శాస్త్రస్పర్శగల అర్థములు ధ్వనించునట్లు ఆ కవి ఆ కావ్యము నెందుకు వ్రాసెను? అత డీ ర్థము లుద్దేశింపలేదన్నచో ఆ కావ్యమం దత డన్ని శ్లోకముల నిక్షే గులబెట్టెను గదా!— అందుకే నేను మొదటి నుండియు చెప్పుచుంటిని. ఈ కావ్యములకు ఆ శాస్త్రములకు పరస్పర సంబంధము గలదు అని. అది ఋషి స్థాపించిన సత్సంప్రదాయము. అది మంచిదా, చెడ్డదా అని నేను చర్చించుట లేదు. కానీ అట్టి సంప్రదాయము కావ్యజగత్తున కలదను సత్యము నేడు గుర్తింపబడవలెననియే నా ప్రయత్నము.

శ్రీ సుందరకాండము వాల్మీకీయ రామాయణమునకు హృదయము. ఆ హృదయ మెరిగిన చాలును. అందలి మహార్థములు తల్లి కృపవలన నాకు తోచినవరకు కొన్ని మనవిచేతును. విద్వాంసులు మన్నింతురుగాక.

ఈ మహాగ్రంథమున ఏదో ఒక మహత్తర రహస్యము నిక్షిప్తమై ఉన్నదన్నంతవరకు ఒప్పుకొనుటకు ఎవ్వరికిని అభ్యంతర ముండబోదు. రామాయణమే గాయత్రీగర్భిత మనుట ఒకటి, పారాయణ గ్రంథముగా ఉండుట మరొకటి — బ్రహ్మాండపురాణము దీనిని మహామంత్రమని చెప్పియుండుట ఇంకొకటి - ఇట్టి హేతువులచేత ఇది ఒక

రహస్య రత్నకోశ మనుకొనవచ్చును. బ్రహ్మాండపురాణము దీనిని "సమస్త మంత్రరాజో యం ప్రబలో నాత్ర సంశయః" అనియు, బీజ కాండమితి ప్రోక్తం సర్వం రామాయణేష్వపి" అనియు మరొకచోట "అస్య సుందరకాండస్య సమం మంత్రం న విద్యతే....ఏతత్పారాయణా త్సిద్ధి ర్యది నైవ భవే ద్భువి, న కేనాపి భవేత్సిద్ధి రితి బ్రహ్మానుశాసనమ్" అనియును చెప్పుచున్నది.- ఇది సమస్త మంత్రములందును ప్రబల మైనది. సంశయ మక్కరలేదు. రామాయణమున కంతటికిని ఇది బీజకాండము. శ్రీ సుందర కాండముతో సమానమగు మంత్రమే లేదు. దానిని పారాయణము చేయుటచే సిద్ధి కలుగకపోయినట్లయిన, భూమండలమున దేనిచేతను సిద్ధి కలుగదు— అని బ్రహ్మానుశాసనము. ఇదీ, ఆ పురాణోక్తుల కర్థము. ఆ పురాణము శ్రీ సుందరకాండమును పలుమార్లు సౌందర్యకాండమనును, "సౌందర్యం సర్వదాయకం"- ఈ సౌందర్య మేమిటి? సౌందర్యలహరిలోని సౌందర్యమును శంకర భగవత్పాదులు ఇచ్చటినుండియే తెచ్చుకొనెనా? ఈ బ్రహ్మాండపురా ణము శ్రీ మహాత్రిపురసుందరీ విద్యావిషయములకు ఆలవాలము. అతి ప్రధానమైన, మాతృసేవా తత్పరులకు కల్పతరువైన, లలితా సహస్ర నామావళియును, చింతామణియైన లలితాత్రిశతియును ఏతత్పురా ణాంతర్గతములే. అట్టి పురాణము "సౌందర్యం సర్వదాయకం" అని నచో ఆ సౌందర్య మేదో వేరుగా చెప్పవలెనా?

మరొక విశేషము—బ్రహ్మాండపురాణము రామాయణ పారా యణమునకై శ్రీ రామధ్యానపద్ధతులను ఒక్కొక్క కాండమునకు ఒక్కొక్కటి చొప్పున చెప్పుచు సుందరకాండమునకు ఇట్లు చెప్పినది- "చంద్రబింబ సమాకారం వాంఛితార్థ ప్రదాయకం, హనూమత్సేవితం ధ్యాయేత్ సుందరే కాండ ఉత్తమం"-(ఉత్తమే అని ఒక పాఠము- కలదు. ఉత్తమం అనినప్పుడు కర్తకు విశేషణ మగును. ఉత్తమే అని నప్పుడు కాండమునకు విశేషణ మగును-సుందరే కాండే ఉత్తమే- ఎట్లయినను బాధలేదు.) ఈ శ్లోకమునకు కర్త ఏది? ప్రకరణముచేత

ఊహ్యామైనను, శ్లోకమున గుప్తము చేయబడినదని గ్రహింపవలెను. వాంఛితార్థ ప్రదాయక, హనూమత్సేవితాది సమాసములు విశేషణ మాత్రములు, నిర్బాధకములు. కాని చంద్రబింబ సమాకారం అను దానిని కర్త కన్వయింపజేయు విషయముననే చర్చ అవసరమగును. ముఖమును చంద్రబింబమునకు పోల్చుట కలదు. కాని నఖశిఖ పర్యంతాకృతిని చంద్రబింబమునకు పోల్చుట లేదు. ఈ చంద్రబింబ విషయము సమ్యక్చింతనాపేక్షకము. కొందరు ఆలంకారిక ప్రమాణైక బుద్ధులు చంద్రబింబ సమాన మనుట ఆకృతి ఆహ్లాద కారకత్వ ప్రసన్నతా లక్షణోపేతమనుటకే అని వ్యాఖ్యానింపవచ్చును. కాని ఇచ్చట ఇది షోడశనిత్యా ప్రపూర్ణ యగు శక్తికి విశేషణమను నొక్కవిధముగా తప్ప మరేవిధముగను అన్వయము గాదు. చంద్రుని షోడశ కళలు దేవి షోడశనిత్యలు సమానము (సౌం. ల. 32 శ్లో. లక్ష్మీధర వ్యాఖ్య). ఈ హేతువు చేతనే "అస్యశ్రీ సుందరకాండ మహామంత్రస్య వాల్మీకి ఋషిః" ఇత్యాది వచ్చినది- 'నిత్యా షోడశికా రూపాయై నమః.'

కాని, రామధ్యాన శ్లోకమున రాముడు కర్త కాక దేవి ఎట్లు కర్త అయినది? అని ప్రశ్న. ఒక చిత్రము గుర్తింపవలెను. శ్రీ సుందర కాండమున రాముడు అదృశ్యుడు. ఉన్నది సీతయే. కనుక ఈ శ్లోకార్థము సీతకే అన్వయించును. హనుమత్సేవితం సీతయే. ఆయన ఇందు సీతనే సేవించెను. అట్లయిన, రాముని విషయము సీత కెట్లన్వయించును అనగా ఈ కాండమున సీతారాములకు ఋషిచేత అభేదము చెప్పబడినది. 15 స. 51, 52 శ్లో. లందు "అస్యా దేవ్యా యథా రూపం అంగప్రత్యంగసౌష్ఠవం రామస్య చ యథా రూపం తస్యేయ మసితేక్షణా" అనియును, "అస్యా దేవ్యా మనస్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితం" అనియును కలదు. రాముని రూపమే సీతకు కలదట. రామునికి సీత రూపమే కలదట! ఈమె మనస్సు ఆయన యందు, ఆయన మనస్సు ఈమెయందు సంప్రతిష్ఠితములై ఉన్నవట! ఇవి ఋషులు చెప్పు మాటలు కాని, మన సామాన్య కవులు చెప్పుమాటలా?

"శివస్య హృదయం విష్ణుః, విష్ణోశ్చ హృదయగ్ం శివః" అనినట్లు లేదా ఇది ? మన కావ్య నాయికా నాయకులను గురించి ఇట్లు చెప్పు పరిపాటి గలదా ? ఋషి ఈ విధము చెప్పుటచేత సీతారాముల అభిన్నతను ప్రతిపాదించెను. శాస్త్రము శివశక్తుల కిట్టి అభిన్నతనే చెప్పును. అట్లయిన ఇచ్చట సీతారాములు శివశక్తులని సూచింపబడుచున్నదా ? ఏమో చూడుడు—

శ్రీ సుందరకాండమును జాగ్రతగా చూచినచో అందు సీతకు ఋషిచే వాడబడిన ఉపమానములన్నియు పరాశక్తి పరముగా అన్వయించుచుండును. దానిని శబ్దాశ్రిత విశేషములందును, కొన్ని భావములు కుండలినీ శక్తిపరముగా అన్వయించుచుండును ఇచ్చట శబ్దములు భావములు తచ్ఛాస్త్రస్పర్శ గలిగియుండును. వానిని భావాశ్రితములందును, తక్కినవి ప్రకరణాశ్రితములు. ఈ ప్రకారము కతిపయదృష్టాంతము లిత్తును. గ్రంథమంతయు ఈ పద్ధతిగా చూచినచో దాని గుప్త స్వరూపము సాక్షాత్కరించును.

శబ్దాశ్రితములు:- శ్రీ సీతామహాదేవిని హనుమంతుడు చూచినప్పుడు, ఆమె (దదర్శ) "శుక్లపక్షాదౌ చంద్రరేఖా మి వామలాం" (15 స. 19 శ్లో) శుక్లపక్షాదియందలి చంద్రకళవలె నిర్మలముగా ఉండెనట. పశ్చిమోత్తర (లాహోరు) ప్రతిలో "ప్రతిప చ్చాంద్రలేఖేవ దృశ్యతే ద్యోతతే న చ" అని కలదు. ఈ ప్రథమ కళనే శాస్త్రము ప్రతిపత్కళ అనియు, ధ్రువకళ అనియు, ఆత్మకళ అనియు చెప్పును. ప్రతిపత్కళయే పరాశక్తి. సీత అట్టి ప్రతిపత్కళవలె ఉన్నదని ఋషి ఉపమించుచున్నాడు. "ప్రతిపది యా త్రిపురసుందరీ కథితా సా చిద్రూపాత్మికా" (సౌం. 32 శ్లో లక్ష్మీధర వ్యాఖ్య).

అశోకవనమందు కృశించి శోకధ్యానపరాయణయై ఉన్న సీతకు ఋషి వరుసగా కొన్ని అతివిచిత్రములైన ఉపమానములను వాడెను. "తాం స్మృతీమివ సందిగ్ధాం బుద్ధిం నిపతితామివ, విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతామివ-సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం

సకలుషామివ, "అభూతేనాపవాదేన కీర్తిం నిపతితామివ" (15 స. 33, 34 శ్లో) పశ్చిమోత్తర ప్రతియందు అధికపాఠ మొకటి గలదు- 'ఆయతీమివ విచ్ఛినాం ఆజ్ఞామివ విలోపితాం' దాక్షిణాత్యప్రతిలో మరొకచోట "ఆజ్ఞాం ప్రతిహతామివ" (19 స. 12 శ్లో) అర్థము.- ఆమె సందిగ్ధమైన స్మృతివలెను, పతితమైన బుద్ధి (సంపద) వలెను, నిహతమైన శ్రద్ధవలెను., ప్రతిహతమైన ఆశవలెను, విఘ్నముగల సిద్ధివలెను, సకలుషమైన బుద్ధివలెను. అపవాదముచే పతితమైన కీర్తి వలెను, విచ్ఛిన్నమైన ఆయతి వలెను, లోపింపబడిన ఆజ్ఞవలెను ఉన్న దట ! ఇవి ఏమి ఉపమానములు ? సీత ఇట్టి అవస్థలో నుండక భర్తృ సమేతయై శోభాయమానముగా ఉండినచో ఆమె స్మృతి, బుద్ధి, శ్రద్ధా, ఆశా, సిద్ధి, బుద్ధి, కీర్తి, ఆయతి, ఆజ్ఞలవలె ఉండుననియే గదా ఋషిభావము ? ఈ ఉపమానములు అసామాన్యములు. ఇవి ఋషి కెట్లు స్ఫురించెనని పరిశీలించినచో ఆశ్చర్యమగును. ఈ స్మృత్యాది శబ్దములు జగన్మాత యగు పరాశక్తి నామములు !!

దేవీవాఙ్మయముతో పరిచయ మున్నవారు ఈ శబ్దములను చప్పున పోల్చుకొనగలరు. దేవీసప్తశతి ప్రథమాధ్యాయమున బ్రహ్మ కృత యోగనిద్రాస్తుతియందు "మహావిద్యా మహామాయా మహా మేధా మహాస్మృతిః...త్వం శ్రీ స్త్వ మీశ్వరీ త్వం హీ స్త్వం బుద్ధి ర్బోధ లక్షణా..." చతుర్థాధ్యాయమున. యా శ్రీ స్స్వయం సుకృతినాం భవనేషు...కృతధియాం హృదయేషు బుద్ధిః, శ్రద్ధా సతాం కులజన ప్రభవస్య లజ్జా తాం త్వాం నతాస్స్మ పరిపాలయ దేవి విశ్వం"-పంచ మాధ్యాయమున దేవతలు చేయు దేవీస్తోత్రము చూడుడు-"యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా...శ్రద్ధారూపేణ సంస్థితా... లక్ష్మీరూపేణ సంస్థితా...స్మృతిరూపేణ సంస్థితా..."-ఇట్లే నిత్యా చండ్యాది విధిప్రకరణమున "చంద్రస్య షోడశకళాః పూజయేత్" అని కళాపూజ-చేయుచు చెప్పు నామములందు ఈ స్మృత్యాది నామము లన్నియు వచ్చును.

ఇక-దేవీభాగవతమున పంచమాధ్యాయమున దేవీస్తోత్రమందిట్లు గలదు, "త్వంభూమి స్సర్వభూతానాం ప్రాణః ప్రాణవతాం తథా, ధీః శ్రీః కాంతిః క్షమా శాంతిః, శ్రద్ధా మేధా ధృతిఃస్మృతిః" చతుర్థాధ్యాయమున విష్ణుకృత భువనేశ్వరీస్తుతియందు "త్వం కీర్తి కాంతి కమలామలతుష్టిరూపా.." అని కలదు. ఇప్పటికి ఋషి ప్రయోగించిన ఆ ఉపమానములన్నియు వచ్చినవా? (శబ్దములు భావములు నిగమములనుండి ఆగమములందు ప్రవేశించినవి. మన ఉపమాన శబ్దములే భావభంగి కొంచెము మార్చుకొని శ్రుతులందున్న ఉనికి చూడుడు-"శ్రద్ధాయాం ప్రాణే నివిష్టోమృతం జుహోమి"-"మేధావీ జుషమాణా...ఇత్యాది తైత్తరీయములు). లలితా సహస్ర నామావళి నుండి చూపుచున్నాను-"స్మృత్యైనమః. ఆజ్ఞాయై నమః ప్రతిష్ఠాయై నమః మహాసిద్ధ్యై నమః మహాబుద్ధ్యై నమః".

ఇక భావాశ్రితములైన శాస్త్రధ్వనుల వివరింతును. సీత కుండలినీశక్తియని ఋషి ఇచ్చట సూచించుచున్నాడు. కుండలినీ శక్తికి శాస్త్రము చెప్పిన లక్షణములు కార్శ్యము, ఆధారకమల నివాసము, సర్పాకారము, విలాపము. సుందరకాండమున లంకలోని సీతను వర్ణించిన శ్లోకములు ఈ లక్షణముల నన్నిటిని ధ్వనించుచున్నవి. అనగా లంక మూలాధార కమలమా? ఏమో, చూతము-"ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచంద్రప్రభా మివ, భూమౌ సుతను మాసీనాం నియతా మివ తాపసీం," అను శ్లోకము (15 స. 30 శ్లో) సీతనుగురించి చెప్పిన మాట. ఇందు సుతనుం, నియతాం, తాపసీం, భూమౌ, ఆసీనాం అను మాటలందు అట్టి ధ్వని కలదు.

కార్శ్యము:-పై శ్లోకమందలి సుతన్వాది శబ్దములు కార్శ్యమును ధ్వనించుచున్నవి. సుతనుం అనగా ఇచ్చట మిక్కిలి సన్నమైన దానిని అని ధ్వని (మంచిశరీరము వాచ్యార్థము). పరాశక్తి మిక్కిలి సన్ననిదని శాస్త్రము. "తటి త్కోటినిభప్రఖ్యా బిసతంతు నిభాకృతిః"

(యోగినీ హృదయము) నారాయణ ప్రశ్నమున పరమాత్మ సన్నగా ఉండునని కలదు. "నీవారశూకవ త్తన్వీ పీతాభాస్వ త్యణూపమా." ఇంకా సీతను వర్ణించిన శ్లోకములం దన్నిటియందును అనుస్యూతముగ ఈ కార్శ్యము నిక్షేపింపబడినది. ఇది ముఖ్యముగా గుర్తింపవలెను. సీత కృశించియున్నదని చెప్పుటకు ఋషి ఆమెను అనేక పర్యాయ ములు ప్రతిపత్కళతో పోల్చి వర్ణించిన వైనము ముందే వివరించితిని. సీత పరాశక్తి అని సూచించుటే ఇట్లు కార్శ్యమును సర్వత్రా ఋషి చెప్పుట యందలి ఉద్దేశము." "తటిల్లేఖా తన్వీం" (సౌం) బిసతంతు తనీయస్యైనమః (ల.స.నా.)

తాపసీం-సీతను ఋషి అనేక పర్యాయములు తాపసి అని వర్ణిం చును. "అల్పాహారాం తపోధనాం-శోకధ్యాన పరాయణాం-పరిమ్లా నాంతపస్వినీం-దీనాం నిరానందాం తపస్వినీం-(పశ్చిమోత్తర ప్రతిలో) దుర్బలాం దుఃఖసంతప్తాం సుకుమారీం తపస్వినీం-వేపమానా తపస్వినీ (పశ్చిమోత్తరప్రతి) పతిశోకేనచావిష్టా తపసాచ కృశా భృశం"-అని కలదు. ఇట్లు తపస్వినీ తపస్వినీ అని సీత ఇన్నిమార్లు వర్ణింపబడుట యేల? ఋషియం దొక కీలక మున్నది. ఏదైనా ఒక రహస్యమును సూచింపదలచినచో ఒక శబ్దమును పలుమార్లు ప్రయోగించును. ఒక సారికి మనము గుర్తింపకున్నచో రెండవసారికిగాని మూడవ నాల్గవ సార్లకుగాని గుర్తింప గలమని అట్లు అసకృత్ ప్రయోగము చేయును. కనుక తపస్వినీ వర్ణన అనుమానింపవలసిన విషయము. సీత కాంతా మాత్రమే అయినచో ఈతపస్వినీత్వము ఎట్టి కావ్య రామణీయకము నిచ్చును? అదికాదు. పరాశక్తి తపస్విని కనుకనే ఋషి కిట్టి వర్ణన స్ఫురించెను. తైత్తిరీయమున "తా మగ్నివర్ణాం తపసా జ్వలంతీం" అని దుర్గాస్తవము గలదు. 'యోగిన్యైనమః, దీక్షితాయై నమః (ల.స.నా.) ఈతపస్వినీత్వ వర్ణనము సీత యొక్క కార్శ్యమునుకూడ ధ్వనించును. 'నియతామివ ఆసీనా' అని శ్లోకమునం దనుట్యును ఆమె

యొక్క తపస్వినీత్వమును చెప్పుటకే-'పద్మాసనాయై' నమః ఇచట ఒక చమత్కారముకలదు. సందర్భముగనుక చెప్పుచున్నాను. 'పతివ్రతాం' అని సీతకు రామునియందుగల బద్ధానురాగము వ్రతముగా మాటిమాటికీ చెప్పబడును. ఇట్టి ప్రియవ్రతమే ల. స. నా యందు "ప్రియవ్రతాయైనమః."

తర్వాత 'భూమౌ ఆసీనాం'- సీత భూమియందు కూర్చుని యున్నదట. విశేషార్థ ముద్దేశింపకపోయినచో, ఆమాట కావ్యమున చెప్పవలెనా? "చైత్యప్రాసాద ముత్తమం...ప్రవాళకృత సోపానం తప్తకాంచనవేదికం (15 స. 15, 16 శ్లో) అని వర్ణింపబడిన స్వర్ణవేదికపై సీత ఉన్నదని చెప్పి ఇప్పుడు 'భూమి' అనుట ఏమిటి? ఇట్లాలోచింపకున్నచో ప్రాచీన కావ్యపఠనము (విశేషించి ఆర్షము) వ్యర్థము కాగలదు. సీత భూమియందు గలదనుమాట ఋషి అనేకపర్యాయములు చెప్పెను. 'అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశ్రితవ్రతా'—సీత భూమిజ, అయోనిజ 'అయోనయే' నమః. భూమౌ ఆసీనాం అనగా పృథ్వీతత్త్వ స్థానమైన మూలాధార కమలమం దున్నదని పరాశక్తి సూచితము. ఈ విషయమే సౌందర్య లహరియందు 'అవాప్యం స్వాం భూమిం భుజగ నిభమధ్యుష్టవలయం' అని చెప్పబడినది. స్వాం భూమిం అనగా స్వకీయం భూమిం ఆధారచక్రం అని వ్యాఖ్య. కనుక సీత ఉన్న భూమి ఇది! శక్తిని కులయోగిని అందురు. కులం అనగా కుః పృథివీతత్త్వం లీయతే యత్ర తత్కులం - ఆధారచక్రం [లక్ష్మీధర వ్యాఖ్య] కనుక సీత మూలాధారస్థితకుండలిని అని ధ్వని. హనుమంతుడు అశోకవనమున ప్రవేశించినప్పుడు సీతను భూమి మీద వెదకెను, అని ఋషి తొలుతనే చెప్పెను. 'సవీక్షమాన స్తత్రస్థో మార్గమాణశ్చ మైథిలీం అవేక్షమాణశ్చ మహీం సర్వాం తాం అన్వవైక్షత [15 స. 1 శ్లో].

ఆమెను భూమిపై గాక మరెచ్చట వెదకును ? అదేమి మాట! కనుక ఈ మాటలను యాదృచ్ఛికములని భావింపరాదు. పైగా వీనిని విడివిడిగా చూడరాదు. పూర్వాపరములను అనుసంధించుకొనుచు ప్రకరణము యావత్తు దృష్టియందుంచుకొని విషయమును చర్వణము చేయవలెను. కనుక ఋషి ఈ విధముగా 'భూమౌ ఆసీనాం' అనియు, 'తాం మహీం అన్వవైక్షత' అనియు ఇత్యాదులచేత సీతను ఆధార కమలవాసినిగా సూచించెను.

తర్వాత సర్పాకారము :- ఋషి సీతను 'వేష్టమానాం తథా విష్టాం పన్నగేంద్రవధూ మివ' [19 స. 9 శ్లో] అని వర్ణించెను. అనగా ఆమె ఆడు పామువలె చుట్టచుట్టుకుని ఉన్నదట. ఇట్టి ఉపమాన ముచే ఆ ప్రకరణమున విశేష కావ్య రామణీయక మేదియు సిద్ధించుట లేదు. ఆ ఉపమానము పరిపాటిగా వాడునదియు గాదు. అందులోను పన్నగమని సామాన్య వాచకముగాక, పన్నగవధూమివ అని వధూ శబ్ద మొకటి కలిపెను. కనుక 'భుజగ నిభమధ్యుష్ట వలయ' అని సౌంద ర్యలహరిశక్తిని వర్ణించిన పద్ధతియే గదా యిది? ఇదే తంత్ర గ్రంథము లందు భుజగాకార రూపేణ మూలధార సమాశ్రితా శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభా శుభా' అనబడినది. కుండలిని మూలాధార చక్రమున చుట్ట చుట్టుకొని సర్పాకారముతో ప్రవలపించుచుండునట. దీనినే ఋషి మరొకమారు చేసిన సీతావర్ణనచేత దృఢము చేయు చున్నాడు. 'ఆచ్ఛాద్యోదరమూరుభ్యాం బాహుభ్యాంచ పయోధరే ఉపవిష్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ [19 స. 3 శ్లో.] ఊరువులతో ఉదరమును, బాహువులతో పయోధరములను కప్పుకొని ఆమె ఏడ్చు చున్నదట! అనగా, శరీరము చుట్టచుట్టుకొని అనియేగదా! ఇదే 'అధ్యుష్టవలయం' ఈ స్థితియే లక్ష్మీధర వ్యాఖ్యలో "ముఖేన పుచ్ఛం సంగృహ్య" అని వర్ణింపబడినది. ఇదే 19 స. 9 శ్లోకమునందు "వేష్ట మానాం" అనబడినది.

ఈ విషయమును నిష్కృష్టము చేయుటకే ఋషి చేసిన మరొక వర్ణన చూడుడు. అధోముఖ ముఖీ బాలా విలప్తు ముపచక్రమే" (26 స. 1 శ్లో.) ముఖము క్రిందకు వంచి ఆ బాల విలపింప మొదలిడెను. ఈ "విలప్తుం" విషయమే వెనుకటి ఆచ్ఛాద్యోదర శ్లోకమున 'రుదంతీ' అనబడినది. ఇచట అధోముఖముఖీ అనుటచేత 'ముఖేన పుచ్ఛం సంగృహ్య' సూచింపబడినది. బాలా అనుటచేత పరాశక్తిఅని మరింత దృఢము చేయబడినది. ఈ వర్ణననే ఋషి తన కీలక పద్ధతి ప్రకారము పునరుక్తి చేయుచున్నాడు.

"ఉపావృత్తా కిశోరీవ వివేష్టంతీ మహీతలే" (26 స. 2 శ్లో.) కిశోరీ అనునది బాలా శబ్దమునకు పునరుక్తి. వివేష్టంతీ అనునది వేష్టమానాం అనుటకు పునరుక్తి. మహీతలే వెనుకటి 'భూమౌ సుతనుమాసీనాం' లోని భూమౌకు పునరుక్తి. కనుక కిశోరీ శబ్దమునకు బాలా అని ధ్వన్యర్థము (ఆడ గుర్రపుపిల్ల వాచ్యము) "బాలాయై నమః"

సీత సర్పాకారముతో ముఖమున పుచ్ఛముంచుకొని మూలాధారమున ప్రలపించుచుండు కుండలినీ శక్తి అని ఋషి సూచించుటచేతనే ఋషి హనుమచేత 16 సర్గయందు ఈమెయే నా అన్వేషణాఫలిత మని చెప్పించుచు, "ఉత్థితా మేదినీం భిత్వా క్షేత్రే, హాలముఖక్షతే, పద్మరేణునిభైః కీర్ణాశుభైః కేదారపాంసుభిః (16 స. 16 శ్లో.) అని రమణీయముగా చెప్పించెను. భూమిని చీల్చి హాలముఖక్షతమైన క్షేత్రము నుండి ఉత్థాపన చేయబడినదియు, శుభమైన పద్మరేణువుల వంటి కేదార పాంసువులచేత ప్రకీర్ణమైనదియు ఈ సీతయే అని అర్థము. ఇచ్చట శబ్దములన్నియు శాస్త్రధ్వని యుక్తములు. క్షేత్రే అనగా దేహమునందు "యోగినోయం విచిన్వంతి క్షేత్రాభ్యంతర వర్తినం" -కుమార సంభవం! హాలముఖక్షతే-హాలముఖము అనగా హాలవర్ణసముచ్ఛయవర్గమునకు ముఖము. య ర ల వ శ ష స హ ళ క్ష అను వర్ణములు మంత్రశాస్త్రమున వ్యాపకము లనబడును. అవి యర

లవశ అనియు షసహాశతు అనియు రెండు భాగములు. ఆ రెంటి యొక్క మధ్యమాతురములే హాలములు. కనుక హాలముఖ మనగా వ్యాపక వర్గముఖము అనగా య వర్ణము. య వర్ణము వాయు బీజము (ఆప్టే కూడా వాయు వని.) కనుక క్షేత్రే హాల ముఖక్షతే అను దానికి ప్రాణవాయువుచేత క్షతమైన దేహమునందు అనగా ప్రాణాయామము చేత-మేదినీం భిత్వా మేదినీం అనగా స్వాం భూమిం అను సౌందర్య లహరిలోని భూమిం అనగా ఆధారచక్రమును భిత్వా-భేదించి, ఉత్థితా --ఉత్థాపన చేయబడినది, అనగా, ప్రాణాయామముచే ఆధారకమలమం దున్న కుండలినీ శక్తిని ఉత్థాపన చేయుట ఋషిచే ధ్వనింపబడుచు న్నది. 'పద్మరేణు నిభైః' అనుటచే చక్రము సూచితము. కేదార శబ్దముచే పృథివీతత్త్వము సూచితము. అన్నిటి కన్నియు ఇచ్చి ధ్వని నాస్వాదింపు మని ఋషి సైగ చేయుచున్నాడు. అంగడిలో అన్నియు ఉన్నవి.

ఇక ప్రకరణాశ్రితములైన ధ్వనులు చూడుడు - (౩౩౫-౩శ్లో) మొట్టమొదటిసారిగా సీతను హనుమంతుడు కలిసినప్పుడు ఆయన పలికిన తొలిపలుకులివి-"కా ను పద్మవిశాలాక్షి క్లిష్టకౌశేయవాసినీ- సురాణాం అసురాణాం వా నాగగంధర్వరక్షసాంయక్షాణాం కిన్నరాణాం వా కా త్వం భవసి శోభనే-కా త్వం భవసిరుద్రాణాం మరుతాం వా వరా ననే-వసూనాం వా వరారోహే దేవతా ప్రతిభాసి మే"-దేవతలలోని దానివా,నాగ గంధర్వ యక్ష రాక్షసులందలిదానవా, రుద్రమరుద్వసు గణములలోనిదానవా అని అడుగును. ఈ పద్ధతి ఎట్లున్నది? ఇచ్చట విశేష మేమిటనగా-హనుమ శింశుపావృక్షశాఖలం దుండి రావణా గమనము, రాక్షసీకృత సీతా భర్త్సనము ఇత్యాదులు చూచి సీత మాటలు విని ఆమె సీతయే అని గుర్తించెను. "ఇత్యేవ మర్థం కపి రన్వ వేత్య సీతేయ మిత్యేవ నివిష్టబుద్ధిః", ప్రహర్షమతులతాలేభే మారుతిః ప్రేత్యమైథిలీం-సీతాదర్శనసంహృష్టో హనుమాన్ సంవృతో భవత్"-ఇ

అని సీతను చూచితినని మిక్కిలి సంతసించెను. "యాం కపీనాం సహ స్రాణి సుబహూ న్యయుతానిచ దిక్షు సర్వాసు మార్గంతే సేయమాసా దితామయా" ఇట్టి సందర్భమున ఇప్పుడు సీతను నీ వెవరని ప్రశ్నించుట యేమిటి హనుమంతునికి తెలియక కాదుగదా?అది దేవీస్తోత్రము. స్యాత సంశయః. దేవి సర్వదేవగణముల యొక్క రాశీభూత స్వరూపము. దేవీ సప్తశతియందు హరాదితేజః పుంజావిర్భావ దేవివర్ణన గలదు. "అతులం తత్రతత్తేజస్సర్వదేవశరీరజం ఏకస్థం త దభూన్నారీ వ్యాప్తలోకత్రయం త్విషా"-

మరొకటి-రావణునితో సీత చెప్పుమాట; "మాంహిధర్మాత్మనః పత్నీం శచీమివ శచీ పతేః త్వదన్య స్త్రిషులోకేషు ప్రార్థయే న్మనసా కః"-ధర్మాత్ముని పత్నినైన నన్ను ఈ త్రిలోకములందు నీవుగాక మరెవ్వరును కోరరు; అనగా నేను ముల్లోకములకు తల్లిని. నన్నెవ్వరు ఇట్లు కోరరు; నీవు కోరుట నీ వినాశనమునకే. సామాన్య కావ్యార్థమే అయినచో ముల్లోకముల సంగతి ఏల? జగన్మాతయని ధ్వనించుటకే ఇట్లు చెప్పబడెను.

"అస్యా హేతో ర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః" మొదలు 7 శ్లోకములందు ఈమెవల్లనే రాముడింతచేయుచున్నాడనుట సీత అన్నిటికి మూలకారణమనియు, సీత లేనిచో రాము డివేవియు చేసియుండడనియు "శివశ్శక్త్యా యుక్తోయది భవతి శక్తః ప్రభవితుం-నచే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి" భావమును ధ్వనింపజేయుచున్నాడు.

సీత ఎవరో తెలిసికొనుటకు ఒక సూక్ష్మమైన కీలకముచూడుడు. నీ వెవరో అని సీతను హనుమ అడిగినప్పుడు ఆమె సమాధానము చెప్పు సందర్భమున అనినమాట "సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామ సమృద్ధినీ"-నేను రాముని ఇంట 12 ఏండ్లు మానుషభోగములు అనుభవించుచుంటిని, అన్ని

అర్థము. ఈమె మానుషకాంత కాకున్ననే, అనగా, మానవేతరకాంత అయిననే నేను మానుషభోగములు 12 ఏండ్లు అనుభవించితిని అనుట చెల్లును అనగా నేను కేవలము మానుష కాంతనని భ్రమింతువేమో,నన్ను సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మిగా ఎఱుగుము అని సూచన. "అహం సర్వ కామసమృద్ధిద" అనుట మిక్కిలి ముఖ్యము "మాత శ్శంకరి కామదే" అని దేవీ భాగవతము; "అశ్వదాయి, గోదాయి, ధనదాయి, మహాధనే ధనంమే జుషతాం దేవి సర్వకామార్థసిద్ధయే(శ్రీ. సూ)ఓం కామ్యాయై నమః"(ల. స. నా.) అట్లుకాక ఆమె మానుషకాంతామాత్రమే అయినచో ఈ మాట నిరర్థకము గదా.

మరొకటి-"అశ్మసారమిదంనూన మథవా ప్యజరామరం హృద యం మమ యేనేదం న దుఃఖే నావశీర్యతే"-నా హృదయము పాషా ణముగాని లేక అజరామరముగాని కావలెను కనుకనే, ఇది దుఃఖముచే బ్రద్దలగుటలేదు. భర్తృవియోగ దుఃఖార్తిచే సీత విలపించుచు చెప్పిన మాట ఇది. హృదయము పాషాణ మనవచ్చును గాని అజరామర మందురా? అజరామర మనబడు హృదయమేది? మంత్ర హృదయమే యద్వా-"ఆనంద ఆత్మా బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అని శ్రుతులుచెప్పిన పరమాత్మని హృదయమగు ఆనందము కావలెను. ఆమె హృదయము ఆనందము కనుకనే న దుఃఖేనావశీర్యతే", దుఃఖముచేత శీర్ణము గాకుం డును; అనగా దేవీ హృదయమును పొందినవాడు అనగా ఆనందలబ్ధి గలవాడు దుఃఖమున కతీతుడు. దుఃఖము వానినంటదు. ఆ ఆనందము అజరామరము లేక అశ్మసారము. అశ్మసార మనగా పరమాత్మవలె బలమైనది, యుక్తమైనది, శ్రేష్ఠమైనది, స్థిరమైనది. సారో బలే స్థిరాంశే చ న్యాయ్యేక్లీబం వరేత్రిషు అను అమరకోశము ప్రకారము సారశబ్ద మునకు పై జెప్పిన నాల్గర్థములు గలవు. అశ్మన్ శబ్దముకూడా చిత్ర మైనదే. అశూ వ్యాప్తౌ కనుక అశ్మన్ వ్యాపించు లక్షణము కలది. అట్టిది పరమాత్మయే! వ్యాపిన్యై నమః. అశ్మసారశబ్దములు ఇట్టి

స్వరూప స్వభావములు గలవి కనుకనే ఋషి వాటి నీ సందర్భమున ఈ భంగిగా వాడెను. సంస్కృతమున శబ్దములు ఏ పనికొరకు పుట్టెనో ఆ పని చేయించుట ప్రాచీన కవి కార్యము. మన మీ కీ తెరిగి వ్యవహరించినచో ఆ కావ్యముల పరమార్థము విదితము కాగలదు.

మరొకటి: "మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః" (26 స. 40 శ్లో) అని సీత హనుమకు చెప్పినమాట. ఆమె పరమాత్మ్నయొక్క భార్య యట !!! అల మతివిస్తరేణ. ఇంకను ఋషి యొక్క ధ్వని గుర్తింపకున్నచో అది పురాకృత దుష్కృతఫలితమగునే గాని అచ్చట అట్టి ధ్వని లేక గాదు.

భక్తుడగు హనుమంతుడు సీతను జగన్మాతగనే గుర్తించెను. కనుకనే "తథాపి నూనం తద్వర్ణం తథా శ్రీమ ద్యథేతరత్" అని పోల్చుకొనెను. (15స. 47 శ్లో). ఆమె కట్టిన వస్త్రము అదే (రావణాపహరణా త్పూర్వమున్న దే) ఎట్లనగా పూర్వమున్న వస్త్రముయొక్క వర్ణమెట్లు శ్రీమత్తో అట్లే యిదియును శ్రీమత్తు. ఇది వాచ్యార్థము. వర్ణము శ్రీమత్ అనుటకు కాంతిమంత మని అర్థము చెప్పుట చాలదు. అది ఋషి గరుత్మంతుడై ఎగురుచుండగా ఆయన నందుకొనుటకు కాకియై ప్రయత్నించుట వంటిది. ఇచ్చట ఉపాసకుడు అను హనుమ సీతను అనగా దేవిని శ్రీం అను బీజాక్షరముతో అభిన్నమని ఎరిగినవాడాయె నని సూచన.

అట్టిసీత 68 సర్గలుగల శ్రీ సుందరాకాండమందు (దాక్షిణాత్య ప్రతి) 15వ సర్గలో దర్శనమిచ్చుట, "తథాపి నూనం తద్వర్ణం తథా శ్రీమ ద్యథేతరత్" అని ఉండుటలోని రహస్యము పరిశీలనాచతురులకు, ముముక్షువులకు గోచరింపకపోదు!

శ్రీ సుందరకాండ మంతయు ఈ విధముగ ఉన్నది. కానీ, భాషామాత్రపాండిత్యము పురాకృతదుష్కృతము. అది యిట్టి పరమార్థములను ఆస్వాదింపనీయదు. అహంకార రూపమున, దురభిమాన

దూపమున అడ్డువచ్చి, అన్యథా కలుగు లాభములకు నష్టము కలిగించును. కనుకనే ఋషి జిజ్ఞాసువు, యోగి అగు హనుమంతునిచేత ఇట్లు చెప్పించెను. (30స. 38 శ్లో.) అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాపి న శోభతే ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః" అన్వయము-బుద్ధి ర్నిశ్చితాపి, అర్థాంతరే (అర్థాన్ అధికృత్య సా బుద్ధిః) న శోభతే ఘూతాః పండిత మానినః ఘాతయంతి హి కార్యాణి అనగా బుద్ధి నిశ్చయాత్మకమైనప్పటికినీ (అట్టి బుద్ధి ఉన్నప్పటికినీ), అర్థాంతర విషయమున అర్థాన్ అర్థా నధికృత్య, అనగా అర్థాంతర విషయమున కావలసినవానిని గురించి అనగా వ్యంగ్యార్థములనుగురించి - ఇట్టి పరమార్థములను గురించి ఆ బుద్ధి శోభింపదు. అట్టివారు కార్యములను పాడుచేయుదురు. వారికి కార్యసిద్ధి కలుగదు. ఇట్టి మహార్థములు గోచరింపవు. మరొకరు చెప్పినను వారి పూర్వజన్మ దుష్కృతము వారి నానందింపనీయదు. ఇట్టివారిని గూర్చియే ఆ జగన్మాత "నమాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధి మివ పాపకృత్"అనెను.

(శ్రీ సుందరకాండమున.)

# శ్రీ సుందరకాండ కుండలినీ యోగమే !

శ్రీ మద్రామాయణమున పరమ పూజనీయము అగు మహారహస్యములు చెప్పబడి ఉన్నవి గనుకనే అది పారాయణ గ్రంథమైనది. కథామాత్ర కావ్యమే అయినచో అట్టి పదవి పొందగలిగెడిది గాదు. మనుచరిత్రను మనము నిత్యము పారాయణము చేయము. అది ఇహపర తారకమని చెప్పము. ఇదీ వాటి భేదము. రామాయణమందున్న రహస్యములలో పరమరహస్యములు, మోక్షాన్వేషుల కుపాదేయములు అగు గాయత్రీ మంత్రము, కుండలినీయోగము సుందరకాండమున చెప్పబడినది. ఈ కాండమందలి ప్రథమ శ్లోకమే తద్రహస్య ప్రస్తావన చేయును. తొలి శ్లోకములు ఏడును ఈ కాండమునకు శిరస్సు వంటివి. "తతో రావణనీతాయాః సీతాయాః శత్రుకర్శనః ఇయేష పద మన్వేష్టుం చారణా చరితే పథి" అని మొదటి శ్లోకము. రావణునిచే కొనిపోబడిన సీత ఉన్నచోటును శత్రుకర్శనుడు [హనుమ] చారణా చరితపథమునందు వెదకవలె ననుకొనెను. ఇది అర్థము.

కాని ఇచ్చట ఒక ప్రశ్న పుట్టుచున్నది. అంగదాదులగు వానరులు సీతాన్వేషణకై దక్షిణ దిక్కునకు పంపబడిరి. వారిలోని వాడే హనుమంతుడు. సీత లంకలో ఉన్నదని వీరికి సంపాతి చెప్పెను. కనుకనే సముద్రలంఘనమునకు ప్రయత్నము చేయబూనిరి. ఆ కార్యమునకు హనుమ "కృతనిశ్చయు" డాయెను. కనుక సీత ఎక్కడ ఉన్నది వీరికి తెలియును. అట్టియెడ హనుమ సీతను చారణా చరితపథమున వెదుక బూనుటయేల ? చారణాచరితే పథి అనగా దేవ గాయకులగు చారణులు సంచరించు మార్గము ఆకాశము అని వ్యాఖ్యా

తలు వ్రాసిరి. ఆకాశము దేవతలు చరించు మార్గమనుట ప్రసిద్ధమే గాని దేవగాయకులు చరించు మార్గమనుట అట్లు ప్రసిద్ధము గాదు. ఒక్క రామాయణమందే ఇట్టిది, తత్తుల్యార్థపదములు మరికొన్ని అచ్చటచ్చట వాడబడినవి. తత్పూర్వ మిట్టి పద్ధతి మనకు గోచరింపదు. కానీ ఈ పద్ధతిని వ్యాసుడు భారతమున గ్రహించెను. అమరకోశమందు చారణుల పేరే లేదు. కానీ వారును దేవతలు గనుక దేవమార్గమని అర్థము సరిపెట్టుకొనవచ్చును.

కానీ రహస్యమంతయు చారణ శబ్దములోనే ఉన్నది—శ్రీ లలితా సహస్ర నామావళి యందలి 'బిసతంతుతనీయసీ' అను నామమునకు భాష్యము వ్రాయుచు భాస్కరరాయలు "ఏవం లోకస్య ద్వార మర్చిమత్ పవిత్రం, జ్యోతిష్మత్ భ్రాజమానం, మహస్వత్ అమృతస్య ధారా బహుధా దోహమానం, చరణన్నో లోకే సుధితాం దధాతు" అను మంత్రమునకు ఈ క్రింది విధముగా అర్థము వ్రాసెను. "లోకస్య బ్రహ్మ లోకస్య, ద్వారం సాధనం, అర్చిర్జ్యోతి ర్మహాశ్శబ్దా అగ్నిసూర్య చంద్రకళావాచకాః — చరణశబ్ద శ్చరతి యాతాయాతం కరోతీతి వ్యుత్పత్త్యా కుండలినీపరః - సామాన్యే నపుంసకం—" ఇత్యాది. అనగా కుండలినీశక్తికి చరణం అను పర్యాయపదము గలదు. ఈ చరణ శబ్దమే మన శ్లోకమందు చారణశబ్దమైనది. కనుక చారణాచరితే పథి అనగా కుండలిన్యా ఆసమంతాత్ చరితః పంథాః-కుండలిని చేత అంతటా సంచరింపబడు మార్గము అని అర్థము. ఆసమంతాత్, చరితః అనుట యెందుకనగా - మూలాధారము నుండి ఉత్థాపన చేయబడిన కుండలినీశక్తి సుషుమ్నానాడిని ప్రవేశించి ఉత్తరోత్తర క్రమముగా స్వాధిష్ఠాన మణిపూర అనాహత విశుద్ధ ఆజ్ఞా చక్రములను దాటుచు పోయి సహస్రార పద్మమును చేరి అందు శివునితో సంయోగమును పొందును. సంగ్రహముగా ఇదే కుండలినీ యోగము. ఇట్లు ఆరు చక్రములందు ప్రయాణము చేయునప్పుడు ప్రతి చక్రము

యొక్క దళము లన్నింటియందును చరించి తదనంతర చక్రమును చేరుచుండును. కనుక ఆచరితే పథి అనబడినది. అందుచేత చారణా చరితపథ మనగా షట్చక్రమార్గము అనగా కులమార్గము-లక్షణయా సుషుమ్నా మార్గము అని అర్థము. తాత్పర్యము కుండలినీ యోగము.

అయితే ఈ చరణశబ్దము కుండలినీశక్తికి పర్యాయపదముగా వాడుట మంత్రశాస్త్రము నందును అంత ప్రసిద్ధముగాదు గదా ? దేవ గాయకాది అర్థము ప్రసిద్ధముగాదని మరొక అప్రసిద్ధార్థము చెప్పుట ముల్లు తీయబోయి కొర్రు గుచ్చినట్లున్నదిగదా ? అని సంశయము కలుగవచ్చును. దానికి భాస్కర రాయలే సమాధానము చెప్పెను. "తది ద ముపబృంహితం శుక్ర సంహితాయాం - పావక స్యార్చిషా భానో ర్జ్యోతిషామహసా విధోః దోహమానా సుధాధారా ద్విసప్తతి సహస్రధా - గుప్తాచారా కుండలినీ తృప్తా నస్మాంస్తనోతు సా"-ఇతి అత్ర గుప్తం యథా తథా చరతీతి చరణపద స్యార్థః - ఏవం వసిష్ఠాది తంత్రేపి ఉపబృంహణాని ద్రష్టవ్యాని" అనగా చరణ శబ్దమునకు కుండలినీ శక్తి అని శుక్రసంహితయందు అర్థము చెప్పబడిన దని ప్రమాణమును చూపెను. మరియు, వసిష్ఠాది తంత్రములును అట్లే చెప్పుచున్నవని దానిని దృఢపరచెను. ఈ విధముగా తంత్ర గ్రంథము లందు ప్రసిద్ధ ప్రామాణిక వ్యవహార ముండగా మనము అప్రసిద్ధమని శంకింప నక్కరలేదు. వాల్మీకి మహర్షి గనుక కుండలినీ యోగవిషయ మున శాస్త్ర మాయనకు కరతలామలకము. ఈ తంత్ర గ్రంథము లందలి వ్యవహారములు ఆయనకు సువిదితమే కనుక దానిని గైకొనె ననుకొనవలెను.

వాల్మీకి కాలమున కుండలినీయోగ ముండినట్లు విశదమగు చున్నది. ఆనాటికి తంత్ర గ్రంథములు లేకపోవచ్చును. కాని తర్వాత శాస్త్రముగా రూపొందిన తాంత్రిక విజ్ఞానమునందు మూడువంతులు ఆనాటికే పరిణత రూపమ్ము సంతరించుకొని ముముక్షువులకు సాధన

భూతమై యుండెడిది. కనుకనే ప్రసిద్ధములైన ఆర్షసాధనములు మూడును అనగా వేదాంతశాస్త్ర ప్రతిపాదితమైన శ్రవణమననాది అష్టాంగ యోగమును. యోగశాస్త్ర పతిపాదితమైన యోగమును, తంత్రశాస్త్ర ప్రతిపాదితములైన మంత్రోపాసన కుండలినీ విద్యయును, రామాయణమున ధ్వనింపబడినవి. యోగమునకు కొన్ని ఉదాహరణలు చూడుడు - సుందరకాండమున :— (అక్షకుమార వధ) "తతః స వీరః సుముఖాన్ పతత్రిణః। సువర్ణపుంఖాన్ సవిషా నివోరగాన్। సమాధి సంయోగ విమోక్ష తత్త్వవిత్ శరా నథ త్రీన్ కపిమూర్ధ్న్య పాతయత్" (47 స-14 శ్లో) మరొకటి:- భగ్నరథుడైన అక్షుడు రథము వదలి ఆకాశమున కెగిరెనని చెప్పుచు వాడిన ఉపమానము- "తతోఽభియోగాదృషి రుగ్రవీర్యవాన్, విహాయ దేహం మరుతా మివాలయం" (47 స. 34)- ఇంద్రజిత్తుతో హనుమ యుద్ధము సందర్భమున-" జగామ చింతాం మహతీం మహాత్మా సమాధి సంయోగ సమాహితాత్మా" (48 స-34) అని ఇంద్రజిత్తు వర్ణింపబడెను.

తర్వాత లౌకికవాఙ్మయ కాలమునకు చెందిన వారికి ఈ వాల్మీకీయ "చారణాచరితే పథి." హృదయ మవగతమైనట్లు కనుపించదు. కాని ఇది ఏదో రహస్య గర్భితమను సందేహ మున్నట్లే తోచును. ఏలననగా భోజుడు తన చంపూరామాయణమున ఈ ప్రయోగమును మార్చక దానినట్లే వాడెను. "తతో హనుమాన్ దశకంఠ సీతాన్ సీతాం విచేతుం పథి చారణానామ్" (సుం. కాం 1 శ్లో)

కానీ వాచ్యార్థమున ఈ చారణాచరితే పథికి ఆకాశమనియే చెప్పవలసివచ్చుచున్నది. అప్పుడయినను తొలిప్రశ్నలు వచ్చును. కాని ఆ అర్థము సైతము సార్థకమే. పరాకాశము బ్రహ్మాభివ్యక్తి స్థానము. పరాకాశాయై నమః, గగనాంతస్థాయై నమః [లసనా] కనుక ఆకాశమున వెదుకుట సార్థకమే.

ఈ శ్లోకమున హనుమ పేరే లేదు. దానికి బదులు శత్రుకర్శనః అనబడినది. శత్రుకర్శనః అనగా శత్రువులను కృశింప జేయువాడు అని అర్థము [కథలో రామాయణమున ఇంతవరకు హనుమచేత కృశింపజేయబడిన శత్రువు లెవ్వరును లేరు]. శ్రుతులందు కొన్ని ప్రసిద్ధములగు ఉపమానము లున్నవి. జీవునకు రథిఅని, ఇంద్రియము లకు హయము లని, సంసారమునకు వృక్షమని-ఇత్యాది. అట్లే కామ క్రోధాదులను అరిషడ్వర్గమని చెప్పుట ప్రసిద్ధము, హనుమ శత్రుకర్శను డనగా జితేంద్రియుడు, లేక యమి, వశి అని అర్థము.

అసలు ఈ హనుమత్ అను పేరే చిత్రమైనది. సుందరకాండ మునం దంతటను ఈ హనుమచ్ఛబ్దము దప్ప మరొక పేరు వాడబడక పోవుట ఒక విశేషము. హనుమత్ అనియు, మారుతాత్మజః లేక తత్తుల్యార్థక పర్యాయ పదములును మాత్రమే రామాయణమున హనుమకు వాడబడినవి. ఆంజనేయః ఇత్యాది నామములు అందెచ్చటను వాడబడలేదు. అంతరేణ తాలుకే య ఏష స్తన ఇవావలంబతే సేంద్ర యోనిః" అని తైత్తరీయము. అనగా హృదయమునుండి ఊర్ధ్వముగా ప్రవృత్తమగు సుషుమ్నా నాడి తాలుకల మధ్య స్తనమువలె వ్రేలాడు చుండును. లో దౌడలు, తాలుకలు, వెలిదౌడలు హనువులు, మొత్తము మీద రెండును దౌడలే. కనుక అంతరేణ తాలుకే అనుటకు బదులు అంత రేణ హనూ అనిగాని హన్వో అనిగాని చెప్పవచ్చును గదా. ఇప్పుడు తాలుకవత్ అందము దానికి సుషుమ్నయను అర్థము వచ్చునుగదా. అట్లే హనుమత్ అనియు సుషుమ్న అనియే అర్థము. ఆంజనేయుడు ఈ కాండమునందు హనుమత్ అని పిలువబడుట యోగికి అది సార్థక నామధేయ మనుటకే. కాశీఖండాది గ్రంథములు వ్రాసిన మన కవి సార్వభౌముడు మంత్రదీక్షితులు ధరించు వీరచండికాచార్య దీక్షిత నాథాది దీక్షా నామములందొకటియైన శ్రీనాథుడు అను దానిని నామధేయముగా పెట్టుకొన్నట్లు, ఇందు యోగియగు ఆంజనేయుడు

సుషుమ్నా నామమే అయిన హనుమత్ అను పేరు ధరించెను-కనుక ప్రథమశ్లోకమే హనుమంతుడు యోగి అనియు, సీత కుండలిని అనియు, అతడు కుండలినీ యోగమును అనుష్ఠింపబోవు చున్నాడనియు నాందీ ప్రస్తావన చేసినది. ఈ ధ్వనియే కాండమునందంతటను ఋషిచే అను స్యూతముగా నిర్వహింపబడెను.

రెండవ శ్లోకము:—"దుష్కరం నిష్ప్రతి ద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః సముదగ్రశిరోగ్రీవో గవాంపతి రివా బభౌ"- ఈ కుండలినీ యోగము దుష్కరము, నిష్ప్రతిద్వంద్వము. గుదమును కుంచించి ప్రాణవాయువుతో మూలాధారమున నిద్రించు కుండలినీ శక్తిని ఉత్థాపనచేయు క్రియకు ఈ విశేషణములు సార్థకములే. కుండలిన్యుత్థాపనకు సాధకులు అవలంబించు సరస్వతీ చాలనాది ప్రక్రియా విశేషములను ప్రత్యేక శాస్త్ర గ్రంథముల వలన తెలిసికొనవలెను-ఈ యోగమునకు పూర్వము సాధకుడు సుఖాసీనుడై శిరోగ్రీవములను సుస్థితి యందుంచి సంధ్యా వందనాది నిత్యకర్మ ముగించి ఇష్టదేవతా ప్రార్థనము చేయవలెను. ఈ శ్లోకమున సుఖాసీనుడగుట చెప్పబడినది-ఇచ్చట "గవాంపతిః" అనగా ఎద్దు గాదు. గో అనగా ఇంద్రియము గనుక ఇంద్రియాధిపతి అని అర్థము.

ఇక వచ్చు శ్లోకములన్నియు అతి చిత్రమైనవి. వానియందు ఋషి నిత్యకర్మ అగు గాయత్రీ జపము చెప్పుచున్నాడు. హనుమ మహేంద్రగిరిపై ఉన్నాడని చెప్పెను. ఆ గిరిని రెండే రెండు శ్లోకములతో ఇట్లు వర్ణించెను. "నీలలోహితమాంజిష్ఠపత్రవర్ణైః సితాసితైః స్వభావవిహితైః చిత్రైః ధాతుభిః సమలంకృతం కామరూపాభి రావిష్టం అభీక్ష్ణం సపరిచ్ఛదైః యక్షకిన్నర గంధర్వైః దేవకల్పైశ్చ పన్నగైః"- అనగా ఆ పర్వతము నీలలోహిత మాంజిష్ఠపత్రవర్ణములు సితాసిత వర్ణములు గల ధాతువులచే అలంకృతము, కామరూపులగు యక్ష

కిన్నర గంధర్వనాగాది దేవజాతులచేత కూడియున్నది. ఆ పర్వత వర్ణన ఇక్కడికి ఇంతే-ఇంతవరకు తీసుకున్నచో ఇది శరీరము!!!

ధాతువు లనగా గైరికాదిధాతువులేగాదు "శ్లేష్మాది రసరక్తాది మహాభూతాని తద్గుణాః ఇంద్రియా ణ్యశ్మ వికృతి శ్శబ్దయోనిశ్చ ధాతవః" అని అమరకోశము అనగా శ్లేష్మాదులు, అసృఙ్మాంస మేదోస్థి మజ్జాదులు, పృథివ్యాది పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచేంద్రియములు ధాతువు లనబడును. ఇవన్నియు శారీరికములే గదా. మనశ్లోకమున ధాతుశబ్దము తక్కిన అన్నిటికంటే పృథివ్యాది పాంచభౌతికమునకు విశేషించి వర్తించును. శాస్త్రము పంచభూతములకు కలవని చెప్పిన వర్ణములే మన "నీల లోహితమాంజిష్ఠ సిత అసిత" వర్ణములు ! ఇవి అయిదు వర్ణములు. గోవిందరాజీయ వ్యాఖ్యలో పత్రవర్ణైః పత్రశ్యామైః అని మరొక వర్ణము అధికముగా గైకొనబడి సంఖ్య ఆరు చేయబడినది. కాని మహేశ్వర తీర్థులవారి వ్యాఖ్యలో నీలాది పత్రసమాన వర్ణైః అని అయిదువర్ణములుగానే చెప్పబడినది. ఇదియే సాధుపద్ధతి—ఈ పంచభూతవర్ణములే శరీరమందలి పాంచభౌతిక చక్రములైన మూలాధారస్వాధిష్ఠాన మణిపూర అనాహత విశుద్ధ చక్రములకు చెప్పబడినవి. అయితే ఇందు మతభేదములు కలవు. క్రమముగా కొన్ని వివరింతును. లలితా సహస్రనామావళి ప్రకారము మూలాధారాది క్రమముగా ధూమ్ర పీత రక్త శ్యామ ఆరక్త (పాటల) వర్ణములు. లసనాయందు మూలాధారవర్ణము చెప్పబడలేదు. కాని తంత్రగ్రంథములందు చెప్పబడిన ధూమ్రవర్ణము గైకొనబడినది. యోగశాస్త్రమున-అపరంజి, శ్వేతరక్తహరిత నీలవర్ణములు చెప్పబడినవి. కానీ కుండలినీ యోగము తాంత్రికముగనుక ధూమ్రాది పద్ధతియే తీసుకొనుచున్నాను. ఇప్పుడు...మన నీలలోహిత శ్లోకవర్ణములను పంచభూత వర్ణములనుజోడించి చూచినచో రహస్యము విశదమగును. మాంజిష్ఠ=ఆరక్త, నీల=శ్యామ, లోహిత=రక్త, సిత=పీత, అసిత=

ధూమ్రము. ఇందు ఆకాశతత్త్వమునందు చెప్పిన మాంజిష్ఠవర్ణము ఎరుపు కనుక పసుపు కలసినది; పాంచభౌతిక ఆరక్తవర్ణము ఎరుపు తెలుపు కలసినది. పసుపు తెలుపు లందే భేదము. రెంటియందును ప్రధానముగా కనపడునది ఎరుపువర్ణమే గనుక వాస్తవముగా భేదము లేదనియే గ్రహింపవలెను. మరొకటి-స్వాధిష్ఠాన విషయమున సిత పీతవర్ణములు సమానముగా తీసుకొనబడినవి. తెలుపుపసుపుల కున్న భేదము అతిస్వల్పము. పైగా శాస్త్రమునందే ఇట్టిభేదములు కలవు. ఫలితముగా తేలినది—ఈగిరి నీలాదివర్ణములు గల పంచభూతములచే ఒప్పి ఉన్నది పురగిరి శబ్దములచేత శరీరమునకు అభేదరూపకము చెప్పుట శాస్త్రాచారమే. శ్రుతి శరీరమును బ్రహ్మగిరి యనుచున్నది. అందుచేతనే హృదయము గుహ అనబడుచున్నది. "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమ్ని"-ఇత్యాది. కనుక ఇచ్చట గిరి శరీరము. ఇట్లు వర్ణములచే శరీర తత్త్వమును ధ్వనింపజేయుట మంత్రశాస్త్రమున ఉన్నదే. గాయత్రీధ్యాన శ్లోకము ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయై ర్ముఖైః అను సమాసము నందలి అయిదువర్ణములు గల అయిదుముఖములు పంచభూతవర్ణములు, సమష్టిగా షట్చక్రము లందలి అయిదు శక్తిచక్రములందున్న పరాశక్తి ఈ ధ్యాన శ్లోకమున ధ్వనింపజేయబడినది. లసనా యందున్నది ఈ విషయమే-త్వక్స్థాయైనమః, రుధిరసంస్థితాయై నమః, మాంసనిష్ఠాయైనమః, మేదోనిష్ఠాయైనమః, అస్థిసంస్థితాయైనమః, మజ్జాసంస్థితాయైనమః, అట్లే శివధ్యాన శ్లోకమందలి "ముక్తాపీత పయోద మౌక్తిక జపావర్ణై ర్ముఖైః" నైతమును. ఈ పద్ధతియందలి రహస్యమును గ్రహించిన వాడగుటచేతనే హర్షభట్టు నైషధమున "ద్రవ్యాణాం సితిపీత రోహిత హరిన్నామాన్వయం లుంపతు" అని శరీరము అంతర్ధానమగుటను వర్ణించెను. ఈ విషయము నానైషధ వ్యాసములందు నిపుణతరముగ ప్రతిపాదింపబడినది. (సుం. కాం అసిత= లసనా) ధూమ్రము=(గాయత్రీ) ముక్తా, (సుం. కాం) సిత=(లసనా)

సీత=(గాయత్రీ) ధవళ, (సుం. కా) లోహిత= (లసనా) రక్త= (గాయత్రీ) విద్రుమ, (సుం. కాం) నీల=(లసనా) శ్యామ=(గాయత్రీ) నీల, (సుం. కాం) మాంజిష్ఠ=(లసనా) ఆరక్త=(గాయత్రీ) హేమ. ఇంచుమించు ఇవన్నియు సమాన వర్ణములని విశదమగును.

పర్వతము దేవతా నివాసమనుట ప్రసిద్ధము. "త్వమగ్నే ద్యుభిః త్వమశ్మనఃపరి" (తైత్తిరీయము) శరీరముకూడా అగ్న్యాది దేవతలకు ఆస్థానము. ఈ రెంటికీ సంబంధము గలదు. కనుకనే ఇచ్చట ఋషి గిరిని కామరూపిభిరావిష్ట శ్లోకముతో వర్ణించెను. ఈ దేవత లెవరో గాదు. శరీరమూల పదార్థములగు పంచభూతాది చతుర్వింశతి తత్త్వములకు అధిదేవతలు. (వెన్నెముక మేరువు. మేరువు దేవతా నివాసము.)

అట్టి గిరిపైన హనుమ కూర్చొని ఉన్నాడట. ఇది "స తస్యగిరి వరస్యతలే నాగవరాయుతే తిష్ఠన్ కపివరస్తత్ర హ్రదే నాగఇవాబభౌ" అని ఋషిచే చెప్పబడినది. పదివేలు, లేక అనేక నాగశ్రేష్ఠములుగల ఆ గిరిశ్రేష్ఠముయొక్క ఉపరితలమున హనుమ కూర్చున్నవాడై హ్రదమునందలి నాగమువలె ప్రకాశించెను. ఇందెన్ని విపర్యయములు స్ఫురింపగలవో చూడుడు. ఆ గిర్యుపరి భాగమున కేవలము నాగములు అనగా ఏనుగులుమాత్రమే ఉన్నవా? మరేవియు లేవా? ఉన్నచో వీనినే చెప్పుట యేల? ఏనుగులే ఉన్నవని చెప్పుటచేత ఏదేని ఒక ఉత్కృష్టమగు కావ్య రామణీయకము సాధింపబడెనా, ఒకవేళ నాగవరాయుతే వదలివేసినచో అట్టి రామణీయకము నష్టమగునా? రామణీయకమూ లేదు, నష్టమగుటయులేదు. మరి ఋషిగదా అట్లెందు కనెను? అసలు రహస్యము—ఈనాగ వరాయుతే సమాసమును ఒక విధముగా విరిచి చెప్పుకొనవలెను. నాగ శబ్దమును జాతి వాచక మాత్రముగా తీసికొనవలెను. అంతట వరా అను స్త్రీలింగ శబ్దమును కలుపవలెను. పిమ్మట యుతే చేర్చవలెను. ఫలితము: నాగ—

వరా—యుతే—అనగా నాగినీ శ్రేష్ఠా సంయుతే. "రూపేణా ప్రతిమాలోకే వరా విద్యాధర స్త్రియః" అని ఋషియే 12వ సర్గలో వరా శబ్ద ప్రయోగము చేసెను. (వరా అనగా పార్వతి.అట్టే ఇదొక విశేషము.) అయితే ఎవ రీ నాగిని ?

తర్వాత గిరితలమున నున్న హనుమ హ్రాదము నందున్న ఏనుగు వలె ప్రకాశించెనట: ఇదేమి ఉపమానము ? ఉపమానోపమేయములకు కావలసిన సమాన లక్షణములు ఇచ్చట ఏవి ? వెనుకటి సమాసమున నాగవరా శబ్దము నాగిని అయినట్లే ఇచ్చటను అదే చెప్పుకొన్న చో హ్రాదే సమన్వితమగును. ఇంతెందుకు. ఋషియే నాగము అనగా సర్పము అనుకొనమని తన తదనంతర ప్రయోగముచే చెప్పుచున్నాడు. చూడుడు 5 స. 14 శ్లోకమున "హ్రాదో భుజంగై రివ నిశ్వసద్భిః" అని కలదు. ఇదియే నా ఊహకు దోహదము- అయితే ఆ గిరితలమునం దున్న నాగము ఎవరు ? ఈ హ్రాదము నందలి నాగము ఎవరు ? గిరితల మేది ? హ్రాద మేది ?

గిరి శరీరమని వివరించితిని. కనుక గిరితలము శిరస్సు. అందలి నాగిని పరాశక్తియే. భోగిన్యైనమః [లసనా] ఈ నామమునకు వ్యాఖ్య వ్రాయుచు భాస్కరరాయలు "భోగః సుఖసాక్షాత్కారః తద్వతీ భోగినీ నాగకన్యాత్మికా వా"- అనెను. శిరస్థితాయైనమః (లసనా) ఆమెను కుండలినీ అందురు. "భుజగాకార రూపేణ మూలాధార సమాశ్రితా శక్తిః కుండలినీ నామ బిసతంతునిభా శుభా' వామకేశ్వర తంత్రము కాని. ఆమె మూలధారము నుండి శిరస్సు చేరినప్పుడు ఊర్ధ్వకుండలిని.

ఇక హ్రాదే నాగ ఇవా బభౌ- ఈ హ్రాద శబ్దము సుధాసింధువులకు వాడబడిన శాస్త్రపరిభాష. సుధాసాగరమధ్యస్థా అను నామమునకు భాష్యము వ్రాయుచు లసనా యందు భాస్కర రాయలు ఇట్లు చెప్పెను. "సుధాసాగరః పీయూషార్ణవః-సచోర్ధ్వస్థ ఏకః-పిండాండే

బిందుస్థానే సహస్రార కర్ణికా చంద్ర మధ్యేన్యః- అపరాజితాఖ్యే సగుణ బ్రహ్మోపాసనా ప్రాప్యే నగరే అరనామకణ్యనామకౌ హ్రదౌ సాగర ప్రతిమౌ" ఇత్యాది. అనగా, "అమృతేనావృతాం పురీం'' అని చెప్పబడిన బ్రహ్మాండమందలి ఊర్ధ్వస్థసుధాహ్రదమొకటియు, పిండాండ మగు శరీరమందున్నది మరొకటియు మొత్తము రెండు సుధాహ్రద ములు సాగరసమానము లున్నవని శాస్త్రము. శరీరమందలి సుధా సింధువు సహస్రార కర్ణికా మధ్యమందలి చంద్రమండలమున గలదు. అధఃకుండలిని సహస్రారమును చేరి ఆ మండలమును ఛేదింపగా సుధా ప్రవాహము స్రవించి ద్విసప్తతి సహస్ర నాడీమండలము తృప్తిపొం దును. (దేవతలు అమృతము త్రాగుట ఇత్యాది విషయ మీ శాస్త్రమే) కనుక హ్రదే నాగ అనగానే ఈ శాస్త్ర విపయము స్ఫురించును.

అందుచేత, గిరిపరస్యతలే తిష్ఠన్ కపివరః తత్ర హ్రదే నాగ ఇవాబభౌ అనగా పిండాండమందలి నాగినియు, బ్రహ్మాండమందలి నాగినియు ఒకటే అనియు, గిరివరస్యతలే తిష్ఠన్ అనగా అందున్న పరాశక్తి యందు ఆత్మను సుప్రతిష్ఠితము చేసి తాదాత్మ్యభావన చేసె ననియు, అంతట పిండాండ బ్రహ్మాండములకు తాదాత్మ్యమును భావన చేసెననియు, సూచింపబడినది. సాధకునకు ఇట్టి తాదాత్మ్య భావన అవసరము. దీని సారాంశము - లింగాత్మ సూత్రాత్మ, పరమా త్మలయొక్క ఐక్యము యోగిచే భావన చేయబడినది అని.

అయితే, ఇది గాయత్రీ జప మెట్లగును? అనగా రెండు కారణ ములు గలవు ఒకటి 'ససూర్యాయ...భూతేభ్యః ప్రాంజలిం కృత్వా చకారగమనే మతిం" అని దేవతా ప్రార్థనా శ్లోకము. ఈ శ్లోకములకు తర్వాత వచ్చుచున్నది. ఇంతవరకూ వివరింపబడిన శ్లోకము లన్నియు గాయత్రీ పరముగా సైతము అన్వయించును. రెండు-చారణా చరితే పథి, నాగవరాయుతే, హ్రదే నాగ అనునవి గాయత్రికి కూడ వర్తిం చును. దేవీ భాగవతము 12వ స్కంధము 6 అధ్యాయము చూడుడు.

అది శ్రీమన్నారాయణుడు నారదునికి చెప్పిన గాయత్రీ సహస్రనామ స్తోత్రము అందుండియే ప్రమాణములు తీసికొందును. 129 శ్లోకమున మూలాధారస్థితా ముగ్ధా...మహిషాసుర మర్దినీ'' అనియు 122 శ్లోకమున "భుజంగ వలయా భీమా" అనియు గాయత్రి వర్ణింపబడినది. కనుక, గాయత్రి కుండలినియే.

చారణా చరితే పథే ఆకాశమనుటకు గాయత్రి ఆకాశమునందుండును. 141 శ్లోకము "వినతావ్యోమమధ్యస్థా" అనియు 38 శ్లోకము "ఖేచరీ ఖగవాహనా" అనియు వర్ణించినది. చారణులు అను విశేషమునకు 'గాయంతం త్రాయతే' గాయత్రి అనగా గానము చేయుచున్న వారిని రక్షించునది గాయత్రి. కంఠము గానస్థానము, అందున్న విశుద్ధ చక్రము శ్రుతివిషయగుణకమగు ఆకాశతత్త్వాత్మకము. అచ్చటనే వైఖరీవాక్కు అభివ్యక్తమగును. కంఠమునకు, గానమునకు ఆకాశమునకు, గాయత్రికిని, ఇట్టి సంబంధము కలదు. ఈ విశేషము గుర్తింపవలెను. 40 శ్లోకమున గాయత్రి ''గాంధారీ గానలోలుపా'' అనబడినది.

నాగవరాయుతే అనుటకు 120 శ్లోకము 'భామినీ భోగినీ భాషా' అని గాయత్రిని వర్ణించినది భోగిని అనగా నాగిని. 144 శ్లోకము ఆమెను వరా అనినది. "వాసవీ వామజననీ వైకుంఠ నిలయా వరా"

హ్రాదే నాగఇవ అనుటకు హ్రాదము సుధాసింధువుగదా. గాయత్రి అందుండును. 10వ శ్లోకము "అమృతార్ణవ మధ్యస్థా వ్యజితా చాపరాజితా"

గాయత్రియొక్క రహస్యరూపమే పంచదశీ మంత్రాధిదేవత యగు శ్రీ మహాత్రిపుర సుందరి. కనుకనే లసనా యందు గాయత్ర్యైనమః, సంధ్యాయైనమః

ఇది సుందరాకాండమున గాయత్రీ జప ప్రకరణము.

---

# i

వాల్మీకి మహర్షి రచన, వేసిన శబ్దమే వేయుచు, వాడిన శ్లోకమే వాడుచు, చెప్పిన విషయమే చెప్పుచు దీర్ఘముగా సాగిపోవుచుండు పౌరాణిక శైలిగలది అని చాలామంది అభిప్రాయము. సంగ్రహముగా ఉండకపోవుట, చిక్కదనము లేకపోవుట, భాషయందు అపాణినీయ పద్ధతు లుండుట ఇత్యాది లక్షణములచేత ఇది పౌరాణిక పద్ధతి అనియు, కాళిదాసాదుల కవిత ఋషిలో ఉన్న లోపములను తొలగించి మెరుగులు పెట్టి తీర్చిదిద్దిన పద్ధతి అనియు వారి అభిప్రాయము. ఇది ఒక భ్రమ. అందలి పరమార్థ మెప్పుడు గ్రహింపబడదో అప్పుడు ఇట్టి మిథ్యాదృశ్యము లన్నియు గోచరించుచుండును. కాని పరమార్థము గోచరించినపుడు ఈ పునరుక్తులు ఇత్యాది లక్షణములు అవసరమనియు, ఋషి రచనయందు అనవసరమగునది ఒక్క అక్షరము కూడ లేదనియు తెలియును. వేదమున వ్యర్థమగు ద్విరుక్తి కలదా? వ్యర్థమగు దైర్ఘ్యముగలదా? వ్యర్థమగు శబ్దము గలదా? యోచింపుడు. వేదమంతయు మంత్రమయము. ఋషి రచన వేదమే అను విశ్వాసము కుదుర్చుకుని పిదప దానిని పరిశీలింపుడు. సర్వము విదితమగును. ఋషియందు ప్రధానముగా ఆరు లక్షణములు గలవు: ఒకటి. ప్రతిశబ్దము దాని వ్యుత్పత్తి దృష్టియం దుంచుకునియే వాడబడును- రెండు-శ్లోకములు సాధారణముగ ధ్వనించుచుండును. మూడు-సాధారణముగ ధ్వనికొరకే శబ్దములు వాడబడుచుండును. నాలుగు-కొన్ని శ్లోకములందు ఒకటికంటె ఎక్కువ పద్ధతులందు మార్చి, ఒకటికంటె ఎక్కువ అర్థములు వచ్చునట్లుగా ఒక చిత్రమగు శబ్దవ్యూహముండును. అయిదు-ధ్వని ఉద్దేశించిన శబ్దము తరుచుగా మూడు నాలుగు పర్యా

యములు పునరుక్తమగును. ఆరు-వాక్యము రెండు శ్లోకపాదములందే ముగియునట్టి నియమము లేదు. ఇవన్ని ఎట్టివో నేనిప్పుడే వివరింపను. నా రామాయణ వ్యాసములు - శ్రద్ధగా చదువువారికి, మొత్తముమీద ఇవన్నియు ఉన్నవని ఋజువు అగును. కాని పై ఆరు లక్షణము లందును మూడవ నాల్గవ లక్షణములు అతిప్రధానములు అని గుర్తించు కొనవలెను ఇవియే రామాయణ పరమార్థమునకు ద్వారము.

కాళిదాసమహాకవి వాల్మీకి మానసపుత్రు డనునది జగద్విదిత మే. దీనికి లక్ష కారణములున్నను అందు కొన్ని తెలిసిన మాత్రము ననే ఈ భావము కలుగవచ్చును కదా! తెలియని కారణము లింకను ఉండవచ్చును గదా? ఆ తెలియని కారణములు రెండు చెప్పుటయే నా ప్రకృతోద్దేశము. ఆ రెండును నేను వెనుక ఆరింటియందు రెండు అతి ప్రధానములని చెప్పిన వాల్మీకీయ లక్షణములే. అనేకార్థ స్ఫోరక శబ్ద వ్యూహ రచన కాళిదాసునం దున్నట్లు ప్రతీతి లేదు. అట్లే వాల్మీకిని గురించియు లేదు. కాని ఇరువురియందును కలదనియు, అది వాల్మీకినుంచి కాళిదాసునకు సంక్రమించినదనియు చూపింతును. చూడుడు-

రఘువంశము కలదుగదా, కాళిదాసుని ప్రసిద్ధ గ్రంథము. అందు ఒక శ్లోకము- "అథాథర్వనిధే స్తస్య విజితారిపురః పురః అర్థ్యాం అర్థపతిర్వాచం ఆదదే వదతాంవరః" ఈ శ్లోకము చిత్రమగు ఒక శబ్ద వ్యూహము. దిలీపుడు కులగురువగు వసిష్ఠుని ఆశ్రమమునకు పోయినప్పుడు అచ్చట ఆ రాజు ఆ ఋషిని కలుసుకొన్నప్పటి వృత్తాంతము. మల్లినాథాదుల వ్యాఖ్యలు గలవు. సామాన్యముగా దీనికి చెప్పు అర్థము, చేయు అన్వయము-అంతట అథర్వనిధి యగు వసిష్ఠుని ముందు శత్రుపుర విజేతయు, వక్తలందు శ్రేష్ఠుడును అర్థపతియు నగు దిలీపుడు అర్థయుక్తమగు వాక్కును గైకొనెను. అనగా సార్థక వాక్కుతో మాట్లాడెను. ఇరువురును ఇచ్చట మహానుభావులు గనుక

వ్యర్థ సంభాషణ ఉండదని తాత్పర్యము. ఒకడు మునియైనచో మరొకడు రాజ్యాశ్రమముని ("రాజ్యాశ్రమమునిం మునిః" అని కవి). ఇచ్చట కాళిదాసు ఇరువురికిని సమాన ప్రతిపత్తి గలదని, వారి అంతరము అతి సూక్ష్మమని, ఆ తత్త్వము సామాన్య సంస్కారము గల వారికి అవేద్యమనియు సూచించుచున్నాడు. ఈ ప్రతిపత్తినే ఆసందర్భ మున అన్ని శ్లోకములందును వ్యంజితము చేసెను. ఆ వ్యంజనాపరా కాష్ఠయే మన ప్రకృత శ్లోకము. అన్వయము, అథ తస్య అధర్వనిధేః పురః, విజితారి పురః వదతాంవరః అర్ధపతిః అర్థ్యాం వాచం ఆదదే. అధర్వనిధి అనగా అధర్వ వేదమున పౌరోహితమంత్రములు కలవు. కనుక వసిష్ఠుడు పురోహితశ్రేష్ఠుడనుటకు అధర్వనిధి అనబడినదని మల్లినాథాదులు. ఇది ఇట్లుంతము:—

కాని అధర్వన్ అను శబ్దము శివునకు విశేషణము (అప్టే చూడుడు) అధర్వనిధేః అనగా వసిష్ఠస్య అని యెట్లువచ్చునో అట్లే శివస్య అని కూడా వచ్చును. అట్లు శివస్య పురః అని తీసికొన్నప్పుడు అన్వయము – తస్య విజితారిపురః అధర్వనిధేః పురః అర్థపతిః వదతాం వరః, అర్థ్యాం వాచం ఆదదే. అనగా ఆ త్రిపురారియగు శివునిముందు వక్తలందు శ్రేష్ఠుడగు కుబేరుడు అన్వర్థమగు వాక్కును గైకొనెను. (విజితారిపురః అనుచోట పురః అనునది రెండు విధములుగా మారు టకు వీలయిన శబ్దము. పురః అనునది పూః అను స్త్రీలింగ శబ్దము యొక్క షష్ఠీ విభక్తి ఏకవచన రూపము – పురముయొక్క అని అర్థము, మరొకటి పురం అను నపుంసక లింగశబ్దము ప్రథమావిభక్తి, పుంలింగ కర్తకు విశేషణమయి పుంలింగ రూపము దాల్చినది. పురం పూః శబ్దములకు పట్టణమనియే అర్థము. శ్లోకమున రెండవ పురః ముందు అను నర్థమిచ్చు అవ్యయము). ఇందు శివ కుబేరు లను అర్థ మొకటే కాదు. కదలించినచో శతకోటి ధ్వనితరంగము లుత్పన్న మగును. అర్థపతిః వదతాంవరః అనగా అర్థములపతి శివుడు వాక్కు

నకు వరుడు శిష్రుడు. వాగర్థములు పార్వతీ పరమేశ్వరులు గదా. ఇట్లయినచో రాజ్యాశ్రమమునియు, - మునియు సమాను లగుదురు. ఇట్లు ఇంకెన్ని మర్మము లున్నవో! మహాకవులందు ఎక్కడ ఏమి ఉన్నదో తెలిసికొనుట అసాధ్యము. అదదే అను క్రియాపదము తీసికొనెను. దానిచేత ఇచ్చువాడొకడు కలడను ధ్వని నిచ్చుచున్నది ఇచ్చట వసిష్ఠ దిలీపులను వాచ్యార్థమునందు విజితారిపురః అనునది. అర్థపతిః అను పదమునకు విశేషణ మగును. శివకుబేరు లను వ్యంగ్యార్థమునందు అధర్వనిధేః అను పదమునకు విశేషణమగును. ఈ విధముగా ఇరువైపులకు కలియుటకు అనుకూలముగా ఈ విజితారిపురః అను విశేషణము మధ్యస్థముగా పెట్టబడినది. అనగా ఈ శ్లోకము ఆశుకవిత్వము కాదు, కాళిదాసు కవిత సులభము - హర్షుని కవిత కష్టము అనువారు సులభమను శబ్దముచేత వ్యక్తముచేయు భావ మేదో ఆ భావము పట్టి భ్రమ అని శ్లోకము విశదము చేయును. పద క్లేశము కాఠిన్య మనుకొనువారు సాహిత్యమున శిశువులు. దానిని సిద్ధాంతము చేయువారు ఎవరు ? పదక్లేశముగల కవిత బయట పరుషముగ మాట్లాడి లోపల ఏమియు లేనట్టివాని వంటిది. ఆ బాధను నిఘంటువులు సులువుగా తీర్చును. కాని కాళిదాసు కవిత అట్టిది కాదే!—

కాళిదాసు కవిత లలితముగా ఉండును. పదములు మృదువుగా ఉండును. మన అథాధర్వనిధేః శ్లోకమున కఠినపదములు గలవా ? ఆయన కవిత అంతము అట్లే మృదువుగానే ఉండును. నిఘంటువుల బాధయే లేదు. కానీ నీ కేమి తెలిసినది ? తెలిసిన దనుకొన్నచో అంతకంటే ఆత్మవంచన ఉండదు. సాహిత్యమున కావ్యాత్మ శబ్దార్థములం దుండదు. అదెప్పుడు ఆ రెంటికిని అతీతమగు స్థానమునందే పరోక్షముగా ఉండును. పరోక్షప్రియా వై దేవాః అనిగదా శ్రుతి. కనుక అది దేవమార్గము. అట్టిచో శబ్దములయొక్క కాఠిన్యాకాఠిన్యములు కవిత్వసత్తాను నిర్ణయింపజాలవుగదా ? కనుక కాళిదాసు

మెత్తగా మాట్లాడుచునే కడుపులో ఒక సముద్రమంత భావమును దాచుకొని యుండును.
(మరొకశ్లోకము శాకుంతల నాందినిగురించి అనుబంధము చూడుడు.)

మన అథాధర్వనిధేః శ్లోక మెట్లున్నది? ఒక పద్మవ్యూహము వలె నున్నది. కాని పైకేమియు లేనట్లు తోచుచున్నది. మహానుభావు లగువారి వాక్కులు, ఇట్లేవుండును. శతయోజనవిస్తీర్ణమగు సముద్రము దాటి సీతను చూచి లంకనుకాల్చి వచ్చిన రుద్రాంశ సంభూతుడగు హనుమంతుడు ఆ పని చేయుటకు ముందు ఏమియు ఎరగనట్లే ఊరక కూర్చుని యుండెనట. ఆయనతో జాంబవంతు డనిన మాట జ్ఞాపకము వచ్చుచున్నది. "వీర వానరముఖ్యస్య సర్వశాస్త్ర విశారద, తూష్ణీ మేకాంత మాశ్రిత్య హనుమ న్కిం న జల్పసి" (ఈ జల్పసి అను క్రియాశబ్ద మెంత రసపుష్కలముగా వున్నదో చూడుడు). కాళిదాసుకవిత అట్టిది. కాళిదాసునకు ఈలక్షణము వాల్మీకినుంచియే వచ్చినది.

కాళిదాసు మెత్తని పులి అయినచో వాల్మీకి ఆయన తాత ! వాల్మీకియొక్క శబ్దవ్యూహ రచనాదక్షత అద్వితీయము. ఈలక్షణము నం దొక స్వల్పభాగమే కాళిదాసుకు లభించినది. సుందరకాండమున హనుమంతుడు సీతను తన వీపుపై నెక్కించుకుని పోయి రాముని వద్ద జేర్చెదనని ఆమెకు చెప్పు సందర్భము—"పృష్ఠ మారోహ మే దేవి, మా వికాంక్షస్వ శోభనే యోగ మన్విచ్ఛ రామేణ శశాంకేనేవ రోహిణీ"—(37 స. 26 శ్లో) కథయంతీవ చంద్రేణ సూర్యేణ చ మహార్చిషా, మత్పృష్ఠ మధిరుహ్యాత్వంతరాకాశే మహార్ణవం" (37-27 దేవీ మత్పృష్ఠము నధిరోహింపుము, శశాంకునితో రోహిణివలె రామునితో యోగమును (కలయికను) కోరుము. నాపృష్ఠముపై నెక్కి తేజోవంతులైన చంద్రసూర్యులతో సంభాషించుచున్న దానివలె ఆకాశ మార్గమున సముద్రమును దాటుము అని అర్థము. ఈ శ్లోకద్వయము

కులకము. ఈ నాల్గుపాదములందలి తొలిపాదమును వదలి తక్కిన మూడుపాదములు పరిశీలింతము - ఆ మూడుపాదములు అతిచమత్కార ముగా ఉన్నవి. ఇందు వ్యూహారచనాచాతుర్యము ఎంత ఉన్నదో చెప్పుటకు శక్యముగాదు. వెనుక చెప్పిన రెండు అతి ప్రధాన లక్షణ ములు అనగా, శబ్దములు ధ్వనికొరకే వాడుట, అనేకార్థ స్ఫోరక శబ్ద వ్యూహారచన—ఈరెండు తెలిసికొనుటకు ఈ శ్లోకములు చక్కటి ఉదాహరణములు.

వాచ్యార్థము విదితమే వ్యంజనా చాతురి చూడుడు: నాల్గవ పాదమున మత్పృష్ఠమధిరుహ్యాతు అంతరాకాశే మహార్ణవంఅని విడ దీసినచో ఈ శ్లోకముయొక్క స్వరూపమే మారిపోయి శబ్దములు వ్యంజనాపద్ధతియందు వానివాని స్థలములలో అవే చేరును. అట్లు చేరి ఋషి ఉద్దేశించిన పరమార్థము నిచ్చును. ఇందు ఋషి పరమార్థము కుండలినీ యోగము!!! ఈపక్షమున ఈ శ్లోకాన్వయము మత్పృష్ఠం మహార్ణవం అధిరుహ్యాతు అంతరాకాశే చంద్రేణ సూర్యేణచ మహార్చిషా కథయంతీవ, రామేణ యోగ మన్విచ్ఛ, శశాంకేనేవ రోహిణీ మహా ర్ణవమగు నాపృష్ఠము నధిరోహించి అంతరాకాశమునందు చంద్ర సూర్యాగ్నులతో కలసి మాట్లాడుచున్నదానివలె రామునితో యోగ మును కోరుము—శశాంకుని రోహిణివలె—ఇది అర్థము.

బాహ్యయోగమును వాచ్యార్థము చెప్పును. కానీ పరమార్థము ఆంతరయోగమును చెప్పును. వాస్తవముగా యోగము అంతరాకాశ మునందే సంభవించును. "న యోగో నభసః పృష్ఠే నభూమౌ న రసా తలే ఐక్యం జీవాత్మనో రాహు ర్యోగం యోగవిశారదాః" [దేవీ భాగవతము 7 స్కం—౩౫అ—2 శ్లో] యోగమనగా ఆకాశమునందు గాని, భూతలమునందుగాని, రసాతలమునందుగాని, జరుగునది కాదు. అది జీవేశ్వరుల ఐక్యమే, వీ రెచ్చట ఉన్నారు? "ద్వాసుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే" [శ్వేతాశ్వతరీయము]

అనగా జీవేశ్వరులను ఇరువురు పతులు ఒక్క దేహమునందే ఉన్నారు. కనుకనే ఋషి. అంతరాకాశే అనెను. కుండలినీ శక్తి శివునితో సంయోగము పొందినచో, జీవుడు ముక్తుడగును.

క్రమముగా శ్లోకమందలి శబ్దములు పరిశీలింతము. పృష్ఠం అనగా ఇచ్చట వీపు గాదు. నభసః పృష్ఠే అని వెనుక అనినపుడు ఆకాశముయొక్క వీపు అందురా? కాదు, ఇచ్చట పృష్ఠం అనునది వ్యంగ్యార్థస్ఫోరకమే ఈపృష్ఠ శబ్దమునకు మహార్ణవం అను నది విశేషణము. అర్ణః అను శబ్దమునకు జలము అనియేగాక వర్ణము అని కూడా అర్థము గలదు. మంత్రశాస్త్రమున ఆ అర్థముతో ఆ పదము తరచు వాడబడుచుండును. కనుక మహార్ణవం అనగా వర్ణసమామ్నాయ స్థానము అని అర్థము. అట్టిపృష్ఠమును కుండలినీ శక్తిగా సూచింపబడుచున్న సీతను అధిరోహింపుమనుటయు, యోగశబ్దమును ప్రయోగించుటయు, పృష్ఠ శబ్దమునకు వ్యంజనా శక్తిని కలిగించుటకే, ప్రకరణముచేత పృష్ఠము పృష్ఠ వంశమని ధ్వనించుచున్నది. ఒకటి గుర్తింపవలెను. శబ్దశక్తి మూలధ్వనియందే శబ్దము అగత్యమగును. కాని ఇది అట్టిది కాదు కనుక ఇచ్చట పృష్ఠవంశమని వాచ్యముగా శబ్దమక్కరలేదు.

పృష్ఠవంశ మనగా వెన్నెముక. వంశమనగా వేణువు. అది వాయుపూరణముచేత శబ్దములను చేయును. అట్లే మానవులుచేయు శబ్దములు వెన్నెముకయందు పుట్టుచున్న వని శాస్త్రము. ఎట్లు? వెన్నెముకయందు సుషుమ్నా అను నాడి కలదు. "ప్రధానా మేరుదండేఽత్ర చంద్ర సూర్యాగ్ని రూపిణీ....సర్వతేజోమయీ సాతు సుషుమ్నా." [దేవీ భా. 7 స్కం. 35 అ, 29, 30, 31 శ్లో.] దానికి నీలకంఠ వ్యాఖ్య—ప్రధానా సుషుమ్నా నాడీ మేరుదండే పృష్ఠస్య వంశే స్థితా మూలాధార మారభ్య, పృష్ఠవంశమార్గేణ బ్రహ్మరంధ్రపర్యంతం గతేత్యర్థః—సుషుమ్నా నాడి వెన్నెముకయందు మూలాధారమునుండి

సహస్రారము వరకు వ్యాపించి యున్నది. వాయుప్రేరితమై తొలుత అవ్యక్తశబ్దబ్రహ్మము మూలాధారగతకుండలినియందు పుట్టును. అది పరా వాక్కు. సుషుమ్న ఊర్ధ్వగతి గలది. దానియందీ శబ్దము ఊర్ధ్వముగా పోవుచు మనోయుక్తమై పశ్యంతిగాను, బుద్ధియుక్తమై మధ్యమగాను, కంఠస్థానమందు పరశ్రోత్ర గ్రహణయోగ్యమై అకారాది వర్ణరూపమును పొంది అభివ్యక్తమైనపుడు వైఖరిగాను, రూపాంతరములను పొందుచున్నది. ఈ సుషుమ్న చంద్రసూర్యాగ్నిరూపిణి గనుక తదుత్పన్న వర్ణసమామ్నాయము సౌమ్య సౌర ఊష్మము అని త్రిథావిభక్తములై యున్నవి. కనుక సుషుమ్న పంచాశద్వర్ణమాతృకారూపముగా ఉన్నదనియు, అది పృష్ఠవంశమున గల దనియు, అది ఋషిచే పృష్ఠం అను శబ్దముచే ధ్వనింపబడినదనియును గుర్తింపవలెను. కనుక మత్పృష్ఠం మహార్ణవం అనగా పంచాశద్వర్ణ సమామ్నాయ స్థానమగు నాపృష్ఠవంశమునందలి సుషుమ్నా నాడిని (అధిరోహింపుము) అని.

కుండలిని సుషుమ్నను ఆరోహించి, షట్చక్రములు దాటి సహస్రారమును చేరును. అచట శివైక్యమును పొందును. గాయత్రీ పంజర స్తోత్రమున "ఆరోహా దవరోహణక్రమగత (శ్రీ) కుండలీ సంస్థితా" అనబడినది. ఆమెకు ఊర్ధ్వ అని పేరు గలదు. "ఊర్ధ్వచాపూర్ధ్వ కేశీచాపూర్ధ్వాధోగతిభేదినీ" అని (12 స్కం. 6 అ) దేవీ భాగవతము. కనుక కుండలిని ఆరోహశీల కనుక నే ఋషి "యోగ మన్విచ్ఛ రామేణ శశాంకే నేవ రోహిణీ" అని కుండలినిని రోహిణీ శబ్దముతో సూచించెను. రోహిణి అనగా యా రోహతి సా రోహిణి అని కుండలినీ పరముగా అర్థము వచ్చును. ఇది యాదృచ్ఛికముగా చొర్లిన ఉపమానము కాదు వాల్మీకియం దేదియు యాదృచ్ఛికముగా ఉండదు. ఈ విశ్వాసము కుదిరిన గాని ఆయన హృదయము అందదు. అన్నియు సాభిప్రాయముగను, బుద్ధిపూర్వకముగను ప్రయోగింపబడుచుండును. అది వట్టి

అలంకారము కాదు. అలంకార ధ్వని. రోహిణి ఎట్లు కుండలిని యో శశాంకుడు అట్లు పరమాత్మయే, శాస్త్రపరిభాషయందు సహస్రారగత చంద్రమండలము. చంద్రుడు షోడశకళాయుక్తుడు. శ్రుతి పురుషుని షోడశకళాయుక్తునిగనే చెప్పుచున్నది. "షోడశకలః పురుషః" అని ఛాందోగ్యము. ఒక విశేషము—దేవీ వాఙ్మయమున శక్తికి రోహిణి అను నామము ప్రశస్తమే. "రోహిణీ, రాజ్యదా, రేవా, రమా, రాజీవలోచనా" (దేవీ భా. 12 స్కం, 6 వ అ, 134 శ్లో) గాయత్రీ పంజర స్తోత్రమున "ధనినా యామినీ పద్మా రోహిణీ రమణీ ఋషిః" కనుక, శశాంకేనేవ రోహిణీ అనగా ఇదీ ఋషి యొక్క తాత్ప ర్యము. ఇది అలంకారధ్వనియా ? లేక అలంకారమా ?

ఇక కథయంతీవ చంద్రేణ సూర్యేణ చ మహార్చిషా అని ఉన్నదే ఇదేమిటి ? అనగా—ఇచ్చట అర్చిషా అగ్నా్య అని. అర్చి శ్శబ్ద మునకు తేజస్సనియే గాక, అగ్ని అనియు అర్థము కలదు అట్టి చంద్ర సూర్యాగ్నుల ముప్పురతో కథయంతీవ— కథయంతీ అనునది సీతకు విశేషణము. ఇచ్చట సహాయుక్తే అప్రధానే అను సూత్రముచేత చంద్రేణ ఇత్యాది తృతీయ వచ్చినదనియు, సహార్థయోగమనియు గ్రహింపవలెను. ఇచట మాట్లాడు ప్రక్రియ ముఖ్యోద్దేశము గాదు, చంద్ర సూర్యాదులతో కలిసిపోవుట ముఖ్యము. చంద్రేణ సూర్యేణ మహార్చిషా సహ కథయంతీవ వినాపి తద్యోగం అనుదానిని బట్టి సహ లోపించినది.

కుండలిని చంద్ర సూర్యాగ్నులతో కలియుట శాస్త్రవిషయము. దేహము మూడు భాగములు. అందు ఊర్ధ్వాధోభాగములు చంద్ర అగ్ని ఖండములు. మధ్యభాగము సూర్యఖండము. ఈ క్రమమే ఋషి చేత శ్లోకమునందు పాటింపబడి చంద్రేణ సూర్యేణ చ మహార్చిషా అన బడినది. కనుక ఇది ధ్వనిరహస్యమున కొక కీలకము. కుండలిని ఈ ముప్పురితో కలియుట రెండు విధములుగా శాస్త్రమున కలదు,

దేహమందు మూడు ముఖ్యమగు నాడులు కలవు. అవి చంద్రసూర్యాగ్ని నాడులు. వానికే ఇడా, పింగళా, సుషుమ్న అని పేరు. ఇందు సుషుమ్నయే బ్రహ్మలోక ద్వారము 'సేంద్ర యోనిః' అని తైత్తిరీయము. ఇడా పింగళలు ఆజ్ఞాచక్రమందు సుషుమ్నతో ఐక్యము నొందును. కనుక సుషుమ్నయందు ఆరోహించు కుండలినితో అచ్చట చంద్రాగ్ని సూర్యనాడులు కలియునని భావము. మరొకటి అగ్నిఖండమందు ఉన్న కుండలిని సూర్యఖండము చేరినప్పుడు అగ్నిఖండము సూర్యఖండముతో సంయోగము పొందును. పిమ్మట చంద్రఖండమును చేరినప్పుడు వెనుకటి రెండును మూడవ ఖండముతో సంయోగము పొందును. అప్పుడు కుండలిని యొక్క సహస్రారాంతర్గత చంద్రమండలవేధచేత అమృత స్రావమగును. ఈ భావమునే భాస్కరరాయలు లలితాయందు బిసతంతు తనీయసికి వ్యాఖ్య వ్రాయుచు 'తృప్యత అగ్నికుండలినీ ముత్థాప్య సూర్యకుండలిన్యా సంయోజ్య తాభ్యాం చంద్రమండలం శివశక్తి సామరస్యేన ద్రావయిత్వా..." ఇత్యాది. ఈ విధముగా మన దేహమునందున్న సుషుమ్నలో శక్తి యొక్క ఆరోహణచేత చంద్ర సూర్యాగ్ని సమ్మేళన కలుగుచున్నది. ఇదే మన శ్లోకములందలి చంద్రేణ సూర్యేణ చ మహార్చిషా సహయోగ మన్విచ్ఛ రామేణ కథయంతీవ అనునది. వెనుక వివరించిన వర్ణసమామ్నాయోత్పత్తి విషయముతో అనుసంధించుకొనవలెను. చంద్రాదివిషయమునకు వ్యాఖ్యాతలందు మహేశ్వర తీర్థులు మాత్రము "తథా అత్యున్నతపథం త్వాం గృహీత్వా గచ్ఛామీతిభావః" అని చెప్పెను. ఇది కొంతవరకు లక్షణా మార్గము త్రొక్కినట్లే.

ఇప్పుడు మన శ్లోకద్వయమును ఒక్కసారి చదువుడు. దాని రహస్యస్వరూపము సమగ్రముగ గోచరించును. నేను దీని పరమార్థము వివరించుటకు ఇంత గ్రంథము కావలసివచ్చెను. కాని, ఈ శాస్త్రమంతయు మనస్సునందున్నవాడు మన శ్లోకములను చూచినచో

చప్పున అనుమానము తోచి, ఒకటి రెండు నిముషములలో తద్గతరహస్యము గోచరించును. మహర్షి యొక్క శ్లోకములు ఇట్లే ధ్వనిభరితములై ప్రతి శబ్దము, ప్రతి భావము జాగ్రత్తగా ప్రయోగింపబడినవని చెప్పగలను. పునరుక్తులు మొదలగునవి ధ్వనికీలకములు. ఇట్లు చతుర్వింశతి సహస్ర శ్లోక విస్తృతమగు రామాయణమును రచించిన ఆ వాల్మీకి ఋషియో సాక్షాత్తు పరమేశ్వరుడో, ఎవరో ఆయనకు నా నమస్కారము.

## ii

వాల్మీకి మహర్షి సుందర కాండమున నాల్గు ముఖ్యమైన రహస్య ములను నిక్షేపించెను. ఒకటి - హనుమంతుని కుండలినీ యోగము, రెండు - త్రిజటా స్వప్నమను ఒక అద్భుత రహస్యము (ఇప్పుడు ఆవిష్క రింపను.) మూడు-రావణుని కౌళమార్గము, అవి. తక్కినవి వీటికి అనుషంగికములు.

కుండలినీ యోగమునకు ఉపక్రమించుటకు ముందు హనుమం తుడు నిర్వర్తించిన నిత్య కర్మాది పూర్వరంగము వివరింపబడినది. అనంతర విషయములు తెలిపెదను. సుందర కాండమును తెరువగనే కనుపించు మొదటి ఏడు శ్లోకములు దాటింపుడు. (అది నిత్యకర్మ.) తర్వాత వచ్చు శ్లోకములందు ఋషి నడిపిన రహస్యమునే ఇచ్చట వివ రించుచున్నాను. హనుమంతుడు సముద్రలంఘనము చేయుటకు ముందు దేవతా ప్రార్థనము చేయుచున్నాడు: "స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే, భూతేభ్య శ్చాంజలిం కృత్వా చ కారగమనే మతిం" (1స. 8శ్లో) హనుమ సూర్య మహేంద్ర వాయు బ్రహ్మలకు, పంచ భూతములకు నమస్కరించెను అని అర్థము. దీని తర్వాత "అంజలిం ప్రాఙ్ముఖం కుర్వన్ పవనా యాత్మయోనయే, తతోహి వవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశం" (1-9 సూర్యాదులకు నమస్కరించి మరల ఆయన (దక్షిణుడు) తూర్పుకు తిరిగి ఆత్మ యోని యగు వాయువునకు నమస్కరించెనని దీని అర్థము. తొలుత నమస్కరింపబడిన సూర్యాదులందు వాయువు ఉన్నాడు. కాని, మరల వాయువునకు ప్రత్యేకముగా నమస్కరించుటలో అంత రార్థ మేమిటి? ఏమియు లేదా? ఇందున్న దేవత లెవరు? త్రిమూర్తులు గారు,

ఇంద్రాది బృందారకులు గారు, ఏ క్రమమూ లేదు. విభిన్న దేవతల సమ్మిశ్రమము. ఏదో యాదృచ్ఛికముగా వాల్మీకి నోటికి వచ్చిన దేవతలను చెప్పెనా ? ఈ ప్రశ్నలు రామాయణమును చదువువారికి స్ఫురింపవలదా ? ఇవేవియు పట్టించుకొనక, లోతుకు పోక, అంధప్రాయముగా ఉపర్యుపరి వాచ్యార్థములతో తృప్తిపడి, గ్రంథము దాటించుచుండుట యేనా రసజ్ఞత, పాండిత్యము, పరమార్థ జిజ్ఞాస ?

జాగ్రత్తగా పరిశీలించినచో ఈ ప్రార్థన ఉపనిషన్మూలము ! ఈ దేవత లెవరో కాదు... "ఇంద్రియపాలకా నసృజత్. దిగ్వాతార్కప్రచేతోశ్వి వహ్నీంద్రోపేంద్ర మృత్యుకాః చంద్రో విష్ణు శ్చతుర్వక్త్రః శంభుశ్చ కరణాధిపాః" అని శ్రుతి చెప్పిన ఇంద్రియాధిదేవతలే వీరు. ఇందులో ముఖ్యులైనవారే మన శ్లోకమున తీసికొనబడిరి. సూర్యుడు ముఖ్యుడు. మహేంద్రుడు అనుటచేత తదధినేతృత్వమునకు లోబడినవారును కలరని సూచింపబడినది. అంతట బ్రహ్మ. ఇదే ఈ దేవతా ప్రార్థన. ఈ శ్లోకములయొక్క వివృతరూపము ఋషియే మరొకచోట యిచ్చెను. 13 సర్గమున వచ్చు 59, 65, 66 శ్లోకములు చూడుడు. అవియు హనుమంతుని ప్రార్థనయే. అందు మహేంద్ర శబ్దమునకు బదులు ఇంద్రశబ్దమే వాడబడినది (ఆయన సహచరదేవత లందరు చెప్పబడిరి కనుక) కనుక, ఇచ్చట మన 8వ శ్లోకమున ప్రార్థింపబడిన దేవతలు ఇంద్రియపాలకులు.

ఇట్లు ఇంద్రియపాలకులను స్తుతించుటకు మూలము "శం నో మిత్ర శ్శం వరుణః శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః..." ఇత్యాది శాంతిపాఠమే. ఈ శాంతిపాఠమునందు వాయుదేవుడు ప్రత్యేకముగా ధ్యానింపబడును. "నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి..." అని. ఈ పద్ధతినే ఋషి ఇచట అవలంబించి హనుమచే వాయుదేవునకు ప్రత్యేక నమస్కారము చేయించెను. ఈ శ్లోకమున ఆత్మయోనిః అనగా జీవుడు

తనకు కారణమగువాడు అని అర్థము ("ఆత్మా జీవే ధృతాబుద్ధౌ స్వభావే పరమాత్మని" ఇతి విశ్వః. ఈ ఆత్మయోనిశబ్దము వాల్మీకి సృష్టించినది కాదని గుర్తించుట అవసరము. ఇది శ్రౌతభాషనుండి తెచ్చుకొనబడెను చూడుడు- 'స విశ్వకృ ద్విశ్వవిదాత్మయోనిః జ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్యః..." ఇత్యాది (శ్వేతాశ్వతరీయోపనిషత్తు ౬ అధ్యా. 16 మంత్రము) ఇందలి ఆత్మయోనియే మన వాల్మీకి యొక్క ఆత్మయోని. ఉపనిషత్తునందు దాని అర్థము- "సుర నర తిర్య క్ఛరీరాణాం ఆత్మనాం యోనిః కారణం, ఆత్మయోనిః." అనగా బ్రహ్మ పదార్థము. అట్టి ఆత్మయోని త్వమేవ అని వాయువును గూర్చి శాంతి పాఠము చెప్పుచున్నది. కనుక, వాల్మీకియొక్క 'పవనా యాత్మ యోనయే'కు మూల మిట్లు కలదు: "యావదస్మిఞ్ఛరీరే ప్రాణో వసతి తావదే వాయుః" అని శ్రుతి. ప్రాణము ఎంతవరకు శరీరమునం దుండునో అంతవరకే ఆయువు. కనుక, వాయువును శ్రుతి, ప్రత్యక్షం బ్రహ్మ యనుట సాభిప్రాయమే ప్రత్యక్షం బ్రహ్మ యనుటచే పరోక్ష బ్రహ్మ అతడు కాడనుటయు వ్యంజితము. కనుకనే భృగువల్లియందు "తద్విజ్ఞాయ, పునరేవ వరుణం పితర ముపససార, అధీహి భగవో బ్రహ్మేతి, తగ్ం హోవాచ, తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మే తి..." ఇత్యాది ఘటిల్లెను.

రెండవ శ్లోకమున "గంతుం దక్షిణో దక్షిణాందిశం" అనబడినది. హనుమ దక్షిణుడట, దక్షిణదిశగా వెళ్ళుటకు ఉపక్రమించుచున్నాడు. ఈ శ్లోకమున హనుమత్ శబ్దమే వాడబడక తొలి శ్లోకమున శత్రు కర్శనః అని మాత్రమే అనినట్లు ఇచట 'దక్షిణః' అనెను. ఈ దక్షిణు డేమిటి? ఈ దక్షిణముగా పోవుటేమిటి? వట్టి ఆశుకవిత్వమేనా? ఏదో వాల్మీకి అను 'చాదస్తుడు' వేగముగా పురాణము చెప్పుకొనుచూ పోవుచుండగా; యాదృచ్ఛికముగా పడిన పదములేనా అవి. అనగా, వాల్మీకి ఒక "అర్జంటు కవితాధురీణు"డనియేనా తాత్పర్యము?

"సేంద్రయోనిః" అని శ్రుతిచెప్పిన సుషుమ్నానాడి మూలాధారము నుండి బయలుదేరి హృదయాది స్థానములు దాటి, దక్షిణ కాలుష చేరి అచ్చటనుండి లంబిక అంతట సహస్రారము చేరును. ఇదీ దాని మార్గము. ఈ సుషుమ్న గుండా ప్రాణవాయువు పోయి మూలాధారగత కుండలిని ఉత్థాపన చేయవలెను. కనుక సుషుమ్నా మార్గము దక్షిణ మార్గము కనుక, దక్షిణముగా పోవుట. యద్వా - వామాచార దక్షిణాచారములను రెండు దేవీ పూజామార్గములందలి దక్షిణాచారము వైదిక పద్ధతి. కనుక హనుమ దక్షిణుడు, దక్షిణమార్గమున వెళ్ళెను.

ఇట్లు ఇంద్రియ పాలకులను స్తుతించి హనుమ కుండలినీ యోగమున కుపక్రమించుచు అవలంబించిన యోగాసనమును ఎట్లు వాల్మీకి చెప్పెనో ఆ చిత్రము చూడుడు-"బాహూ సంస్తంభయామాస మహా పరిఘ సన్నిభౌ ససాదచ కపిః కట్యాం చరణౌ సంచుకోచచ-సంహృత్య చభుజౌ శ్రీమాన్ తథైవ చ శిరోధరం తేజస్సత్త్వం తథా వీర్యం ఆవివేశ స వీర్యవాన్" [1 స- 35, 36]. అనగా, ఆయన పరిఘముల వంటి బాహువులను స్తంభింపచేసెను. కటిమీద కూర్చుండెను. చరణములను ముడుచుకొనెను. చేతులను కంఠమును ముడుచుకొని తేజస్సత్త్వములను ఆవేశింపజేసికొనెను. ఇది యోగులు శ్రేష్ఠమని భావించు సిద్ధాసనము కావచ్చును. తత్ప్రకారము - శిశ్నముమీద ఎడమ మడిమ చేర్చి, దానిపై కుడిమడిమ ఉంచి, కటిపై కూర్చుండి నాసాగ్రమున దృష్టి సారించుట. యద్వా-ఇది పూర్వ తాణువాసనము కావచ్చును. అది—కాలి వ్రేళ్లు మడచి, మడమలు, పిరుదులు చేర్చి, తలను చేతులతోను, నడుము మోచేతులతోను అదిమిపట్టుకొని నడుము నిక్కించుట. ఇట్లు ఆసీనుడైన హనుమ నాసాగ్రమున చూపు సారించుట ఋషి ఎట్లు చెప్పెనో చూడుడు: "మార్గమాలోకయన్

దూరా దూర్ధ్వం ప్రణిహితేక్షణః రురోధ హృదయే ప్రాణాన్ ఆకాశ మవలోకయన్" (1-37).

యోగి యోగానుష్ఠాన సమయమున తాను పరమాత్మనే అని బ్రహ్మభావన చేయవలెను. దానిని ఋషి—"ఉత్పపాత తాథ వేగేన వేగవా నవిచారయన్ - సుపర్ణ మివ చాత్మానం మేనే స కపి కుంజరః" అని చెప్పెను. హనుమ తాను సుపర్ణుడనుకొనెనట. వాచ్యార్థము గరుత్మంతుడని అయినను పరమార్థమున సుపర్ణ శబ్దమునకు పరమాత్మ అని అర్థము. తైత్తిరీయమున త్రిసుపర్ణ మంత్రము లందు చెప్పిన సుపర్ణుడే ఇచ్చటి సుపర్ణుడు. యజుర్వేదమున (సం. 6 కాం. 1, ప్ర. 6 అ.) ఒక చిత్రమైన కథ కలదు అది భారతమందలి వినతా కద్రువల కథకు మూలము. అందు వినత సుపర్ణి అనబడినది. సుపర్ణి సంతానము ఛందస్సులు. అమృతము సోమము. గాయత్రీ ఛందము స్వర్గమునకు పోయి, దేవతలను జయించి సోమమును తెచ్చి సుపర్ణి దాస్యమును బాపెను. ఈ కథచేత సుపర్ణులు గలది సుపర్ణి. గాయత్రి సుపర్ణుడు, తస్మాత్ పరమాత్మ. గాయత్రీ తత్త్వమాలా మంత్రమున "తం భూతాఖిలదేవంతు సుపర్ణ ముపధావతాం" అని కలదు. కనుక, "సుపర్ణ ఇతి మేనే" అనగా బ్రహ్మభావన. తైత్తిరీయమునందే "వయస్సుపర్ణా ఉపసేదు రింద్రం ప్రియమేధా ఋషయో నాధమానాః" అను మంత్రమునందు సప్తర్షులు సుపర్ణు లనబడిరి. ఋషులు మంచి రెక్కలు గలవా రనియా అర్థము? బ్రహ్మవేత్తలు అనుకొనవలెను. బ్రహ్మవేత్త బ్రహ్మమే. బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి అని తైత్తిరీయము. శ్వేతాశ్వతరోపనిషత్తునందు, జీవేశ్వరులు సుపర్ణు లనబడిరి. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" (4 అ. 6 సుం.)

అట్టి హనుమను ఋషి "వాయుమార్గానుసారిన్" (1-58)ఆత్మవాన్(1-194) వీతమోహః (1-196), మేధావీ (3-1) అను విశేషణము

లచే వర్ణించెను. మేధావీ అనగా మేధ గలవాడు. మేధ బ్రహ్మసాధన మని ఉపనిషత్తు "బ్రహ్మమేధయా"-వాయుమార్గానుసారిన్ అనగా ప్రాణాయామనివిష్టుడు. అట్టి హనుమంతుడు నిర్వర్తించిన కుండలినీ యోగమే హనుమ దాకాశగమనము. అందు మైనాకుని ఆతిథ్యము, సురసా వృత్తాంతము, సింహికానామ రాక్షసీవధ-అను మూడు ఘట్టములు గలవు. తదనంతరము లంక చేరుట, అందు క్లేశించి వేష్టమానాం తథావిష్టాం పన్నగేంద్రవధూ మివ అనబడిన సీతను చూచుట, చూచి, 'యోగ మన్విచ్ఛ రామేణ' అని ఆమె నడుగుట ఇత్యాదులు వచ్చును.

ఇందు మైనాక సురసా సింహికల వృత్తాంతము గ్రంథిత్రయ భేదనము. ఒక వస్తువును మరొకటి అని భావించుటయే గ్రంథి రుద్ర విష్ణు బ్రహ్మ గ్రంథులని మూడు మన శరీరమున గలవని శాస్త్రము. వరుసగా. ఈ మూడును జీవునకు తనయొక్క స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు తానే అని భ్రమింపచేయు దశా విశేషములు. వీనికి కారణము మన ఆత్మయను శుద్ధచైతన్యమును మాయాత్మకములగు అన్నమయాది పంచకోశములు ఆవరించి ఉండుటే. ఈ పంచకోశ తత్త్వమే షట్చక్ర స్థానీయమై యున్నది. ఆరు చక్రములును జీవుని యొక్క సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ భావనాశక్తి హేతువులు. వీనిని క్రమముగా అధిగమించి తదతీత భావనాశక్తి కలిగినప్పుడు అనగా తురీయ దశ పొందినప్పుడు జీవుడు తానే బ్రహ్మము నని గుర్తింపగలుగు చున్నాడు. ఇదియే సామాన్య- భాషలో గ్రంథిత్రయ భేదనము. విశేషములు తచ్ఛాస్త్రగ్రంథముల వలన తెలిసికొనవలెను. మూలాధార స్వాధిష్ఠానములు రుద్రగ్రంథి, మణిపూర అనాహతములు విష్ణుగ్రంథి, విశుద్ధ ఆజ్ఞలు బ్రహ్మగ్రంథి. వీనినే తామిస్ర, రాజస, సాత్త్వికలోకము అందురు. హనుమదాకాశ

గమనమున తొలుత సువర్ణ శృంగ సముజ్జ్వలము, సాత్త్వికగుణ సంపన్నము, ఆనందదాయకము నగు మైనాకపర్వతము వచ్చును. ఇది సాత్త్వికలోకము, బ్రహ్మగ్రంథి. కానీ, హనుమ దానిని "మధ్యే లవణతోయస్య విఘ్నోఽయ మితి నిశ్చితః" అని విఘ్న మనుకొనెను. తర్వాత వాస్తవము గ్రహించి "ప్రీతోఽస్మి కృత మాతిథ్యం" అని సంతోషించెను. ఇదే గ్రంథి-తర్వాత సురస రాక్షసీరూపములో అడ్డు వచ్చును. రూపము, తత్కాలచర్య రాక్షసము అయినను ఆమె వాస్తవముగ నాగమాత, దేవతలచే గౌరవింపబడిన పుణ్యాచరిత. "ఏవ ముక్తా తు సా దేవీ దేవతైరభిసత్కృతా." హనుమ ఆమెను "దాక్షాయణి నమోస్తుతే" అనెను. ఇట్టి ఈ సురస ఎవరో వాస్తవరూపరహస్య మేమిటో వ్యాఖ్యాతలు చెప్పలేదు. కాని, సురస ఎవరో తెలిసికొనుటకు సహాయపడు సామగ్రి దేవీభాగవతమున కొంత కలదు (9 స్కం. 1 అధ్యా) పంచప్రకృతి వర్ణనా ఘట్టమున ఇట్లు కలదు. ప్రధానాంశ స్వరూపా యా మనసా కశ్యపాత్మజా, శంకర ప్రియశిష్యా చ మహా జ్ఞాన విశారదా - నాగేశ్వరస్య అనంతస్య భగినీ నాగపూజితా, నాగేశ్వరీ నాగమాతా సుందరీ నాగవాహినీ సర్వమంత్రాధిదేవీ చ జ్వలంతీ బ్రహ్మతేజసా బ్రహ్మస్వరూపా పరమా బ్రహ్మభావనతత్పరా- జరత్కారుమునేః పత్నీ...71, 72, 76, 77 శ్లో. ఈ నాగమాతయే రుద్రయామళ మంత్రమందలి గాయత్రీమంత్ర వర్ణాత్మక సహస్రనామస్తోత్రమున "సర్పిణీ, సర్పమాతా చ, సావధానా సుఖప్రదా, దక్షా దాక్షాయణీ దీక్షా ధృష్టా దక్షవరప్రదా, దక్షిణా దక్షిణారాధ్యా దక్షిణామూర్తి రూపిణీ..." అని వర్ణింపబడినది. కనుక, మన సురస నాగమాత, దాక్షాయణి, దేవి, దేవతైరభిసత్కృతా అని వర్ణింపబడినచో ఆమె గాయత్రి యని ఒక పక్షమును, సర్వమంత్రాధిదేవిగా చెప్పబడిన పరాశక్తి రూపాంతర యగు మనసాదేవి యని మరొక పక్షమునను గ్రహింపవలెను. హనుమంతునికి సురస రాక్షసీ రూపమున

తోచినను, వాస్తవముగ నాగమాత కనుక, పిదప భ్రాంతినివృత్తి యగును గనుక, ఇది రెండవ గ్రంథి.

కానీ, ఈ సందర్భమున ఒక రహస్యము కలదు. కుండలినీ యోగముచేత గారుడ ప్రయోగ ప్రభావము సిద్ధించునని కలదు. సౌందర్య లహరియందు 20 శ్లో. "కిరంతీ మంగేభ్యః కిరణ నికురుంబా మృతరసం, హృది త్వా మాధత్తే హిమకరశిలా మూర్తిమివ యః, ససర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ, జ్వరప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధార సిరయా-" అని కలదు. లక్ష్మీధర వ్యాఖ్య "అనేన శ్లోకేన గారుడప్రయోగ ఉక్తః"...కనుకనే ఆకాశగమన సందర్భమున హనుమంతుని గరుడునివలె ఎగిరిపోయెనని వాడిన ఉపమానమునే ఎనిమిదిమారులు వాడెను. (1స. 33, 34, 44, 75, 80, 171, 178, 200 శ్లో.) ఇన్ని మారులు వాల్మీకి ఒక శబ్దమునో, ఒక ఉపమానమునో పునరావృత్తము చేసెనన్నచో అందేదో మర్మ ముండితీరవలెను. అదే గారుడము, కుండలినీయోగ ప్రభావజనితము. హనుమ దాకాశగమనము కుండలినీయోగ మనుటకు ఇదొక కీలకము. ఇట్లు ఇం దెన్నిమర్మములను ఋషి నిక్షేపించెనో దుర్జ్ఞేయముగా ఉన్నది. ఇన్ని మహిమాన్విత విషయము లిందు పెట్టబడినవి కనుకనే ఈ గ్రంథము యొక్క పారాయణముచేత కొన్ని ఫలములు సిద్ధింపగలుగుచున్నవి. మన కీశ్రమ అక్కరలేకుండా వాల్మీకి దానిని మన కథలు నవలలవలె వ్రాసి యున్నచో మనము సిగరెట్టు కాల్చుచు చదువుకొనవచ్చును. పారాయణమూ లేదు, ఫలితమూ లేదు.

ప్రకృత మనుసరామః - మూడవదగు సింహిక రాక్షసియే. అనగా ఇది కేవలము తామస లోకము. రుద్రగ్రంథి. ఈ గ్రంథులు మూడును హనుమచే నిర్జింపబడెను. ఈ మూడు సంఘటనలందు ప్రతి దాని సమాప్తి తర్వాత దుష్కరం నిష్ప్రతిద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః అనియు తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మసుదుష్కరం

అనియు, తత్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరం అనియు, భీమ మదద్రౌక్షాతః కర్మ మహత్సత్త్వం త్వయా హతం అనియు ఋషి సూచనలు చేసెను. దుష్కరం నిష్ప్రవృత్యాది ప్రథమము యోగారంభ విషయము, తక్కిన మూడు గ్రంథిత్రయభేదనములు. ఈ పునరావృత్త వాక్యములందు ఇంచుమించు ఆ శబ్దములే గల వాక్యము త్రిరావృత్తమైనట్లు తేలుచున్నది.

అయితే ఈ గ్రంథి క్రమమునందు ఒక వ్యత్యాసము కలదు. ఇదె ఎందరు గ్రహించిరో నే నెరుగను. లక్ష్మీధరుడు మూలాధార స్వాధిష్ఠానములు రుద్రగ్రంథి యని చెప్పి ఆ క్రమమును తన వ్యాఖ్యయందు పాటించెను. దానికి ఆయన సౌం. 14 శ్లో వ్యాఖ్యయందు "ప్రథమఖండోపరి అగ్నిస్థానం తదేవ రుద్రగ్రంథి రిత్యుచ్యతే ద్వితీయ ఖండోపరి సూర్యస్థానం తదేవ విష్ణుగ్రంథిరిత్యుచ్యతే, తృతీయ ఖండోపరిచంద్రస్థానం తదేవ బ్రహ్మగ్రంథి రిత్యుచ్యతే-సోమసూర్యానలాత్మకం ఇత్యవరోహక్రమే ణావగంతవ్యం..." అని చెప్పెను. ఈ క్రమమును చెప్పుటకే 10 శ్లో వ్యాఖ్యలో "రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః, బ్రహ్మగ్రంథించ భిత్వైవ కమలాని భినత్తి షట్..." ఇత్యాది శ్లోకము వామకేశ్వరతంత్రము నందలిదని చెప్పి ఉద్ధరించెను. కాని, లలితా సహస్రనామావళీ భాష్యమునందు భాస్కరరాయలుకూడా దీనినే ఉద్ధరించి చూపుచు, క్రమమును మార్చి (111 వ నామము) "బ్రహ్మగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః, రుద్రగ్రంథిం విభిద్యైవ కమలాని భినత్తి షట్..." అని వ్యత్యస్తముగ ఉద్ధరించి చూపెను. భాస్కరరాయలే 104 నామ వ్యాఖ్యయందు "రుద్రగ్రంథిద్వయం హృదయగత అనాహతచక్రీయం విభినత్తీతి తథా అనుష్ఠానే ఏతద్వైపరీత్య మున్నేయం...శ్రీవిద్యాయాం చత్వారః ఖండాః, ఆగ్నేయ సౌరసౌమ్య చంద్రకళాఖ్యాః... తేషాం చతుర్ణాం మధ్యే త్రయో హృల్లేఖాఖ్యా గ్రంథయః—తాశ్చ

తిస్రః క్రమేణ రుద్ర విష్ణు బ్రహ్మ సంజ్ఞికా తత్త్రియం విభిద్య తదంతః ప్రవిశతి...ఇత్యాది. లసనాయందు గ్రంథిక్రమము లక్ష్మీధర వ్యతిరేకము గనే కలదు. "మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంధివిభేదినీ"— గ్రంధి క్రమవిషయ మిట్లుండగా సుందరకాండమున ప్రతిపాదింపబడినది అవరోహ క్రమమే అని గ్రహింపవలెను. కారణ మేమనగా దక్షిణా చార పరులైన వైదికుల పూజా ప్రకారము అవరోహ క్రమముగ నిర్దేశింపబడినది. చూడుడు సౌం 41 శ్లో. వ్యాఖ్య లక్ష్మీధర "అత్ర భగవత్పాదైః ఆధారాదికమల క్రమం విహాయ ఆజ్ఞాచక్రాది క్రమేణ అవరోహక్రమేణ పూజాప్రకారః కథితః- అయమాశయః ఆత్మన ఆకాశ స్సంభూతః....ఇతి శ్రౌతక్రమ మవలంబ్య అవరోహ క్రమ ఉక్తః—ఊర్ధ్వమూల మవాక్శాఖం వృక్షం...అతశ్చ షట్కమలా నాం కదళీ కుసుమోపమానాం అథోముఖానాం అవరోహక్రమేణ కమలాని ఉత్థానానీతి...ఇత్యాది.

ఇట్లు చారణాచరిత పథమున అనగా సుషుమ్నా మార్గమున పయనించి హనుమంతుడు అను యోగి సముద్రమును దాటి "త్రికూట శిఖరే లంకాం స్థితాం స్వస్థో దదర్శ హ" త్రికూట శిఖర మందున్న లంకను చూచెనట. ఈ త్రికూట శిఖర మేమిటి? ఈ లంక ఏమిటి? లంకను ఋషి వర్ణించిన తీరు చూడుడు: "రమ్యకానన తోయాఢ్యాం పురీం రావణ పాలితాం... సాగరోపమనిర్ఘోషాం... భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీమివ. అనగా వనములు నీరు కలది, సాగరము వలె ఘోష కలది, పాముచేత సంచరింపబడునది, గుప్తమైనది శుభ మైనది, పన్నగలోకమగు పాతాళము వంటిది—పట్టణము నిట్లాకవులు వర్ణింతురు ? వాల్మీకి కల్పనయేగదా ఇది. ఇట్లే ఏల కల్పింపవలెను ? లంకను గూర్చి ఋషి లక్ష మాటలు చెప్పి ఉండవచ్చును గాని అందివి ప్రధానములు. శాస్త్ర రహస్యములను చెప్పుచు వైదికమగు ధ్వనిమార్గ మవలంబించి నడచు ఋషి లంకను వాచ్యముగ మూలాధారమని ఎట్లు

చెప్పును. దూరమునుంచి చూచిన హనుమకు ప్రధానముగా గోచరించిన లంకాదృశ్యమిది. ఋషి యొక్క ధ్వని ఇచ్చుట ఏమిటనగా— తోయాఢ్యాం అనగా లంక జలతత్త్వస్థానమగు స్వాధిష్ఠానమునకు ఆవల ఉన్న మూలాధారము. సాగరోపమ నిర్ఘోషాం అనగా మూలాధారము. శబ్దము యొక్క ఆద్యస్థాన మనుట. "యత్కుమారీ మంద్రయతే" అనబడిన రీతిగా పరావాక్కు అందు గలదని దాని వ్యంజన. భుజగా చరితాం అనగా కుండలినీ నివాసమని. స్వాధిష్ఠాన మూలాధారములు లింగగుదస్థములు గనుక గుప్తాం అనుట.

అట్టి లంక త్రికూట శిఖరమున గలదు! శిఖర మనగా కొన. త్రికూటములు శరీరమందలి సాత్త్వక, రాజస, తామస ఖండములు శ్రీవిద్యయం దవి శక్తి, కామరాజ, వాగ్భవ ఖండము లనబడును. కనుక ఇందు చివర ఉన్నది మూలాధారము. అది తామసఖండము గనుక ఆసురీసంపదకు నెలవు. ఇదియే త్రికూట శిఖరస్థ మనుటకు తాత్పర్యము. మూలాధారము కుండలినీస్థానము గదా! అందున్న సీత కుండలినీ శక్తి అని వ్యంజిత చేయబడెనుగదా! కనుక అట్టి కుండలినిని ఉత్థాపన చేయుటకే హనుమ యోగమును అనుష్ఠించుచున్నాడు.

లంకను హనుమ నిశియందు ప్రవేశించెనని ఋషి చెప్పుట అది తామిస్రలోక మనుటకే. "నిశి లంకాం మహాసత్త్వో వివేశ హనుమాన్ కపిః" హనుమ లంకను లంబశిఖరములు గల లంబపర్వతమునుండి చూచెనట! 'స లంబశిఖరే లంబే లంబ తోయద సన్నిభే సత్త్వ మాస్థాయ...'— (3 స - 1 శ్లో) లంబశిఖరములనగా వ్రేలాడుచున్న శిఖరములు! ఇవెక్కడయిన ఉండునా? సృష్టిలో దేహమునందు తప్ప ఎచ్చటను లంబశిఖరములు లేవు. జీవుడు ఉత్తరోత్తరక్రమముగా ఆజ్ఞాది చక్రములు దాటుచు పూజావిధి ననుష్ఠించుచున్నప్పుడు

ఆ చక్రములు "షట్కమలానాం కదళీకుసుమోపమానాం అధో ముఖానాం..." (సౌం. 41 శ్లో. వ్యా)అధోముఖ కదళీకుసుమముల వలె ఉండును కనుక అవి లంబశిఖరములు, అనగా అధోముఖాగ్రములు. అట్టి లంబశిఖరములు గల లంబపర్వతము శరీరము. లంబశబ్దముచేత "ఊర్ధ్వమూల మవాక్శాఖం" అను భావము వ్యంజితమైనది.

ఈ లంబశిఖరములు గల పర్వతము గాని, ఆ మైనాక సురసాది క్రమము గాని, ఏదిగాని ఈ గ్రంథమున ఋషి చేసిన సృష్టియే గదా! పూర్వమే వేదాది గ్రంథములందివి యున్నవా ? అట్లు లేదే. కనుక ఈ సృష్టి ఇట్లే ఉండవలసిన నిర్బంధము లేదు. ఐనను అట్లున్నదనగా, ఇది ఋషి బుద్ధిపూర్వకముగా చేసిన పనియే అని గుర్తించుట యుక్తము. మరి ఆ బుద్ధి ఎట్టిది ? ఇట్లు శాస్త్రార్థములు ధ్వనించుట కనుకూలముగా కల్పింపవలె ననునది.

రామాయణమున కవిత్వము ప్రధానముకాదు ! ప్రధానము గాకున్నను అది లోకోత్తర రామణీయక సంపన్నముగా ఉండవచ్చును గదా ! 'కందర్ప ఇవ మూర్తిమాన్' అనబడిన నలచక్రవర్తి వ్యాసునిచే 'సాక్షాదివ మనుస్స్వయం' అనబడెను. ఈ రెంటియందేది ప్రధానము ? వాల్మీకిమహర్షి సంసార వ్యాధిబాధితులకు ఇచ్చిన పరమౌషధమే రామాయణము. ఆ ఔషధ మేది ? బ్రహ్మవిద్య. మరి ఆ ఔషధ మెంత దుర్గ్రాహ్యమైనది ! రోగులు పథ్యము నిచ్చగింతురా ? కనుకనే కవిత్వమను అనుపానముతో కలిపి ఋషి ఈ ఔషధము నిచ్చెను. 'నైషధం విద్వదౌషధం' అన్నను ఇదే తాత్పర్యము. కనుక రామాయణమున కవిత్వము మందుకు తేనెవలె అనుపానము. రోగి తేనెనే మెచ్చుకొనుచు ఔషధమును పుచ్చుకొనును. వాడు దేనిని మెచ్చుకొన్నను ఔషధమును మ్రింగెనుగదా ! అది వాడికి మేలుచేయును,

అసలు ఈ వాల్మీకి ఎవరు? చిత్రమైనవాడుగా ఉన్నాడే? ఇతడు ప్రాచేతసుడట. ప్రచేతసు డెవరు? వరుణుడు. వరుణుడు బ్రహ్మ విద్యా ప్రవర్తకుడుగా శ్రుతులందు ప్రసిద్ధము. ఆయన తన కుమారు డగు భృగువునకు చెప్పిన బ్రహ్మవిద్యయే తైత్తిరీయమందలి భృగువల్లి. కనుక మన ఋషి ఆ వారుణియేనా? కానిచో "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయ ణాత్మనా—" అనునది ఎట్లు వచ్చును?

# iii

పూర్వము కావ్యములు వ్రాయువారికి చదువువారికి తగు మాత్రము శాస్త్రజ్ఞాన మావశ్యకమై యుండెను. ఇప్పుడయినను వాటి యొక్క సమగ్రతత్త్వమును గ్రహించుటకు అట్టిజ్ఞానముయొక్క ఆవశ్యకము అనుల్లంఘనీయమే-ఈ శాస్త్రరహస్యములతో మా కేమి పని ? అనుటకు వీలులేదు అసమగ్రముగ వాటిని అర్థము చేసుకొని అంతయు గ్రహించితి మనుకొని ఆ ప్రకారము ప్రవర్తించుట ఆత్మ వంచనయు, లోకవంచనయు గాదా?

'శాస్త్రములు పండితుల కొరకే' అను వాదము స్వార్థ పరులైన కొందరు పండితులు, సోమరిపోతులైన కొందరు పామరులు కలిసి చేసిన కుట్ర. శాస్త్రములు కష్టసాధ్యములను మాటచే నిరుత్సాహపడరాదు ఆ మాటకు వచ్చినచో లోకమున ఏది సులభసాధ్యము? శాస్త్రమేనా కష్టసాధ్యము? తిండితినుట సులభముగా ఉన్నదా? లోకములో తిండి ఎందరికి సులభముగా ఉన్నది? బహుశః తిండిని సంపాదించుటకంటె శాస్త్రజ్ఞానము సంపాదించుటయే సులభ మేమో? ఏ విషయమైనను జాగ్రత్తగా పరిశీలింపక తత్త్వమెట్లు తెలి యును ? భ్రాంతికి గురియగుదుము. తిండి సులభము, శాస్త్రము కష్టము అనుకొనుట అట్టిభ్రాంతియే. ఇట్టి భ్రాంతుల సముదాయమే జీవితము. నీవు తిండికొరకు పడుపాట్లలో నూరవ వంతు వెచ్చించినచో నీకు శాస్త్రము తప్పక లభించును. అసలు రహస్యము, నీకు తిండిమీద ఉన్న పక్షపాతము శాస్త్రముమీద లేదుకదా! ఇక శాస్త్రమును నిందిం చుట యేల? నీ స్వార్థముకొరకు, ఘనతకొరకు, అసెంబ్లీలకొరకు, అకాడమీలకొరకు, డాబులకొరకు, డాక్టరేట్లకొరకు నీ కాలమును

వెచ్చించుచున్నారు, సత్పురుషులను. ప్రతిభావంతులను తృణీకరించు చున్నారు. ఈ పనులు - కొంత మానుకున్నచో- శాస్త్రము కొంత- లభించు ; అంతయు మానకున్నచో- అంతయు లభించును ఈ సూక్ష్మ మెరుగుట శ్రేయస్కరము గదా! కనుక తగుమాత్రము శాస్త్రజ్ఞానము సేకరించి పూర్వకావ్యముల యొక్క సమగ్ర తత్త్వమును ఆస్వాదించుట ఉత్తమముగాని కావ్యములకు శాస్త్ర మెందుకు? అనుట యుక్తము కాదు.

రామాయణము విప్పినచో ఇదే బాధ. అందులో కవిత్వము కేవలము రోగికిచ్చు మందునందలి అనుపానము వంటిదే, అసలు పర మార్థము శాస్త్రజుష్టము. తత్సంబంధమైన విషయములు పూర్వము ఎన్నియో చర్చించితిని. ప్రస్తుతము ఆ గ్రంథమందలి హనుమద్రావణుల అంతరస్వరూపము వాల్మీకిచే ఎట్లు ధ్వనింపజేయబడినదో వర్ణింతును.

రామాయణమున హనుమంతుడు మహాపండితుడని వర్ణింప బడినది. "నా నృగ్వేద వినీతస్య" ఇత్యాది వర్ణన ప్రసిద్ధమే. అతడెట్లు మహాయోగీశ్వరుడుగా ధ్వనింపబడెనో "హనుమదాకాశ గమనము కుండలినీ యోగానుష్ఠానము"ని నేను వివరించిన ప్రకరణమున తెలిపి తిని. ఇక ఇప్పుడు అతడు శ్రీవిద్యోపాసకుడనియు, అందును నంది కేశ్వరుడనియు వాల్మీకి ధ్వనింపజేసిన చమత్కారము విశదీకరింతును.

సీతాదేవి హనుమంతుని తొలుత చూచినప్పుడు ఆయన రూప మామె కెట్లు కనుపించెనో చూడుడు. "వేష్టితార్జున వస్త్రం తం విద్యు త్సంఘాత పింగళం" (సుం. 32-1) తెల్లని వస్త్రము దాల్చిన వాడు, మెఱుపుల సమూహామువలె పింగళ వర్ణము కలవాడు-అట్టి వానిని చెట్టు కొమ్మలో చూచి సీత ఆశ్చర్యపడి; "అహో భీమ మిదం రూపం వాన రస్య దురాసదం" (సుం. 32-3) (ఓహో ఏమి వీని రూపము ? అతి ఉగ్రముగాను దుర్నిరీక్ష్యముగాను ఉన్నది?) కాని ఇచ్చట రూపము నకు భీమమను విశేషణము చెప్పుట చేత శైవము అని ధ్వని వచ్చు

చున్నది. ఈ భీమమను విశేషణమే అనేక పర్యాయములు హనుమంతుని మూర్తికి వర్తింపజేయబడినది. ఎవరు నీతో మాట్లాడినవాడని సీతను రాక్షస స్త్రీలడుగగా హనుమను రాక్షసుడని తాననుకొనుచున్నట్లు బొంకునప్పుడు కూడా ఆయన రూపము భీమమనియే చెప్పబడినది. "రక్షసాం భీమ రూపాణాం విజ్ఞానే మమకాగతిః" (సుం 42-8) అక్కడే 12 శ్లో.-"విరూపం వానరం భీమం ఆఖ్యాతు ముపచక్రముః 13వ శ్లోకమున "అశోక వనికా మధ్యే రాజన్ భీమ వపుః కపిః"-20 శ్లోకమున తస్యోగ్రరూపస్యోగ్రం త్వం దండమాదాతుమర్హసి"-ఇక్కడ ఉగ్రరూపం అనబడటయు ఉగ్రః భీమః పర్యాయపదములు కనుకనే, ("ఉగ్రాయ దేవాయనమః, భీమాయ దేవాయనమః"-మహాన్యాసము) "తతో వాతాత్మజః క్రుద్ధో భీమరూపం సమాహితః (సం. 43-16) ఉగ్రత్వమునకు ఇచ్చట భీమ శబ్దమే వాడబడుట గుర్తింపవలెను.

హనుమంతునితో సీత ఏమనెనో చూడుడు-"విక్రాంతస్త్వం సమర్థస్త్వం ప్రాజ్ఞస్త్వం వానరోత్తమ.... నహి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ" (సుం. 36-79) ఓ హనుమంతుడా నీవు విక్రాంతుడవు, ప్రాజ్ఞుడవు; నిన్ను నేను వట్టి వానరుడవు మాత్రమే అనుకొనుట లేదు"-ఈ నహిత్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ-అనుమాట హనుమంతుని తత్త్వస్వరూపమును స్ఫురింపజేయు చున్నది. అహో భీమ మహోరూపం ! అనుటచేత సీతకు హనుమ యొక్క శైవరూపము గోచరించినది. మరొక చిత్రము చూడుడు-హనుమంతుని బంధించి రావణుని యొద్దకు తీసికొనిరాగా (సుం. కాండమున) రావణుడు హనుమను చూచి"కిమేష భగవా న్నందీ భవే త్సాక్షా దిహాగతః (సుం 50-2)"అనెను. ఏమిటి సాక్షాత్తు నంది భగవానుడే ఇక్కడకు వచ్చెనా" అనెను; కనుక రావణునకు ఆశైవస్వరూపమే గోచరించెను. లేనిచో కిమేష భగవాన్నందీ అనుమాటలోని తాత్పర్య మేమిటి? రావణునకు హనుమ విరోధిపక్షమువాడు గదా; నంది తనకు పూజ్యుడు

గదా. శత్రుఘ్నునందు పూజ్య మూర్తిని చూచెనని వాల్మీకి చెప్పుటలోని ఆంతర్యమేమి? పైగా "యేన శప్తోస్మి కైలాసే మయాసంచాలితే పురా"-పూర్వము నేను కైలాసమును కదలించినప్పుడు ఎవని చేత శపింపబడితినో ఆ నంది భగవానుడు అనుచున్నాడు, అనగా ఒక అపరాధమునకు తనను మందలించిన నందిగా కనుపించుట విశేషము. ఎందుచేతననగా ఇక్కడ కూడా ఒక అపరాధమును తాను చేయగా హనుమ మందలించుటకే వచ్చెను. ఇట్లున్నది చమత్కారము.

కనుక సీతకు కనిపించిన ఆ శైవ స్వరూపము నందికేశ్వరునిదే అని స్ఫురించును. సీతకు హనుమ ఒక చిత్రమైన మాట చెప్పును. వాల్మీకి అభిప్రాయమేమిటో వితర్కింతురు గాక. "హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా" (సు. 35-82) నాపనిచేత నేను లోకమున హనుమంతుడని పేరు పొందితిని— కాని తన పని ఏమిటో అచ్చట చెప్పలేదు. అనగా అది మన ఊహకు వదలి వేయబడినది. కిష్కింధ కాండలో జాంబవంతుడు హనుమకు ఆయన జన్మ వృత్తాంతము చెప్పుచూ "క్షిప్తమింద్రేణ తే వజ్రం క్రోధావిష్టేన ధీమతా; తతః శైలాగ్ర శిఖరే వామో హనురభజ్యత, తతోహి నామ ధేయం తే హనుమానితికీర్త్యతే" (66 స 23, 24) అనెను. ఉదయభానుని ఫలమనుకొని మ్రింగబోవుచున్న హనుమను ఇంద్రుడు వజ్రముతో కొట్టగా అతని ఎడమ దౌడ విరిగినది. కావున హనుమంతుడను పేరు వచ్చెనుఅని దీని భావము-దీనిని ఇచ్చట అనుసంధించుకొన్నచో ఎట్లుండును? మూఢత్వమున కుదాహరణముగా నుండును. హనుమంతుడు అనగా దౌడకలవాడు అనిగాని ఎడమ దౌడ విరిగినవాడని కాదు గదా అర్థము. కనుక అది సరిపోదు. దౌడలు కలవాడు అని ఒక పేరు పెట్టుట నిరర్థము. హనుమత్ అనగా దౌడలు కలది. ఏది? "అంతరేణ తాలుకే యఏష స్తన ఇవావలంబతే-సేంద్రయోనిః" అని తైత్తిరీయము చెప్పినది. తాలుకలు రెంటిమధ్య వ్రేలాడునది సుషుమ్న ; అదే బ్రహ్మ

ద్వారము - కనుక తాలుకావత్ అన్నచో సుషుమ్నయగునుగదా- హనుమత్ అన్నను అదే. హనుమాన్ అని పుంలింగ శబ్దముగా నామ ధేయమైనది. ఒక యోగికి సుషుమ్నుడు అని పేరుపెట్టుట సార్థకము. కనుక హనుమ యోగి. ఇప్పుడు "హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా" అను మాటలోని సొగసు విశదమే గదా!

అట్టి హనుమ నందికేశ్వరుడుగా ధ్వనింపబడుట యేల అనగా మను చంద్ర కుబేర క్రోధభట్టారకాది శ్రీ విద్యోపాసకులలో నంది కేశ్వరు డొకడు. వీరు శ్రీ విద్యాభేదములకు ద్రష్టలు, మన్మథు డొక ద్రష్ట. కనుక కందర్ప విద్యాయైనమః (ల. స. నా) అట్లే నంది విద్యా అనియు కలదు. కనుకనే నంది విద్యాయైనమః (ల. స నా).

వానరులందరూ విచారములో మునిగియున్నారు, యింకా ఏల ఉపేక్షించెదవు. "ఉత్తిష్ఠ హరి శార్దూల లంఘయస్వ మహార్ణవం" అని హనుమకు ఉద్బోధించుచూ జాంబవంతుడు ఆయనను "పరాహి సర్వ భూతానాం హనుమన్ యా గతిస్తవ" అని చెప్పును. (కి. 66—37) వాల్మీకికి ఈ ధ్వని ప్రావీణ్య మెంత యపారముగా కలదో అది ఎంత అద్భుతమైనదో ఈ ఒక్క ముక్క తెలుపుటకు చాలియున్నది. నీ గతి ఏదైతే కలదో అది సర్వభూత కోటిలోను పరాస్థానమందున్నది. రెండు వైపులా పదనుగల మాట ఇది. ఒక పక్షమున హనుమకు గల గమన శక్తి సృష్టిలో మరొకరికి లేదు అని సముద్ర లంఘనకు ప్రోత్స హించుట : మరొకపక్షమున ఓహనుమా "న త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ" సర్వభూతానాం పరాగతిస్తవ—సర్వ భూతకోటి యందును, అగ్రస్థానము గలవాడివి ; అనగా శివగణములైన భూతము లందు నీవు అగ్రేసరుడవు అనగా నందికేశ్వరుడవు "భూతేశః ఖండ పరశుః" అని అమరము." ఈశాన స్సర్వవిద్యానాం ఈశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతిర్ బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా శివోమేఅస్తు సదాశివోమ్" - కనుక నీకు కామగమన కామరూపాదిశక్తులు కలవు,

శివుని వాహన మైనప్పుడు వృషభముగాను అన్యవేళలందు దివ్య మంగళమైన పురుషాకృతి ధరించి చరింతువు; మహాత్మా కనుక వేగమే "లంఘయస్వమహార్ణవం" అనుచున్నాడు-ఈ భూతశబ్దప్రయోగ మనేక పర్యాయములు జరిగినది- అశోకవన ధ్వంసము చేసిన హనుమను గూర్చి రావణుడు మంత్రులకు చెప్పుట చూడుడు— "నహ్యాహం తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయన్, సర్వథా తన్మహద్భూతం మహాబల పరిగ్రహం." (సుం 46-6) సీతవలెనే రావణుడును వీడు వట్టికోతి అను కొనుటకు వీలులేదనుచున్నాడు; "మహద్భూతం మహాబలపరిగ్రహం" అట-మహద్భూతం అనగా నంది. "తత్పురుషాయ విద్మహే చక్ర తుండాయ ధీమహి తన్నో నందిః ప్రచోదయాత్" అని శ్రుతులందు ప్రశంసింపబడిన నందియే ఈ హనుమ ; ఎందుచేతననగా ఇతడు మహా బల పరిగ్రహం. ఎవ డీమహాబలుడు? "బల వికరణాయ నమః బలాయ నమః బలప్రమథనాయనమః సర్వభూతదమనాయనమః" (మహా న్యాసం) ఆ పరమేశ్వరుడే ఈ మహాబలుడు, అట్టివానిని పరిగ్రహం- పరివేష్టించి కొలుచువాడు నంది.

మరొక చోట—రావణుడు హనుమను కోతిరూపమున ఉన్న ఒక మహాసత్త్వముగానీ వట్టికోతిగాదు అనిచెప్పును. నీలుడు ద్వివిదుడు మొదలగు వానర పుంగవులను చూచితినిగాని వారి కీ బలోత్సాహ రూపపరికల్పనాదిశక్తులు లేవు. "న మతి ర్న బలోత్సాహౌ న రూపపరి కల్పనం, మహత్సత్త్వమిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితం"(సుం. 46-12) మహత్సత్త్వ మనగా మహామృగమని వాచ్యార్థము. కాని మహచ్ఛబ్ద ప్రయోగముచే నంది అని ధ్వని స్ఫురింపజేయు చున్నాడు. అట్టి నంది కపిరూపం వ్యవస్థితం. అట్లే "తోరణస్థం మహోత్సాహం మహావేగం మహాబలం మహామతిం మహాసత్త్వం మహాకాయం మహాభుజం" (46—18) రుద్రుడివలె విష్ణువవలె అగ్నివలె ఉన్నాడని చెప్పిన ఉపమానములు కాక; కేవలము నేరుగా హనుమకే వర్తింపజేసిన శబ్ద

జాలమును మాత్రమే పరిశీలించినచో ఇదీ హనుమత్స్వరూపము! ఇతడు నందికేశ్వరుడు, శ్రీవిద్యోపాసకుడు.

ఈ పరమార్థమును స్ఫురింపజేయుటకే మహర్షి మాటిమాటికి హనుమను పింగాధిపతే రమాత్యః అనును. "దదర్శ పింగాధిపతే రమాత్యం వాతాత్మజం సూర్య మివోదయస్థం" (సుం. 61-13)" దదర్శ పింగాధిపతే రమాత్యం వాతాత్మజం బుద్ధిమతాం వరిష్ఠం" (సుం. 32-)ఈ పింగాధిపతే రమాత్యం అనునది చిత్రమైనది. వ్యాఖ్యాతలు సుగ్రీవుని మంత్రి అని చెప్పిరి. వారి కాధారము "సంచింత్య తాంహి పింగేశ హరిభిః సహ మంత్రిభిః" (కి. 36-28) అని రాముడు సుగ్రీవుని సంబోధించిన మాటయే కావచ్చును. కాని ఈ పింగేశగాని ఆ పింగాధిపతిగాని సుగ్రీవు డెట్లగును? పింగ శబ్దమునకు శబ్దకోశము లందు కోతి యను నర్థములేదు. పింగ వర్ణమని కలదు. కాని పింగళ శబ్దమునకు పింగవర్ణ మనియు కోతియనియు గలదు. పింగళ శబ్దమునకు కోతి యని కలదుగాన పింగ శబ్దమునకును కోతియను నర్థము సాధించవచ్చును. ఆ విధముగా ఇచ్చట పింగేశు డనగా వానర ప్రభు వగును. కాని పింగ శబ్దమునకు దుర్గయను నర్థము కలదు. కనుక పింగాధిపతి అనగా పార్వతీపతి శివుడు. కనుక పింగాధిపతే రమాత్యః అనగా శివస్య మంత్రిః అనగా నందిః అని అర్థము- అసలు పింగేశు డనబడిన సుగ్రీవుడే ఈశ్వరుడు. సుగ్రీవుడను శబ్దము శివునికి విశేషణము (ఆప్టే).

శ్రీవిద్యోపాసకుడు కనుకనే సుందరకాండమున హనుమ యొక్క సీతాన్వేషణమే ముఖ్య వస్తువు; రామాయణమున హనుమ యొక్క పనియే అది. సీత పరాశక్తి; కుండలిని యని ప్రకరణాంతర మున చూపితిని. హనుమదాకాశగమన సీతాన్వేషణలు కుండలినీ యోగ సంయుక్త శ్రీ విద్యోపాసనయే గనుక సుందరకాండమున మూలధారమైన లంకా నగరము హనుమద్యోగిచే జ్వలింపజేయబడి

నది. మూలధార స్వాధిష్ఠానములు దేహమున వహ్నిఖండ మనబడును సాధకుడు చేయవలసినది- "పద్మాసనగతః స్వస్థో గుద మాకుంచ్య సాధకః పాయు మూర్ధ్వగతం కుర్వన్ కుంభకావిష్ట మానసః పాయ్వా ఘాతవశా దగ్ని స్స్వాధిష్ఠానగతోజ్జ్వలన్ జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితోఽహిరాట్" అని సౌందర్యలహరి యొక్క లక్ష్మీధర వ్యాఖ్య. అనగా సాధకుడు స్వాధిష్ఠానమును ప్రజ్వలింపజేసి తద్ద్వారా విజృంభించిన వాయువుచేత కుండలి న్యుత్థాపన చేయవలెను. ఇవన్నియు లంకాదహనమున గలవు గదా.

సుందరకాండమున హనుమంతుని యొక్క పూజాక్రమము మూలాధారాదిక్రమము గాక "ఆత్మన ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వాయుః" ఇత్యాది రీత్యా సహస్రారాదిక్రమము గనుక హనుమ సమయమత ప్రవర్తకుడుగా సూచింపబడినట్లు గ్రహింపవలెను. ఇదే గాక హనుమయొక్క మార్గము వామాచారము గాక దక్షిణాచార మనియు ఋషి స్పష్టముగా కాండాదియందే చెప్పెను. "తతో హి వవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశం" (సుం 1-9) దక్షిణుడు (హనుమ) దక్షిణ దిశగా పోవుటకు దేహమును పెంచెను. అనగా కుంభకమును ప్రయోగించెను. ఇట్లు దక్షిణాచారపరుడైన హనుమ ఉపాసించిన పరాశక్తియగు సీతను వాల్మీకి యుద్ధకాండమున నెట్లు వర్ణించెనో చూడుడు- "తరుణాదిత్యసంకాశాం తప్తకాంచన భూషణాం రక్తాంబరధరాం బాలాం నీలకుంచిత మూర్ధజాం" (121-3) అనగా ఆమె శ్రీ బాలాత్రిపురసుందరి అని యేగదా? అట్టి సీతను అగ్ని రామున కిచ్చెను. (అగ్నియు మను మన్మథాదులవలె దేవీ ఉపాసకుడు).

యోగపక్షమున లంక మూలాధారము; ఉపాసనా పక్షమున అది శ్రీ చక్రము లేక శ్రీ పురము, కనుకనే అశోకవన పుష్పకవిమాన లంకానగరములు ఇట్లు దివ్యములుగా వర్ణింపబడినవి. రావణుని భవ

నము "...పృథివీ లక్షణాంకయా పృథివీమివ విస్తీర్ణాం"- "నాదితాం మత్త విహగైః దివ్యగంధాధివాసితాం...ధూమ్రామాం అగరుధూపేన విమలాం హంసపాండరాం...(సుం. 9-25 26 27) అని వర్ణింపబడినది. మూలాధారమునకు శాస్త్రము చెప్పుధూమ్ర వర్ణ గంధాది పృథివీ లక్షణ ములు గలిగియున్నదని యేగదా భావము ? మరియు "మనస్సంహ్లాద జననీం వర్ణస్యాపి ప్రసాదనీం తాం శోకనాశినీం దివ్యాం శ్రియస్సంజననీ మివ (9-28) ఇంద్రియా ణీంద్రియార్థైశ్చ పంచ పంచభిరుత్తమైః తర్ప యామాస మాతేవ తదా రావణ పాలితా..." ఇట్టి వానిని వట్టి పట్టణ వర్ణనలుగా భావించుట యెంతటి అవివేకమగును ! శబ్ద స్పర్శ రూప రస గంధములను అయిదు ఇంద్రియార్థములచేత పంచేం ద్రియములను ఆ రావణ భవనము తల్లివలె తృప్తిపరచుచున్నదట. ఇది భూతత్త్వము. కనుక అట్లు చెప్పబడినది. అందలి పుష్పక విమానము దేవిదే. తపస్సమాధాన పరాక్రమార్జితం-దివంగతం వాయుపథ ప్రతి ష్ఠితం వ్యరాజ దాదిత్య పథస్య లక్ష్మవత్-" (సుం. 8 స) ఆదిత్య పథస్య లక్ష్మవత్ అనగా గాయత్రీ వత్. గాయత్రి-అణిమాది గుణాధారా అర్కమండల సంస్థితా...ఆదిత్య పదవీ చారా ఆదిత్య పరిసేవితా (దేవీ భాగవతం 12 స్కం. 6 అ-11,16 శ్లో).

ఇక అశోకవన మెట్టిది ?- "సంతానకలతాభిశ్చ పాదపైరుప శోభితాం" (15-2) కల్పవృక్షములు నందనవనముననేగదా ఉండ వలెను ? అదికాదు "సుధా సింధో ర్మధ్యే సురవిటపివాటీ పరివృతే" అదే యిది. సర్వర్తు కుసుమై రమ్యాం (15-5) అన్ని ఋతువుల పువ్వులును ఏకకాలమం దెట్లుండును ? అనగా ఇచ్చట అన్ని ఋతు వులు కలవనుట. దేశకాలా పరిచ్ఛిన్నాయైనమః (లసనా) అది "అతి వృత్త మివాచింత్యం దివ్యం రమ్యం శ్రియావృతం-పుణ్యగంధ మనో హారం (15-11,14) అందు ఉత్తమ చైత్య ప్రాసాదము ఆ ప్రాసాదము సహస్ర స్తంభములు కలది; కైలాస పాండురమైనది; ప్రవాళ సోపాన

ములు తప్త కాంచన వేదిక గలది; అందు సీత కలదు (15-16 17) ఇంత భూమిక నేర్పరచిన తర్వాత ఆ సీత దేవి గాకపోవునా, ఆ లంక శ్రీ చక్రము గాకపోవునా, కనుకనే హనుమ అశోక వనికా సీతను చూచి అదుఃఖార్హా మిమాం దేవీం వైహాయస ముపస్థితాం" (27-47) విమానమున ఉన్నది అని చెప్పెను. నేల మీద ఉన్న సీత విమానమున ఉన్నదనుట ఎట్లు పొసగును? కనుక ఆమె దేవి-విమానస్థాయైనమః (లసనా) ఆ దేవియే సర్వకర్త్రి, లోకైకజనని. ఆమె లేనిచో దేవుడు కార్యకుశలుడు కాడు." న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి"-ఈ తత్త్వము చెప్పుటకే హనుమ "త్వన్నిమిత్తో హి రామస్య జయో జనక నందిని" (సుం 39-1) అనగా నీ నిమిత్తముననే గదా రామునకు జయము" అనెను-

అట్టి దేవియగు కుండలినిని ఉత్థాపనచేయుటకై హనుమ ఉద్యోగించెను. మూలాధారమునకు వచ్చి (లంకకు వచ్చి) కుండలి న్యుత్థాపన చేయకుండా రేచకము చేయుట తప్పు అని హనుమ అను కొనెను. ఈవిషయమునే హనుమంతుడు "యది హ్యాహ మిమాం దేవీం శోకోపహత చేతసాం అనాశ్వాస్య గమిష్యామి దోషవ ద్గమనం భవేత్" (30-5) అని చెప్పెను. అనగా శోకావిష్టయై (సుషుప్తియందు) ఉన్న ఈ దేవిని ఆశ్వాసింపక అనగా అట్టిస్థితి నుండి ఉత్థాపన చేయక వెను దిరిగి పోయినచో అట్టి గమనము దోషవంత మగును; అట్టి యోగము యోగ మనిపించుకొనజాలదు అని భావము.

ఈ సందర్భమున ఒక శ్లోకమును పరిశీలించుట యుక్తము-సీతను చూడ వచ్చిన హనుమ ఆమెతో ఇట్లనెను "కృత్వామూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః త్వాం ద్రష్టు ముపయాతోహం సమాశ్రిత్య పరాక్రమం" (35-40) దేవీ నేను దురాత్ముడగు రావణుని యొక్క తలపై కాలు పెట్టి పరాక్రమము నాశ్రయించి నిన్ను చూచుటకు వచ్చితిని." ఇది వాచ్యార్థము. కాని ఇది యోగ పథమున అద్భుత

మగు ధ్వని నిచ్చుచున్నది. కృత్వామూర్ధ్ని అనుపద్ధతి తంత్రగ్రంథము లందు కలదు. "మాతృయోనౌ క్షిపే ల్లింగం భగిన్యాః స్తనమర్దనం గురోర్మూర్ధ్ని పదం దత్వా," ఇట్టి పనులు చేసినచో కైవల్యము లభించును అని ఒక ప్రసిద్ధమగు శ్లోకము కలదు. గురువు నెత్తిన కాలు పెట్టినచో కైవల్యమెట్లు వచ్చును? తత్పూర్వార్థములు-జీవుని మూలాధారమున నిక్షేపించుట కుండలినితో కలిపి పైకి ఉత్థాపన చేయుట-ఆ తర్వాత గురుస్థానమైన ఆజ్ఞా చక్రమును దాటి సహస్రారమును చేరుట. అది కైవల్యముగదా. జీవుడు సహస్రారమును చేరినప్పుడు వాని కాళ్ళు గురుస్థానము మీద ఉండునని అనగా గురువు తలపై ఉండుననుట ఒక సాంకేతిక చమత్కారము. కనుక ఇది తంత్ర గ్రంథములందు శాస్త్ర రహస్య గోపనార్థము అవలంబించు సాంకేతిక పద్ధతి-అట్లే ఇచ్చట అట్టి సాంకేతిక పద్ధతి అవలంబింపబడినది — రావణుడు జీవుడని వాల్మీకి ధ్వనింపజేయుచున్నాడు. "త్రైలోక్య వసుభోక్తారం రావణం రాక్షసేశ్వరం" (24-4) జీవేశ్వరుల సృష్టి తర్వాత త్రిభువనములు అందలి అన్నాది భోగ ద్రవ్యములు సృష్టింప బడినవి. జీవునికి భోగసాధనమగు శరీరము సృజింపబడినది. అట్టి శరీరము స్థూల సూక్ష్మ కారణ శరీరము లని మూడు అంతస్థులు గలది. అట్టి శరీరాభిమానియగు జీవుడే రావణుడు. కనుకనే రావణుడు త్రైలోక్యవసు అనగా త్రిభువనము లందలి భోగ ద్రవ్యములకు భోక్త అనబడెను. ఇది శాస్త్ర పరిభాష కనుక చప్పున వానిని పోల్చుకొనవచ్చును. సీత హనుమను రావణుడని శంకించినప్పుడు రావణుని గూర్చి చెప్పినమాటలుకూడా ఇట్లే ఉన్నవి. మాయాం ప్రవిష్టో మాయావీ యది త్వం రావణః స్వయం" (34-14)రావణుడు మాయయందు ప్రవేశించిన మాయావియట. తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్ అని శ్రుతి. మాయయందు ప్రవేశించిన పరమాత్మయే జీవాత్మ. అవిద్యా సమావృతి తొలగినచో ఆ జీవుడే పరబ్రహ్మము.

మాయావృతుడైన జీవుడు తన శరీరమే తానను భ్రాంతి యందుండును. కనుక జీవుడు చేయు సర్వకర్మలకు తానే కర్త యను కొనును. ముల్లోకములను జయించును. జీవుడును ఈశ్వరుడే కనుక జయించును. కానీ ఈశ్వరుడు పాశముక్తుడు కాగా జీవుడు పాశ యుక్తుడు. కనుకనే ముల్లోకములు జయించి తనయందు సర్వ కర్తృ త్వము నారోపించుకొనును. "నేహ పశ్యామి లోకేన్యం యో మే ప్రతిబలో భవేత్ — పశ్యమే సుమహద్వీర్యం అప్రతిద్వంద్వమాహవే" (20-19) లోకములో నాకంటె శక్తిమంతు డెవ్వడును లేడు. నన్ను నీవు అంగీకరింపుము అని రావణుడు సీతను కోరుచున్నాడు. దేవీ సప్తశతియందు శుంభుడు దేవి నిట్లే కోరును. "మమ త్రైలోక్యమఖిలం మమ దేవా వశానుగాః మాం వా మమానుజం వాపి నిశుంభ మురు విక్రమం భజ త్వం చంచలాపాంగి!" — దేవికి ఎప్పుడును ఇట్టి ఇక్కట్టులే. సీత దేవ్యవతార గాన ఇచ్చట రావణుడు దాపురించెను. ఈ విధముగా రావణుడు శరీర త్రయాభిమానియగు జీవుడు. అట్టి భ్రాంతి చేతనే వాడు తానే శక్తిమంతుడనుకొని (అనగా శక్తి) సీత తనదే అనుకొని ఆమెను తన దానిని కమ్మని నిర్బంధించుచున్నాడు. కాని ఇదెట్లు ఘటిల్లును ? శక్తి ఎవ్వరిదీ కాదు, పరమాత్మదే. "సర్వజ్ఞతా శక్తిరనాది బోధః స్వతంత్రతా నిత్యమలుప్త శక్తిః అనంతతాచేతి విభో ర్విధిజ్ఞా షడాహురంగాని మహేశ్వరస్య". కనుక తనది కాని శక్తిని తనదనుకొనుటయే రావణాదులు పరాశక్తిని తమను వరింపుమనుట లోని తాత్పర్యము. ఇది అజ్ఞాన మూలకము. అజ్ఞాన నివృత్తిచే ఈ భ్రాంతి పోవును. భ్రాంతి తొలగుటయే మోక్షము. అట్టి అజ్ఞాన నిర్వాపణమే రావణ వధ. కనుకనే రావణునికి దహనక్రియలు చేయుటకు అనుజ్ఞ యిమ్మని విభీషణుడు రాముని అనుజ్ఞ కోరగా రాముడు "మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనం క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథాతవ" (యు. 112-26) అనెను. మరణ

ముతో వైరము పోయినది. అనగా జీవేశ్వరు లైక్యమయిరి మమా ప్యేష యథా తవ, ఇతడు నీకెట్లో నాకును అట్లే. అనగా రావణుడు నాకును నీవలెనే సోదరుడు. అనగా జీవేశ్వరులు సోదరులు. ఎట్లు? ద్వాసువర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్ అన్యోఽభిచాకశీతి" అని ఋగ్వేదము (1704 ఋక్కు).

అథ ప్రకృత మనుసరామః - కనుక శ్లోకమున రావణస్య దురాత్మనః మూర్ధ్ని అనగా జీవస్యమూర్ధ్ని అని గ్రహింపపలెను. పైగా దురాత్మనః అనుట రావణుడు సదాత్మకాడనుటకే. సదాత్మ పరమాత్మ, దురాత్మ అజ్ఞానావృతుడైన జీవాత్మ. జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశానీశౌ అని శ్రుతి ఈశ అనీశులను ఇర్వురు జ్ఞ అజ్ఞులు అజులు అని అర్థము. ఇందులోని అజ్ఞ అనీశ స్ఫురణకే ఇచ్చట దురాత్మన్ శబ్ద ప్రయోగము - కనుక జీవస్య మూర్ధ్ని పదన్యాసంకృత్వా అనగా జీవస్థానమైన విశుద్ధ చక్రమును దాటి నీ స్థానమైన అనగా చిచ్ఛక్తి స్థానమైన ఆజ్ఞా చక్రమును చేరితిని. ఆజ్ఞాచక్రస్థానమైన భ్రుకుటీమధ్య ప్రదేశమున యోగముచేత జ్యోతీరూప ఆత్మ దర్శనము చేయవచ్చును. "తదభ్యాసా దఖండమండలాకార జ్యోతిర్దృశ్యతే తదేవ సచ్చిదానందం బ్రహ్మ భవతి" (మండల బ్రాహ్మణోపనిషత్తు) ఈ పక్షమున రెండవ పాదపు అన్వయము త్వాం ద్రష్టుముపయాతః అహం సమాశ్రిత్య పరాక్రమం కాదు — ఇప్పుడు త్వాం ద్రష్టు ముపయాతః- హం- సం- ఆశ్రిత్య - పరా - క్రమం :— హంస మంత్రమును ఆశ్రయించి పరా- క్రమం, పరా, పశ్యంతి మధ్యమా, వైఖరీక్రమమున, యద్వా, పరా స్థానమగు మూలాధార చక్రము నుండి వచ్చు క్రమము ననుసరించి, ఉపయాతః వచ్చినవాడను. హంసం అను హంస మంత్రము హకార సకార సంపుటి కనుక శ్లోకమున ఛందస్సునకు బాధ లేదు. (హకార

సకారములు శివ శక్తులు) తత్పూర్వ శ్లోకమును ఇట్టే చిత్రి నిర్మాణము గలది. ప్రకరణాంతరమున వివరించితిని.

ఇట్లు సాగిన హనుమంతుని యోగము, మంత్రయోగము. దీని యందు వైదికమగు సమయ మతమును అవైదికమగు కౌళమతమును గలవు. ఈ రెండును సుందరకాండమున చెప్పబడినవి. సమయమతస్థులు ఆజ్ఞాది అవరోహణ క్రమ మవలంబింతురు. ఇది హనుమ పథమున వెనుక వివరించితిని. కానీ కౌళులు మూలాధారాది ఆరోహణక్రమ మవలంబింతురు. కౌళానాం "ఆధార చక్రమేవ పూజ్యం - తత్ర స్థితా కుండలినీ శక్తిః కౌలిత్యుచ్యతే - ఏషా కుండలినీ శక్తిః బిందు రూపిణీ నిద్రాణైవ సంపూజ్యా సర్వదా నిద్రా స్వాభావ్యాత్ సాపూజ్యా తామిస్ర కుండలినీప్రబోధోయదాస్యాత్ తత్క్షణమేవముక్తిః కౌళానాం- అత ఏవ క్షణ ముక్తయః కౌళా ఇతి వ్యవహారః" - (లక్ష్మీధర) కనుక కౌళులు మూలాధార పూజాతత్పరులు.

ఇది సుందరకాండమున ఎట్లు చూపింపబడినది - రావణుని సీతాప్రలోభమే ఆ ధ్వని నిచ్చుచున్నది. హనుమ ఆత్మసిద్ధికై మంత్ర యోగము ననుష్ఠించుట సమయమతము కాగా, ఐహిక సిద్ధులకై రావణుడు మూలాధార కుండలినీ పూజ చేయుట కౌళ మార్గము. ఉదా॥ "కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే సర్వాంగ గుణసంపన్నాం సర్వలోక మనోహరే" (20-3) అని రావణుడు సీతను కోరుట పరాశక్తిని కటాక్షింపుమని పూజించుటయే, ఇక్కడ కౌళమత నిరూపణకు నేను అసహాయుడను గాలేను. ప్రాచీన వ్యాఖ్యా తలే ఆ పని చేసిపోయిరి. మహేశ్వరతీర్థులు తన తత్త్వదీపికా వ్యాఖ్యా నమున— "మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానోదరం అదర్శన మివాత్మానం భయాన్నేతుం త్వ మిచ్ఛసి" (20-2) దీనికి ఆ తర్వాత వచ్చు "కామయే త్వాం విశాలాక్షి"కి ఆయన ఈ విధముగా వ్యాఖ్యా నము వ్రాసెను - నన్ను జూచి స్తనోదరములు కప్పుకొనుచున్న

ఓ సీతా నా భయము వలన నిన్ను కనబడకుండ చేసుకొనవలెనని కోరుచున్నావు - ఇది వాచ్యార్థము కాగా తత్త్వదీపికా వ్యాఖ్య చూడుడు - "వస్తుతస్తు, పుత్రభృత్య దర్శన విషయే భయాదికం నోచితమితి భావః - రెండవ శ్లోకమునకు- "వస్తుతస్తు, త్వాం కామయే ఈశ్వరీత్వేన ఇతి విశేషః - అతో మాం బహుమన్యస్వ - వస్తుతస్తు సర్వేశ్వర్యాస్తవ న కుత్రాపి భయశంకేతి భావః - కనుక రావణ ప్రార్థన ప్రణయ ప్రార్థన కాదు, దేవీ ఉపాసన - "పుత్ర భృత్యదర్శన విషయమున నీవు స్తనోదరాదులు దాచుకొనుచు భయపడరాదు. నీవు సర్వలోక మనోహారివైన జగన్మాతవు గనుక ఈశ్వరీత్వముచేత నిన్ను నేను కోరుచున్నాను. నన్ను దయతో చూడుము" ఇది దాని తాత్పర్యమని మహేశ్వరతీర్థులు. 24 వ సర్గలో కూడా దివ్యాంగ రాగా వైదేహీ దివ్యాభరణ భూషితా ఇత్యాది శ్లోకములు దేవీ స్తోత్రములే.

ఇట్లు సమయ కౌళమతము లుభయములును ప్రతిపాదింపబడినవి. కౌళమతము అవైదికము నిషిద్ధము. అయినను శాస్త్రము రెంటిని అంగీకరించినది. కనుకనే లలితా సహస్ర నామావళి దేవిని ఉభయమత ప్రతిపాదిత దైవత్యముగానే చెప్పినది - కుళ సంకేత పాలిన్యై నమః, సమయాచార తత్పరాయైనమః, కౌళమత తత్పర సేవితాయై నమః, భగారాధ్యాయై నమః, యోని నిలయాయై నమః, సవ్యాపసవ్య మార్గస్థాయై నమః.

# త్రిజటా స్వప్నము గాయత్రీ మంత్రమే

ఇంతవరకు ఎవ్వరికిని స్ఫురింపక రామాయణమందు దాగి ఉన్న ఒక రహస్యమును చెప్పుచున్నాను.

సుందరకాండమున త్రిజటా స్వప్న మను ఒక వృత్తాంత మున్నది గదా. అదేమిటి? వట్టికలయేనా? కల అనగా కార్యకారణ సంబంధిత త్త్వ మేదియు లేక యదృచ్ఛామాత్రగతి కలదియేగదా! త్రిజటాస్వప్నము అట్టిదేనా? వాల్మీకియంతవాడు వట్టికలను చెప్పునా? ఇం దేదేని నిగూఢార్థము ఉండకపోదు, అను అనుమానముతో దానిని పరిశీలింపగా దాని వాస్తవ స్వరూపము గోచరించి ఆశ్చర్య భరితుడ నైతిని.

లంకలో రాక్షసస్త్రీలు రావణ నియోగమున, సీతను రావణుని వరింపుమని హింసించిరి. కాని సీత మనస్సు మార్చుకొనక వారిని తృణీకరింపగా వారామెను భక్షించెదమని బెదిరించిరి. అప్పుడు వారితో త్రిజట అను రాక్షసి వారిని వారించి, "మిమ్ములను మీరే భక్షించు కొనుడు, సీతను మీరు భక్షింపలేరు. నా కొక కల వచ్చినది, అందులో సలక్ష్మణుడైన రాముడు వచ్చి సీతను రక్షించి తీసుకొనిపోయినట్లును, రావణాది రాక్షసులును లంకయు నాశన మయిపోనట్లును నాకు కని పించినది" అని కలలోని సంగతులు చెప్పినది. సంగ్రహముగా ఇదీ, ఆ సందర్భము.

ఈ కలలో త్రిజటకు రాముడు నాల్గుసార్లు నాల్గు విధములుగా కనిపించును. మొదటి సారి "గజదంత మయీం దివ్యాం శిబికాం అంతరిక్షగాం, యుక్తాం హంస సహస్రేణ స్వయ మాస్థాయ రాఘవః, శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సహాగతః" అనగా ఏనుగు దంతమ్ము

లతో చేసిన, వేయి హంసలుపూన్చిన, ఆకాశమున పోవునట్టి శిబికను (పల్లకీని) ఎక్కి రాముడు వచ్చెను. రెండవసారి— "రాఘవశ్చ మయా దృష్టః చతుర్దంతం మహాగజం ఆరూఢః శైలసంకాశం చకాస సహ లక్ష్మణః". అనగా నాల్గుదంతములు కలిగిన మహాగజమును (ఐరావత మును) ఎక్కి రాముడు ప్రకాశించెను. మూడవసారి— "పాండరర్షభ యుక్తేన రథేనాష్టయుజా స్వయం ఇహోపయాతః కాకుత్థ్సః సీత యా సహ భార్యయా" అనగా తెల్లని ఎనిమిది వృషభములను పూన్చిన రథమెక్కి రాముడు సీతతో కూడివచ్చెను. నాల్గవసారి—" లక్ష్మణేన సహ భ్రాతా విమానే పుష్పకే స్థితః శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సమాగతః" తెల్లని దండలు, వస్త్రములు ధరించి సలక్ష్మణుడై పుష్పక విమాన మెక్కి వచ్చెను.

ఇవి ఆ నాల్గుదృశ్యములు. ఆతర్వాత "ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభం ఉత్తరాం దిశ మాలోక్య జగామ పురుషర్షభః" అని చెప్పి పిమ్మట రావణాదుల దురవస్థ వర్ణితము. కానీ పరిశీలింప వలసినవి పై నాల్గు దృశ్యములు.

వ్యాఖ్యాతలు ఈ స్వప్నమందు చెప్పిన గజదంత శిబికాదులు వాహనాదులు ఏవో కొన్ని ఫలితముల నిచ్చునవని చెప్పి "ఆరోహణం గోవృష కుంజరాణాం ప్రాసాద శైలాగ్రవనస్పతీనాం విష్టాను లేపోరుదితం మృతంచ స్వప్నేష్వగమ్యాగమనంచ ధన్యం" ఇత్యాది శ్లోకములను స్వప్నాధ్యాయమునుంచి ఉద్ధరించి చూపి అప్రకారము చెప్పిరి.

ఇది కేవలము కలమాత్రమే అని భావించినచో వ్యాఖ్యాన మట్లే ఉండును. కానీ, నాకు స్ఫురించిన నిగూఢార్థము చూడుడు—

మొదటి దృశ్యమున వాహనము శిబిక గజదంతమయి గజ అనగా ఎనిమిది. దంత అనగా ముప్పది రెండు. కనుక ఈ శిబిక ఎనిమిది ముప్పదిరెండు కలిగినది. రెండవ దృశ్యమున వాహనము

మహాగజం అనగా మహా ఎనిమిది. ఈమహాగజ చతుర్దంతం. కనుక నాలుగు ముప్పది రెండు కలిగిన మహా ఎనిమిది నెక్కి వచ్చెను. ఇదేమిటి? ఇది గాయత్రీమంత్ర స్థూల స్వరూప వర్ణన!!!

సుందరకాండమే రామాయణహృదయము. సుందరకాండ హృదయము త్రిజటాస్వప్నము. ఈ త్రిజటాస్వప్న మెక్కడ ఉన్నదో చూడుడు- రామాయణము యొక్క ఇరువదినాలుగువేల శ్లోకము లందు నట్టనడుమ ఉన్నది. పంన్రెండువేల శ్లోకములు గడచినతర్వాత మొదలిడు పదుమూడవ వెయ్యికిమొదటి శ్లోకము ఈ త్రిజటా స్వప్న వృత్తాంత మధ్యమున ఉన్నది. "భర్తురంకా త్సముత్పత్య తతః కమల లోచనా" అను (సుం. 27 స.) 15 శ్లోకము యొక్క ఆద్యవర్ణము భ కారము భర్గోదేవస్య ధీమహి అను గాయత్రీమంత్ర ద్వితీయపాద ప్రథమాక్షరము. లేక గాయత్రీ మంత్రమధ్యమాక్షరము వ్యాఖ్యాత లీ విషయమే చెప్పుచు, "తత_స్తస్య నగస్యాగ్ర" ఇతి -అత్ర ద్వాదశసహస్ర శ్లో కాగతాః- త్రయోదశ సహస్రాది మోయం శ్లోకః గాయత్ర్యా స్త్రయోదశ మక్షరం అత్ర బోధ్యం-భర్తు రితి"అని చెప్పిరి. కనుక 24వేల శ్లోకమణులుగల రామాయణ హారమున త్రిజటాస్వప్నము నాయక మణిగా ఉద్దేశింపబడినట్లు ఋషిహృదయమును గ్రహింపవలెను.

త్రిజటాస్వప్న మెట్లు గాయత్రీమంత్ర మగును? మొదటి దృశ్యమున గజదంతమయీ అనుచోట గజశబ్దముచేత ఎనిమిది అని చెప్పి గాయత్రి అష్టాక్షరి అను విషయము సూచింప బడినది. దంత శబ్దముచేత గాయత్రీ మంత్రము యొక్క మొత్తము అక్షరములు 32 అని చెప్పబడినది. గాయత్రియొక్క ఒక్కొక్కపాదమున 8 అక్షరము లుండును. కనుక ఈ మంత్రమునకు నాలుగు పాదములు కలవు అని తెలుసుకొనవచ్చును. దీనిచే రెండవ దృశ్యమున చతుర్దంతం మహాగజం అని చెప్పెను. ఇందులో దంత గజ శబ్దములు క్రొత్తవి కావు. మొదటి దృశ్యములోనివే. ఇందు చతుః అనునదే అధికము. అది నాల్గుపాదములు

అను మరొక విషయము చెప్పుటకు - యతులకు "పరో రజసి సావదోం" అను తురీయ పాదముతో కలిపి నాల్గుపాదములు చెప్పబడినవి గదా! ఇదే పూర్ణ గాయత్రి. ఇచ్చట ధ్వనింపబడునది ఇదే!

మొదటి దృశ్యము-పరబ్రహ్మ స్వరూపమయిన రాముడు పాదమునకు ఎనిమిది అక్షరములు కలిగి మొత్తము మంత్రము 32 అక్షరములు కలిగిన శిబికాం అనగా మంగళకరమైన దానిని, అంతరిక్షగాం ఆకాశతత్త్వమయ విశుద్ధచక్ర స్థానమైన కంఠదేశమునందు చరించునది అనగా గానము చేయబడునది (గాయంతం త్రాయత ఇతి గాయత్రి) అయిన గాయత్రీ మంత్రమును అధిష్ఠించి వచ్చినట్లు కనిపించుట. రామునకును గాయత్రీ మంత్రాధిష్ఠాన దైవతమైన పరబ్రహ్మమునకును ఇచ్చట అభేదము చెప్పబడినది. రెండవ దృశ్యమున అట్టి మంత్రమునకు నాల్గు పాదములు కలవని చెప్పబడినది.

మూడవ దృశ్యమున - పాండురర్షభయుక్తేన రథేన అష్టయుజా స్వయం - అని మరొక లక్షణము చెప్పబడినది. ఆ మంత్రము రథము. ఆ రథమునకు ఎనిమిది తెల్లని వృషభములు పూన్చబడి యున్నవి. ఈ వృషభము లేమిటి? అట్టివి ఎనిమిది ఉండుట యేల? అవి ఎందుచేత తెల్లటివి? వృషభం అనగా "చతుశ్శృంగో వమీద్గౌర ఏతత్... త్రిధా బద్ధో వృషభో రోరవీతి" ఇత్యాదిగా శ్రుతి వర్ణించిన వృషభమే ఈ వాల్మీకి యొక్క వృషభము, అనగా ఓంకారము! అది "గౌర ఏతత్" అనబడెను గదా కనుక ఇది ఆ పాండురర్షభము - మరి అవి ఎనిమిది ఎందుకు అనగా - గాయత్రీ మంత్రమునకు ఎనిమిది ఓంకారములు కలవుగదా? ఓం భూర్భువః ఇత్యాది సప్త వ్యాహృతులకు సప్త వృషభములు, ఓం తత్సవితుర్వరేణ్యాం అని మంత్రమునకు ఒకటి, మొత్తము ఎనిమిది ఓంకారములు ఈ మంత్రమునకు కలవు. కనుక అది ఎనిమిది తెల్లటి ఎడ్లు పూన్చిన రథము. రమంతే అత్ర ఇతి రథః అని కదా, కనుక పరబ్రహ్మము అందు రమించును.

నాల్గవ దృశ్యమున నిర్గుణబ్రహ్మ ప్రతిపాదకమైన పాదమును సూచించుటకు ఎట్టి వాహనములను చెప్పక దివ్యం విమానం సూర్య సన్నిభం అని ఋషి వర్ణించెను. గాయత్రీ మంత్రమున ఉపాసింపబడు దైవతము సూర్యుడే కదా ? ఇక అంతకంటె గాయత్రీ మంత్రమును వర్ణించుటకు చెప్పవలసిన లక్షణము లేమున్నవి ? ఎవరైనను ఇంతే కదా చెప్పుదురు. ఋషియు అంతే చేసెను.

ఇట్టి పరమార్థమును స్ఫురింపజేయవలెనను ఉద్దేశము లేకపోయి నచో గజదంతమయి. చతుర్దంతం, పాండురర్షభ ఇత్యాది శబ్దములను, చిత్రములను ప్రయోగింప నక్కరలేదు. తన చేతిలో ఉన్న పని గనుక మరొక విధమైన మాటలతో మరొకరకమైన చిత్రములను కల్పించి యుండవచ్చును.

ఇంతేకాదు, ఈ పరమార్థమును గ్రహించుటకు ఋషి మరొక కీలకమును గూడ ఇచ్చెను. మొదటి దృశ్యమున హంసను రెండవ దృశ్యమున చతుర్దంత మహాగజమును అనగా ఐరావతమును మూడవ దృశ్యమున వృషభమును చెప్పెను. ఇవి ఏమిటి ? ఇవి ఏవో కావు, త్రిసంధ్యలందు తన్మంత్రాధిదేవత అధిరోహించు వాహనములే. గాయత్రి యొక్క మొదటి మూడు పాదములు అనగా త్రిపదాగాయత్రి సగుణబ్రహ్మాత్మకము, తురీయ పాదము నిర్గుణ బ్రహ్మాత్మకము. కనుక త్రిపద బ్రహ్మ విష్ణు మహేశ్వర సంపుటి. "గుణత్రయాత్మకాః ప్రోక్తా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః" అని దే. భా 71. గుణత్రయసామ్యావస్థా త్మక మాయాశబ్ద బ్రహ్మమే త్రిపదా గాయత్రి. కనుక ఆమె త్రిసంధ్యలందు బ్రహ్మవిష్ణు మహేశ్వర స్వరూపములతో తత్తద్వాహన లాంఛనములతో విలసిల్లును. దేవీ భాగవతమునందే "హంసస్థా గరుడా రూఢా తథా వృషభవాహనా" అని 12 స్కం 5. 5 శ్లోకము. దీనికి నీలకంఠవ్యాఖ్య చూడుడు: "గాయత్రీ రక్తా సావిత్రీ శ్వేతా సరస్వతీ కృష్ణా - త్రిసూణాం క్రమేణ వయోవస్థా . మాహ (బాలాయువనీ

వృద్ధా) హంసస్థా బ్రాహ్మీ గరుడారూఢా సరస్వతీ వృషభవాహనా సావిత్రీ" - దేవతా త్రయస్య క్రమేణ వేదత్రయోత్పాదకత్వ మాహ - ఈ క్రమము ననుసరించియే త్రిజటాస్వప్నమందలి - మూడు. దృశ్యములందు గాయత్రి మంత్రాధిదేవత హంస ఐరావత, వృషభ ముల నెక్కినట్లు చెప్పబడినది. అయితే గాయత్రియొక్క మాధ్యాహ్నిక వాహనము గరుడుడు గదా ఐరావత మెట్లు చెప్పబడిన దనగా మాధ్యాహ్నికసంధ్యయందు ఆ దేవత వైష్ణవి. అట్టి దేవత మధ్యాహ్నము ఐరావతారూఢా అనుటచేత ఎట్టి విప్రతిపత్తియు కలుగదు. విష్ణుమూర్తి ఐరావతారూఢుడైనట్లు - ఆగమశాస్త్రము. ఉపేంద్రుడుగా విష్ణువు ఇంద్రుని లాంఛనములందు సమానభోగము గలిగినట్లు పురాణము చెప్పుచున్నది. అన్నిటిని మించునది - గాయత్రి ఐరావతారూఢ "ఐంద్రీ హ్యైరావతా రూఢా చైహికాముష్మికప్రదా" అని దేవీభాగ. 12 స్కం. 6 అ. 26 శ్లోకము. ("ఖేచరీ ఖగవాహనా" అని కూడా 38 శ్లో.) ఒక్కటయినను అట్లు దారితప్పించి క్లిష్టము చేయక పోయినచో, పరమార్థము బట్టబయలుగా ఉండును. గుప్తము గాకున్నచో అది ఆర్షపద్ధతికి విరుద్ధము. కనుకనే ఐరావతము చెప్పబడినది. లేనిచో గరుడుడే చెప్పబడెడిది. పైగా ఈ మార్పువలన మూలవిషయమునకు భంగం లేదు.

అయితే, ఇచ్చట ఒక విశేషము గలదు. గాయత్రీ కల్పము, వసిష్ఠ ప్రోక్త గాయత్ర్యష్టోత్తర శతనామ స్తోత్రము. గాయత్ర్యుపనిషత్తు, కాశీఖండము - ఇత్యాది గ్రంథములందు చెప్పబడిన క్రమము దీనికి విరుద్ధముగా ఉన్నది. అనగా వెనుక చెప్పినట్లు బ్రహ్మ విష్ణు మహేశ్వర క్రమమున గాక బ్రహ్మ మహేశ్వర విష్ణు అను క్రమమున గలదు. అనగా వృషభ వాహనము మధ్యాహ్నము; గరుడవాహనము సాయంకాలము అగును. దీనినే యజుర్వేద సంధ్యావందన భాష్యమున శంకరులవారున్ను అనుసరించిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వర క్రమము

సృష్టిస్థితి లయక్రమము, త్రిసంధ్యాక్రమము సరిపోవుచుండగా వెనుక చెప్పిన గ్రంథములందు ఈ మార్పెందుకు వచ్చెనో పరిశీలింపవలసి యున్నది.

అ దెట్లున్నను వాల్మీకి యొక్క మూడు దృశ్యములు బ్రహ్మ విష్ణు మహేశ్వర క్రమమున ఉండి దేవీ భాగవతమునుండి నేను ఉద్ధరించి చూపిన శ్లోకము చెప్పిన క్రమమునకు సరిగా ఉన్నది. కనుక ఋషి త్రిజటాస్వప్నమును నొకబాహిరరూపమును కల్పించి, అంతరార్థముగా గాయత్రీ మంత్రమంత్రాధిదేవతలను ధ్వనింపజేసెను.

ఈ అపూర్వకల్పన కంతటికి ఋషి త్రిజటాస్వప్న మని పేరు పెట్టెను. త్రిజట అనుటలోనే రహస్య మున్నది. త్రిజట ఏదో రాక్షసి కాదు. త్రిజటా శబ్దము గాయత్రీ దేవికి చెప్పబడిన వేయి నామములలో ఒక నామము-"త్రిజటా తిత్తిరీ తృష్ణా త్రివిధా తరుణాకృతిః" దే. భా. 12 స్కం. 6 అ. 72 శ్లోకము. కనుక రామాయణమున త్రిజట యొక్క అంతరార్థము ఇది.

రామాయణమునకు వ్యాఖ్యలు వ్రాసినవారిలో ఒకడగు గోవిందరాజు "త్రిజటా విభీషణ పుత్రీ" అని వాడుటచేతనేమో త్రిజట విభీషణుని కూతురు అను దుర్వాద మొకటి వ్యాపించినది. కానీ రామాయణమున వాల్మీకి "రాక్షసీ త్రిజటా వృద్ధా ప్రబుద్ధా వాక్య మబ్రవీత్" అని చెప్పెను. ఈ త్రిజట వృద్ధ. రావణుడే వృద్ధుడు కాడు. "సమక్షమివ కందర్పం అపవిద్ధశరాసనం" అనబడినవాడు. అట్టివాని రెండవ తమ్ముని కూతురు వృద్ధ ఎట్లగును? వాల్మీకియే సుందరకాండమున 37 స. 11 శ్లో. నందు "జ్యేష్ఠా కన్యా నలా నామ విభీషణ సుతా కపే" అనెను. కనుక విభీషణపుత్రి "నల" అను నది - త్రిజటను వృద్ధా ప్రబుద్ధా అనుట ఎంతో అన్వర్థముగా ఉన్నది. సాయం సంధ్యా దేవత వృద్ధా, ప్రబుద్ధా అనుటచే ఆమె జ్ఞానస్వరూపిణి.

మరియొకటి - ఇందు రామునికి లక్ష్మణునికి సీతకు శుక్ల మాల్యాంబరధారణము చెప్పబడినది. "శుక్ల మాల్యాంబరధరో లక్ష్మణేన సహా గతః" - "తత స్తౌ నరశార్దూలౌ...శుక్ల మాల్యాంబర ధరౌ" "సీతా శుక్లాంబరావృతా." కనుక సీతా రామ లక్ష్మణులు శ్వేతవర్ణ సంకలితు లని భావము. పరమార్థమున సీతారామలక్ష్మణులు ఒక్కటే. ఎట్లనగా "లక్ష్మీ రస్యాస్తీతి లక్ష్మణః" అనగా లక్ష్మీకలవాడు. ఎవడు? రాముడే. రామః లక్ష్మణః అనినప్పు డంతయును లక్ష్మణశబ్దము రామునకు విశేషణప్రాయమే. ఉదాహరణ- "న చిరా ద్ద్రక్ష్యసే రామం లక్ష్మణం చ మహాబలం మధ్యే వానరకోటీనాం సుగ్రీవం చామితౌజసం" -(సుం. 34 స. 38 శ్లో.) త్వరలో రాముని, లక్ష్మణుని, సుగ్రీవుని చూచెద వని వాచ్యార్థము. త్వరలో లక్ష్మీవంతుడైన చక్కని గ్రీవము కలిగిన రాముని (మధ్యే - వా - నరకోటీనాం) చూచెదవు అని పరమార్థము. ఇక సీతారాముల అభేదము ప్రత్యేకించి చెప్పనక్కర లేదు. శివశక్తులకు భేద మెక్కడిది ?

"అస్యాదేవ్యా యథారూపం అంగప్రత్యంగ సౌష్ఠవం రామస్యచ యథా రూపం తస్యేయ మసితేక్షణ" అని వారి అభేదమును వాల్మీకియే (సుం. 15 స 57 శ్లో.) ముందే చెప్పెను. "చిన్మయేస్మిం స్త్రియో దశ స్వభూర్జ్యోతి స్త్రిస్రః సీతారామావేకా- జీవవాచీ షష్టిః..." ఇత్యాది రామతాపన్యుపనిషత్తు. కనుక త్రిజటాస్వప్నమున సీతా రామ లక్ష్మణులకు శ్వేతమాల్యాంబరధారిత్వము చెప్పుట గాయత్రి శ్వేతవర్ణ యనుటకే. "శ్వేతవర్ణా సాంఖ్యాయనస గోత్రా గాయత్రీ..." - ధ్యానమునందే రక్త, శుక్ల, కృష్ణ వర్ణములు త్రిసంధ్యలకు చెప్పబడినది కానీ ధ్యానేతర సందర్భమున గాయత్రి శ్వేతవర్ణయే.

లాహోరు డి. ఏ. యస్. కళాశాల పరిశోధనశాఖవారు ప్రకటించిన పశ్చిమోత్తర ప్రతియందు త్రిజటాస్వప్న ఘట్టముయొక్క పాఠము ఈ క్రింది విధముగా ఉన్నది.

"తాసాం ఏత ద్వచ శ్శ్రుత్వా త్రిజటా వృద్ధరాక్షసీ
వక్తుం కృతాంజలిపుటా తం స్వప్నం ఉపచక్రమే- 1

సపర్వతవనాం కృత్స్నాం గ్రసమానో మహీం ఇమాం
స్వప్నే రామో మయా దృష్టో రుధిరం పీతవాన్ బహు- 2

గజదంతమయీం దివ్యాం శివికాం అంతరిక్షగాం
యుక్తాం *నాగసహస్రేణ స్వయం ఆస్థాయ రాఘవః- 3

స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లాంబరావృతా
సాగరేణ పరిక్షిప్తం ఆరుహ్య శ్వేతపర్వతం
రామేణ సంగతా సీతా భాస్కరేణ యథా ప్రభా- 4

ఇహోపయాతః కాకుత్స్థః సీతా యా సహభార్యయా
లక్ష్మణేన సహ భ్రాతా విమానే పుష్పకే స్థితః- 5

రాఘవశ్చ మయా దృష్ట శ్చతురంతే మహాగజే
ఆరూఢ శ్శైలసంకాశో విచరన్ సహ భార్యయా- 6

తత స్తౌ నరశార్దూలౌ దీప్యమానౌ స్వతేజసా
శుక్లమాల్యాంబరధరౌ జానకీం ప్రత్యుపస్థితౌ- 7

తత స్తస్య నగస్యాగ్రాత్ ఆకాశస్థస్య దంతినః
భర్త్రా పరిగృహీతస్య జానకీస్కంధ మాప్లుతా— ? 8

భర్తు రంకా త్సముత్పత్య తతః కమలలోచనా
చంద్రసూర్యౌ మయా దృష్టా పాణినా పరిమార్జతీ- 9

తత స్తాభ్యాం కుమారాభ్యాం అస్థితోసౌ గజోత్తమః
సీతయా చ విశాలాక్ష్యా లంకాం పర్యభితః స్థితః- 10

పాండురర్షభయుక్తేన *రథేనాష్టయుజః స్వయం
శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సమాగతః- 11

విమానాత్ పుష్పకాత్ అద్య రావణః పతితో మయా
కృష్యమాణః స్త్రియా దృష్టో ముండః పీతాంబరో హి సః- 12
*ఉష్ట్రేణ చ మయా దృష్టః ప్రయాతో దక్షిణాం దిశాం
సమాజశ్చ మయా దృష్టో గీతావాదిత్ర నృత్యవాన్- 13
......................................."

ఈ పాఠమున కొలది మార్పులు గలవు. అందు ముఖ్యమైనవి-
హంస సహస్రేణ అనుటకు నాగసహస్రేణ (8)
రథేనాష్టయుజా స్వయం అనుటకు రథేనాష్టయుజః స్వయం (11)
ఖరేణ అనుటకు ఉష్ట్రేణ (13)

ఈ మార్పులైనను త్రిజటాస్వప్నవృత్తాంతముయొక్క తత్త్వము నంటు నంతటి తీవ్రమైనవి కావు. ప్రాంతీయ పరిస్థితులను బట్టి చొచ్చుకొనినవే గాని అన్యములు కావు. ఉత్తరహిందూస్థానము అనేక రాజకీయ సాంఘిక కల్లోలములకు లోనగుటచేత అచ్చటి పారంపర్య సంప్రదాయములు విచ్ఛిన్నము లగుటకు, వ్యత్యస్తము లగుటకు పెక్కు అవకాశములు కలవు. కనుక అచ్చటిప్రతులందలి పాఠభేదము లన్నియు మూలగ్రంథముతో సంబంధము కలవేమో అనుకొన నక్కరలేదు. కానీ దక్షిణ హిందూస్థానమున అట్లుకాదు. ప్రాచీన సంప్రదాయము చాలవరకు చెక్కు చెదరకుండా ఉన్నది. కనుక ఇచ్చటి పాఠములు అచ్చటి వాటికంటె శుద్ధములని నమ్ముట కెక్కువ అవకాశము కలదు.

ఈ త్రిజటా స్వప్న రహస్యమును భారత కర్తగాని అధ్యాత్మ రామాయణకర్తగాని, దేవీ భాగవత కర్తగాని, చంపూరామాయణ కర్తగాని గుర్తించినట్లు లేదు. ఆసక్తి కలదేని వానిని చూడుడు. విశదమగును.

ఈ విధముగా వాల్మీకి మహర్షి సుందరకాండమున త్రిజటా స్వప్నమను వాచ్యార్థము గల వృత్తాంతమును కల్పించి గాయత్రీ మంత్ర మంత్రాధిదేవతల వర్ణనమును ధ్వనింపజేసెను. సహృదయు లీ పరమార్థము గ్రహించి సంతోషింతురుగాక !

మూడవ ప్రకరణము

# భారతము రామాయణమునకు ప్రతిబింబము

## I

రామాయణమును వాల్మీకి వ్రాసెను. భారతమును వ్యాసుడు వ్రాసెను. కానీ ఆ భారతమును చదువుచున్నప్పుడు అందు సర్వత్ర రామాయణమూర్తి సాక్షాత్కరించుచుండును. "అంగాదంగాత్సంభవసి హృదయాదధిజాయసే ఆత్మావై పుత్రనామాసి"-అను శ్రౌతవాక్యానకు తాత్పర్య మేదో అది రామాయణ, భారతములకు అన్వయించుచున్నది—

గ్రంథనిర్మాణ పద్ధతియను సూలలక్షణము నందును, సూక్ష్మలక్షణము లనదగు శబ్ద భావములు, ఉపమానములు, గిరి నిర్ఝరవన వర్ణనాదులు, కథనరీతులు ఇత్యాదులందును భారతమునందు రామాయణము గోచరించుచుండును. ఈ విషయములను వివరముగా పరిశీలించి చూపింతును. రామాయణ కర్తయు, భారతకర్తయు మహర్షులు ఇరువురు తమ గ్రంథములను వ్రాయుటకు తపస్సు చేసిరి. వాల్మీకి "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్" ఇత్యాది ప్రశ్నలు నారదుని అడుగుట, తమసానదీతీరమున చింతించుచు సంచరించుట "[స...నియతేంద్రియః, చచార పశ్యం స్తత్సర్వతో విపులం వనం]" [బాల 1-8] క్రౌంచవధ, ఋషికరుణ, శ్లోకావిర్భావము, బ్రహ్మసాక్షాత్కారము ఇవన్నియు వాల్మీకి తపస్సు గాక మరేమిటి ?-రామాయణమున వాచ్యముగా చెప్పు పద్ధతి లేదు కనుక ఇట్లు చెప్పబడెను. కాని భారతమున చూడుడు వ్యాసుని తపస్సు వాచ్యము

చేయబడెను. "పుణ్యే హిమవతః పాదే మధ్యే గిరి గుహాలయే, విశోధ్య దేహం ధర్మాత్మా దర్భసంస్తరమాశ్రితః, శుచిస్సనియమో వ్యాసః శాంతాత్మా తపసి స్థితః". రామాయణమునందును ఈ దర్భ సంస్తరము చెప్పబడెను "ఉపస్పృశ్యోదకం సమ్య జ్మునిస్థిత్వా కృతాంజలిః ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మే ణాన్వేష తేగతిం." [ బాల 3-2 ] ఈ మాటనే వ్యాసు డెట్లనెనో చూడుడు. "భారత స్యేతిహాసస్య ధర్మేనాన్వేత్యశాం గతిం". [సంభవపర్వము]

రామాయణమున వాల్మీకి చింతించుచుండగా బ్రహ్మ వచ్చెను. "ఉపవిష్టః కథాశ్చాన్యాః చకార ధ్యాన మాస్థితః అజగామ తతో బ్రహ్మ లోకకర్తా స్వయంప్రభుః"- అట్లే వ్యాసుడు భారతమును గురించి చింతించుచుండగా బ్రహ్మ వ్యాసునికడకు వచ్చెను. "తత్రా జగామ భగవాన్ బ్రహ్మ లోకగురుః స్వయం"- శబ్దములు, భాష, భావము అన్నియు ఉభయత్రా ఒక్కటే. ఈ సూక్ష్మమును జాగ్రత్తగా గుర్తించుచుందురు గాక.

రామాయణమున బ్రహ్మ వాల్మీకిగ్రంథమును కావ్య మని చెప్పెను. "నతేవాగనృతాకావ్యేకాచి దత్ర భవిష్యతి" [బాల. 2—35] భారతము నందును బ్రహ్మ దానిని కావ్యమని వ్యాసునికి చెప్పెను. "త్వయాచ కావ్య మిత్యుక్తం తస్మాత్ కావ్యం భవిష్యతి."

రాముడు రాజ్యమును పొందిన తర్వాత వాల్మీకి రామాయణ మును వ్రాసెనట. "ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవవాన్ ఋషిః, చకార చరితం కృత్స్నం విచిత్రపద మాత్మవాన్" [బాల4-1] వ్యాసుడును అట్లే పాండవాదులు గతించిన తర్వాత [అనగా వారు రాజ్యమును పొందిన తర్వాత] భారతము వ్రాసెనట. "తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం అబ్రవీ ద్భారతం లోకే మానుషేస్మిన్ మహాన్ ఋషిః [సంభ. 1అ].

రామాయణమును వాల్మీకి ఉదార వృత్తార్థ మనోహరశబ్దముల చేతను, సమాక్షర రమ్యములగు అనేక శ్లోకములచేతను కావ్యమును నిర్మించెను - అని ఉన్నది. "ఉదాత్తవృత్తార్థపదై ర్మనోరమై స్తదాస్య రామస్య చకార కీర్తిమాన్, సమాక్షరై శ్లోకశతై ర్యశస్వినో యశస్కరం కావ్య ముదారధీ ర్మునిః." భారతమునందును వ్యాసు డట్లే వ్రాసెనని కలదు. "అలంకృతం శుభైః శబ్దైః సమయై ర్దివ్యమానుషైః చందోవృత్తైశ్చ వివిధై రన్వితం విదుషాం ప్రియం" [సంభ. ప]

రామాయణమున అది వేదార్థ సమ్మితమని కలదు. "ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యాం వేదైశ్చ సమ్మితం" [బాల 1-98] అట్లే భారతమునందును "వేదైశ్చతుర్భిస్సంయుక్తాం వ్యాస స్యాద్భుత కర్మణః"—

రామాయణమున రహస్యార్థము గలదని చెప్పబడినది "రహస్యంచ ప్రకాశంచ యద్వృత్తం తస్య ధీమతః...తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి" [బాల-2-33, 34] అట్లే భారతమునందును - "సూక్ష్మార్థ న్యాయయుక్తస్య వేదార్థై ర్భూషితస్య చ"- అష్టౌశ్లోక సహస్రాణి అష్టౌశ్లోక శతాని చ అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వానవా, భేత్తుం న శక్యతేర్థస్య గూఢత్వాత్ ప్రశ్రితస్యచ."

రామాయణమున వాల్మీకి 24 వేల శ్లోకములు వ్రాసెనని కలదు. "చతుర్వింశత్సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ఋషిః [బాల 4.2] అట్లే భారతమునందును "చతుర్వింశతిసాహస్రీం చక్రే భారత సంహితాం" 24 వేలనియే కలదు.

రామాయణము కవుల కాధారమని అది చెప్పును. "వరంకవీనాం ఆధారం సమాప్తంచ యథాక్రమం" [బాల 4-21] అట్లే భారతమునందును "సర్వేషాం కవిముఖ్యానాం ఉపజీవ్యో భవిష్యతి".

రామాయణము వ్రాసి వాల్మీకి దీనిని లోకమున ఎవడు ప్రవర్తిల్ల జేయునని చింతించెను. "చింతయామాస కోన్వేతత్ప్రయుంజీయాదితి ప్రభుః"— (బాల-4-3) అట్లే భారతము నందును— "కథమధ్యాపయానీహ శిష్యానిత్య న్వచింతయత్" అనబడినది. స్థూలముగ గ్రంథ నిర్వహణ లక్షణము లిట్లున్నవి.

ఇక శబ్దభావ ఉపమాన వర్ణన కథనాదులు వివరింతును.

సత్యపరాక్రమః, క్రోధమూర్ఛితః, క్రోధ సంరక్తలోచనః. క్రోధసంవర్తితేక్షణః, దుఃఖమూర్ఛితః. ద్విజనిషేవితః, నాగనా సోరు, భీరు, నరవ్యాఘ్రః, అక్లిష్టకర్మణః (షష్ఠిలోనే ప్రయోగబాహుళ్యము) మంత్ర గ్రామం, రావణం లోకరావణం ఇత్యాది శబ్దములు శబ్దబంధములు వాల్మీకిలోనివి వ్యాసునియందు విస్తారముగ వెదజల్లబడియున్నవి. అవి బహువారములు భారతమున ప్రయోగింపబడుచుండును.

వాల్మీకి రచనలో సహజముగా రూపొంది బహువారములు దొర్లుచుండు కొన్ని వాక్య నిర్మాణములు "తస్యతద్వచనం శ్రుత్వా" "విహరస్వ యథాసుఖం" "సుముహూర్త మివ ధ్యాత్వా" వంటివి భారతమునందును బహుళముగ వాడుకొనబడినవి. అవే తర్వాత పురాణములందు ప్రవేశించినవి.

ఉపమానములు చూడుడు. విష్ణుతుల్య పరాక్రమః అని వాల్మీకి విష్ణువును పరాక్రమమునకు ఉపమానముగా వాడుచుండును. వ్యాసుడును దానినే వాడెను. "బలేవిష్ణు సమశ్చాసీత్ తేజసాభాస్కరోపమః" (సంభ. 69 అ.) "జామదగ్న్య సమఃకుంతి విష్ణుతుల్య పరాక్రమః (సంభ—122 అ) ఇట్లెన్నో పర్యాయములు భారతమున వచ్చును. అయితే వ్యాసుడు పరాక్రమమునకు మరి యిరువురిని అధికముగా తెచ్చెను. కార్తవీర్య సమః కుంతి శివతుల్య పరాక్రమః" (సం. 122 అ.)

అయం సుపురుష వ్యాఘ్రఘోరణే వసుపరాక్రమః" (సం. 71 అ)-—మరొకటి, విష్ణునా సదృశోవీర్యే సోమవత్ ప్రియదర్శనః (బాల, 1--18) అని వాల్మీకి.అనగా వ్యాసుడు శుభలక్షణ సంపన్నః సోమవత్ ప్రియదర్శనః (సంభ 123 అ ) అనెను. మరొకటి "దేవతాభి స్సమా రూపే సీతా శ్రీరివ రూపిణీ" (బాల 77-28) అని రామాయణము. అట్లే "శ్రుత్వాథ తస్యతం శబ్దం కన్యాశ్రీ రివరూపిణీ" (సంభ 71 అ.) కుంతి ద్రౌపదిని ఆశీర్వదించు చోట- [వైవాహిక పర్వం 198 అ. ] యథేంద్రాణీ హరిహయే స్వాహోచైవ విభావసౌ, రోహిణీవ యథా సోమే దమయంతీ యథానలే, యథావైశ్రవణే భద్రా, వసిష్ఠే ప్యరుంధతీ యథా నారాయణే లక్ష్మీ తథా త్వం భవ భర్తృషు" ఈధోరణి ఉపమానము లన్నియు వాల్మీకియం దున్నవే- (సుందరకాండ 24- 10) యథా శచీ మహాభాగా శక్రం సమను తిష్ఠతి, అరుంధతీ వశిష్ఠంచ రోహిణీ శశినం యథా... నైషధం దమ యంతీవ భైమీ పతిమనువ్రతా"... ఇ ట్లెన్నో గలవు-

కొన్ని భావములు— "కాలః సుప్తేషు జాగర్తి కాలోహి దురతిక్రమః [వ్యాసుడు— సంభ— 1 అ] అట్లే వాల్మీకి- యది సీతాపి దుఃఖార్తా కాలోహి దురతిక్రమః (సుం. 16. 3.)

మరొకటి- సంభవ పర్వమున 73 అ. న శకుంతల దుష్యంతునిచే నిరాకరింపబడి అతనిని నిందించును. నీవునాకు చేసిన ప్రమాణము ఎవ్వరును లేనప్పుడు చేసినదిగదా, ఇప్పుడు తద్విరుద్ధముగ వర్తించిన ఏమగు ననిభావింతువేమో- హృదయసాక్షి యగుపరమాత్మ ఉన్నాడు సుమా అని హెచ్చరించును. "ఏకోహమస్మీతిచ మన్యసేత్వం-నహృచ్ఛయం వేత్సిమునిం పురాణం యో వేదితా కర్మణః పాపకస్య-తస్యాంతికే త్వం వృజినం కరోషి" "యమో వైవస్వతస్తస్య నిర్యాతయతి దుష్కృతం— హృదిస్థితః కర్మసాక్షీ క్షేత్రజ్ఞో యస్య తుష్యతి- సతు

తుష్యతి యస్యైవ పురుషస్య దురాత్మనః- తం యమః పాపకర్మాణం వియాతయతి దుష్కృతం." దీనికంతటికీ హృదిస్థితః కర్మసాక్షీ అననది జీవభూతము, అనగా హృదయమందలి పరమాత్మ. వాడే ఉపనిషత్తు నందు "పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖం... తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః... నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరాః నీవార శూకవత్తన్వీ పీతాభా స్వత్యణూపమా తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః- అని వర్ణింపబడెను. ఈ హృదిస్థితః కర్మసాక్షీ అను ఈ సందర్భమునందలి భావము వ్యాసునకు పూర్వమే వాల్మీకియందున్నది- చూడుడు- ధర్మహాని చేసితివని తనను నిందించుచున్న వాలికి రాముడు చెప్పుట (కిష్కింధ కాండ) "సూక్ష్మః పరమదుర్జ్ఞేయః సతాం ధర్మః ప్లవంగమ, హృదిస్థ స్సర్వ భూతానాం ఆత్మా వేద శుభాశుభం-" దీనిని మన కాళిదాసెట్లు వాడుకొనెనో చూడుడు- తన అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతునిచే ఇట్లు చెప్పించెను:

"సతాం హి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణః ప్రవృత్తయః"- ఇట్లున్న వీమహాకవుల పరస్పర సంబంధములు!

మరొకటి:—తారాంగద సుగ్రీవులకు రాముడు "లోకవృత్త మనుష్ఠేయం...తదలం పరితాపేన ప్రాప్తకాల ముపాస్యతాం" అని చెప్పుచు "స్వభావే వర్తతే లోకః తస్యకాలంః పరాయణం" అని కాల స్వరూపమును వివరించుచు "కాలస్స్వభావోనియతిర్యదృచ్ఛాభూతాని యోనిః పురుష ఇతి చింత్యం" అనబడిన శ్వేతాశ్వతరీయ ప్రతిపాదిత తత్త్వము చెప్పును. కిష్కింధకాండలోని 25 సం. లోని 3-11 శ్లోకములు చూడుడు-అట్టివే సంభవపర్వమున ఒకటవ అధ్యాయమున సంజయుడు దుఃఖార్తుడైన ధృతరాష్ట్రునికి చెప్పును. "కాలమ్మూల మిదం

సర్వం భావాభావే సుఖాసుఖే కాలః సృజతి భూతాని కాలః సంహరతే ప్రజాః" ఇత్యాది.

వ్యాసుని వనవర్ణనలు చూడుడు: అన్నియు రామాయణీయములే "అనేక గ్రంధ ప్రవహాం పుణ్యగంధం మనోరమం" (వాల్మీకి సుందర 15-14) "మధుగంధైశ్చసంయుక్తం పుష్పగంధం మనోహారం"(వ్యాస అంశావతరణపర్వం 27అ.) "ఉత్పతద్భిరివాకాశం వృక్షైర్మలయజైరపి శోభితం పుష్పవర్షాణి ముంచద్భిర్మారుతోద్ధతః" (వ్యాస. ఆస్తీక పర్వం: 27అ.) "ఉత్పతదిభిర్ద్విజగణైః పక్షైఃసాలాః సమాహతాఃఅనేక వర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః" (వాల్మీ-సుం-14-10) "మత్తబర్హిణ సంఘుష్టాం నానాద్విజ గణాయుతాం (వాల్మీ-సుం-14 8) "మత్తభ్రమర సంఘుష్టంమనోజ్ఞాకృతి దర్శనం" (వ్యాస-ఆస్తీ-27అ.). "హర్మ్యప్రాసాద సంబాధాం కోకిలాకుల నిస్వనాం" (వాల్మీ. సుం. 15-3) "కోకిలాకుల సంనాదం మత్తభ్రమర నాదితం" (వ్యాస-అంశా-63అ.) "సంతానక లతాభిశ్చ పాదపైరుపశోభితాం" (వాల్మీ. సుం. 15-2) "పుష్ప సంచన్న శాఖాగ్రం పల్లవైరుపశోభితం" (వ్యాస. అంశా-63అ) "దివ్య గంధరసోపేతాం సర్వతః సమలంకృతాం (వాల్మీ సుం. 15-2) "దివ్యగంధవహైః పుణ్యైః మారుతైరుపవీజితం" (వ్యాస. ఆస్తీ-27అ) "సర్వర్తు కుసుమై రమ్యాం ఫలద్భిశ్చ పాదపైః" (వాల్మీ. సుం-15-5) "సర్వర్తు కుసుమై ర్వృక్షైః సుఖచ్ఛాయైస్సమావృతం (వ్యాస. సంభవపర్వం-70అ).

'ఇయంచ నళినీరమ్యా ద్విజసంఘ నిషేవితా' (వాల్మీ. సుం. 1445) ఇయంచ నళినీరమ్యా జాతపర్వత నిర్ఝరే (వ్యాస. తీర్థయాత్రా ప. 154 అ) సువర్ణవృక్షా నపరాన్ దదర్శశిఖసన్నిభాన్" "వాల్మీ-సుం-14-39) హిరణ్మయ సదృశైః పుష్పైర్దావాగ్నిసదృశైరపి (వ్యా

యత-ప.-157అ) కొన్ని ఉదాహరణలే యిచ్చితిని. భారత మంతట ఇట్టివి కొల్లలుగా ఉన్నవి.

గిరి వర్ణన కొంచెము

"నీలలోహిత మాంజిష్ఠ పత్రవర్ణై స్సితాసితై స్వభావవిహితై శ్చిత్రై ర్ధాతుభి స్సమలంకృతం" (వాల్మీ, సుం. 1-5)

ధాతవో హారితాళస్య క్వచిద్దింగుళకస్య చ మనశ్శిలాగుహాశ్చైవ సంధ్యాభ్ర నికరోపమా శశలోహిత వర్ణాభాః క్వచిద్గైరికధాతవః సితాసితాభ్ర ప్రతిమా బాలసూర్య సమప్రభా" (వ్యాస-యతుయుద్ధ ప. 157 అ.)

ఇట్లు ఒకవిధముగా కాక అనేక విధములుగా అనేక సందర్భము లందు రామాయణ శబ్దములు భారతమున దొర్లుచుండును. ఉదా:— "సర్వే వేదవిదః శూరాః సర్వేలోక హితేరతాః" (వాల్మీ-బాల-. 18-24)

"సర్వే వేదవిదః శూరాః సర్వాస్త్ర విదుష స్తథా (వ్యాస. తీర్థయా. ప. 86అ.) హనుమంతుని లాంగూలమును వాల్మీకి ఇట్లు వర్ణించెను: (సుం. 1—61) "లాంగూలంచ సమావిద్ధం ప్లవమానస్య శోభతే, అంబరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః" [వాల్మీ-సుం. 1-61] వ్యాసుడు చేసిన వర్ణన చూడుడు [వ్యాస. తీర్థయాత్రా. ప. 145 అ.] "జృంభమాణస్సువిపులం శక్రధ్వజ ఇవోచ్ఛ్రితం ఆస్ఫోటయచ్చ లాంగులం ఇంద్రాశని సమస్వనం"—శక్రధ్వజ ఇవోచ్ఛ్రితం అనుట ఉభయత్రా సమానముగదా-హనుమను వాల్మీకి "విద్యుత్సం ఘాత పింగళం" అని వర్ణింపగా వ్యాసుడును [తీర్థయాత్రా పర్వమున 145 అ.] హనుమను అట్లే "విద్యుత్సంపాతదుర్నిరీక్ష్యం విద్యుత్సంపాతపింగళం" అని వర్ణించెను.

వ్యాసుని రామోపాఖ్యానమం దంతటను వాల్మీకీయముతో గలవు.

"సకల్పవృక్ష ప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్ శ్మశాన చైత్య ప్రతిమో భూషితోపి భయంకరః" [వాల్మీ సుం 22-2?]

"విచిత్రమాల్యమకుటో వసంత ఇవ మూర్తిమాన్

సకల్పవృక్షసదృశో యత్నాదపి విభూషితః శ్మశాన చైత్య ద్రుమవత్ భూషితోపి భయంకరః" [వ్యాస.280అ]

"భవమైథిలిభార్యా మే మోహమేనం విసర్జయ బహ్వీనాం ఉత్తమ స్త్రీణాం మమాగ్రమహిషీ భవ" [వాల్మీ. సుం. 20-16]

"భజస్వ మాం వరారోహే సుహోత్తానభరణాంబరా భవ మే సర్వ నారీణాం ఉత్తమా వరవర్ణినీ" [వ్యాస 280అ]

"నాహమౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ" [వాల్మీ-సుం 21-6]

"పరదారాస్మ్యలభ్యా చ సతతం చ పతివ్రతా న చైవౌపయికీ భార్యామానుషీ కృపణా తవ [వ్యాస-280అ] ఇట్లెన్నో కుప్రతిపత్తులుగా కలవు.

---

(9)

ఆదికావ్యమగు రామాయణము రహస్యార్థ గర్భితమగు ఒక మహామంత్రము. దానిని అర్వాచీన కవులు, పండితులు, వ్యాఖ్యాతల కంటె పూర్వులైన కేచి దుపనిషత్కర్తలు, పురాణకర్తలు, మరికొందరు సంహితాది గ్రంథకర్తలు సమగ్రముగా అర్థము చేసికొని రన వచ్చును. కాని భారతకర్తయగు వ్యాసభగవానుడు వాల్మీకిని అర్థము చేసుకున్న పద్ధతి విలక్షణముగా ఉన్నది. దేవీభాగవత, అధ్యాత్మరామాయణాది గ్రంథములందు సైతము రామాయణమునకు ఇవి కేవలము ప్రతిబింబములా అన్నట్లు శబ్దజాలము వర్ణనలు, కథాగతులు ఉన్నప్పటికీ, భారతము మరింత ఆశ్చర్యజనకముగా ఉండును.

వ్యాసుడు భారతమున రామోపాఖ్యానము చెప్పెను. అది చూచినచో ఆ ఉపాఖ్యానము వాల్మీకియొక్క కథయే, ఆయన శబ్దజాలమే, ఆయన వర్ణనలే. అందును రాముడు విష్ణ్వవతారమే. "అథ దాశరథిర్వీరో రామోనామ మహాబలః విష్ణుర్మానుషరూపేణ చచార వసుధాతలమ్" (147అ. తీర్థయాత్రాపర్వము). ఇవి ఇట్లుండగా అందు కొన్ని భేదములున్నవి. ఒకటి త్రిజటాస్వప్నము. అది వాల్మీకియందున్నటువంటి స్వప్నముకాదు. త్రిజట సీతను ఊరడించి ఆశాజనకమగు ఒక శుభవార్తను చెప్పుట మాత్రమే "త్రిజటానామ రాక్షసీ, సాంత్వయామాస వైదేహీం ధర్మజ్ఞా ప్రియవాదినీ, సీతేవక్ష్యామి తేకించి ద్విశ్వాసం కురు మే సఖి—అవధ్యోనామ మేధావీ వృద్ధో రాక్షసపుంగవః స రామస్య హితాన్వేషీ త్వదర్థేహి సమావదత్--భర్తా తే కుశలీ రామో లక్ష్మణానుగతో బలీ--స్వప్నాహి సమహా ఘోరా దృష్టా మే నిష్టదర్శనా..." అని అవధ్యుడను రాక్షసుడు కలగన్నట్లున్నది. ఈ అవధ్యుడు వాల్మీకిలోనూ ఉన్నాడు. కాని వాడు అవింధ్యుడు "అవింధ్యో

నామ మేధావీ విద్వాన్ రాక్షసపుంగవః ధృతిమాన్ శీలవాన్ వృద్ధో రావణస్య సుసమ్మతః" (సుం. 37, స-12 శ్లో) వాల్మీకి ఈ అవింధ్యుడు సీతకు ఏ వర్తమానమును పంపడు. రావణునకు సీతను త్యజింపుమని హితము చెప్పును. ఈ సంగతి కల యాయ విభీషణపుత్రి సీతకు చెప్పినట్లు సీత హనుమకు చెప్పును.

వ్యాసుని అవింధ్యుడు కపిల కలలో వాల్మీకియొక్క వృత్తాంతములు మార్పు చెందినవి. అట్టి మార్పులలో "రుదతీ రూపసంపన్నా దీనా క్షీణ వ్యాఘ్రేణ పరిరక్షితా" అనునది విశేషార్థసూచకము. వ్యాసునిలో యుద్ధానంతరము సీతాసమేతుడై రాము డయోధ్యకు పోవునప్పుడు ఈ త్రిజటకు, ఆ అవింధ్యునికి వరము లిచ్చెను. కానీ, ఈ రెండవసారి వాడు అవింధ్యుడనబడెను.

ఇట్లు జరిగినమార్పులలో మరింత ముఖ్యమైన మార్పు హనుమదాకాశగమనము. వాల్మీకియందున్న ఆకాశగమనవృత్తాంతము, రామోపాఖ్యానమున లేదు. కానీ, సౌగంధికాహరణ ప్రకరణమున భీమునికి హనుమచెప్పిన రామాయణ సంగ్రహమున ఆకాశగమనము కలదు. అంతేగాని, రామోపాఖ్యానమున మాత్రము సుగ్రీవుడు వానరులను సీతాన్వేషణకు పంపెను అని కలదు. ఎవరిని ఏ దిక్కుకు పంపెనో నివరింపబడలేదు. తర్వాత "ద్విమాసోపరమే కాలే వ్యతీతే ప్లవగాస్తతః సుగ్రీవ మభిగ మ్యేదం త్వరితా వాక్య మబ్రువన్" (281—26) వారు తెచ్చినవార్త మధువనధ్వంసము. అది విని రామునితో, సుగ్రీవుడు, "తేషాం తత్ప్రణయం శ్రుత్వా మేనే సకృతకృత్యతాం. కృతార్థానాం హి భృత్యానాం ఏతద్భవతిచేష్టితం" (281—27) తర్వాత హనుమదాది వానరులు రామ సుగ్రీవ లక్ష్మణులకు మ్రొక్కిరి. అప్పుడు రాముడు "అపి మాం జీవయిష్యథ్యం అపి వః కృతకృత్యతా" అని ప్రశ్నింపగా, హనుమ "ప్రియ మాఖ్యామి తే రామ! దృష్టా సా జానకీ మయా" అని

ప్రారంభించి అతిసంక్షిప్తంగా సంపాతివచనము, సముద్ర లంఘనము, ..రాక్షసీహాసనము, లంకాప్రవేశము, సీతాదర్శనము చెప్పును. "తత్ర సీతా మయా దృష్టా రావణాంతఃపురే సతీ". ఈ విధముగా వ్యాసుడు అతిస్వల్పకముగా కథ నడిపించెను—ఉపాఖ్యానము గనుక.

కానీ ఇందులో ముఖ్యముగా ఉన్న మార్పు-వాల్మీకిలోని ఆకాశ గమనవర్ణన, సీతాదర్శనమందలి వర్ణనలు ఇందు లేవు. మొదటిది కుండలినీ యోగమనియు, రెండవది కుండలినీ శక్తియొక్క స్వరూపవర్ణనమనియు నేను మునుపు వివరించితిని. గాయత్రీ మంత్రమని నేను చెప్పిన త్రిజటా స్వప్నము రూపాంతరము చెందగా పై రెండును అసలే స్ఖలితములై పోయినవి. కానీ, ముఖ్యమైనదేమిటనగా వ్యాసు డాఘట్టములను వాల్మీకియందు చూడలేదా? లేక చూచియును వేగముగా చెప్పుచుండుటచేత వదలివేసెనా? ఇదేదియు కాదు. ఎందుచేతననగా ఆ సీతాదర్శన వర్ణనలనే యథాతథముగా తన నలోపాఖ్యానమున వాడుకొనెను—కానీ, అవి లేని రామోపాఖ్యానము తంత్రులులేని వీణ అయిపోయెను. నలోపాఖ్యానము పరిశీలించినచో ఆ చిత్రము విశదమగును.

నలకథ వ్యాసునికి పూర్వమే గ్రంథములందును లేదు. హరిశ్చంద్ర ఇక్ష్వాకులవలె నలనామము వైదికగ్రంథములందు కనుపించుట లేదు. కానీ వ్యాసునికి పూర్వము నలనామము రామాయణమునందే కలదు. రావణుని వరింపుమని బలాత్కరించుచున్న రాక్షస స్త్రీలకు సీత "దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః తం నిత్యమనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా" అని కొన్ని ఉపమానములు చెప్పుచు "నైషధం దమయంతీవ భైమీ పతి మనువ్రతా" అనును. ఇంతకు దప్ప మరెచ్చటను నలప్రసక్తి లేదు. బహుశః నలచక్రవర్తికథ లోకమున ప్రసిద్ధమై యుండవచ్చును. వాల్మీకియే ఆ ఉపమానమున్ను

గైకొనుటచేత నలుడు రామునికన్న పూర్వుడు కావలెను. వ్యాసుడు "ఇతిహాస మిమం శ్రుత్వా పురాణం శశ్వదుత్తమం" అని నల కథను ఇతిహాసమనెను. గనుక నలకథ వాస్తవముగ జరిగిన దనుకొనవలెను. కానీ, రామాయణమునగల ఆ కొంచెముదప్ప పూర్వగ్రంథములందెచ్చటను లేకపోవుటచేత కథలోని విశేషములు కేవలము వ్యాసకల్పితములే అనుకొనవలెను.

పూర్వము మహాత్ముల కథలను తీసుకుని వాటిని మహనీయ శాస్త్ర రహస్య సంపద్భరితములు చేసి వాల్మీకి వ్యాసాదులు వ్రాయుచుండిరి. ఇట్టి పద్ధతి వేదములందే గలదు. కనుక నలకథను వ్యాసుడు ఆ విధముగా కల్పించెను. అందలి రహస్యములను గ్రహించిన హర్షుడు ఆ ముగ్గను పరియించి నైషధీయచరిత అను పరమార్థ పరిమళభరితమైన ఉద్గ్రంథముగా జేసెను.

ఇట్టి ఈ వ్యాసనలోపాఖ్యానమునకు సుందర కాండమునకు బింబ ప్రతిబింబ సంబంధము గలదు.

వ్యాసుడు రామోపాఖ్యానమున వదలిపెట్టిన హనుమదాకాశ గమనమును గైకొని తన నలోపాఖ్యానమున హంసయొక్క ఆకాశ గమనము కల్పించెను. సీతాదర్శన వర్ణన గైకొని చేదిపురమున దైన్య స్థితి యందున్న దమయంతి వర్ణనకు వాడుకొనెను. అసలు నలకథా కల్పనకే సుందర కాండ బీజ మనుకొనవచ్చును, రాము డొకచోట సీత మరొకచోట ఉండగా హనుమ రామునికొరకు సీతను చూచివచ్చుట; అట్లే వ్యాసనలోపాఖ్యానమున నలుడొకచోట దమయంతి మరొకచోట ఉండగా నలునికొరకు హంస దమయంతిని చూచివచ్చుట. కనుక నలోపాఖ్యానమున హనుమదాకాశ గమన మొకచోట సీతాదర్శన వర్ణన మరొకచోట వాడుకొనబడినవని గుర్తింపనగును—

హనుమదాది వానరులను సుగ్రీవుడు సీతాన్వేషణకు నాలుగు దిక్కులకు పంపెను. అట్లే నలోపాఖ్యానమున సైతము భీమరాజు తన అల్లుడు కూతురులను వెదకుటకు బ్రాహ్మణులను నాల్గు మూలలకు పంపెను. "హృతరాజ్యే నలే భీమః సభార్యే ప్రేష్యతాం గతే ద్విజాన్ ప్రస్థాపయామాస నలదర్శన కాంక్షయా" (68—7) సుదేవుడు దమయంతిని చేదిపురములో చూచెను. అక్కడ హనుమ సీతనుచూచి ఆమె రూపలక్షణములను తర్కించి చివరకు సీతయని తెల్పుకొనెను. అట్లే ఇచ్చటను--ఇక్కడ చూడుడు రామాయణమున ఏ వర్ణనలు ఏ శబ్దములు కలవో అవే ఇందును కలవు. కొన్నిటిని ఉదాహరింతును-

మంద ప్రఖ్యాయమానేన
  రూపేణాప్రతిమేణ తాం
నిబద్ధాం ధూమజాలేన
  ప్రభామివ విభావసోః (నల 68-77)

మంద ప్రఖ్యాయమానేన
  రూపేణ రుచిరప్రభాం
పినద్ధాం ధూమజాలేన
  శిఖామివ విభావసోః (సుందర 15-20)

తాం సమీక్ష్య విశాలాక్షీం
అధికం మలినాం కృశాం
తర్కయామాస భైమీతి
కారణైరుపపాదయన్ (నల 68--9)

తాం సమీక్ష్య విశాలాక్షీం
అధికం మలినాం కృశాం
తర్కయామాస సీతేతి
కారణైరుపపాదిభిః (సుందర 15-26)

యథేయం మే పురా దృష్టా
తథా రూపేయ మంగనా (నల ౬౨-10)

యథాహి రూపా దృష్టావై
తథారూపేయమంగనా (సుందర15.27)

పూర్ణచంద్రనిభాం శ్యామాం
చారు వృత్త పయోధరాం
కుర్వంతి ప్రభయా దేవి
సర్వా వితిమిరాదిశః (నల 11-12)

పూర్ణచంద్రాననాం సుభ్రూం
చారు వృత్తపయోధరాం
కుర్వంతీ ప్రభయా దేవీ
సర్వా వితిమిరా దిశః (సుందర 16-28)

చారుపద్మవిశాలాక్షీం
మన్మథస్య రతీమివ (నల 68-12)

సీతాం పద్మవిశాలాక్షీం
మన్మథస్యరతీంయథా (సుందర 15-29)

ఇట్లు సీతారూపవర్ణనకు సంబంధించిన వర్ణనలన్నియు రామాయణీయములే యథాతథముగా భారతమున ఉన్నవి. కేవలము గ్రంథ విస్తరభీతిచే విపులముగా చెప్పుటలేదు. సుందరకాండ తీసి 15, 16, 19 సర్గలు చూచినచో అందులో ఈ ధోరణి వర్ణనలు కలవు. అంతట భారత నలోపాఖ్యానమునందలి దమయంతీ దర్శన ఘట్టము చూచినచో వ్యాసుడు వాల్మీకి నెట్లు వాడుకొనెనో తెలియును. ఆమె స్థితిని గురించి వర్ణించిన శ్లోకములును వ్యాసునిలో ఇట్లే యున్నవి.

దేహం ధారయతీం దీనాం
భర్తృదర్శనకాంక్షయా (నల 68-19)

ధారయత్యాత్మనో దేహం
తత్సమాగమలాలసా (సుందర 16-34)

దుష్కరం కురుతే త్యంతం
హీనో య దనయానళః (నల 68-20)

దుష్కరం కృతవాన్ రామో
హీనో య దనయా ప్రభుః (సుందర 15-63)

సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా
మమాపి వ్యథితం మనః (సుందర 16-28)

అస్యా నూనం పున ర్లాభాత్
నైషధః ప్రీతి మేష్యతి
రాజా రాజ్యపరిభ్రష్టః
పున ర్లబ్ధ్వా చ మేదినీం (నల. 68-23)

అస్యా నూనం పున ర్లాభాత్
రాఘవః ప్రీతిమేష్యతి
రాజా రాజ్యాత్ పరిభ్రష్టః
పునః ప్రాప్యేవ మేదినీం (సుందర. 16-23)

ఒక టేమిటి? ప్రతిముక్కయును ఇట్లే యథాతథముగా భారత నలోపాఖ్యానమున దొర్లినవి. దీనిని తెలుగులో అయినచో కాపీ అం దురుగదా! కొందరు దానిని నాక్షేపించి సుఖింతురుగాన వారి కా సుఖించు అవకాశమిచ్చుట యేల? బింబప్రతిబింబము లందము—

తనకు పూర్వమున్న గ్రంథస్థ లోకస్థ వృత్తాంత బీజములను గైకొని వ్యాసుడు భారతమున కొన్ని కథలను కల్పించెను. అట్టి సందర్భములందు కథనరీతులు రామాయణము నుండియే గైకొనబడి కథలు పరిపుష్టములు చేయబడినవి. వెనుక నలోపాఖ్యానమును గురించి చర్చించినప్పుడు ఆ కథయందు వ్యాసుడు కల్పించిన స్వర్ణహంస, భీమరాజు బ్రాహ్మణులను దమయంత్యన్వేషణకు నాల్గుదిక్కులకు పంపుట, చేదిపురస్త్రీయగు దమయంతినిగూర్చి చేసిన వర్ణన ఇత్యాదులు రామాయణమునుండి నలోపాఖ్యాన కథాకల్పనార్థము ఎట్లు గైకొనబడినవో వివరించితిని. ప్రస్తుతము వ్యాసుడు వాల్మీకి కథనరీతులను గైకొనుటకు నిదర్శనముగా అట్టిదే మరొక ఉదాహరణ మిత్తును. భారతమందలి వినతాకద్రువల కథకు మూలము ఋగ్వేద మందున్నది. దానినే వ్యాసుడు వాల్మీకీయ కథనపద్ధతు లవలంబించి పరిపుష్టమగు ఒక కథగా రూపొందించెను. ఋగ్వేదమునందు కద్రువ, సుపర్ణి అను సవతులు ఇద్దరు తమలో ఎవరు ఎక్కువ సౌందర్యవతి అని వివాదపడి, ఆ వివాదమును మధ్యవర్తులు తీర్చినచో ఓడిపోయినవారు గెలిచినవారికి దాసీ కావలెనని నిర్ణయించుకొనిరి. సుపర్ణి ఓడిపోయి దాసీ ఆయెను. కాని సుపర్ణి స్వర్గమందలి సోమమును తెచ్చి యిచ్చినచో సుపర్ణిని దాస్యమునుండి వదలెదనని కద్రువ మాటయిచ్చెను. కద్రువ సంతానము సర్పములు; సుపర్ణి సంతానము ఛందస్సులు. సుపర్ణి కోరికపై జగతీ త్రిష్టుప్ ఛందస్సులు స్వర్గమునకు వెళ్ళి సోమమును కొనిరాజాలక పరాజయమును పొంది వచ్చినవి. అప్పుడు గాయత్రి వెళ్ళి జయించి సోమమును తెచ్చి మాతృదాస్యవిముక్తి కలిగించినట్లు యీకథ ఋగ్వే

పమును కలదు. ఈ కథ వ్యాసునిలో రూపాంతరము చెంది విస్తృతి నందినది.

కద్రువ, దాస్యమును నొందిన వినత (అనగా ఋగ్వేద సుపర్ణి) చేత ఊడిగము చేయించుకొనుట, గరుత్మంతుడు (ఋగ్వేద గాయత్రి) ఆకాశగమనము ననుష్ఠించి స్వర్గముచే అమృతము (ఋగ్వేదసోమము) తెచ్చుట ఇత్యాది కథావిస్తృతులు వ్యాసునిచే కల్పింపబడెను. ఊడిగము చేయించుకొనుట అను విస్తరణకుగాను కద్రువను వినత, కద్రువ సంతానమును గరుడుడు భుజములపై సాగరమందలి నాగవాసమను ఒక ద్వీపమునకు మోసుకొని పోవుట కల్పించెను. ఆ సందర్భమున వన వర్ణన, కద్రువ ఇంద్రస్తోత్రము చేయుట కలవు. అందు విస్తారముగ వాల్మీకీయశబ్ద జాలభావాదులను వ్యాసుడు వాడుకొనెను. ఇక అమృతమునకై గరుడుడుస్వర్గమునకు వెళ్ళు సందర్భమున సుందరకాండమందలి హనుమదాకాశగమన రీతిని సర్వవిధముల అనుసరించెను. ఇది చదువుచుండగా దాని స్పృహ కలుగుచుండును. ఆ వింత చూడుడు.

(ఆస్తిక పర్వము 28)

వాల్మీకి యందు మైనాక సురసా సింహిక లను మూడు ఆకాశ గమన విఘ్నములు కలవు. అట్లే వ్యాసునియందును నిషాదాలయ, గజకచ్ఛప, నిష్పురుష శైలములను మూడు గరుడగమన విఘ్నములు గలవు. తొలుత సముద్రమందలి నిషాదులను భుజించుటకు గరుడుడు నిషాదాలయమున ఆగును. అంతట మరొక భోజనమునకై గజ కచ్ఛప ములకొరకు ఒక సరస్సుదగ్గర ఆగును. అటుపిమ్మట ఆ గజకచ్ఛప ముల నారగించుటకై ఒక మర్రిచెట్టు కొమ్మపై వాలగా, అది విరుగగా, దానియందు తలక్రిందుగా వ్రేలుచు తపస్సు చేయుచున్న వాలఖిల్యాది మహర్షులకు అపాయము కలుగునని, దానిని క్రిందపడ కుండా మోసుకొనిపోయి తండ్రియగు కశ్యపునిఅభ్యర్థనపై ఆఋషులు స్థలాంతరమున కేగగా కొమ్మను ఒకానొక నిష్పురుష శైలమునకు

పోయి అచ్చట విడుచుట- ఇవి గరుడాకాశగమన ఘట్టములైన మూడు. ఈ నిష్పురుషశైల మేదోగాని "అగమ్యం మనసాప్యన్యైః" అని వర్ణింపబడినది. ఈ మూడు సంఘటనల తర్వాత గరుడుడు స్వర్గము చేరుట. అమృతరక్షకులగు దేవతలను నిర్జించి అమృతమును తెచ్చుట అవిశేషములు. సుందరకాండకు దీనికి గల మరికొన్ని పోలికలు చూడుడు- ఒకచోట రామునికై హనుమ ఆకాశమున పోయి లంక జేరి పరాక్రమము చూపి సీతను చూచివచ్చుట. మరొక చోట- తల్లికై గరుడుడు ఆకాశమునపోయి స్వర్గముచేరి విక్రమము చూపి అమృతము తెచ్చుట. సీత. అమృతము సమానము! దీని ప్రధాన లక్షణములు ఇట్లుండగా భాష వర్ణనలు ఎట్లున్నవో చూడుడు- హనుమంతుడు మహేంద్రగిరి నుంచి ఎగిరినప్పటి వర్ణన, ఇచ్చట గరుడుడు గజకచ్ఛప భోజనమునకై నిష్పురుష శైలముపై వ్రాలినప్పటి వర్ణన. రెండును ఒక్కటి గా ఉండును. చూడుడు-

"పక్షానిలహతశ్చాస్య ప్రాకంపత స శైలరాట్
ముమోచ పుష్పవర్షంచ సమాగళిత పాదపః"

(వ్యాస)

స చచాల అచలశ్చాపి ముహూర్తం కపి పీడితః
తరుణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్ప మశాతయన్".

(వాల్మీ)

"శాఖినో బహవశ్చాపి శాఖయాభిహతస్తయా
కాంచనైః కుసుమైర్భాంతి విద్యుద్వంత ఇవాంబుదాః"

(వ్యాస)

"పుష్పౌఘేనానువిద్ధేన నానావర్ణేన వానరః
బభౌ మేఘ ఇవాకాశే విద్యుద్గణ విభూషితః"

(వాల్మీ)

అట్లు గరుడుడు ఆకాశమున కెగిరెను. దానిని "వితత్య పక్షా వాకాశ ముత్పపాత మనోజవః" అని వ్యాసుడనెను. అట్లే వాల్మీకి "ఉత్పపాతాథ వేగేన వేగవా నవిచారయన్" అనెను. అయితే వ్యాసుని గరుడుడును ఒక సముదగ్ర తేజోమూర్తిగా సాక్షాత్కరించి మనలను మంత్రముగ్ధులను చేయును. చూడుడు- "దదర్శ తం పితాచాపి దివ్యరూపం విహంగమం, తేజోవీర్యబలోపేతం, మనో మారుత రంహసం, శైలశృంగప్రతీకాశం, బ్రహ్మదండమివోద్యతం, అచింత్యమనభిధ్యేయం, సర్వభూత భయంకరం, మహావీర్యధరం రౌద్రం, సాక్షా దగ్ని మివోద్యతం, అప్రధృష్య మజేయంచ దేవదానవ రాక్షసైః, భేత్తారం గిరి శృంగాణాం సముద్రజల శోషణం, లోకసంలోడనం ఘోరం, కృతాంత సమదర్శనం"— ఇదెట్లున్నది? ఎన్నిసార్లయినను పురశ్చరణ చేయవలె ననిపించు నొక సమ్మోహ మంత్రమువలె లేదా? కించిద్భేదముతో ఈ విశేషణములే సుందరకాండ మందలి హనుమకు వాడబడి యున్నవి. ఈ శ్లోకములు చూడుడు- 32 స:- 3. 4-42 స:- 4, 6, 12,- 13-46 స:- 6, 9, 11, 12, 18-47 స:- 8-47 స:- 38-54 స:- 26, 36, 37, 38, 39, 40- ఈ గరుడుడు ఋగ్వేదమందు "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథోదివ్యః స సుపర్ణో గరుత్మాన్ ఏకం సద్విప్రా బహుధా వదం త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః' అని ప్రతిపాదింపబడిన పరబ్రహ్మమే గదా? సుపర్ణుడు వేదసృష్టి; హనుమ రామాయణసృష్టి, కనుకనే రామాయణమున హనుమద్విక్రమమునకు సుపర్ణుడే ఉపమానముగ నైకొనబడెను. "నిపపాత పునర్భూమౌ సువర్ణ సమవిక్రమః" (సు. 46-29) కిష్కింధకాండలో (67 స.) హనుమయే ఇట్లు చెప్పును. "పన్నగాశన మాకాశే పతంతం పక్షిసేవితే వైనతేయ మహంశక్తః పరిగంతుం సహస్రశః" (14) "వైనతేయస్య సాశక్తి ర్మమ వా మారుతస్య వా, ఋతే సుపర్ణ రాజానం మారుతంవా మహోజవం: నతద్భూతం ప్రపశ్యామియన్మాం ప్లుతమనువ్రజేత్" (23, 24) అనగా రామాయణ

కాలమునకే ఋగ్వేద సుపర్ణి వినతయైనది. గాయత్రి సుపర్ణుడగు రుద్రాతుడు అయెను.)

ఇక రామాయణమందలి స్తోత్రములనే వ్యాసు డెట్లు వాడుకొనెనో చూపింతును- యుద్ధకాండమున 120 సర్గలో ఉన్న బ్రహ్మకృత రామస్తోత్రము చూడుడు; అంతట ఆస్తీకపర్వమందలి 25 అధ్యాయమున గరుడునిచే సూర్యమండల సమీపమునకు గొనిపోబడి మూర్ఛిల్లిన తన సర్పసంతానమును రక్షింపుమని కద్రువ చేసిన ఇంద్ర స్తోత్రము చూడుడు. రెండును సమాన రూపములు గలిగియున్నట్లు విశదమగును- గ్రంథ విస్తృతి నివారించుటకు ముఖ్యభాగములే చూపింతును. రామాయణము: 'త్వం త్రయాణాం హి లోకానాం ఆదికర్తా స్వయం ప్రభుః...... త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వం ఓంకారః పరంతపః......నిమేషస్తే భవేద్రాత్రి రున్మేషస్తే భవేద్దివా......"
ఇక కద్రూకృత ఇంద్రస్తోత్రము- "స్రష్టా త్వమేవ లోకానాం సంహర్తా చాపరాజితః — త్వం జ్యోతిస్సర్వభూతానాం త్వమాదిత్యో విభావసుః- త్వం విష్ణుస్త్వం దేవస్త్వం పరాయణం త్వం సర్వమమృతం దేవస్త్వం సోమః పరిమార్చితః త్వం ముహూర్తస్త్వం తిథిస్త్వం చ లయస్త్వంచ పునః క్షణః...... అభిష్టుతః పిబసి చ సోమమధ్వరే వషట్కృతా న్యపిచ హవీంషి భూతయే......" ఇట్లున్నది.

మరొక స్తోత్రము చూడుడు- భారత వనపర్వమందు ధర్మరాజ కృత సూర్యస్తోత్రము (3 అధ్యాయము) రామాయణ యుద్ధకాండ యందలి ఆదిత్య హృదయమును పోలియుండును. చూడుడు—

"ఇంద్రో వివస్వాన్ దీప్తాంశుః శుచిశ్శౌరిశ్శనైశ్చరః
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ స్కందో వై వరుణో యమః
(వ్యాస)

"ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలో యమస్సోమో హ్యపాంపతిః

(వాల్మీ)

"ప్రతిష్ఠితింపిత్వయి సర్వాణి త్వం సర్వజ్యోతిషాంపతిః"

(వ్యాస)

జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయేనమః" (వా_ల్మీ)

తపంత్యన్యే దహంత్యన్యే గర్జంత్యన్యే తథా ఘనాః
విద్యోతంతే ప్రవర్షంతి తవప్రావృషి రశ్మయః"

(వ్యాస)

"నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః" (వా_ల్మీ)

వాల్మీకీయ స్తోత్రములు శ్రుతులందలి భావతో కూర్పబడినవి తైత్తిరీయ నారాయణ ప్రశ్నమందలి మంత్రములనే రామస్తోత్రమున నిక్షేపించెను.

ఉదా: సహస్రచరణః శ్రీమాన్ శతశీర్ష స్సహస్రదృక్

(వా_ల్మీ)

సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం

(తై_త్తిరీయ)

దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషుచ గోషుచ
దిక్షు సర్వాసు గగనే పర్వతేషు వనేషుచ (వాల్మీ)

హంసః శుచిష ద్వసురంతరిక్ష సద్ధోతా వేదిష
దతిథిర్దురోణసత్ నృషద్వర సద్వ్యోమ సదబ్జా
గోజాఋతజా అద్రిజాఋతం బృహత్ (తై_త్తిరి)

త్వంయజ్ఞ_స్త్వం వషట్కార_స్త్వం ఓంకారః
పరంతపః (వాల్మీ)

త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వం
ఇంద్రస్త్వం రుద్రస్త్వం
విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః (తైత్తిరీ)

కనుక వ్యాసస్తోత్రములును అట్లే శ్రుతిజనితములే. ఈ ఉభయుల సూర్యస్తోత్రములను ఋగ్వేద జనితములే— ఇట్లు వ్యాసుడు వాల్మీకి నుంచి శబ్దములు, శబ్దబంధములు, భావములు, ఉపమానములు, శ్లోక నిర్మాణములు, కథనరీతులు అతివిస్తారముగ తీసుకొని భారతమంతట వెదజల్లెను. శ్లోకములు శ్లోకములే కొన్ని వందలు వందలు తీసుకొనినట్లు చూపుటకు నేను ఉదహరించితిని గదా. వాల్మీకిని కాళిదాసు అనుకరించెనుట ప్రసిద్ధమేగాని వ్యాసునికి వాల్మీకితోగల ఈ విచిత్ర సంబంధము అప్రసిద్ధము. కనుక వాల్మీకి ననుసరించిన వారిలో వ్యాసుడు అందరికంటె అగ్రగణ్యుడనుట ముఖ్యముగ గుర్తించ వలసినది. తుదకు. మహదుత్పన్న మాఖ్యానం రామాయణ మితి శ్రుతం ... ధర్మకామార్థ సహితం శ్రోతవ్యమనసూయయా" అని (బాలకాండ 5 స.) వాల్మీకి అనగా వ్యాసుడును "ఇదమంశావతరణం శ్రోతవ్యమనసూయయా" అని అంశావతరణ పర్వాంతమున చెప్పెను. ఇదంతయు చూడగా, భారత కాలమునాటికి రామాయణము ఏకైక పారాయణ గ్రంథమై యుండెననియు, విశేషించి భారతకర్త సుందర కాండ పారాయణము జీవితాంతము అవిచ్ఛిన్నముగ చేసిన వాడనియు ఊహింప వలసి వచ్చుచున్నది. భారతమందలి వనగిరి నిర్ఘరాది వర్ణన లన్నియు సుందరకాండమందలి వానినే పోలియుండుట చేతనే ఇట్టి యూహ.

# రామాయణమున విష్ణుపారమ్యము కల దనుటకంటె ఇంద్రపారమ్యమే కలదనుట సమంజసము

శ్రీమద్రామాయణము విష్ణుపారమ్యమును ప్రతిపాదించుగ్రంథ మని ప్రతీతి. కాని జాగ్రత్తగా పరిశీలించినచో విషయము ఆశ్చర్యకర ముగా ఉండును.

బాలకాండమున ప్రక్షిప్తములని ప్రసిద్ధిపొందిన కొన్ని ఘట్టము లను, అట్టి పేరే పొందిన యుద్ధకాండమందలి బ్రహ్మకృత రామ స్తోత్రమును వదలినచో రామాయణమున విష్ణుపారమ్యమును ప్రతి పాదించు మాట లెచ్చటను రావు. ఇంద్రాది దేవతలకు విష్ణువు రామావతార మెత్తెదనని చెప్పుట, వామనావతారము, క్షీరసాగర మథనము, భార్గవగర్వభంగము, బ్రహ్మకృతరామస్తోత్రము ఇత్యా దులు ప్రక్షిప్తములుగా పేర్కొనబడినవి. ఈ ఘట్టములు గాక గ్రంథ మున విష్ణుప్రసక్తి వచ్చినప్పు డంతయు అది పరాక్రమునకు ఉదాహరణ గానే చెప్పబడినది. కాని పరాక్రమమునకును, విష్ణువును ఉపమాన ముగా చెప్పుటకంటె ఇంద్రుని చెప్పుటయే అధికముగా ఉన్నది. రాక్షసుల పరాక్రమమును వర్ణించుటకు కూడా ఇంద్రునే ఉపమాన ముగా చెప్పుట గుర్తింపవలసిన విషయము—"మారీచో రాక్షసః పుత్రో యస్యాశ్శక్రపరాక్రమః" (24 స. 26శ్లో బాల. కాం) కిష్కింధకాండలో వాలి "మహేంద్ర మివ దుర్ధర్షం మహేంద్ర మివ దుస్సహం (17స-శ్లో) అని వర్ణింపబడెను. రామబాణనిహతుడై పడిన వాలి "శక్రతుల్యపరాక్రాంతం వృష్ట్వేవోపరతం ఘనం" (19స-28శ్లో)

అని వర్ణింపబడెను. సుందరకాండమున దశరథుడు" "చక్రవర్తికులే జాతః పురందరసమో బలే" (21స-8శ్లో) అని వర్ణింపబడెను. అందే రాముడు "మహాబలం వాసవతుల్యవిక్రమం (31స-37శ్లో) అని వర్ణింపబడెను; అందే రాముడు మరొకచోట "రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేంద్రసమవిక్రమః" (53స-17శ్లో) అని వర్ణింపబడెను. ఇట్టి వెన్ని ఉదాహరణలైనను చూపవచ్చును. దీనికి కారణము వేదప్రకారము ఇంద్రుడే బలాధిపతి. రామాయణము సాక్షాత్తు వేదమునకు రూపాంతరమే కనుక ఇందును ఇంద్రుడే పరాక్రమమునకు ఉపమానమాయెను. ఒక్క పరాక్రమమునకేగాదు, అన్ని ఉత్కృష్టలక్షణములకు ఇంద్రుడు ఉపమింప హేతువైనవా డని ఋగ్వేదము చెప్పుచున్నది.-" అస్మా ఇదుప్రయ ఇవ ప్రయంసి భరామ్యాంగూషం బాధే సువృక్తి ఇంద్రాయ హృదా మనసా మనీషా ప్రత్నాయ పత్యే ధియో మర్జయంత" అస్మా ఇదు త్యముపమం స్వర్షాం భరామ్యాంగూష మాస్యేన మంహిష్ఠ మచ్ఛోక్తిభి ర్మతీనాం సువృక్తిభిః సూరిం వావృధధ్యై" (మండ.1.అను వా. 11 సూక్త. 61 మంత్ర 695) ప్రసిద్ధుడును ఉపమింప హేతువైనవాడును...అగు ఇంద్రునికొరకై ...మంచి యర్థము గల్గి స్వచ్ఛమైన మాటలతో గొప్పదగు ధ్వనిని నోటితో చేయుచున్నాను).

వేదమున ఇంద్రుడే బలాధిపతి, శత్రుహంత. ఉదా-"యుధా యుధముప ఘేదేషి ధృష్ణుయా పురాపురం సమిదం హంస్యోజసా నమ్యా యదింద్ర సఖ్యా పరావతి నిబర్హయో నముచింనామ మాయినం" (మం 1 అను 10. సూ 53 మంత్ర 636) (ఓ ఇంద్రా శత్రువులను జయించు నీవు యుద్ధము తరువాత యుద్ధమును జేయుచుంటివి. ఈ శత్రువుల పురములను బలముచేత బాగుగా నశింపజేసితివి...) త వాహం శూర రాతిభిః ప్రత్యాయం...", ఇంద్ర మీశాన మోజసా ..." (మం.1. అను 4. సూ 12 మంత్ర 109,110) అను ఋక్కులందు ఇంద్రుడు శూరుడనియు బలముచే ఈశుడనియు చెప్పబడినది. ఋగ్వేదమందలి 1 మం.7 అను. 32,33 సూక్తములందలి ఋక్కులు

వృత్రహంతగాను శత్రుపుర భేదనుడుగాను ఇంద్రుని పరాక్రమమును వర్ణించును. మరొకచోట "అత్రాహతే మఘవన్ విశ్రుతం సహో ద్యామనుశవసాబర్హణాభువత్" (1మం.10 అను 53సూ. 625మంత్ర) 'ఇక్కడనే నీ బలమును, ఆబలముచే గలిగిన వృత్రాదివధయును ప్రఖ్యాతి నందినవి.) అని కలదు. మరొకటి-" తమస్య పారే రజసో వ్యోమనః స్వభూత్యోజా అవసే ధృషన్మనః చకృషే భూమిం ప్రతిమాన మోజ సోపః స్వః పరిభూరే ష్యాదివం" (1మం. 10 అను. 53 సూ. 626 ము) (శత్రువులను తిరస్కరించు మనసు గల ఇంద్రా ఈ కనబడు అంతరిక్ష లోకమున కవతల ఉన్న వాడవై బలమే ధనముగా గల నీవు మమ్ము రక్షించుటకు భూలోకమును చేసితివి. బలవంతుల బలమునకు సాటి చెప్పబడిన బలముగలవాడ వయితివి. శుభముగా నడువదగిన అంత రిక్ష లోకమును స్వాధీనపరచుకొంటివి.) ఈ ఋక్కుకూడా బలమున కింద్రు డుపమాన మని చెప్పుట గుర్తింపనగును. ఋగ్వేదమున 1మండ లము 10 అనువాకము 55సూక్తము ఇంద్రవిక్రమమును వర్ణించును. అందులో 653 మంత్రము" "ఇంద్రః...సనాత్సయుధ్మ ఓజసాపనస్యతే" (యోధుడయిన ఇంద్రుడు చిరకాలమునుండి బలమునకు పేరుబడెను) ఆ అనువాకమందలి 56 సూక్తము కూడా ఇంద్రవిక్రమము వర్ణించును పతుర్వణి ర్మహో అరేణుపౌంస్యేగిరే ర్భృష్టి ర్నభ్రాజతే తుజాశవః యేన శుష్ణంమాయినమాయసోమదేదుర్ధ ఆభూషురామయన్ని దామని" (11అను 662 ఋక్కు) (ఆ ఇంద్రుడు శత్రువులను హింసించువాడయి వృద్ధినొందుచున్నాడు. ఇనుపకవచమును తొడిగినవాడును దుష్ట శాత్ర వులను దూలించు వాడును అగుచు, మద మెక్కి యేబలముచేత, సర్వ మును శోషింపజేయు మాయావి యగు అసురుని సంకెళ్ళలో పడ వేసెనో ఆ ఇంద్రుని బలము యుద్ధమందు దోషము లేనిదియు శత్రువుల హింసించునదియు నై పర్వతశిఖరమువలె ప్రకాశించుచున్నది.) అని వర్ణించుచున్నది. "ప్రమం హిష్ఠాయ బృహతే బృహద్రయే సత్య

శుషాౄయ తవసేమతింభరే అపామివ ప్రవణే యస్య దుర్ధరం రాధో విశ్వాయుఃశవసే అపావృతం" అను 668 ఋక్కు (ఉత్తమదానగుణములచే గొప్పవాడును మహాధనవంతుడును సత్యమగు బలము ... వాడును గొప్ప ఆకారము కలవాడును అగు ఎవని బలమును పల్లపునేలకు బోవు జలము నాపలేనట్లు ఆపలేరో మరియు నే ఇంద్రునిచేత సర్వత్ర నిండిన ధనబలము కొరకు తెరువబడెనో ఆ ఇంద్రునికై యుత్తమస్తుతిని సంపాదించితిని.) అని వర్ణించును. 12అను 80 సూ 855 మంత్రము," ...మహత్త ఇంద్రవీర్యం బాహోర్వ స్తే బలం హిత మర్చన్ను స్వరాజ్యం" (నీవీర్యము గొప్పది ఇంద్రా 1 నీ బాహులందు బల ముంచబడినది) అనుచున్నది. అచ్చటనే 857 ఋక్కు "మహత్తదస్య పౌంస్యంవృత్రం జఘన్వా అసృజ దర్చన్ను స్వరాజ్యం" (ఆ ఇంద్రుని బలము గొప్పది, కనుక నే వృత్రుని గొట్టెను. ఉదకముల నగార్చెను... అనుచున్నది. 1 మండ 15అను. 102 సూక్తములోని "గోజితాబాహూ అమితక్రతుః సిమః కర్మ న్కర్మఞ్ఛతమూతిఃఖజంకరః। అకల్ప ఇంద్రః ప్రతిమాన మోజసా థాజనావిహ్వాయన్తే సిషాసవః" అనుమంత్రము ఇంద్రా నీ చేతులు గోవులను జయించినవి; నీవు విశేషజ్ఞానము కల వాడవు; శత్రుహంతవు; ప్రతికర్మయందును అనేకరక్షణలు కలిగి యున్నావు. యుద్ధము చేయువాడవు; సాటిలేనివాడవు; బలముచేత సర్వప్రాణులకు ఉపమానభూతుడవు ..." అని చెప్పును. 1. మండ 19 అను 132 సూక్తమందలి 1438 ఋక్కు"... శాసన్తమింద్రమర్త్య మయజ్యుం శవసస్పతే..." అనుచోట ఇంద్రుని బలాధిపతిగా చెప్పు చున్నది. యజుస్సామ వేదములందును ఇట్టివర్ణనలు కలవు.

కనుకనే వేదపుత్రికయగు రామాయణము ఇంద్రునే బలమునకు ఉపమానముగా చెప్పును. మరొకవిశేషము - విష్ణువును పరాక్రమము నకు ఉపమానముగా చెప్పినచోట్ల, అది రామునకేగాక హనుమదాదు

లకు గూడా చెప్పబడినది. విష్ణువు రాముడుగా అవతరింపబోవుచుండగా ఆయనకు సహాయులుగా వానరులను ఘట్టింపుడని బ్రహ్మ, దేవతలకు చెప్పెను. ఆ ఘట్టింపబడవలసిన వానరుల లక్షణములు చెప్పుచు బ్రహ్మ "నయజ్ఞాన్ బుద్ధిసంపన్నాన్ విష్ణుతుల్యపరాక్రమాన్... సృజధ్వం హరిరూపేణ" అని దేవతలకు చెప్పెను (బాల.17స-8శ్లో) కిష్కింధ కాండలో హనుమంతుడు విక్రమమున విష్ణువుతోను విష్ణ్వవతారమైన త్రివిక్రమునితోను పోల్చబడెను. "విక్రమస్వ మహావేగో విష్ణుస్త్రీన్విక్రమానివ" (66స-37 శ్లో) ప్రహృష్టా విస్మితాశ్చాపి వీక్షంతేస్మ సమంతతః త్రివిక్రమ కృతోత్సాహం నారాయణ మివ ప్రజాః" (కిష్కిం 67స-3శ్లో). "భవిష్యతిహి మే రూపం ప్లవమానస్య సాగరే విష్ణోః ప్రక్రమమాణస్య పురా త్రీన్ విక్రమానివ"-(కిష్కిం.67స-26శ్లో) అట్లే సుందరకాండలో హనుమంతుని వర్ణించుట-" త్రీన్ క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః" (1స-207శ్లో).

ఈ ఉపమానము రామునకు చెప్పబడిన కొన్ని ఉదాహరణలు చూపింతును. సీత రావణుని బెదరించుచు రాముని త్రివిక్రమునితో పోల్చుట, "అపనేష్యతి మాం భర్తా త్వత్తః శీఘ్ర మరిందమః అసురేభ్యః శ్రియం దీప్తాం విష్ణు స్త్రిభిరివ క్రమైః" (సుం.21స-28శ్లో) "ఏవం స్వప్నే మయా దృష్టో రామో విష్ణు పరాక్రమః" (సుం.27స-21శ్లో) అని త్రిజట రాక్షస స్త్రీలకు చెప్పెను. సీతకు శ్రవణపేయముగా రాముని గురించి వర్ణించుచు హనుమ ఇట్లనును, "విక్రమేణోపపన్నశ్చ యథా విష్ణు ర్మహాయశాః (సుం 34 స-29శ్లో) హనుమ రావణునికి చెప్పుట, "సర్వభూతేషు సర్వత్ర సర్వకాలేషు నాస్తి సః యో రామం ప్రతియుధ్యేత విష్ణుతుల్యపరాక్రమం" (సుం 51స-42శ్లో)

కాని ఇచ్చట ముఖ్యముగా గుర్తింపవలసినది, విష్ణుతుల్య పరాక్రమః అను ఉపమానము రామునకేగాక హనుమదాది వానరులకు

గూడ ప్రయోగింపబడినది. కనుక రాముడు విష్ణ్వవతారమని సూచించుటకుగాను ఈ ఉపమానము వాడబడినదనుటకు వీలుగాదు. అది ఒక సామాన్య వాచకము మాత్రమే అని విశదము.

ప్రధాన గ్రంథమున ఉపమానముగా నైనను విష్ణుప్రసక్తి వచ్చుట చాలా సకృత్తు. కాని గ్రంథమందు సర్వత్ర ఇంద్ర ప్రసక్తి అత్యంత బహుళముగా కలదు. ఇంద్రప్రసక్తి నూరుసార్లు రాగా విష్ణు ప్రసక్తి అయిదుసార్లే వచ్చును. ఇంత తారతమ్యము గలదు.

రామాయణమున అందరు అతిముఖ్యముగా గ్రహింపవలసిన కొన్ని విషయములు ఇచ్చట చూపింతును :—

రామాయణమున విష్ణువు ఇంద్రునకు లొంగిన దైవతము:— శివధనుర్భంగ, సీతావివాహ నిశ్చయము లెరిగించి తమ్ముడగు కుశ ధ్వజుని తీసుకొనిరండని జనకుడు దూతలను పంపెను. వారు జనకుని యాజ్ఞ గైకొని కుశధ్వజుని తీసుకొని వచ్చుటకు పోయిరి, ఎట్లు? ఇంద్రుని యాజ్ఞపై విష్ణువును తెచ్చుటకు పోవు వారివలె పోయిరట! "శాసనాత్తు నరేంద్రస్య ప్రయయు శ్శీఘ్రవాజిభిః సమానేతుం నర వ్యాఘ్రం విష్ణు మింద్రాజ్ఞయా యథా" (బాల. 70స-5శ్లో) అనగా జనకుడు ఇంద్రునకు కుశధ్వజుడు విష్ణువునకు పోల్చబడిరి. ఇదేగదా ఇచ్చట ఉపమానోపమేయ సంబంధము? యుద్ధకాండలో మరొకటి- వానర వాహినిని పారద్రోలి రావణుడు యుద్ధరంగమున రాముని ఎదుర్కొనెను. అప్పుడు రాము డెట్లు కనుపించెను? "స దదర్శ తతో రామం తిష్ఠంత మపరాజితం లక్ష్మణేన సహ భ్రాత్రా విష్ణునా వాసవం యథా" (100స-11 శ్లో) విష్ణుసహితుడైయున్న ఇంద్రునివలె సోదరు డైన లక్ష్మణునితో కూడియున్న రాముని రావణుడు చూచెను. అనగా ఇంద్రునివలె ఉన్నవాడు రాముడు విష్ణువువలె ఉన్నవాడు లక్ష్మ

ణుడు. ఇదియా ఇచ్చటి ఉపమానోపమేయముల పద్ధతి ? దీనిచేత ఇంద్రుడధికుడా లేక విష్ణువా?

రామాయణమునాటికి వేదము త్రయీరూపమున ఉండెను. అథర్వణ వేదమున కప్పుడు ప్రత్యేక వేదస్థానము లేదు. అథర్వ శిరో మంత్రము లని ఆ మంత్ర సముదాయమును పేర్కొనుచుండిరి. ఋశ్య శృంగుడు దశరథునిచే అశ్వమేధమును అథర్వ శిరస్సునందు చెప్పబడిన మంత్రములచేత చేయించెనట. "అథర్వ శిరసి ప్రోక్తైర్మంత్రైస్సిద్ధాం విధానతః" (బాల. 15స-2శ్లో) భాగవతమున అథర్వ శిరస్ అను శబ్దము వాడబడినను అథర్వణవేద మను మాటయే బహుళముగా వాడబడినది. వేదవిభజన వ్యాసునిచే భారతకాలమున చేయబడినది. అంత ప్రాచీన మైన రామాయణమున ఋగ్యజుస్సామ వేదములందలి పద్ధతియే సర్వత్ర పాటింపబడినది. ఆ మూడింటిని సమష్టిగా చూచినచో ఇంద్రపారమ్యమే బహుళముగా ప్రతిపాదింపబడినట్లు విశదమగును. ఋగ్వేదమున అతి క్వాచిత్కముగను యజుర్వేదమున అధికముగను విష్ణుప్రాధాన్యము చెప్పబడినది అట్టి సమ్మిశ్రణమే ఆ నిష్పత్తిలోనే రామాయణమున కనుపించును.

వేదములందలి విష్ణువునకును పురాణములందలి విష్ణువునకును చాల భేదము కలదు. పౌరాణిక విష్ణువునకున్న లక్ష్మీ చక్రాది లాంఛనములు, త్రివిక్రమ నృసింహాద్యవతారములు, రాక్షస విరోధము వైదిక విష్ణువునకు లేవు. అవి వైదిక ఇంద్రునుంచి పౌరాణిక విష్ణువునకు సంక్రమించినవే. ఈ విచిత్రోదంతమును తర్వాత సోపపత్తికముగ వివరింతుము. కాని ప్రస్తుతము పైన చెప్పిన పౌరాణిక విష్ణు లక్షణములు రామాయణమందలి ఇంద్రునకు వాల్మీకిచే చెప్పబడినవి. కారణము, అది వేదపద్ధతి అగుటచేతను, రామాయణము వేదమునుబట్టి రూపొందిన దగుటచేతను.

రామాయణమందలి ఇంద్రుడు ఎట్లు విష్ణు లక్షణములు గల వాడుగా ప్రతిపాదింపబడెను ?—రామాయణమున లక్ష్మి ఇంద్రునిదే గాని విష్ణువుదిగా ఎచ్చటను చెప్పబడలేదు. (ప్రక్షిప్తభాగము వదలి) రాముడు సీతను పెండ్లాడి లక్ష్మితోకూడిన ఇంద్రునివలె ప్రకాశించెను అని వర్ణింపబడినవి. "అతీవ రామ శ్శుశుభేతి కామయా, విభుశ్శ్రియా విష్ణురివామరేశ్వరః" (బాల. 77 స-29 శ్లో) ఇచ్చట విభుః, విష్ణుః అను రెండు శబ్దములును అమరేశ్వరః అను విశేష్యమునకు చెప్పబడిన విశేషణములు. అమరేశ్వరః అనగా ఇంద్రుడు; విష్ణుః వ్యాపనశీలి.

ఒక పండితమిత్రుడు ఈ అభిప్రాయముతో ఏకీభవింపక, విష్ణుః విశేష్యము, విభుః అమరేశ్వరః విశేషణములు అని చెప్పెను. దానికి ఆయన కారణము సంస్కృత వాక్య నిర్మాణపద్ధతియందు సాధారణ ముగ ఉపమానవాచకమగు "ఇవ" ఎప్పుడును ఉపమానమునకే సంధింప బడి యుండును. ఇచ్చట "ఇవ" విష్ణు శబ్దమునకు కలుపబడినది కనుక విష్ణుశబ్దమే ఉపమానముగాని అమరేశ్వరః కాదు అని ఆయన వాదము. మనవాక్యమున ఉపమానమునకు రెండు విశేషణము లున్నవి. కనుక "ఇవ" కలసినది ఉపమానము. విశేష్యము. (ఆ మిత్రుని ప్రకారము) అట్లు ఉపమానము విశేష్యముకాగా మిగిలినవి ఆ విశేష్యమునకు విశేషణములగును. కనుక ఉపమానమునకే ఇవ సంధింపబడి యుండు ననగా, దానికి విశేషణములున్నచో, వానికిగాక, విశేష్యమునకే సంధి యుండునని తాత్పర్యము.

కాని వాక్యనిర్మాణమునందిట్టి పద్ధతి పాటింపబడు ననుకొనుట వాస్తవము కాదని నే నిచ్చు ఉదాహరణలు పరిశీలించినచో విశద మగును. అవియును రామాయణమునందలివే—

"విడిపిత్వా శయనే శుభ్రే పంచశీర్షా వివోరగా" (సుం. 10స-18 శ్లో) "రావణస్య నివేశనే, నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా

(సుం. 19స-15శ్లో) "విపద్మా మివ పద్మినీం" (సుం. 15స-21శ్లో)" "పీడితా మివ రోహిణీం" (సుం 15స-22శ్లో(" నియతామివ తాపసీం (సుం 15స-24శ్లో) అట్లనే "బుద్ధిం నిపతితామివ" "ఆశాం ప్రతిహతామివ"; "విద్యాం ప్రశిథిలా మివ" ఇత్యాదు లున్నవి-లోకకాంతా మివ శ్రియం (సుం. 16స-6శ్లో) "సహచర రహితేవ చక్రవాకీ" (సుం. 16స-30శ్లో) "తారాం నిపతితా మివ" (సుం. 17స-19శ్లో) "సమతు మివ కందర్పం" (సుం. 18స-23శ్లో) "జ్యాముక్తఇవ నారాచః" (సుం 57స-13శ్లో) ఇట్టివి పెల్లలుగా కలవు. కనుక ఉపమానవాచకము ఇవ విశేష్యమునకే (ఉపమానము) సంధింపబడవలెనను నియమము లేదని విశదమేగదా. అట్లయినచో మన శ్లోకమున విష్ణుః అను శబ్దమే "ఇవ" కలదు కనుక ఉపమానమని నిర్ణయించుటకు వీలుగాదు. గ్రంథమున ఇంద్రాధిక్యము చెప్పు ఇతర కారణములచేతను ఇంద్ర పారమ్యమే గ్రంథమంతటను వ్యాపించియుండుటచేతను ఈ శ్లోకమున అమరేశ్వరః ఉపమానమును విభుః విష్ణుః విశేషణములుగను గ్రహించుటయే సమంజసము

దీనికి కారణము వేదమున ఇంద్రుడే ధనవంతుడు, ధన మిచ్చువాడు వైదిక ఇంద్రుని లక్షణములను కొన్నింటిని తీసుకొని పురాణము లు లేక తత్పూర్వతంత్రములు కుబేరాది ప్రత్యేకదేవతలను సృష్టించినవి. వేదమున సర్వత్ర ఇంద్రుని ఐశ్వర్యము దాతృత్వము చెప్పబడియున్నది. ఈ లక్షణమే తర్వాత విష్ణువుయొక్క లక్ష్మీవిభుత్వము కుబేరధనకర్తృత్వముగా రూపొందిన దనుకొనుటకు అవకాశ మిచ్చుచున్నది. చూడుడు ఋగ్వేదమున:—

"ఇంద్రో అస్మభ్యం శిక్షతు విభజాభూరి తే వసు తవ రాధసః" (1మండ 81 సూక్త 869 మంత్ర)

"మఘేన దేహి నో దక్షిణ్యాధా వామ్యజు క్రతుః సంగృభాయ పురూ శతో క్షయ హస్త్యా వసు శిశీహి రాయ ఆభర" (570 మంత్ర)

"శూరవయస్త్వసు తేసచా శవసే శూర రాధ శేవిద్మాహి త్వాపురూవసు ముప కామాన్ ససృజ్మహే థానో వితాభవ" (571 మం)

"ఏతేత ఇంద్ర జంతవో విశ్వం పుష్యంతి వార్యం అంతర్హిఖ్యో జనానా మర్యోవేదో అదాశుషాం తేషాం నో వేద ఆభర" (572 మం)

వివితాత్పర్యము:— ఇంద్రా నీకు విస్తారముగ ధన మున్నది. నీ ధనము నందలి భాగమును నే ననుభవింతును. సోమపానమద మెక్కినవు డంతయు ఇంద్రుడు మాకు ఆవుల నిచ్చువాడగును. ఇంద్రా నీవిస్తారమైన ధనమును రెండు చేతులతోను మా కిచ్చుటకుగాను ధరింపుము. ధనముల నిమ్ము. ధనముకొరకు బలముకొరకు శూరుడా తృప్తిగా సోమము ద్రావుము. నీ వెక్కువ ధనము గలవాడనని మే మెరుగుదుము...—ఇట్టిమంత్రము లనేకములు ఋగ్వేదమున కలవు.

అనగా ధనములు కలవాడు ధనము నిచ్చువాడు తొలుత ఇంద్రుడే. ఋగ్వేదకాలమందలి ఇంద్రుని ఈ ప్రత్యేకలక్షణమే పురాణ కాలమున లక్ష్మియను ప్రత్యేక దేవతగా రూపొందినది. పౌరాణికలక్ష్మి ఋగ్వేదమునగాని యజుర్వేదమునగాని లేదు. వేదమందు లక్ష్మీశబ్దము సంపదను చెప్పుటకు ప్రయోగింపబడినది." భవతి సాహస్రీ వా ఏషా లక్ష్మియన్నతో లక్ష్మియైవ పశూ నవరుంధే యదా సహస్రం పశూన్ ప్రాప్నుయాత్" (యజు. అను 5 పంచా 1 370 మంత్ర) (ఉన్నత మగు పశువు ఉన్నత మనుట ఏది కలదో ఇది మిగిలిన సహస్రమునకు సంప్రదూపము. ఇట్టివాడు సమృద్ధిరూపమగు లక్ష్మితో కూడుకొనినవాడై పశువులను పొందుచున్నాడు) కనుక ఇచ్చట లక్ష్మి అనగా సంపద. ఇదేగాక శోభ అను అర్థమునకూడా ఈ శబ్దము నేటికిని వాడ

బడుచున్నది. ఇట్టి పైమంత్రమునకు ముందున్న మంత్రమున "ఎవడు పశువులను కోరునో వాడు ఇంద్రదేవతాకమగు ఈ ఉన్నతపశువును ఆలంభన చేయవలెను" అని చెప్పబడినది కనుక ఇంద్రునకు లక్ష్మి శబ్దమునకు గల సంబంధముకూడా కనుపించుచున్నది.

శ్రీసూక్తాదు లెంత ప్రాచీనములైనను ఋగ్వేదముయొక్క మూలగ్రంథ మనుకొనతగిన భాగమునకు అర్వాచీనమే. అందును ప్రాచీనము లనదగిన మొదటి పంచదశఋక్కులును లక్ష్మిని పౌరాణిక లక్ష్మిగా చెప్పలేదు. చివర వచ్చు ధ్యానశ్లోకములందు మాత్రమే లక్ష్మి విష్ణుభార్యగా చెప్పబడినది. కానీ పూర్వభాగము వైదికభాష, శ్లోకములభాషఅత్యర్వాచీనభాష అని విశదమేగనుక లక్ష్మి విష్ణు పత్నిగా చెప్పు అంత్యశ్లోకములు ప్రక్షిప్తము లనుకొనవలెను. అయితే ఆ ధ్యానశ్లోకములందును లక్ష్మి విష్ణుపత్నిగానే కాక "శివే సర్వార్థ సాధకే శరణ్యే త్ర్యంబకే దేవి" అని యుండుటచేత ఈలక్ష్మి కేవలపౌరాణికలక్ష్మిగాక ఇటు పురాణములకు అటు వేదమునకు మధ్యస్థములైన తంత్రములు చేసిన సృష్టి యనుకొనవలసివచ్చుచున్నది. ధ్యానశ్లోక పూర్వఋక్కులు అప్పుడప్పుడే వేదమందలి సంపద్రూపభావమునకు లక్ష్మీః అను శబ్దము ప్రయోగించువాడుక, క్రమముగా ఒక ప్రత్యేక స్త్రీదైవత్యముగా రూపొందుచున్నదశను, సూచించును. అట్టి లక్ష్మీదేవి విష్ణుపత్నిగా చెప్పబడు అనంతరకాలమును ధ్యానశ్లోకములు సూచించును. బహుశః శ్రీసూక్తమే పౌరాణిక లక్ష్మీరూపావతరణకు హేతువు కావచ్చును- లక్ష్మి ఎట్లు వేదమున సంపదకు పర్యాయపదమో అట్లే శచీశబ్దము కూడా వేదమున ఒక భావమును ప్రతిపాదించు శబ్దమే గాని ఒక నామధేయము కాదు "శచీభి ర్నః శచీవసూదివానక్తందశస్యతం" (మండ1, అను 20.సూ 139 మంత్ర 488 కర్మలే ధనముగా గల అశ్వినులారా మీరు కర్మలచేత రాత్రింబవళ్ళు కోరిన ఫలము లిందు- (శచి = కర్మ) ఈశచియే క్రమముగా ఇంద్రునిభార్య యైనది.

కనుక ఇంద్రుడు ధనాధిపతి. ఈఇంద్రుని ధనాధిపత్యమే పర్వాత పౌరాణికవిష్ణువుయొక్క లక్ష్మీపతిత్వముగా మారినది. రామాయణ మతిప్రాచీనమగుటచేత, ఋగ్వేదమున కతిసన్నిహిత మగుటచేత, ఆగ్రంథమున ఎచ్చటను లక్ష్మి విష్ణుపత్నిగా చెప్పబడలేదు. (యజుర్వేద విష్ణువునకుకూడా (వైదిక విష్ణువునకు.) లక్ష్మీపతిత్వము లేదు రామా యణమునందును లక్ష్మీః అనగా శ్రీ అనగా సంపద, శోభ అని మాత్రమే.కాని సుందరకాండమున పుష్పకవర్ణనఘట్టములో "లక్ష్మీ స్తథాపద్మిని పద్మహస్తా" (7స-14శ్లో) అని కలదు కాని దానిని పరిశీ లించినచో అది శ్రీ సూక్తలక్ష్మీసంబంధిగా ఉన్నదేగాని అంతకన్న అధునాతనముగా తోచదు వేదలక్ష్మి శ్రీసూక్తలక్ష్మి, పౌరాణిక లక్ష్మి అని మూడుగా లక్ష్మీపరిణామదశలు విభజించినచో రామాయణలక్ష్మి వేదశ్రీసూక్తములకుమాత్రమే సన్నిహితముగా ఉన్నదని చెప్పవలసి వచ్చుచున్నది. కనుక రామాయణమున లక్ష్మి ఇంద్రునిదేగాని విష్ణువుది కాదు. విభుః శ్రియా విష్ణురివామరేశ్వరః అనగా సంపదచే శోభించు ఇంద్రునివలె అని చెప్పుకొనవలెను.

రామాయణమున విష్ణువు చక్రధారిగా చెప్పబడలేదు. "భవాన్ నారాయణో దేవః శ్రీమాన్ చక్రాయుధో విభు" అని చెప్పిన యుద్ధ కాండాంతర్గత రామస్తోత్రము ప్రక్షిప్తము. కాని రామాయణమున విష్ణుచక్రమనుమాట మూడు లేక నాల్గు పర్యాయములు ప్రయోగింప బడినది. అప్పుడు అది విష్ణుదైవతము యొక్క ఆయుధముగా పేర్కొన బడలేదు. ఒకటి-బాలకాండమున విశ్వామిత్రుడు రామునకు తనకున్న అన్నిఅస్త్రములయొక్క ప్రయోగోపసంహారమంత్రములను ఇచ్చెనని కలదు. "పరితుష్టోస్మి భద్రం తే రాజపుత్రమహాయశః ప్రీత్యా పరమ యాయుక్తఃదదా మ్యస్త్రాణి సర్వశః" నేను సంతుష్టుడనైతిని గాన *అస్త్రముల నన్నిటిని నీ కిచ్చెదనని విశ్వామిత్రుడు రామున కిచ్చిన బ్రహ్మాస్త్ర వారుణాస్త్ర ఇంద్రాస్త్ర పైనాకాద్యనేకాస్త్రములందు

గదలు ముసలములు, ఖడ్గములు కూడా అస్త్రములుగా పేర్కొనబడి నవి. కనుక రామాయణమున గదాఖడ్గముసలాదులుకూడా అస్త్రము లని గ్రహింపవలెను. (అస్త్రములు మంత్రపూర్వకప్రయోగోపసంహార ములు గలవి. శస్త్రములు అట్టివిగాక వట్టి ఆయుధములు మాత్రమే భారతమున గదా ఖడ్గముసలములు ఆయుధములుమాత్రమే ఇది గుర్తింపవలెను) రామాయణమున గదాఖడ్గముసలములతోపాటుమూడు చక్రములుకూడా అస్త్రములుగా చెప్పబడినవి. ఇవన్నియు విశ్వా మిత్రుడు రామున కిచ్చెనని గలదు. ఆ మూడు చక్రములు-కాల చక్రము ధర్మచక్రము విష్ణుచక్రము. ఈ విష్ణుచక్రము విష్ణువు ప్రయో గించు చక్రమనుకొనుటకు వీలుకాదు. ఈ విష్ణుచక్రము విష్ణువు ప్రయో గించునదే అయినచో దానిని మరొకరు ప్రయోగించినట్లు పురాణాది గ్రంథములందు ప్రమాణము లేదు. అది సుదర్శనము. దానిని విష్ణువే ప్రయోగించును. ఇట్టివిషయము పౌరాణికమేగాని మరొకటి గాదు. శూలసుదర్శనాదులు శివకేశవాదులకు పురాణములు చెప్పిన విశిష్ట లాంఛనములు. రామాయణము పురాణములకు పూర్వము. రామా యణమున కిట్టివి వర్తించవు, పైగా రామాయణవిష్ణుచక్రము విశ్వా మిత్రునిచే రామున కివ్వబడినది, అనగా రాముడు దానిని ప్రయోగిం చెను. విశ్వామిత్రు డిచ్చుటచే అతడు ప్రయోగించియుండును. విశ్వా మిత్రుడు రామున కిచ్చిన అస్త్రముల నన్నిటిని వసిష్ఠునిపై ప్రయో గించెననియు, వాటి నన్నిటిని వసిష్ఠుని బ్రహ్మదండము గ్రసించెననియు రామాయణమున కలదు. "తాని సర్వాణి దండేన గ్రసతే బ్రహ్మణ స్సుతః" (బాల 56స-13శ్లో) ఆసందర్భమున వసిష్ఠునిపై విష్ణుచక్రము గూడ ప్రయోగింపబడినట్లు కలదు "ధర్మచక్రం కాలచక్రం విష్ణుచక్రం తథైవచ............ఏతా న్యస్త్రాణి చిక్షేప సర్వాణి రఘునందన" (బాల. 56స-12శ్లో) ఇట్టి విష్ణుచక్రము పురాణములు విష్ణువున కిచ్చిన విశిష్టాయుధము కాజాలదు. పైగా రామాయణమున రావణాదులచే

కూడా యుద్ధములందు చక్రములు ప్రయోగింపబడినట్లు చెప్పబడుట చేత ఆనాడీ చక్రములు సామాన్యాస్త్రములై యుండు ననుకొన వచ్చును. యుద్ధకాండమున రావణుని ధనుస్సునుండి చక్రములు బయల్వెడలినవనియు, వానిచే గగనమండలము ప్రదీప్తమైనట్లును అవి చంద్రసూర్యగ్రహములవలె నున్నట్లును వానిని రాముడు తన బాణములచే ఛేదించెననియు కలదు. "తత శ్చక్రాణి నిష్పేతు ర్భాస్వరాణి మహాంతిచ కార్ముకాత్ భీమవేగస్య దశగ్రీవస్య ధీమతః (7,8.శ్లో. 101స-యుద్ధ) ఈ చక్రము లేమిటో? మరొకచోట రావణుడు "భూయ ఏవ సుసంక్రుద్ధః శరవర్షం ముమోచహ గదాశ్చపరిఘాశ్చైవచక్రాణిముసలానిచ" (యుద్ధ. 109స. 17,18 శ్లో) మొత్తముమీద ఆనాడు ఈ చక్రములు అందరిచే ప్రయోగింపబడుచుండినట్లున్నది. కనుక అది రామాయణమున విష్ణువుయొక్క ప్రత్యేక లాంఛనము కాదు.

మరొకచోట సుందరకాండమున విష్ణుచక్రము ప్రసక్తమైనది. హనుమ రావణాంతఃపురమున సీతాన్వేషణ చేయుచు రావణునిచూచెను. అతని బాహువులు ఐరావణ దంతములచేత గాయపరచబడినవి వజ్రము చేత గాట్లు పడినవి విష్ణుచక్ర పరిక్షతములైనవి అని చెప్పబడినది." "ఐరావణ విషాణాగ్రై రాపీడన కృతవ్రణౌ, వజ్రోల్లిఖిత పీనాంసౌ విష్ణుచక్రపరిక్షతే" (సుం. 10స-16శ్లో) (విష్ణుచక్ర పరిక్షతే అనగా చక్రాంకితములు గలవి అని ఒక మతస్థు లనుకొనుట పక్షపాతముచేత కావలెను.) ఈ శ్లోకమున చెప్పబడిన రెండు వస్తువులు నిర్వివాదముగా ఐంద్రములే-ఐరావణ వజ్రములు. విష్ణుదైవత్వమునకు విశిష్ట సంబంధము గలదిగాక, విశ్వామిత్ర రామాద్యన్యులచేత కూడా ప్రయోగింప బడుచుండిన అస్త్రము మాత్రమే అయినది విష్ణుమూర్తియొక్క ఆయుధ మెట్లగును? రామాదులు వాడిన విష్ణుచక్రమును ఇంద్రుడెందుకు వాడ కూడదు? కనుక అదికూడా ఈ శ్లోకమున ఇంద్రుడు వాడిన అస్త్రముగానే గ్రహించుట హేతుసమ్మతముగా ఉండును.

ఇచ్చట ఒక ఆశ్చర్యకరమైన విషయమును చెప్పుచున్నాను, వేదమున ఇంద్రుడు చక్రాయుధమును ప్రయోగించి అసుర సంహారము చేసినట్లు కలదు. ఋగ్వేదము 4మండ. 53 సూక్త. 638 మంత్రమునందు "త్వమేతాం జనరాజ్ఞో ద్విర్దశా బంధునా సుశ్రవసోప జగ్ముషః షష్టిం సహస్రానవతిం నవశ్రుతో నిచక్రేణ రథ్యాదుష్పదావృణక్" అని కలదు. (ఓ ఇంద్రా సుశ్రవుడను రాజుయొక్క శత్రువులను చక్రముతో ఛేదించితివి) సామవేదమున ఇంద్రపర్వమందలి తృతీయాధ్యాయ దశమ ఖండమున 331 మంత్రమున "చక్రం యదస్యాప్స్వానిషత్తముతో తదస్మై మధ్విచ్చచ్ఛద్యాత్" అని కలదు. (ఇంద్రునియొక్క చక్రము ఆకాశమున వ్యాపించెను మరియు ఉదకమును వశపరచును,) మరొక చోట ఋగ్వేదమున 1 మండ. 19 అనువా. 131 సూక్త "సూర్యశ్చక్రం ప్రవృహజ్జాత ఓజసా ప్రపిత్వేవాచ మరుణో ముషాయతీశాన ఆముషాయతి......" ఇత్యాది 1433 మంత్రమున ఇంద్రుడు సూర్యునియొక్క రథచక్రమును తీసుకొని బలముచేత అధికుడై ప్రయోగించెను; తేజోవంతుడై శత్రువుయొక్క ప్రాణమును హరించెను...అని చెప్పబడినది.

ఇట్లు వేదమున ఇంద్రుడు చక్రప్రయోక్తగా వర్ణింపబడెను. ఈ పురాతన వైదిక విషయమే తర్వాత పురాణములందు విష్ణువునకు చేర్చబడినది, కనుక విష్ణుచక్ర పరీతతా అనగా ఇంద్ర చక్ర పరతతా అనినట్లే కారణము:-ఇచ్చట విష్ణుః అనగా ఇంద్రః అనుకొనవలెను. ఆ శబ్దము ఇంద్రశబ్దమునకు విశేషణము. అట్లు వాడుట రామాయణమున కలదు. "విభుః శ్రియా విష్ణురివామరేశ్వరః" అను బాలకాండాంతర్గత శ్లోకపాదమును నేను వెనుక విమర్శించినప్పుడు అచ్చట విష్ణుః ఇంద్ర విశేషణమని చూపితిని.

వేదమును జాగ్రతగా చూచినచో విష్ణుః అను శబ్దము ఇంద్రునకు చాలసార్లు విశేషణముగా వాడబడెను: అన్యులకుకూడా కొన్ని

చోట్ల ఆ విశేషణము వాడబడినది. ఉదా:—21 1 మండ. 61. సూక్తము ఇంద్రదేవతాకము, అందులో 699 మంత్రమున "మహా యద్విష్ణుః సచతం వహీయాన్" అనుచోట విష్ణుః అనగా వ్యాపించినవాడు అని ఇంద్రునకు విశేషణము ఈ విశేషణమే వేదమున ఇంద్రున కనేక పర్యాయములు వాడబడినది. కొన్నిచోట్ల అన్యదేవతలకుకూడా వాడబడినది. కృష్ణయజుర్వేదమున 4 అను వాకము 250 వ పంచాశత్తులో "వనామహేధుక్షీమహి ప్రజామిషం" అను మంత్రమున "విష్ణోః శం యోరహం దేవయజ్యయాయజ్ఞే..." ఇత్యాది వచ్చును. అచ్చట విష్ణుశబ్దము బృహస్పతికి వ్యాపనశీలియను అర్థమున విశేషణముగా వాడబడినది కనుక వేదమున ఈ విష్ణు శబ్దప్రయోగమిట్లున్నది. ఇట్టి విశిష్ట ప్రయోగము గలదగుటచేత ఈ శబ్దము ఇంద్రునకు విశేషణముగా వాడబడినచోట్ల, భాష్యకారులచేత విష్ణుదేవతయే చెప్పబడినట్లు భావింపబడినది అది పొరపాటు కావచ్చును. ఉదా:—సామవేదమున (4 అధ్యా. 12 ఖండము) "ప్రవోమహేమతయోయన్తు విష్ణవే మరుత్వతే" ఇత్యాది 861వ మంత్రమున విష్ణవే మరుత్వతే అనగా విష్ణువునకు ఇంద్రునకు అని ఇద్దరుగా చెప్పబడినది. కాని మంత్రమందలి విషయము చేతగాని అచ్చటి సందర్భము చేతగాని విష్ణువును ప్రత్యేకముగా చెప్పవలసిన అవసరములేదు. అచ్చట విష్ణవే మరుత్వతే అనగా వ్యాపనశీలియగు ఇంద్రునికొరకు అనుకొనుట సమంజసము. కనుక ఇచ్చట విష్ణుః ఇంద్రవిశేషణము మాత్రమే. సామవేదమునందే 2 అధ్యా. 11 ఖండమున వచ్చు తొమ్మిది మంత్రములును ఇంద్రదేవతాకములు, ఇంద్రమహిమను వర్ణించునవే, అందులో 8మంత్రములు ఇంద్రశబ్దము వాడి తన్మహిమ వర్ణింపగా 9 వ మంత్రము మాత్రము "ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం సమూఢ మస్యాపాగ్ంసువే" అని విష్ణువుయొక్క మూడు పాదక్రమములను చెప్పును. దానికిని ఇంద్రుడే దేవత కనుక ఈ మంత్రమందలి విష్ణుశబ్దమును, విష్ణుశబ్దమునకు చెందు మహిమయును, ఇంద్రునుద్దేశించినదే అని గ్రహింపవలెను.

ఇట్లు విష్ణుశబ్దము వేదమునందు ఇంద్రునకు విశేషణముగా వాడు సందర్భములు చెక్కుగలవని విశదము. రామాయణము అన్ని విధముల వేదము ననుసరించిన దగుటచేతను వేదమునకు కాలమున అతిసన్నిహితమయినదగుట చేతను కొన్నిచోట్ల విష్ణుశబ్దమును అట్లే రామాయణము ఇంద్రునకు విశేషణముగ వాడినదని యూహింపవచ్చును. అందుచేత విష్ణుచక్ర పరిఘతా అనుచోట అది ఇంద్ర చక్ర పరిఘతా అగును. పైగా ఇంద్రుని చక్రము ఆకాశమున వ్యాపించునదని వేదము చెప్పుచున్నది గదా? "చక్రం యదస్యాప్స్వా నిషత్తముతో తదస్మై మధ్విచ్ఛద్యాత్" (సామవేదము ఇంద్ర పర్వము 3 వ అధ్యా. 10 ఖండ) కనుక విష్ణుచక్ర పరిఘతా అనునది వ్యాపించునట్టి (ఇంద్ర) చక్రమనియు అర్థమిచ్చును.

మరొకటి-రామాయణమున ప్రతి పుటయందు ఇంద్రుని ప్రసక్తియే వచ్చుచు ఇంద్రాధిక్యము గోచరించుచుండుటచేతను, విష్ణు ప్రసక్తి అత్యల్పమగుటచేతను, ఆ అల్పప్రసక్తియందును విష్ణువు యెచ్చటను చక్రధారిగా వర్ణింపబడక పోవుటచేతను విష్ణుచక్ర పరిఘతా అను ఒక్కచోట మాత్రము విష్ణుః అనగా విష్ణుదేవుడు అనుకొనుట అసమంజసముగా ఉండును.

[మరొక ముఖ్య విషయము—ఇంద్రుడు ప్రయోగించినట్లు వేదము వర్ణించిన చక్రము సూర్యరథ చక్రమని వేదమున, స్థలాంతరమున గలదని వెనుక చూపించితిని. సూర్యరథచక్రము అనగా కాల చక్రము ఈ కాలచక్రమును ఋగ్వేదముయొక్క 1 మండ. 22 అను. 164 సూక్తములోని 86 వ ఋక్కు ఇట్లు వర్ణించుచున్నది. "సప్త యుంజంతి రథ మేక చక్ర మేకో అశ్వో వహతి సప్తనామా। త్రినాభి చక్ర మజరమ నర్వం యత్రేమా విశ్వాభువనాధి తస్థుః"-ఒక చక్రము గల రథమునకు ఏడు కట్టబడి యున్నవి. సప్తయని పేరుగల ఒకే యశ్వము ఆ రథమును లాగుచున్నది ఆ చక్రము మూడు రంధ్ర

నుభు గలది. దానియందు ఈ మూడు లోకములు ఆధారపడి యున్నవి. అని ఈ ఋక్కునకు అర్థము. ఇచ్చట-సూర్యమండలమే సూర్యరథమనియు, దినమును పిల్చు నాలుగు జాతుల కిరణములే గుఱ్ఱ మనియు, మూడు కాలములు మూడు చక్రరంధ్రములనియు (ఇది కాలచక్రము) ఈ కాలచక్రమందు అన్ని లోకములు భ్రమించు చున్నవి అనియు వేదభాష్యము- ఈ 164 వ సూక్తమందలి మొదటి 19 ఋక్కులు కాలచక్రమునే వర్ణించుచున్నవి.—ఇంద్రుడు అసుర సంహారమునకు వాడిన చక్రము సూర్యరథచక్ర మగుటచేత అది కాల చక్రమని తాత్పర్యము. వేదమున ఇంద్రుడు కాలకర్త. "తమాచుషే మానుషేమాయుగాని కీర్తేన్యం మఘవానామ బిభ్రత్..." (ఋగ్వే 1 మం. 15 అను. 104 సూ. 1103 మంత్ర) శత్రువులను లొంగదీయు నట్టి ఇంద్రుని బలమును స్తుతించు యజమానునకు స్తుతింపదగిన బల మును ధరించు ఇంద్రా మనుష్య సంబంధమైన కనబడుచున్న ఈ యుగ ములను ఇచ్చుచున్నావు, అని అర్థము—వాల్మీకి తన గ్రంథవస్తువును వేదమునుండి గైకొనెను. వ్యాసుడు తన వస్తువును వేదమునుండి వాల్మీకినుండి గైకొనెను. వైదిక విషయమైన ఇంద్రకాల కర్తృత్వ మును, వెనుక పేర్కొనబడిన 1686 మొదలైన ఋక్కులు చెప్పిన కాలచక్ర వర్ణనను గైకొని వ్యాసుడు పౌష్యపర్వమున ఉత్తంకో పాఖ్యానమందలి కాల పురుష దర్శన ఘట్టము నిర్మించెను. "త్రీణ్యర్పి తాన్యత్ర శతాని మధ్యే షష్టిశ్చ నిత్యం చరతి ధ్రువేస్మిన్ చక్రే చతుర్వింశతి పర్వయోగే షడ్వై కుమారాః పరివర్తయంతి-తంత్రంచేదం విశ్వ రూపే యువత్యౌ. వయతస్తంతూన్ సతతం వర్తయంతౌ, కృష్ణాన్ సితాంశ్చైవ వివర్తయంత్యౌ, భూతాన్యజస్రం భువనానిచైవ-వజ్రస్య భర్తా భువనస్య గోప్తా వృత్రస్య హంతా నముచేర్నిహంతా, కృష్ణేవ సానో వసనే మహాత్మా సత్యానృతే యో వివినక్తి లోకే, యోవాజినం గర్భ మపాంపురాణం వైశ్వానరం వాహన మభ్యుపైతి, నమోస్తు

"తస్మై జగదీశ్వరాయ లోకత్రయేశాయ పురందరాయ"—భారత సుందరి ఈ మట్టును చదివినతర్వాత ఋగ్వేదమందలి 1 మండల, 22 అనువా, 164 సూక్తములోని మొదటి 19 ఋక్కులు చదివినచో వ్యాసుని కాలచక్ర వర్ణన ఎక్కడిదో గోచరించును. ఇచ్చట ముఖ్య ముగా గ్రహింపవలసినది "వజ్రస్య భర్తా భువనస్య గోప్తా" ఇత్యాదితో వ్యాసుడు ఇంద్రుని కాలపురుషునిగా వర్ణించుటయే.—కనుక వ్యాసుని వర్ణనను చేతకూడా విష్ణువును కాలపురుషునిగా వర్ణించు వేద మంత్రములు విష్ణుః అనగా ఇంద్రః అనియే ఆ ఋక్కుయొక్క ఉద్దేశ మని నా యూహ.

ఇట్లు కాలచక్రము వేదమున చక్రమను శబ్దముచే 5°, 131 సూక్తములందు వర్ణింపబడగా, రామాయణమున చక్రశబ్దము జ్యోతి శ్చక్రమును చెప్పుటకు ప్రయోగింపబడినది. "మహర్షిభిశ్చక్రచరైర్మహో వ్రతైః..." (సుంద. 47స. 38 శ్లో) మహర్షయశ్చక్ర చరాశ్చ సిద్ధాః" (సుంద. 48 స-23 శ్లో) మొదటిదానికి గోవిందరాజీయవ్యాఖ్య- "చక్ర చరైః జ్యోతిశ్చక్ర చరైః, నక్షశ్చక్ర చరైర్వా", అని చెప్పినది మహే శ్వర తీర్థవ్యాఖ్య "జ్యోతిశ్చక్రవర్తిభిః" అని చెప్పినది. రెండవదానికి గోవింద రాజ వ్యాఖ్య "చక్ర చరాః సంఘచారిణః" అని మాత్రము చెప్పగా మహేశ్వరతీర్థులు "జ్యోతిశ్చక్ర సంచారిణః" అనెను. కనుక మొత్తముమీద రామాయణమున చక్రశబ్దముచేత జ్యోతిశ్చక్రము చెప్ప బడినది. జ్యోతిశ్చక్రముకూడా కాలస్వరూపమేగదా. ఆ పురాతన గ్రంథ సందర్భము లిట్లున్నవి. విద్వాంసు లాలోచింతురుగాక.

ఇంద్రుని యొక్క కాలకర్తృత్వ లక్షణమే తరువాత విష్ణువునకు ఋగ్వేదమునందే చెప్పబడినది. కాని తత్సంబంధ మంత్రములు అనం తర కాలకల్పితములుగానీ లేక అందలి విష్ణు శబ్దమునకు ఇంద్రః అని యర్థ ముద్దేశింపబడి యుండుట గానీ కావలెను. కొన్ని ఇంద్ర దేవతాక

మంత్రములందు ఇంద్ర శబ్దము లేక విష్ణు శబ్దమే గలదు. కొన్ని ఋక్కులు ఇంద్రుడే సూర్యుడని వర్ణించును. ఇట్టి కారణముల చేత విష్ణువును కాలకర్తృ లక్షణము చెప్పు మంత్రములందు విష్ణుః అనగా ఇంద్రః అనియే కావచ్చును. ఇట్టి శబ్దైక ప్రయోగ మంత్రములే శాస్త్రజ్ఞులు అవి ఇంద్ర దేవతాకములైనను విష్ణుదేవతాకములను భాషములకు అనంతర కాలమున తావిచ్చి ఒక ప్రత్యేక విష్ణుదేవత అవతరించుటకు తత్సంబంధ మంత్రోత్పాదనకు కారణములై యుండవచ్చును. విష్ణుదేవతోత్పత్తి ఇట్లు సంభవించి యుండును.

విష్ణువుయొక్క కాలకర్తృత్వలక్షణమునుచెప్పు ఋక్కు ఇది- "చతుర్భిః సాకం నవతించ నామభి శ్చక్రం నవృత్తం వ్యతీరవీ వివత్ బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిర్యువాకుమారః ప్రత్యేత్యాహవం" (1మం 21 అను 156సూ. 1608 మంత్ర) విష్ణువు తొంబది నాల్గు గమనములచేత వివిధ గతులను వృత్తమువలె త్రిప్పుచున్నాడు. (ఇది వత్సర, అయన, ఋతు మాస పక్ష దిన రాత్రి యామములను చెప్పుచున్నది) ఇట్టి కాలాత్మక విష్ణువు గొప్ప శరీరము కలవాడయి వివిధ శరీరములుగా కనబడుచు అన్నిటిలో కలిసి యధికుడయి యాహ్వానమును గూర్చి వచ్చుచున్నాడు; అని దీని యర్థము. (దీనిచేత ఇంద్రా విష్ణువులు ఒక్కరేనేమో అను ఊహ వచ్చునుగదా?)

ఇంద్రుడు సూర్యరథ చక్రముతో అనగా కాలచక్రముతో శత్రు సంహారము చేసె ననగా శత్రువులు కాలము తీరి మరణించిరని యగును. ఇంద్రునుంచి పుట్టిన పౌరాణిక విష్ణువు ఎప్పుడును దేవతలు మొరపెట్టుకొనగానే రాక్షసుని వధింపడు; వాడిప్పు డజేయుడు. వానికి ఫలానా అప్పటికి కాలము పరిపక్వమగును. అప్పుడు రాముడుగానో కృష్ణుడుగానో అవతారమెత్తి సంహరింతును అని చెప్పును. ఇదే పౌరాణిక విష్ణు లక్షణము. అనగా ఇదే విష్ణువుయొక్క చక్రాయుధము. అనగా

కాలాత్మకుడైన విష్ణువు కాలాత్మకమైన చక్రము ప్రయోగించుట ఇది యె. ఇట్లు చక్రాయుధ మనుభావము అవతరించి యుండునని నాయూహ. అదే తర్వాత క్రమముగ సుదర్శనమాయెను

ఇక ప్రకృత మనుసరాము- రామాయణమున అతిచిత్రమైనది- రావణవిరోధి విష్ణువు అని యెచ్చటను చెప్పబడలేదు గ్రంథమం దంతటను రావణునికి విరోధి, ప్రతిస్పర్థి ఇంద్రుడే అగుచున్నాడు. విష్ణువు రాక్షస విరోధిగా కూడా ఎచ్చటను వర్ణింపబడలేదు ("వ్యవసాయ సమాయుక్తం విష్ణుం దైత్యవధే యథా" సుం.37స-24శ్లో.అనుచోట తప్ప-లేక అట్టి వొకటి రెండుండునేమో పరిశోధక దృష్టితో వెదికినచో) వైదికవిష్ణువు రాక్షసవిరోధి కాదు అట్లే యున్నాడు రామాయణ విష్ణువు. రామాయణమున ఇంద్రుడే రాక్షసవిరోధి. భాగవతాది పురాణములందు విష్ణువు రాక్షసవిరోధి. (విరోధి యనగా విరోధియు హంతయు అని నాతాత్పర్యము)సీతకడ తనప్రతాపము వర్ణించుచు రావణుడు తా నెవరి నెవరిని నిర్జించి యుద్ధమున తా నప్రతిద్వంద్వుడాయెనో వారిని పేర్కొనెను. "అసకృత్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః" (సుం 20స-20శ్లో) అని నాయెదుట సురాసురులైనను నిలువజాల రనెను- కానీ విష్ణు వొకడు తనకు విరోధియై యుండి, వాడే లోకమున ఏకైకాధికుడై యున్నచో వానినే గెల్చితినని తనపరాక్రమము నుత్కర్షించుకొని యుండెడివాడేగదా. అనగా వాల్మీకి అట్లు వ్రాసి యుండవలెనుగదా.

అశోకవనభంజనము చేసిన హనుమంతుని దండించుటకు రావణునిచే జంబుమాల్యాది రాక్షసులు పంపబడి, వారు విధింపబడగా సేనాపతి పంచకముసు పంపించు సందర్భమున "భవే దింద్రేణ వా సృష్టం అస్మదర్థం తపోబలాత్ సనాగ యక్షగంధర్వా దేవాసుర మహర్షయః అస్మాభి

స్పృహాత్రైః పన్నైర్వ్యయాసహా వినిర్జితాః త్తైరవక్ష్యం విధాతవ్యం వ్యలీకం కించిదేవ నః"(సుం. 46స—78శ్లో) దేవ రాక్షస యక్ష నాగ గంధర్వ మహర్ష్యాదులు మనచే నిర్జింపబడి, [illegible] కారము చేయవలెనుగదా. కనుక ఈ కోతి ఇంద్రునిచే మనకొరకు సృష్టింపబడినదై యుండును. ఈ కోతి పట్టి కోతి గాదు." [illegible] తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయన్ సర్వథా తన్మహద్భూతం మహాబలపరిగ్రహం" అని రావణుడు చెప్పినపుడు విష్ణువు పేరైనా ఎత్తలేదు. దేవగంధర్వఋష్యాదులకు రావణుడు కీడు చేయగా దానికి ప్రతిక్రియ చేయవలసినవాడు ఇంద్రుడా? విష్ణువా? విష్ణువైనచో ఇంద్రేణ సృష్టం భవేదస్మదర్థం అని ఎందుకు చెప్పబడినది? విష్ణునా సృష్టం అనబడవలెనుగదా? అనగా రామాయణకాలము నాటికి దేవగంధర్వఋష్యాదులకు ఇంద్రుడే దిక్కు. ("త్వం వలస్యగోమతో పావ అద్రివోబిలం త్వాం దేవాఅభిభ్యుష స్తుజ్యమానా ఆవిషుః"ఋ. 1మం. 8అను. 11సూ.107మంత్ర-వజ్రమును ధరించిన ఇంద్రా, గోవులతో గూడిన బిలాసురునిబిలమును తెరచితివి. అప్పుడు శత్రువులచే హింసింపబడిన దేవతలు నిర్భయులై నిన్ను జేరిరి.—"అస్మిన్నత్రమరుతః సస్మిన్నాజౌ విశ్వేదేవాసోఅమదన్ననుత్వా..." ఋ.1మం.10అను. 65సూ-8మంత్ర - అన్ని యుద్ధములందును దేవతలందరు నిన్ననుసరించి మదించిరి...)కనుక శత్రువులబారినుండి దేవతలను రక్షించువాడు ఇంద్రుడుగాని, పురాణములందువలె విష్ణువు గాదు. ఇంద్రుడే రాక్షసవిరోధి. కనుక అతడే రావణవిరోధి.

యుద్ధకాండమున రావణుడు పుత్రవధసంతప్తుడై కాలాంత రుద్రునివలె క్రుద్ధుడై రాక్షసమధ్యమున పల్కుచు చెప్పిన మాటలలో "కవచం బ్రహ్మదత్తం మే య దాదిత్యసమప్రభం దేవాసురవిమర్దేషు న భిన్నం వజ్రశక్తిభిః తేన మా మద్య సంయుక్తం రథస్థ మిహా

సంయుగే. ప్రతీయాత్కోద్యమా మాజౌ సాక్షాదపి పురందరః "(సుం. 91స-21శ్లో) అని కలదు. బ్రహ్మదత్తమైన నా కవచము వజ్రశక్తిచేత కూడా భిన్నము కాదు అనగా వజ్రశక్తియే లోకమున అత్యుత్కృష్టము యుద్ధములందు భయపడవలసినది అనియేగదా భావము అట్టి కవచమును దాల్చి రథ మెక్కి తాను బయలుదేరినచో యుద్ధమున సాక్షాత్తు ఇంద్రుడుకూడా తన నెదుర్కొనలేడు అనుచున్నాడు. కనుక త్రిభువన విజేత యగు రావణుడే వజ్రము ఆయుధములందు అగ్రగణ్యమనియు ఇంద్రుడే యుద్ధములందు అగ్రగణ్యుడనియు భావించుచున్నా డనియే గదా వాల్మీకితాత్పర్యము. విష్ణువే ఇంద్రునికంటె గొప్పవాడైనచో ఇట్టిసందర్భమునందు రావణుడు అతడిపేరును అతడి ఆయుధమైన సుదర్శనమును మాత్రమే ప్రసంగించవలెనుకదా.

దూతయైన హనుమను చంపుట పండితుడు పరాక్రమవంతుడు అగు రావణునకు యుక్తము కాదని చెప్పుచు విభీషణుడు ఈసంహార యత్నము నీకోతిమీద గాక దేవేంద్రునిమీద చేయుట అర్హమని చెప్పెను. తస్మా న్నాస్య వధే యత్నః కార్యః పరపురంజయ భవాన్ సేంద్రేషు దేవేషు యత్న మాస్థాతు మర్హసి" (సుం 52స-23శ్లో) అనగా నీకు అసలు విరోధి, ప్రతిద్వంద్వి ఇంద్రు డుండగా వానిపై ఈకార్యము చేయక దూత, కోతి అయిన ఈ హనుమను చంపుటకు ప్రయత్నించుట నీ కర్హము గా దనుచున్నాడు. విష్ణువే ఇంద్రునికన్న అధికుడైనచో ఇచ్చట ఇంద్రుడనుటకు బదులు విష్ణు వనిగదా చెప్పవలెను. కనుక రావణవిరోధి ఇంద్రుడేకానీ విష్ణువు గాదు; విష్ణువుకన్న ఇంద్రుడే అధికుడనియు తాత్పర్యము.

రామాయణమునకైతే వాల్మీకి కల మెత్తునాటికి విష్ణువునకు అసురవిరోధిత్వముగాని, చక్రధారిత్వముగాని, లక్ష్మీపతిత్వముగాని, రామకృష్ణాద్యవతారము లెత్తు లక్షణముగాని ఉన్నట్లు కనుపించదు.

రామాయణమున ఇంద్రుని యొక్క అసురవిరోధిత్వ నిహంతృత్వములు ప్రకటింపబడినవేగాని పురాణములందువలె విష్ణువు యొక్క దైత్య సంహారత్వము చెప్పబడలేదు. "వ్యవసాయ సమాయుక్తం విష్ణుం దైత్య వధే యథా అనునట్టి (సుం 3 స-24 శ్లో, వర్ణనలు రామాయణమున అతి క్వాచిత్కములు; బహుళః ప్రక్షిప్తములు. కాని ఇంద్రుని అసుర సంహారత్వము రామాయణమున అతిబహుళమై సర్వత్ర ప్రసక్తమై యున్నది.

"స రాక్షసశతం హత్వా వజ్రేణేంద్ర ఇ వాసురాన్" (సుం.43 స-19శ్లో) హనుమ రాక్షసులను స్తంభముతో చంపుట ఇంద్రుడు వజ్రముతో రాక్షసులను చంపుటతో పోల్చబడినది. "స కపి ర్నాశయా మాస సహ స్రాక్ష ఇ వాసురాన్" (సుం.46-38 శ్లో) ఇట్టిసందర్భములు పరశ్శతములుగా నున్నవి.

"శంబరారి ర్మనసిజః" అని శంబరారి మన్మథుని పేరుగా పురాణ కాలమునుండి ప్రసిద్ధము. కాని వేదమున శంబరాసురుని సంహారించిన వాడు ఇంద్రుడు. ఋగ్వేదమున వృత్ర, విప్రు, శంబర, శుష్ణ, కృష్ణ లను అసురులు ఇంద్రశత్రువులుగాను ఇంద్రునిచే వధింపబడినవారు గాను వర్ణింపబడిరి. "యో వ్యంసం జాహృషాణేన మన్యునా యః శంబరం యో అహన్ పిప్రు మవ్రతం ఇంద్రో యః శుష్ణ మశుష మ్న్యావృణ ఙ్మరుత్వం తం సఖ్యాయ హవామహే" (1 మండ. 15 అను 101 సూ. 1070 మం.) 1078 ఋక్కులో కృష్ణుడను అసురుని పేరు గలదు. అట్టి ఇంద్రుని వైదిక శంబరారిత్వము రామాయణమున గలదు. "విరాధశ్చ హతః సంఖ్యే రాక్షసో భీమవిక్రమః వనే రామేణ విక్రమ్య మహేంద్రేణేవ శంబరః "సుం, 16 స-8 శ్లో)

మరొక చిత్రము రావణుడు మృగరూపమున రాముని వంచించి సీతను అపహరించెనని రామాయణమున కలదు. "తత స్త్వ మరా

పహృత్వా జానకీ రావణేన తు వంచయిత్వా వనే రామం మృగరూపేణ మాయయా" (సుం. 31 స-11 శ్లో) అట్లే "అపకృష్యాశ్రమపదా న్మృగరూపేణ రాఘవం శూన్యే యే నాపనీతాసి తస్య ద్రక్ష్యసి యత్ఫలం" (సూ. 34 స-32 శ్లో) ఈ రెంటియందును మృగరూపేణ అనునది రావణేన అనుదానికి విశేషణము, రావణుని కన్వయించుకదే అని విశదము. గ్రంథమున స్థలాంతరమున మారీచుడు మృగరూపమున రాఘవుని అపకర్షించినట్లు కలదు. బహుశః మారీచవృత్తాంతము అనంతరకాలకల్పితమేమో రామాయణమున బాలకాండ యుద్ధ కాండాదులందువలెను ఇతర భాగములందును కొన్ని వృత్తాంతములు కల్పితములై ప్రక్షిప్తములైనట్లు సంశయము కలుగుచున్నది. మృగ రూపధారి యగు రావణుడు సీతను హరించును చివరకు రామునిచే నిహతుడగును, సీత పునర్లబ్ధ యగును. వేదమున మృగరూపమున ఇంద్రుని వంచించి ఉదకములు (గావః) హరించిన వృత్రుని ఇంద్రుడు సంహరించి తిరిగి ఉదకములను విడిపించును. ఈ విషయము వేదమున పలుతావుల ప్రసక్తమైనది ఒకటి- "ఇంద్ర తుభ్య మిదద్రి వోను త్తం వజ్రిన్వీర్యం యద్ధత్యం మాయినం. మృగం తముత్వం మాయయా వధీరర్చన్ను స్వరాజ్యం" (ఋ.1మం. 13 అను. 80సూ. 854 మం,) ఓ ఇంద్రుడా నీవు నీ సామర్థ్యముతో మాయావియైన మృగరూపము దాల్చిన వృత్రుని నీవు కూడ ఉపాయముతో సంహరించితివి ఈ ఋక్కే సామవేదమున ఇంద్రపర్వమందలి 4 అధ్యా, 7 ఖండమందు గలదు- 412 మంత్రము.

కనుక రామాయణమందలి రావణ మృగరూపధారణ వైదిక విషయము. నే నిచ్చట చూపిన రెండు శ్లోకములు అతిప్రాచీన ప్రాథమిక రామాయణగాథా స్వరూపమును చూపునవి కావచ్చును. మారీచు డా మృగరూపము దాల్చుట యను వృత్తాంతము, తర్వాత రామాయణము పొందిన పరిణామము కావచ్చును. మొత్తముమీద వైదిక ఇంద్రుని

అభాసముచేయుకొరకా పాత్ర వాల్మీకిచే సృష్టింపబడినట్లులోచుచున్నది. అదెట్లున్నను ప్రస్తుతము రామాయణమున ఇంద్రపారమ్యమే ప్రతిపాదింప బడినదనుటకు ఇది మంచి ఉపపత్తి. మరియు రామాయణము ఋగ్వేద మున కెంత సన్నిహితమో ఈ విషయము చూపించుచు ఎందుచేత ఇంద్ర పారమ్యము రామాయణమున అధికముగా గలదో విశదము చేయు చున్నది.

రాక్షసులను సంహరించుటకు ఇంద్రుడు దవతరించెనని వేదము చెప్పుచున్నది! "త్వం కుత్సం కుష్ణహత్యేష్వావిధారంధ మోకిథిగ్వాయ శంబరం । హంతంచిదర్బుదం నిక్రమీః పదాసనాదేవదస్యుహత్యాయ జజ్ఞిషే" (1 మం. 10 అను 51 సూ, 605 మంత్ర. ఋగ్వే) ఇంద్రా కుష్ణుని చంపి కుత్సుని రక్షించితివి. శంబరుని చంపి అతిథిగ్వుడను వాని రక్షించితివి. ఎంత గొప్పవాడైనను అర్బుదుని నీ పాదముచే అణచి వైచితివి; కావున దస్యుల జంపుటకే చాలకాలమునుండి నీవు అవత రించితివి.

మరొక ముఖ్యమైన సంగతి- రామాయణమున విష్ణువనగా మూడు పాదన్యాసములు చేసిన త్రివిక్రముడే గాని మరేమీ కాదు. ఇది ముఖ్యముగా గుర్తింపవలెను, (ప్రక్షిప్తభాగములు వదలి) వేదమున ఉన్న విష్ణువునూ అంతే! ఉభయత్ర విష్ణువునకు అసురనిహంతృత్వము లేదనుటకు ఇది చెప్పుచున్నాను- రామాయణవిష్ణువుకు అవతార, చక్ర, లక్ష్మ్యాద్యాది పౌరాణిక లక్షణము లేమియు లేవు. రామాయణమున ఎచ్చట విష్ణుప్రసక్తి వచ్చినను నే నిచ్చు ఉదాహరణలందువలెనే ఉండును. కిష్కింధ కాండ :— "విక్రమస్వ మహావేగో విష్ణుస్త్రీన్ క్రమానివ" (66 స-లశ్లో) "భవిష్యతి హి మే రూపం ప్లవమానస్య సాగరే విష్ణో స్త్రిక్రమమాణస్య పురా త్రీ న్విక్రమా నివ" (67. స-26 శ్లో) "జానామి వారుణాన్ లోకాన్ విష్ణో స్త్రైవిక్రమానపి" (58స-17శ్లో) సుందరకాండ :—"త్రీన్ క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః"

(1 స-207 శ్లో) "అసురేభ్యః శ్రియం దీప్తాం విష్ణు స్త్రిభిరివ క్రమైః) (ఖ స-28 శ్లో) ఇందులో ముఖ్యమైనది మరొకటి- రామాయణమున త్రివిక్రమః అను ఏకపద ప్రయోగమురాదు. ఎప్పుడును త్రిభి రివ క్రమైః, త్రీన్ విక్రమా నివ, త్రీన్ క్రమాన్ ఇత్యాది విధముగా విష్ణువుయొక్క త్రివిక్రమత చెప్పబడును. అనగా రామాయణము నాటికి త్రివిక్రమః అను శబ్దము రూపొందలేదు. తర్వాత కాలమున పరిగణింప బడినట్లు ఆనాడు విష్ణువునకు త్రివిక్రమావతారమని యొకటి లేదు; ఉన్నది విష్ణువే, అతడే మూడు పాదన్యాసములచే మూడులోకము లాక్రమించెను. వేదమున "ఖచ్చితముగా" ఇంతే గలదు! చూడుడు- ఋగ్వే 1 మండ. 5 అను. 22 సూ 224, 225, 226 మంత్రములు—" అతో దేవా అవంతు నో యతో విష్ణు ర్విచక్రమే పృథివ్యాః సప్త ధామభిః"

"ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదంసమూ మహ్యామస్య పాంసురే"

"త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః అతో ధర్మాణి ధారయన్"

ఇట్లే 21 అను 154, 155, 156 సూక్తములందును విష్ణువు యొక్క త్రిపదన్యాసములు వర్ణింపబడినవి. యజుర్వేదాదులందును ఇంతే.

ఇప్పుడు ఈ వైదిక విష్ణువర్ణనను రామాయణ విష్ణువర్ణనను పోల్చి చూచినచో రామాయణ విష్ణువు ఎట్లు వైదిక విష్ణువో, అత డెట్లు పౌరాణిక విష్ణువు కాడో అందుచేత అతని కెట్లు రామాయణమున రాక్షస నిహంతృత్వము చెప్పబడలేదో విశదమగును.

భారత భాగవతాది పురాణములు రామాయణమునకు సమ కాలీన గ్రంథములు కావు. మరి అట్టి సమకాలీన గ్రంథములేవో మనకు తెలియదు. తైత్తిరీయాది కొన్ని అతి ప్రాచీన ఉపనిషత్తులు, అతి

ప్రాచీనకరూపమందున్న కొన్ని యోగశాస్త్ర,తంత్రశాస్త్ర,ధర్మశాస్త్ర సంగీత వాస్తు శిల్పాది శాస్త్ర గ్రంథములు మాత్రమే సమకాలీనములు కావచ్చును. అప్పటికి ఋగ్వేదీయ ఇంద్రుడు సుప్రతిష్ఠితమైన అధిపత్యము గలవాడై యుండును. యజుర్వేద ప్రతిపాదిత త్రివిక్రమ రూపదైవతము అప్పుడప్పుడే ఉదీయమాను డగుచుండును. (క్రమముగా ఇంద్ర మహిమలు ఇతనికే సంక్రమింపజేయబడు చుండెను. చివర కాతడు పురాణ కాలమునకు నేటి విష్ణు వగును) ఇట్టి పరిస్థితి మాత్రమే రామాయణమున గోచరించునుగాని, భారత పురాణములందు చెప్పబడిన త్రిమూర్తులు వారి సృష్టి స్థితి లయ సంహార శక్తులు వారి లోకాధిపత్యము, అందు విష్ణువు యొక్క ఔన్నత్యము లక్ష్మీ చక్రాది లాంఛనములు ఇత్యాది పరిస్థితులు రామాయణ కాలమునకు తల యెత్తలేదనియే భావింపవచ్చును.

ఒక ఉదాహరణ చూడుడు—హిరణ్యా కశిపుని కీర్తి హరించిన వాడు రామాయణమున ఇంద్రుడే గాని విష్ణువుగాడు. రావణుడు సీతను తర్జించుచు "ఊరక రామునికై పలవరింతు వేల, నాచే జిక్కిన నిన్ను ఇక రాముడు పొందుట అసంభవము ఎట్లనగా ఇంద్రునిచే జిక్కిన కీర్తిని హిరణ్యాకశిపుడు పొందుట ఎట్లు అసంభవమో అట్లు "హిరణ్యాకశిపుః కీర్తిం ఇంద్రహస్తగతా మివ" (సుం. 20 స-28 శ్లో) ఇచ్చట హిరణ్యాకశిపు విరోధి ఇంద్రుడేగాని విష్ణువని కాదుగదా. విష్ణువే అయినచో విష్ణు హస్తగతా మివ అనవలెను. పైగా- రావణుడు తనను ఇంద్రునికి రాముని హిరణ్యాకశిపునికిని పోల్చుటకూడా ముఖ్యముగా గమనించవలసిన విషయము. రామాయణ కాలమున కా కథ , ట్లుండెనో! పురాణ పద్ధతి ప్రకారమే అయినచో రావణుడు హిరణ్యాకశిపుని అభిమానించి వానియుత్కర్ష చెప్పవలెను. అట్లుగాక రావణుడే ఇంద్రుని ఆధిక్యమును చెప్పుచున్నాడు. (రావణుడు యు. కాం. 112 స. 24 శ్లో. న "ఏ షో హితాగ్నిశ్చ మహాతపాశ్చ వేదాంతగః కర్మసుచాగ్ర్య వీర్యః అని వర్ణింపబడెను,)

హిరణ్యకశిపుని చంపినవాడని పురాణములు చెప్పు నృసింహావతారము రామాయణమున లేదు. ప్రహ్లాదుని పేరే లేదు వెనుక చెప్పిన ఒక్క ముక్క దప్ప రామాయణమున ఈ వృత్తాంతమునకు సంబంధించిన మాట మరేదియు లేదు- కావున రామాయణము రాక్షస సంహారి ఇంద్రుడే గాని విష్ణువు గాదని విశదమగుచున్నది.

రామాయణమున ఇంద్రునియొక్క సర్వాధిక్యమును విశదము చేయు అనేక ఉదాహరణ లిచ్చి ఈ చర్చ ముగింతును.

ఏ విధమైన సర్వాతిశయ సముత్కర్షను చెప్పవలె నన్నను ఇంద్రుడే ఉపమానముగా గైకొనబడును... జనకుడు సీతాకల్యాణ సందర్భమున తన నగరమునకు బ్రాహ్మణసమేతుడై వచ్చిన వసిష్ఠుని దేవతలతో గూడిన దేవేంద్రునివలె ఉన్నాడని చెప్పును "దిష్ట్యా ప్రాప్తో మహాతేజా వసిష్ఠో భగవాన్ ఋషిః సహ సర్వై ర్ద్విజశ్రేష్ఠై ర్దేవై రివ శతక్రతుః" (బాల, 39 స-10 శ్లో). హనుమంతుని తోక ఇంద్రధ్వజమువలె ఉచ్ఛ్రితముగా ఉన్నదట. "శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః" (సుం. 1 స-61 శ్లో) రావణుడు సీతవద్దకు వెళ్లుచుండగా వానివెంట నూర్గురు స్త్రీలు అనుసరించిరట. ఎట్లనగా "మహేంద్ర మివ పౌలస్త్యం దేవగంధర్వయోషితః" (సుం. 18 స-10 శ్లో) తుదకు రావణుడుకూడా ఇంద్రునితో పోల్చబడెనుగదా! సీత రావణునికి చెప్పుట— "రామస్య ధనుషః శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనం శతక్రతువిసృష్టస్య నిర్ఘోష మశనేరివ" (సు 21 స-24 శ్లో) నీవు రాముని ధనుష్టంకారమును ఇంద్రుని అశని నిర్ఘోషమువలె విందువు. విష్ణువే అధికుడైనచో విష్ణోః పాంచజన్యస్య ధ్వని రివ లేక సుదర్శనచక్రస్య స్వనమివ లేక శార్ఙ్గస్య ధ్వనిరివ అనిగదా అనవలెను.—సీత రావణునికి చెప్పుట; నీవు నరసింహులైన ఆ రామలక్ష్మణుల ఎదుట నిలువలేవు. నీవు ఒక్కడివి వారిద్దరిని జయించుట అసాధ్యము ఎట్లు? ఇంద్రుని రెండు బాహువు

లను వృత్రుడు తన ఒక్క బాహువుతో పట్టుకొనుట అసాధ్యమైనట్లు. ఈ ఉపమానము వైదికము- నేను ధర్మాత్ముడైన రాముని భార్యను ఎట్లనగా శచి ఇంద్రుని భార్య అయినట్లు "మాం హి ధర్మాత్మనః పత్నీం శచీమివ శచీ పతేః" (సుం. 22 స-14 శ్లో) అని సీత రావణునికి చెప్పెను. ఇచ్చట ఒక సర్వాధికుడైనవాని భార్యను ఉపమించుట తాత్పర్యమని విశదమే. విష్ణు వట్టివాడైనచో లక్ష్మీమివ రమాపతేః అని యుండవలెనుగదా? హనుమ రావణుని సమీపమున శయనించి యున్న మందోదరిని చూచి సీతయని పొరపడి తర్వాత కాదని నిర యించుకొనుచోట "నాన్యం నర ముపస్థాతుం సురాణామపి చేశ్వరం" ఇంద్రుడైనను సరే, రాముని దక్క అన్యుని సీత సేవింపదని భావము. ఇచ్చట విష్ణు వధికుడైనచో విష్ణువైనను ఆమె సేవింప దనవలెనుగదా? ధాన్యమాలిని "ఈ అల్పురాలైన సీతపై నీకు ప్రేమ యేల, దానికి నిన్ను పొందు అదృష్టము లేదని" రావణునకు చెప్పుచు "నూన మస్యా మహారాజ న దివ్యాన్ భోగస త్తమాన్ విదధాత్యమరశ్రేష్ఠ స్తవ బాహుబలార్జితాన్ "(సుం, 22 స-41 శ్లో) నీవు బాహుబలముచే ఆర్జించిన దివ్యభోగములను ఇంద్రు డీమె కీయకుండుట నిశ్చయము. ఇచ్చట ఇంద్రుడనగా మనవ్యవహారమున చెప్పుకొను భగవంతుడు. ఈమె కా భోగములను భగవంతుడు వ్రాసిపెట్టలేదు. కనుక ఆమె నిన్నెట్లు వరించును. అని తాత్పర్యము. ఇంద్రుడు ఇచ్చట జీవుల కర్మ ఫల నిర్ణాయకుడుగా చెప్పబడెను. ఇది ఇంద్రాధిపత్యమును సూచించును గదా?

రాక్షసస్త్రీలు సీతను బెదరించుట. "రావణాంతఃపురే రుద్ధాం అస్మాభిస్తు సురక్షితాం న త్వాం శక్తః పరిత్రాతుం సాక్షాదపి పురందరః (సుం. 24 స-32 శ్లో) రావణాంతఃపురబద్ధవై మాచే కాపుచేయ బడుచున్న నిన్ను సాక్షాత్తు ఇంద్రుడు కూడా రక్షింపలేడు అని అర్థము.

రక్షింపగలవారిలో ఇంద్రుడు అధికుడైననేగదా ఇట్లనుట? సీతకు హనుమ చెప్పుట- రావణునకు నీ విక్కడ ఉన్నట్లే తెలియదు, కనుక అతడు నిన్ను తీసుకొనిపోలేదు. ఎట్లనగా ఇంద్రుడు శచినివలె, "తేన త్వాం రానయత్యాశు శచీమివ పురందరః" (సుం. 36 స-22 శ్లో) నేను రాముని ప్రభావమును, దేవేంద్రుని ప్రభావమును శచివలె, ఎరుగుదును అని సీత హనుమకు చెప్పును- "అహం తస్య ప్రభావజ్ఞా శక్రస్యేవ పులోమజా" (సుం. 37 స-17 శ్లో) దేవి ఇంద్రునిచే శచివలె, నీవు రాముని చేనాథవతి వగుదువు; "శచీవ పత్యా శక్రేణ భర్త్రా నాథవతీహ్యసి" (సుం. 39 సం-52 శ్లో).

రాక్షసుల ధనుః ప్రావీణ్యమునకు గూడా ఇంద్రుడే ప్రమాణము. జంబుమాలి హనుమపైకి వెళ్లుచు చేసిన ధనుష్టంకారమును వర్ణించుట "ధనుః శక్రధనుః ప్రఖ్యంమహాద్రుచిరసాయకం విస్ఫారయాణో వేగేన వజ్రాశనిసమస్వనం" (సుం. 44 స-8శ్లో) ఇంద్రజిత్తు ఇంద్రునితో పరాక్రమమున ఉపమింపబడుట "మనః సమాధాయ తదేంద్రకల్పం సమాదిదేశేంద్రజితం స రోషాత్" (సుం. 48 స-1 శ్లో) రావణుడు ఇంద్రజిత్తుకు హనుమద్వధార్థము కర్తవ్యము చెప్పుచు హనుమ అజేయుడు అసాధ్యుడు వీడిదగ్గర చివరకు వజ్రమున్నదా అనుకొన్నచో అట్లును కాదు- ముభావమున "నవజ్ర మాదాయ విశాలసారం" (సుం.48స-11శ్లో) అనగా వజ్రమున్నచో ఒకడు యుద్ధమున అజేయుడు అగుయును లేక వీడజేయుడు డన్నచో వీడెంతటి మేటి? ఇచ్చట వజ్రము యొక్క అజేయతాశక్తి ప్రతిపాదితము. తద్ద్వారా ఇంద్రోత్కర్ష ఉపలక్షితము- ఇంద్రజిత్తు యొక్క బాణప్రయోగమును వర్ణించుచోట ఆ బాణములు వజ్రనిపాతవేగము గలబడెను. "ముమోచ వీరః పరవీరహంతా సుసంనతాన్ వజ్రనిపాతవేగాన్" (సుం. 48 స-28 శ్లో) వైభవోపేతుడైన రావణుడు ఇంద్రునితో పోల్చబడెను! "అన్వాస్యమానం సచివైః సురై

"పస నరేశ్వరం" (సుం. 49 స-15 శ్లో) దశరథుడు సురేశ్వరసమద్యుతిః" అనబడెను. (సుం. 51 స-14 శ్లో).

రామునకు అపకారముచేసి ఇంద్రుడు కూడా సుఖపడలేడు. ఇక నీవనగా ఎంత? హనుమ రావణునకు చెప్పెను. "అపకుర్వన్ హి రామస్య సాక్షాదపి పురందరః న సుఖం ప్రాప్నుయా దన్యః కింపున స్త్వద్విధో జనః" (సుం. 51 స-33 శ్లో) ఇచ్చట ఇంద్రుని ఉత్కృష్టత చెప్పబడినది. బ్రహ్మదేవుడు కూడా వాడిని ఒప్పించలే డన్నట్లు. విష్ణుః వధకుడైనచో సాక్షా దపి పురందరః అనుట యేల?— సీత చిత్తము రామునియందే లగ్నమయి యున్నదని చెప్పుచు" అనన్య చిత్తా రామేచ పౌలోమీవ పురందరే" (సుం. 59 స-28 శ్లో) అని హనుమ అంగదాదులకు చెప్పెను.

కిష్కింధకాండలో- "మహేంద్రమివ దుర్ధర్షం మహేంద్రమివ దుస్సహం మహేంద్రపుత్రం పతితం వాలినం హేమమాలినం" (17 స-11 శ్లో) అని వాలి వర్ణింపబడెను. అనగా ఇంద్రుడు దుర్ధర్షుడని ఉపమానము. రాముడు సుగ్రీవునికి చెప్పుట - "జహారాత్మవినాశాయ వైదేహీం రాక్షసాధమః వంచయిత్వా తు పౌలోమీమనుహ్లాదో యథా శచీం- న చిరాత్ తం హనిష్యామి రావణం నిశితైశ్శరైః పౌలోమ్యాః పితరం దృప్తం శతక్రతు రివాహవే." (కి 41 స-67 శ్లో) అనుహ్లాదుడను శచితండ్రి శచిని హరించినట్లు రావణుడు సీతను హరించెను; మదించిన శచితండ్రిని ఇంద్రుడు సంహరించినట్లు నేను రావణుని సంహరింతును అని అర్థము, (ఈ అనుహ్లాదుని ఉపమానము చిత్రముగా ఉన్నది.)

యుద్ధకాండమున రావణ త్రిశీర్ష కుంభకర్ణ నికుంభ ఇంద్రజిదాదు లెవ్వరును శక్రసముడైన రాముని ఎదిరించుటకు సమర్థులు కారని

విభీషణుడు చెప్పెను" స చేంద్రజిత్ రావణిరథం ప్రసోఢుం త్వంవా రణే శక్రసమం సమర్థాః" (యు. 14 స. 15 శ్లో) రాముడు విష్ణువు అవతారమైనచో ఇంద్రసముడని వర్ణించుట పొసగునా? యుద్ధములందు రామాయణమున ఇంద్రప్రశస్తి చెప్పబడెనే గాని విష్ణుప్రసక్తి లేదు లక్ష్మణునిపై ఇంద్రజిత్తు శరవర్షము కురిపించెననుచు" స లక్ష్మణం సముద్దిశ్య పరం రావణిర్ మాస్త్రిణః వవర్ష శరవర్షాణి వర్షాణీవ పురందరః" (యు. 91 స. 23 శ్లో) లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై ప్రయోగించి చంపిన యస్త్రమును గూర్చి. "యేన శక్రో మహాతేజాః దానవాన్ అజయత్ ప్రభుః పురా దేవాసురే యుద్ధే వీర్యవాన్ హరివాహనః"—తదైంద్ర మస్త్రం సౌమిత్రి స్సంయుగే ష్వపరాజితం శరశ్రేష్ఠే ధనుశ్రేష్ఠే సంశ్రేష్ఠోభిసందధే" (91 స. 68-69 శ్లో) అంగదుడు మహాపార్శ్వుని పిడికిటితో కొట్టగా అది వజ్రసంకాశమని వర్ణింపబడెను." స వీరో వజ్రసంకాశం అంగదో ముష్టి మాత్మనః సంవర్తయత్." (99 స. 22 శ్లో) అక్కడే రావణస్య స్తనాభ్యాశే మర్మజ్ఞో హృదయం ప్రతి ఇంద్రాశని సమస్పర్శం సముష్టిం విన్యపాతయత్" (99 స. 21 శ్లో) మహాపార్శ్వుడు చచ్చినప్పుడు వానరులు చేసిన సింహనాదము "మహేంద్రేణేవ దేవానాం నాద స్సమభవ న్మహాన్" ఇంద్రునితో కలిసి దేవతలు చేసిన సింహనాదమువలె నుండెనట. రావణుడు లక్ష్మణుని పడగొట్టినశక్తి ఇంద్రుని అశనివలె ఉన్నదట. "జగ్రాహ విపులాం శక్తిం దీప్యమానాం స్వతేజసా...జజ్వాల సుమహాఘోరా శక్రాశని సమప్రభా" (యు. 101 స. 23 శ్లో) సా క్షిప్తా భీమవేగేన శక్రాశనిసమస్వనా" 101-32).

రావణుడు రామునిమీద ప్రయోగించిన శూలమునుగురించి "శూలం...మహాఘోరం...,వజ్రసారంమహానాదంసర్వశత్రునిబర్హణం .... ప్రదీప్తమివ రోషేణ శూలం జగ్రాహ రావణః".అది వజ్రమువలె సార

వంతమట. చక్రమువలె అని ఎందుకనలేదు? ఆశూలమును ప్రయోగించుచు రావణుడు రాముని బెదిరించుచు "శూలోయం వజ్రసారస్తే రామ రోషా న్మయోద్యతః తవ భ్రాతృసహాయస్య సద్యః ప్రాణాన్ హరిష్యతి" (104స-18శ్లో) ఇచ్చట ఇంద్రవజ్రముతో తనశూలమును రావణుడే పోల్చుట గుర్తింపవలసినవిషయము. అంతెందుకు సాక్షాత్తు రావణుని చంపిన రామబాణమే ఇంద్రునివజ్రమువలె ఉన్నదని వాల్మీకి వర్ణించుచున్నాడు! "స వజ్ర ఇవ దుర్ధర్షో వజ్రిబాహువిసర్జితః కృతాంత ఇవ చావార్యో న్యపతద్రావణోరసి" (యో112స-17శ్లో, రాముడు విష్ణుమూర్తి యవతారమైనచో ఇదెట్లు కుదురును; విష్ణుచక్రమువలె అనవలెనుగదా? రామాయణమున కంతటికిని పతాకసన్నివేశమైన రావణవధఘట్టమున ఇంద్రోత్కర్ష ఇట్లు ప్రతిపాదింపబడగా ఇంకను విష్ణుపారమ్యము కలదనుకొనుట సహేతుకదృష్టి కాజాలదు - రామబాణనిహతుడై నేలకూలిన రావణుని వర్ణించుచు "పపాత స్యందనాద్భూమౌవృత్రో వజ్రహతో యథా" (యు.112స.22శ్లో) అని రామబాణనిహతుడైన రావణుడు ఇంద్రనిహతుడైన వృత్రునితో పోల్చబడెను. ఇక రాముడో -స తు నిహతరిపుః స్థిరప్రతిజ్ఞః స్వజనబలాభివృతో రణే రరాజ రఘుకులనందనో మహౌజా త్రిదశగణైరభిసంవృతో యథేంద్రః". (112స.42శ్లో) రామాయణపరాకాష్ఠయగు సన్నివేశమున ఇంద్రప్రతిష్ఠ ఇట్లున్నదని సర్వులు గ్రహింతురుగాక. రావణవధానంతరము రాముడయోధ్యకు తిరిగి రాగా దానిని కూడా "పురీ మయోధ్యాం దదృశుః ప్లవంగమాః పురీం మహేంద్రస్య యథామరావతీం" (యు.126స.52శ్లో) అని అయోధ్య ఇంద్రుని అమరావతితో పోల్చబడినది. వైకుంఠముతో కాదు. రాముడు విష్ణువైనచో అయోధ్యను అమరావతితోను రావణుని చంపిన రాముని ఇంద్రునితోను పోల్చుట కుదురునా? అయోధ్యచేరి రాముడు పురోహితునికి నమస్కరింపగా దానిని కూడా పురోహిత స్యాత్మసమస్య రాఘవః

బృహస్పతే శ్శుక్ర ఇవామరాధిపః నిపీడ్య పాదౌ పృథగాసనే శుభే సహైవ తేనోపవివేశ రాఘవః” (130స-61శ్లో) అని వర్ణించెను.

ఇంకను రామాయణము విష్ణుపారమ్యమును ప్రతిపాదించుగ్రంథమన్నచో “బ్రహ్మాపి నరం న రంజయతి”—

# వేదమునందు ఇంద్రా విష్ణువులు

వేదమందు ఇంద్ర విష్ణుదైవత్యముల స్వరూపస్వభావములు పరిశీలించినచో చిత్రముగా ఉండును. వేదమందలి ఇంద్రుడు పురాణములందలి విష్ణువువలె నుండును అనగా పురాణములందు విష్ణువునకు చెప్పబడిన లక్షణములు వేదమందలి ఇంద్రున కుండును. కొన్నిచోట్ల వేదమందలి విష్ణువు ఇంద్రుడే నేమో అనిపించును. విష్ణుశబ్దము వెనుక చూపినట్లు, ఇంద్రునకు కొన్నిచోట్ల విశేషణముగా వాడబడుటచేతను; ఇంద్రుడు ప్రసక్తము కావలసిన కొన్నిచోట్ల విష్ణుశబ్దము ప్రయుక్తమగుట చేతను, వైదికవిష్ణువుయొక్క విశిష్టలక్షణమైన త్రివిక్రమత ఇంద్రలక్షణముగా అనేకచోట్ల వర్ణింపబడి యుండుటచేతను విష్ణువనగా ఇంద్రుడేనా అనిపించును.

పౌరాణికవిష్ణులక్షణములు వైదికఇంద్రునియం దుండుటకు ఉదాహరణములు- విష్ణువుయొక్క సర్వవ్యాప్తత్వలక్షణము వైదికఇంద్రునియందు కలదు:—"న హి త్వా రోదసీ ఉభే ఋఘాయమాణ మిన్వతః జేష స్వరస్వతీరపః సంగా అస్మభ్యం ధూనుహి" (ఋ.1మండ.8అను. 10 సూ.93 మంత్ర) ఓ ఇంద్రా శత్రువులను జయించుచున్న నిన్ను భూమ్యాకాశములు రెండును భరింపజాలవు... "ఇంద్రం విశ్వా అవీవృధ న్త్సముద్రవ్యచసం గిరః రథీ తమం రథీనాం వాజానాం సత్పతిం పతిం" (ఋ.1మం 8అను.11సూ.103మం) సముద్రమునుంబోలి విస్తారమయినవాడు రథికులలో ఉత్తమ రథికుడు, ఈశ్వరుడు. సత్పురుషులకు రక్షకుడు అగు ఇంద్రుని స్తుతులన్నియు వృద్ధిపొందించుచున్నవి - "త్వం భువః ప్రతిమానం పృథివ్యా ఋష్వవీరస్య బృహతః పతిర్భూః విశ్వమాప్రా అంతరిక్షం మహిత్వా సత్యమద్ధానకి రన్యస్త్వావాన్ (ఋ1మం, 10 అను.52సూ.62మం) ఇంద్రా నీవు భూమిఅంత విస్తారమైనవాడవు.

ద్యునీయుంగు పీఠలు గల ద్యులోకమునకు అధిపతివి. మహిమచేత అంతరిక్ష మంతట నిండియున్నావు. కనుక నీవంటివాడు అన్యుడు లేడు- "న హి మయూ దధిమన్యేంద్రం కో వీర్యా పరః తస్మి న్నృమ్ణముత క్రతుం దేవా ఓజాంసి సందధు రర్చన్ననుస్వరాజ్యం" (1,మం.13అను. 80 సూక్త 952 మక) సర్వత్ర వ్యాపించియున్న ఇంద్రుని మేము తెలియలేకున్నాము. వీర్యవంతుడై ఎవరికిని తెలియనిచోట ఉన్న ఇంద్రుని మనుష్యు డెవడు తెలిసికొనగలడు "తదు ప్రయతమ మస్య కర్మదస్మ స్యచారుతమమ స్తిదంసఃఉపహ్వారే యదుపరా అపిన్వన్మ ధ్వర్ణసో నద్యశ్చతస్రః" (ఋ.1మం 11అను.62సూ 714మం) ఈ ఇంద్రుడు భూమియొక్క సమీపస్థలమందు స్థాపింపబడి మధురోదకము గల నాలుగు నదులను ప్రవహింపజేసెను.-" ద్వితా వి వవ్రే సనజాస నీళే అయాస్యః స్తవమానేభిరర్కైః భగోన మేనేపర మేవ్యోమనధారయ ద్రోదసీ సుదంసాః"- (నిత్యజాతములై ఒకేచోట నున్న ద్యావా పృథువులు రెంటిని విడదీసెను. అంతరిక్షమందలి సూర్యునిబోలి శోభన కర్మలు చేయు ఇంద్రుడు ద్యావాపృథువుల ధరించెను.

పౌరాణిక విష్ణువుయొక్క సర్వకర్తృత్వ సర్వనియామకత్వ ములు వైదిక ఇంద్రునియందు కలవనుటకు- "త్వ మస్య పారే రజసే వ్యోమ నః స్వభూత్యో జాఅవ సేధృషన్మనః। చకృషే భూమింప్రతిమాన మోజసోపః స్వఃపరిభూరేష్యాదివం" (ఋ1మం.10అను.53సూ.626మం) ఇంద్రా ఈ కనబడు అంతరిక్షలోకమున కవతల నున్నవాడవై బలమే ధనముగా గల నీవు మమ్ము రక్షించుటకు భూలోకమును చేసితివి. బలవంతుల బలమునకు సాటి చెప్పబడిన బలముగలవాడ వయితివి. శుభముగా నడువదగిన అంతరిక్షమును స్వాధీనపరచుకొంటివి. "స ధారయత్ పృథివీం పప్రథచ్చ..." (ఋ.1మం.15అను.103సూ.1101మం) ఆ ఇంద్రుడు భూమిని పోషించెను. తరువాత విస్తరించెను. "ఈశానో

అప్రతిష్కృత ఇంద్రో అం" (ఋ.1మం. 12అను. 34సూ 391 మం.) ఎదురాడ శక్యము కానివాడై ఇంద్రుడు సర్వ జగమునకు ఈశ్వరుడు- "త మీశానం జగత స్తస్థుషస్పతి ధియం జిన్వ మవసే హూమహే వయం..." (ఋ.1మం.14అను.59 సూ.948మం.) ఐశ్వర్యవంతుడు స్థావరజంగమాత్మక జగత్తునకు పతియు, కర్మమందు ప్రీతికలవాడు నగు ఆ యింద్రుని మా రక్షకై పిలుచుచున్నాము-"యో విశ్వస్య జగతః ప్రాణతస్పతిర్యో బ్రహ్మణే ప్రథమో గా అవిందత్" పతికియు సమస్త జగత్తునకు ఏ ఇంద్రు డధిపతియో...(ఋ.1మం.15అను. 10సూ 1052 మం.) త్రివిష్టిధాతు ప్రతిమాన మోజస స్తిస్రో భూమి నృపతే త్రీణిరోచనా అతీదం విశ్వం భువనం వవక్షిథాశత్రురింద్రజనుషాసనాదసి" (ఋ.1ము.15 అను.102 సూ.1093మం.) జనులకు పతివైన ఇంద్రా ఏందుచే నీవు చిరకాలమునుండి జన్మమొదలు అజాతశత్రుడవో అందుచేత సకలప్రాణుల బలములకు ముప్పిరిత్రాళ్లవలె గట్టి శరీరము గలవాడవై మూడులోకములను మూడు తేజస్సులను ధరించుచున్నావు. ఈ ప్రపంచమంతటిని ధరించుచున్నావు.

పౌరాణికవిష్ణువువలె వైదిక ఇంద్రుడు కాలకర్త (వైదికవిష్ణువు నైతము) "తదూచుషే మానుషామాయుగాని కీర్తేన్యం మఘవానా మబిభ్రత్..." (ఋ.1మం.15అను.104సూ.1103మం.) శత్రువులను లొంగదీయునట్టి ఇంద్రుని బలమును స్తుతించు యజమానునకు స్తుతింప దగిన బలమును ధరించు ఇంద్రా మనుష్యసంబంధమైన యాకనబడుచున్న యుగములను నీవు ఇచ్చుచున్నావు.

పౌరాణికవిష్ణువువలె వైదిక ఇంద్రుడు పురాతనుడు "శిక్షానరః ప్రదివో అకామ కర్శనః సఖానభిభ్యా స్తమిదంగృణీమసి" (ఋ.1మం10 అను.58సూ.631మం.) అందరిని పాలించువాడవు దాతృత్వము నడపు వాడవు. పురాతనుడవు. కోరినకోర్కెలు త్రోసివేయనివాడవు.

సఖులకు ప్రియుడవు ..."ఇంద్రాయ హృదా మనసా మనీషా ప్రత్నాయ పత్యే ధియో మర్జయంత "(ఋ.1మం11అను.61సూ 694మం.) పురాతనుడు, స్వామి. అగు ఇంద్రునికొరకు మనస్సుతో బుద్ధితో స్తుతులను సమర్పించుచున్నాను.

పౌరాణికవిష్ణువున కున్న సర్వదేవాత్మక విశ్వరూపలక్షణములు వైదిక ఇంద్రునకు గలవు :- "యుంజంతి బ్రధ్నమరుషం చరంతం పరిత స్థుషః రోచంతే రోచనాదివి (ఋ.1మం.2.అను.6సూ 51మం) సూర్య రూపముగాను అగ్నిరూపముగాను ఉన్నట్టియు, వాయురూపముగా సర్వత్ర చరించునట్టియు ఇంద్రుని చుట్టునున్న ప్రాణులు తమసర్వ కర్మలలోను దేవతగా వాడుకొనుచున్నారు. ఆ ఇంద్రుని మూర్తులే నక్షత్రములుగా ఆకాశమున వెలుగుచున్నవి.-ఆ క్రింది 53వ ఋక్కు ఇంద్రుని సూర్యుడని చెప్పుచున్నది. కేతం కృణ్వన్న కేతవే పేశో మర్యా అపేశసే సముషద్భిరజాయథాః మరుత్తులు కూడా ఇంద్రుని రూపములే అని 54వ ఋక్కు చెప్పుచున్నది. "ఆదహాస్వ ధామను పునర్గర్భత్వమేరిరే దథానానామయజ్ఞియం" ఋ 1మం.18అను.121 సూక్తములోని 1331 నుండి 1337 వరకు గల ఋక్కులు ఇంద్రుని సూర్యునిగా వర్ణించుచున్నవి. ఆ మండలమునందే 15అను.102 సూక్త మందలి 1090వ ఋక్కుకూడా అట్టిదే. ఇంద్రుడే వైశ్వానరుడని ఋ 1మం.11అను.59సూ.683మం చెప్పుచున్నది. "ప్రనూమహిత్వం వృషభస్య వోచం యం పూరవో వృత్రహణం సచంతే । వైశ్వానరో దస్యు మగ్ని ర్జఘన్వా అధూనోత్కాష్ఠా అవశంబరంభేత్"-వృత్రుని సంహరించిన యే వైశ్వానరుని మనుష్యులు సేవించుచున్నారో ఆ వర్షమును కురిపించు వైశ్వానరుని మాహాత్మ్యమును శీఘ్రముగా చెప్పు చున్నారు. ఈ వైశ్వానరాగ్ని దస్యుని చంపెను. శంబరుని భేదించెను. ఉదకములు క్రిందపడునట్లు చేసెను. ఈ విధముగా

ఇచ్చట ఇంద్రచర్యలు వైశ్వానరునకు చెప్పబడుటచేత ఇంద్రవైశ్వానరుల కభేదము వివక్షితమని గ్రహింపనగును. ఇట్లే విష్ణువునకు ఇంద్రచర్యలు చెప్పు ఋక్కులను కూడా వెనుక ఉదహరించితిని (ఋ.1మం.. 21 అను 156సూ).

ఇట్లే ఋ.1మం.13 అను.78సూ834 ఋక్కు అగ్ని ఇంద్రుడని చెప్పును "త్వముత్వా వృత్రహంతమం యోదస్యూం రవధూనను షేద్యుమ్నైరభిప్రణోనుమః" ఓ అగ్ని దస్యులను నీవు తూలగొట్టుచున్నావు, వృత్ర హంతవగు నిన్ను స్తుతిమంత్రములతో స్తుతింతుము.

పౌరాణికవిష్ణువున కున్న దుష్టశిక్షణ శిష్టరక్షణ లక్షణము వైదిక ఇంద్రున కున్నది."తే త్వామదాఅమదంతానివృష్ణానితేసోమాసో వృత్రహత్యేషు సత్పతే" (ఋ. 1 మం. 10 అను 53 సూ. 635 మం.). "రథీతమం రథీనాం వాజానాం సత్పతింపతిం" (ఋ 1. మం.3అను.11 సూ.103 మం.) సత్పతిః అనగా, శిష్టరక్షకుడు. ఇంద్రుడు వేదమున అనేకపర్యాయములు సత్పతే అని సంబోధింపబడుచుండును.

ముఖ్యముగా గుర్తించవలసిన మరొక విషయము- వేదమున విష్ణువు పురాణములందు ప్రతిపాదింపబడిన విష్ణువువలె ఉండడు. వేద విష్ణువునకు ఒకేఒక లక్షణము కలదు. అది - అతడు కేవలము మూడు పాదములచే మూడు లోకము లాక్రమించిన దైవత్యమే ఆ దైవత్యమునకు పౌరాణిక విష్ణువుయొక్క లక్షణము లేవియు లేవు. పైగా త్రివిక్రముడను పేరు గూడా లేదు. "త్రివిక్రమకృతోత్సాహం నారాయణమివ ప్రజాః" (కిష్కిం. 67 స. 3 శ్లో.) అని ఒక్కచోట త్రివిక్రమ శబ్దము కలదు కానీ అది ప్రక్షిప్త మనవచ్చును. ఈ పాదమున నారాయణశబ్దముండుటయే దానికి కారణము. రామాయణ విష్ణువు వైదిక విష్ణువే. నారాయణ భావము దానికి అర్వాచీనము. నారాయణ

శబ్దము రామాయణమున రెండు మూడు మార్లే వచ్చును. ఆ సందర్భములు గ్రంథమున ప్రక్షిప్తములు. ఋగ్వేదమండలి 1 మం. 21 అను. 154 సూక్తములోని 1597,1598,1599 1600 ఋక్కులు వైదిక విష్ణువును వర్ణించును.

"విష్ణోనుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి యో అస్కభాయదుత్తరం సధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః...

పృథివీసంబంధమైన మూడులోకములను నిశ్చలముగా స్థాపించెను. చాలమందిచేత స్తుతింపబడినవాడై మూడు విధములుగా నడచి లోకములను సృజించెను.

"ప్రతద్విష్ణుస్తవతే వీర్యేణ మృగో నభీమః కుచరో గిరిష్ఠాః యస్యోరుషుత్రిషువిక్రమణేష్వధిక్షియంతిభువనాని విశ్వా..."

ఆ విష్ణువుయొక్క విశాలమయిన మూడడుగులందు సమస్త లోకములు ఇమిడియున్నవి.

"ప్రవిష్ణవేశూషమే తుమన్మగిరిక్షిత ఉరుగాయాయ వృష్ణేయఇదం దీర్ఘం ప్రయతం సధస్థమేకో విమమేత్రిభిరిత్పదేభిః"-

ఆ విష్ణువు ఈ కనపడుచున్న విశాలమయిన ఏకరీతిగా కలసిఉన్న ఈలోకమును మూడుపాదములతో ఒక్కడే ఆక్రమించెను...ఇత్యాది- యజుర్వేదమునకూడా ఈ మంత్రములే కలవు. మొత్తముమీద, వైదిక విష్ణువుయొక్కలక్షణము లివియే.- ఈ శబ్దములే వాడకపోయినను ఇంద్రవర్ణనలు కొన్ని పరిశీలించినచో ఈ లక్షణము లన్నియు ఇంద్రునకు వేదమునందు చెప్పబడినవే. అనగా ఇంద్రునకున్న అట్టిలక్షణములు గైకొని విష్ణువను నొక ప్రత్యేకదేవత ఏర్పడినట్లు ద్యోతకమగును.

ఇంద్రుడు ద్యులోకభూలోకములనాక్రమించెనట- "పరియదింద్ర రోదసీఉభేఅబుభోజీర్మహినావిశ్వతఃసీమ్ ...(ఋ.1మం 7అను.53సూ.392 మం) ఇంద్రా, నీమహిమచే భూమ్యాకాశములు రెంటిని ఎపుడాక్రమించి అనుభవించితివో...

1 మం.10అను.53సూక్తములోని 624,625,626,627,628,629 ఋక్కులు ఇంద్రుని యొక్క త్రివిక్రమత్వలక్షణమును చెప్పుచున్నవి. ఉదా.627 ఋక్కు "త్వంభువఃప్రతిమానంపృథివ్యాఋష్వవీరస్య బృహతఃపతిర్భూః। విశ్వమాప్రా అంతరిక్షంమహిత్వాసత్యమద్ధానకి ర్న్యస్త్వావాన్"-ఇంద్రా నీవు పృథివితో సాటియగు విస్తీర్ణత కల వాడవు. దర్శనీయులగు వీరులు గల గొప్పదగు ద్యులోకమునకు అధిపతివైతివి. మహిమచేత అంతరిక్షము నంతటను నిండియున్నావు. కనుక నీవంటివాడు ఇతరు డెవడును లేడు। (మరి విష్ణువు మాటేమిటి?)

628ఋక్కు-"న యస్య ద్యావా పృథివీ అను వ్యచోన సింధవోరజసో అంతమానశుః।నోతస్వవృష్టింమదేఅస్యయుధ్యతఏకో అన్యచ్చ కృషేవిశ్వమానుషక్". ఏ ఇంద్రువ్యాప్తిని భూమ్యంతరిక్షములు పొంద సమర్థములు కాలేకపోయెనో అట్టి ఇంద్రా! సోమపానమద మెక్కి యుద్ధము చేయునప్పుడు నీ బలమును, వర్షమునాపిన వృత్రాదులు సహింపలేక పోయిరి. కనుక నీ వొక్కడవే ఇతర సర్వలోకమును ఆక్రమించుకొని యుంటివి.

* "ముషాయ ద్విష్ణుః పచతంసహీయాన్విధ్యద్వరాహంతిరో అద్రిమస్తా" (1మం11అను.61సూ.699మం.) సర్వజగత్తును వ్యాపించిన వాడై అసురులధనమును అపహరించెను-ఇది భాగవతమందలి బలిచక్ర వర్తి కథలోని విష్ణుకార్యమే గదా!

ఇట్లే 1మం.13అను.82సూ.868ఋక్కు,102సూ.1076ఋక్కు, 103సూ.1100.ఋక్కు ఇంద్రుని త్రివిక్రమలక్షణము వర్ణించును. అన్నిటి కంటెను మించినది- 19అను.133సూక్తములోని 1449ఋక్కు "అభివ్లగ్యా చిద్రివశ్శీర్షాయాతుమతీనామ్ ఛింధివటూరిణాపదామహావటూరిణా పదా"-శత్రువులను నశింపజేయు ఇంద్రా! హింసించునట్టి శత్రుసేనల శిరస్సుల నంతటను వ్యాపించిన సర్వవ్యాపకమగు ఐరావత పాదము చేతను అంతటను వ్యాపించిన నీపాదముచేతను నణగద్రొక్కుము.

మరొకటి-"న హి త్వా రోదసీ ఉభేఋఘాయమాణమిన్వతః" (ఋ.మం.3అను.10సూ.98మం) ఓఇంద్రా శత్రువులను జయించుచున్న నిన్ను భూమ్యాకాశములు రెండును భరింపజాలవు.

ఇట్టి మంత్రములు ఋగ్వేదమందు చాల కలవు. సామవేదము నందును ఎన్నో కలవు. "అధజ్మోఅధవాదివోబృహతోరోచనాదధి। అయా వర్ధస్వతన్వాగిరామమాజాతాసుక్రతోపృణ" (సామ.ఆగ్నేయ కాండ.1అధ్యా 5 ఖంఢ.52మంత్ర) ఇప్పుడు భూమినుండి లేక ద్యులోకమునుండి లేక స్వర్గము నుండి వచ్చి నాస్తుతివాక్కుతో వృద్ధిపొందుము. అనగా ఇంద్రు డీ మూడు లోకములందు వ్యాపించియున్నాడని భావముగదా? "ఓజస్తదస్యతిత్విషఉభేయత్సమవర్తయత్ ఇంద్రశ్చర్మేవరోదసి" (సామ.ఆ.కాం.2అ.7ఖం.182మం, ఈ ఇంద్రునిబలము ప్రకాశించినది. ఏ బలముతో ఈ ఇంద్రుడు ద్యులోకభూలోకములను రెంటిని చర్మమువలె వాడుకొనెనో అట్టి ఇంద్రబలము...సామవేదము యొక్క ఐంద్రపర్వమున 3అ.5ఖం.278 మంత్రమునందు" యద్ద్యావఇంద్రతే శతగ్ం శతంభూమిరుతస్యుః। నత్వావజ్రిన్త్సహస్రగ్ంసూర్యాఅను నజాత మష్టరోదసీ" - ఓ ఇంద్రా నీయొక్క కొలతకు నూరు ద్యులోకము లున్నను చాలవు. భూలోకములు నూరున్నను, నీశరీరము వ్యాపించుట కవి చాలవు. లెక్కలేనన్ని సూర్యులున్నను నిన్ను ప్రకాశింపజేయలేరు. భూమ్యాకాశములు రెండును సమర్థములుకావు.

వేదమున ఇంద్రలక్షణములను విష్ణునామమును ప్రయోగించి వర్ణించు కొన్ని మంత్రములు కలవు: ఆసందర్భములందు విష్ణుశబ్దము నామమాత్రమే అని తోచుచున్నది. ఇంద్రునకు బృహస్పతికి విష్ణు శబ్దము కొన్నిచోట్ల కేవలము విశేషణ ప్రాయముగా మాత్రమే ప్రయోగింపబడినదని వెనుక చూపితిని. కనుక ఇంద్రలక్షణములు విష్ణునామము ప్రయోగించి వర్ణించు మంత్రములందున్న విష్ణుశబ్దమునకు కూడా ఇంద్రుడనియే భావమేమోఅని తోచును. ఉదా ఋగ్వే. 1మం.డ.21అను. 156 సూక్త.1609మంత్రమయిన "భవా మిత్రో నశేవ్యోఘృతాసుతిర్విభూత ద్యుమ్న ఏవయా ఉసప్రథాః" అని కలదు. ఓ విష్ణూ మిత్రునివలె సుఖము కలిగించు వాడవు. ఉదక మును పుట్టించు వాడవు. విస్తారముగా అన్నము కలిగించువాడవు. రక్షకుడవు... 15వ సూక్తమున 1606 మంత్రమున "తత్తదిదస్యపౌం స్యం గృణీమసీనస్యత్రాతురవృకస్యమీఢుషః..." సర్వమునకును ప్రభువు, పాలకుడును, హింసారతుడును, వర్షము కురిపించువాడును అగు ఈ విష్ణువుయొక్క పౌరుషము...ఈ మంత్రమున విష్ణుశబ్దము లేదు. పూర్వోత్తరమంత్రములను బట్టియే ఆశబ్దమునిచ్చట చేర్చుకొనవలెను. ఋగ్వేద 1మం.14అను. 86సూ. 911వ మంత్రమును ఇట్టిదే.

మరొకటి-వేదమందలి ఇంద్రునియొక్క కొన్ని విజయములే తర్వాత పురాణములందు విష్ణువిజయములుగా రూపాంతరీకృతములు చేయబడెను అని చెప్పవచ్చును. ఉదాహరణకు - మృగరూపముగా మాయావిగా ఉన్న వృత్రుని ఇంద్రుడు వధించెనని వేదము చెప్పిన దానికే రామాయణమున మృగరూపమున మోసగించిన రావణుని రాముడు చంపుట అయిన దనుకొనవచ్చును (సూ.31స.11శ్లో) సామ, వే. ఐంద్రపర్వ-అ.7ఖం.412మంత్రము" ఇంద్రతుభ్యమిదద్రివో౽నుత్తం వజ్రిన్ వీరం యద్ధత్యం మాయినం మృగం తవ త్వన్మాయయావధీరర్చ

స్నసుష్వరాజ్యం." ఇంద్రా!వజ్రఘాటి! నీ వీరకృత్యమే శత్రువులు తిరస్క-రింప శక్యముకానిది. ఏ వీర్యము చేత మాయతో మృగరూపము నొందిన యావృత్రుని నీవును మాయతో చంపితివి.

ఇంద్రుడు నముచియను రాక్షసునితో అయుధముతో చంపను, రాత్రిగాని పగలుగాని చంపను అని చెప్పి ఆ రాక్షసుని సంధ్యాకాలమున నురుగుతో చంపెనని వేదమున గలదు. సామ. వే.ఐంద్రపర్వ. 2అ.10ఖం.211మం. "అపాంఫేనేన నముచేః శిర ఇంద్రో దవర్తయః విశ్వాయదజయస్స్పృథః" ఇదే పురాణములందలి నృసింహావతార కథ యనుకొనవచ్చును.

ఇంద్రుడు గోవులను రక్షించువాడని వేదమున ప్రసిద్ధముగా అనేక మంత్రములు చాటుచున్నవి. అంగిరసుని గోవులను రాక్షసుడు అపహరించి కొండ గుహలో దాచగా ఇంద్రుడు వానిని వధించి గోవులను విడిపించెనని కలదు. ఈ గోవులు కొన్నిచోట్ల ఉదకములను అర్థమున ప్రయోగింపబడును. మొత్తముమీద వేదమున ఈ వృత్తాంతములు ఏదో ఒక తాత్త్వికభావమును చెప్పుటకు అల్లబడిన కథలుగా తోచును. వేదమున ఇట్లు విస్తారముగ కథితమైన ఇంద్రుని గోరక్షణ లక్షణమునుండియే పురాణములందలి కృష్ణావతారము ఆవిర్భవించినట్లు కనుపించును. వేదమందలి అనేక ఇంద్రలక్షణములు చర్యలు పురాణ కృష్ణుని యందు కనుపించును. దీనిని విస్తరించి సిద్ధాంతము చేసినచో ఒక పెద్ద గ్రంథమగుటకు అవకాశమున్నది.

అసలీ ఇంద్రవృత్రులను గురించి పూర్వుల యభిప్రాయము చూచినచో ఆశ్చర్యముగా ఉండును. వేదమున వృత్రుడు అహి అని కూడా పేర్కొనబడెను. ఇంద్రుడు వృత్రుని కొట్టినప్పుడు, అహిని కొట్టినప్పుడు జలములు భూమిపై పడినట్లును నదులు ప్రవహించినట్లును

వేదమున అనేక పర్యాయములు వర్ణింపబడెను. వృత్రుడు లేక అహి మాయచేత అంధకారము కలుగుచున్నదనియు వర్ణింపబడినది. ప్రసిద్ధ వేదభాష్యకర్తయగు సాయనాచార్యులు అహిః అనగా వృత్రః అనియు అనగా మేఘః అనియు తన భాష్యమున తెల్పెను. దీనిని గురించియే యాస్కుడు చెప్పినది చూడుడు-" తత్కోవృత్రః? మేఘ ఇతి నైరుక్తాః - త్వాష్ట్రోఽసుర ఇత్యైతిహాసికాః-అపాంచ జ్యోతిషశ్చ మిశ్రీభావ కర్మణః వర్షకర్మ జాయతే - తత్రఉపమార్థేన యుద్ధ వర్ణాభవంతి." (అందుచేత వృత్రుడెవరు ? మేఘుడని నైరుక్తులందురు, త్వష్టకొడుకగు అసురుడని ఐతిహాసికులందురు-జలములును జ్యోతిస్సును కలియుటచే వర్షము పుట్టుచున్నది. వాటికి రూప కల్పన చేయుటచే యుద్ధ వర్ణనలు సంభవించినవి.) ఇచ్చట జలమయుడైన మేఘుడు వృత్రాసురుడు, జ్యోతిస్సు ఇంద్రుడు. కనుక ఇంద్ర వృత్రాదినామములు రూపకల్పనలు.

ఇట్టి కారణములచేత తొలుత ఋగ్వేదీయఇంద్రుడే సర్వదేవతల సృష్టికిమూల భూతుడనియు, ఆయననుండియే ఇంద్రలక్షణము లొక్కటొకటి గైకొని క్రమముగా ప్రత్యేక దేవతలు కల్పింపబడిరనియు ఊహించుట సమంజసము. ఇంద్రునికి వాడబడిన విశేషణ ప్రాయమైన విష్ణు శబ్దమును, కొన్ని ఇంద్ర లక్షణములను తీసుకొని విష్ణుదేవత కల్పింపబడి, ఒక ప్రత్యేక దేవతగా స్థిరమైనట్లు తోచును. ఇంద్రునికి విష్ణు శబ్దమును విశేషణముగా వాడిన మంత్రములును, విష్ణు శబ్దము వాడి ఇంద్ర లక్షణములను వర్ణించిన మంత్రములును అతి ప్రాచీనములనియు,- అనంతర మంత్రకర్తలు పూర్వమంత్రములందలి విష్ణు శబ్దము ఒక భిన్న దైవతమని భ్రమించిగాని భావించిగాని విష్ణుదేవతాకములైన మంత్రములను ప్రత్యేకముగ రచించిరనియు, ఆ విధముగా ఇంద్రావిష్ణువులు భిన్న దేవతలుగా ఏర్పడినతర్వాత ఇర్వురిని కలిపి చెప్పు మంత్రములు వచ్చినవనియు ఊహించుట హేతుయుక్తము కాకపోదు.

కనుకనే వేదమందు కొన్నిచోట్ల ఇంద్రునికన్న విష్ణువు తక్కువ దైవతముగా చెప్పబడి, తర్వాత ఇంద్రా విష్ణువులు సఖులుగా చెప్పబడి, చివరకు యజుర్వేదమున ఇంద్రునికంటె విష్ణువే అధికమను భావము కలిగించు మంత్రములు ఉత్పన్నమైనట్లు తోచును. విష్ణువు ఇంద్రుని నుండి ఇట్లు ఉత్పన్నమై క్రమపరిణామము చెందినట్లున్నది. వేదమునందే ఇంద్రా విష్ణువులు అదితి కొడుకులనియు, విష్ణువు అనుజుడనియు కలదు.

కనుక వేదమందున్న ఇట్టి ఇంద్రపారమ్యమే రామాయణమున గలదు. అయితే రాముని యజుర్వేద వినీతశ్చ అని వర్ణించినచోట, రామునికి అపకారము చేసిన నిన్ను ఇంద్రుడు కూడా రక్షింపలేడు అని చెప్పబడిన చోట, ఇంద్రుని వజ్రమునకైనను తిరుగున్నదిగాని రామబాణమునకు తిరుగులేదని చెప్పినచోట, రాముడు ఇంద్రుని కంటె అధికుడని భావ మనుకొనుటకు అవకాశములేదు. "బ్రహ్మవ్రాతకైనా తిరుగుంటుం దేమో గాని మన గన్నయ్య మాటయిస్తే ఇక తిరుగులేదు. అని మన నిత్య వ్యవహారము నందున్న వాడుక మాటకు గన్నయ్య బ్రహ్మకంటె అధికుడని భావమా? - కనుక అదంతయు రాముని ఉత్కర్ష చెప్పుటకు అవలంబించిన పద్ధతియే గావచ్చును. ఈ సందర్భములకంటె రామాయణమున రాముని ఇంద్రునితోను, రామబాణమును వజ్రముతోను, అయోధ్యను అమరావతితోను పోల్చిన సందర్భములే ఎక్కువ కలవు. రాముడు కనీసము యజుర్వేద విష్ణువని యైనను ప్రతిపాదించుట వాల్మీకి యుద్దేశమైనచో ఇట్టి వర్ణనలచేత రాముని ఇంద్రునితోను ఇంద్రలాంఛనముల ప్రసంగము చేతను పోల్చి వర్ణించుట అసంగతముకదా? ఈ విషయము వెనుక విపులముగ చర్చించితిని.

ఇక రాముని యజుర్వేద వినీతత్వము ఆనాటి యజుర్వేద ప్రాశస్త్యమును చెప్పునేకాని యజుర్వేదమందలి విష్ణుపారమ్యమును చెప్పు

నచుకొనుటకు చాలదు. కారణము - యజుర్వేదము వేద కర్మాను ష్ఠాన విధులను ప్రతిపాదించును. అట్టి విధులు ఆనాటికి ప్రాతవైన వాయిరంతు బలముకలిగి సుప్రతిష్ఠితములై యుండును. కనుక యజుర్వేదశిక్ష అనుష్ఠానపరులకు అవసరము. రాముడట్టి పాండి త్యము కలవాడన్నచో కర్మిష్ఠియనితాత్పర్యమునుకొనుట సమంజసము.

# రామాయణము భారతమునకంటె అధునాతనమను వాదము

గీర్వాణ వాక్ప్రపంచమున పాశ్చాత్యపండితులు గడచిన వంద సంవత్సరములలో చేసిన కృషి అద్వితీయము. భారతీయుల యుత్సాహమా ప్రపంచమున పతనదశయందున్నప్పుడు దానిని పునరుజ్జీవింప జేసినవారు వారే. నిష్పాక్షికమైన సక్రమమైన పరిశీలనాత్మకమైన వారికృషి మనదేశస్థులకు మార్గదర్శకము. కానీ వారితో ఒక బాధ కలదు. ఈ దేశపు వాఙ్మయము ఏ దృష్టితో రూపొందింపబడినదో ఆ దృష్టి యొక్క సూక్ష్మతత్త్వమును వారు గ్రహించుట కష్టము. వ్యాకరణాదులచేత వాఙ్మయముయొక్క బాహ్యస్వరూప లక్షణములు గ్రహించుట సులభముగానీ వాఙ్మయముయొక్క అంతరస్వరూపము గ్రహించుట అట్లు కాదు. కనుకనే వారు మన వేదశాస్త్రముల తత్త్వమును సమగ్రముగ గ్రహించి రనుకొనుటకు వీలులేకున్నది. కనుకనే యుగమన్వంతర కల్పాదిరూపమైన భారతీయ కాలతత్త్వమును అవగతము చేసుకొనలేకపోయిరి. బ్రహ్మ, వ్యాస, అవతార పురుషాదులయొక్క ప్రతికల్ప పునరావృత్తి తత్త్వరహస్యము బోధపడినట్లు కనుపించదు. మంత్రఋషులకు మంత్రములకు మన దృష్టియందు కల సంబంధము వారికి అర్థమైనట్లు తోచదు. వేదములనుండి ప్రారంభించి నేటికిని భారతీయ వాఙ్మయప్రపంచమును పాలించుచున్న ధ్వనిమార్గము మీద వారికి సానుభూతి కలిగినట్లే కనుపించదు ఈ నాల్గు తెలియకపోయినచో మనదేశపు సంప్రదాయ మెరుగని అన్యదేశస్థులకే గాక మనదేశస్థులకుగూడా ఆయా గ్రంథములయొక్క అందలి ఆయా వృత్తాంతములయొక్క పౌర్వాపర్యములను నిర్ణయించుపట్ల ప్రమాదములు సంభవించి వారు భ్రాంతులకు గురియగుట అనివార్యము.

రామాయణము భారతమును చూచి వ్రాసిన గ్రంథమని,
భారతము ముందు పుట్టినది రామాయణము ఆ తర్వాత వచ్చినది అని
భారతీయులు ఇట్టి భ్రాంతిలోనే. పాశ్చాత్యదేశీయ పండితులందలి గుణమును
గ్రహించి, వారెచ్చట పొరపడుటకు అవకాశ మున్నదో అచ్చట వారిని
సవరించుటయు శ్రేయస్కరము.

రామాయణము భారతమునకుపూర్వము వ్రాయబడిన గ్రంథ
మని నేనింతకాలము విశ్వసించుచుంటిని. ఆ ప్రకారమే దానిపై
కొంత పరిశోధన జరిపి కొన్ని సిద్ధాంత సౌధములు నిర్మించుకొని అందు
నివసించుచున్న నాకు పునాదులవంటి ఆవిశ్వాసము తప్పు అని ఇటీవల
నా కొందరు చెప్పగనే మిక్కిలి ఆందోళన కలిగినది. కనుక సత్య
మేదో పరిశీలింపవలసిన అక్కర కలిగెను. కావలసినంత సామగ్రి
దొరకెను. అది మనవి చేసెదను.

తొలుత ఈ దుర్వాదబీజము వేసినవాడు ప్రొఫెసర్ వీబర్. కానీ
దానిని ఆయన సమగ్రముగా చూచి ఇది ఇంతే అని నిష్కర్ష చేసి
చెప్పినమాట కాదు. మహాభారతమందలి రామోపాఖ్యానము
అన్నివిధములా చాలా ప్రాచీనముగా కనుపించుచున్నదనియు, రామా
యణమునకు ఇదే మాతృక కావచ్చుననియు ఈ మతము. వారు
చెప్పు కొన్ని హేతువులు-1. భారతమునందు వర్ణవ్యవస్థ ఇత్యాది ఆర్య
ధర్మములు పూర్తిగా నెలకొనని సామాజికదశ కనుపించును. రామా
యణమున ఆర్యధర్మములు సుస్థిరముగా నెలకొన్న అనంతరదశ
కనుపించును. 2. ఉభయగ్రంథములందు పరశురామాదిపాత్రలు
సమానముగా ఉన్నవి. కనుక ఈ రామకథ భారతకథ ఇంచుమించు ఒకే
శతాబ్దమున జరిగిన సంఘటనలై యుండవచ్చును. రామకథ మొదట
జరిగియుండవచ్చును. భారతకథను వ్యాసుడు వ్రాయుచు అందులో
రామకథకూడా ప్రస్తావించియుండవచ్చును. రామకథ జరిగినప్పుడు

వ్యాసు డుండియుండవచ్చును. తర్వాత వాల్మీకి రామునికాలమున గాక కుశలవులకాలమున రామకథ వ్రాసియుండవచ్చును. వీరు భారతమున వాల్మీకిపేరు లేదనికూడా అనిరట. ఇది సంగ్రహముగా వీరి వాదము. కానీ ఈ వాదమంతయు ఊహా మాత్రముగానే ఉన్నది. కీత్, కస్ట్ అను పండితులు దీని నామోదించిరి. ఈ వాదమునకు బలమిచ్చుటకు గ్రంథస్థములైన భాషా విషయములను కూడా తెచ్చిరి. భారతభాష రామాయణభాషకంటె "రఫ్" గా ఉన్నదనియు, రామాయణభాష మెరుగు పెట్టబడినదిగా ఉన్నదనియు, కనుక రామాయణ భాషకంటె భారతభాషయే పూర్వమనియు వారి భావము.

వాస్తవముగా చూచినచో భారత భాషలో మెరుగులేనితనము లేదు. అన్నచో ఆమాట భారతభాష అంతయు కాదు వ్యాసుడు వ్రాసియుండు ననుకొనదగిన మూలగ్రంథములోని భాష అట్లున్న దనిరి. అయితే ఆ మూలగ్రంథ మేదో నిర్ణయించు టెట్లు? ఎవరైనా నిర్ణయించిరా? ప్రక్షిప్తములు భారతమున అతిబహుళముగా ఉన్నవి. అవన్నియు మూలగ్రంథ మొక టున్నచో అందు అక్కడక్కడ చేర్పబడినవే గాని ఒక్కచోట ఉన్నవి గావు. పైగా భారత భాష అంతయు ఇంచుమించు సమానముగా ఉన్నదేగాని అతుకులబొంతగా లేదు. కొన్ని భాగములందు భాష రమణీయముగా ఉన్నచో అది తద్భాగకర్త అన్యు డగుటచేతనే అని నిష్కర్ష చేయుటకు సాధ్యముకాదు. ఎందుచేతననగా ఒక విస్తారగ్రంథములో ఆ యా భాగముల రసవత్త్వమునుబట్టి భాషావిలాసముకూడా మారుచుండును. అంతమాత్రమున తత్కర్త వేరనలేము. అనగా భారతమున ప్రక్షిప్తములు లేవని కాదు. భారతరామాయణముల కాలమును భాషచేత నిర్ణయించవలెనన్నచో అందలి భాషను వ్యాకరణ శాస్త్రరీత్యా పరిశీలింపవలెను. ఉదా-గమిష్యామి అని నే డనుచుండగా గమిష్యే అని ప్రయోగించుట, విభక్తిప్రత్యయములు, గణవికారములు, వాక్య

వారు గ్రంథ విమర్శలో రామాయణ భారతముల భాషను గూర్చి యిట్లనిరి.—"It is generally recognized that the epic sanskrit of Ramayana and Mahabharatha and for the matter of that puranas is a unit in itself from the point of view of grammer and syntax..."

వారు తక్కువ పండితులు గారు.

రామాయణమున పరశురాముడు కలడు. భారతమున ఆ పరశురాముడు కర్ణునకు విలువిద్య నేర్పును. కనుక రామాయణ భారతములు సన్నిహితకాలమున జరిగిన సంఘటనలై యుండును అందురు. శ్రీరాము నెదుర్కొన్న పరశురాముడు కర్ణునకు విలువిద్య నేర్పినంత మాత్రమున భారత రామాయణములు ఏకకాలీనగాథ లన్నచో, ఒక ప్రశ్న వచ్చును—ఋగ్వేదమున బహువారములు పేర్కొనబడిన మనువు రామాయణమున పేర్కొనబడెను. భారతమునందును పేర్కొనబడెను. కనుక ఆ మూడును సమకాలీనములా ? ఆంజనేయుడు రామాయణమున కలడు; భారతమునందును కలడు. భీమునకు కనుపించును. దానిచేత ఆ రెండును ఏకకాలీనము లైనచో ఆంజనేయుడు ద్వాపరమందే కాదు శాశ్వతముగా ఉండునట గదా. దాని కేమందురు. అశ్వత్థామ రావోవు బ్రహ్మ యట. దాని కేమందురు. మరొకటి—

జనమేజయుని పేరు రామాయణమున గలదు. అందుచే రామాయణము భారతమునకు తర్వాత వచ్చినదన్నచో—భారతమునందే చూడుడు. సంభవ పర్వమున పుత్రశోకముచే మూర్ఛిల్లి తేరుకుని మరణింపగోరుచున్న ధృతరాష్ట్రునికి ఆశ్వాసవచనములు చెప్పుచు సంజయుడు పలికిన వాక్యములందు "అస్మిన్ లోకే యశః ప్రాప్య తతః కాలవశం గతాన్...కృతవీర్యం మహాభాగం తథైవ జనమేజయం"

జరిగెను. అట్లు సంజయునిచే కీర్తికాయులై గతించిరని ధృత రాష్ట్రునితో చెప్పఁబడిన ప్రాచీన రాజసత్తములం దొకడైన జనమేజయుడు. ధృతరాష్ట్రునికి తమ్ముని కొడుకు కొడుకు కొడుకు కొడుకను కొనవచ్చునా! మరొకటి—(సంభవ పర్వం 95 అధ్యాయం) "పూరోస్తు భార్యా కౌసల్యానామ తస్యామస్య జజ్ఞే జనమేజయో నామ యః త్రీన్ అశ్వమేధాన్ జహార విశ్వజితా చేష్ట్వా వనం వివేశ" అని వైశంపాయనుడు జనమేజయునికి చెప్పెను. ఈ జనమేజయు లిద్దరు ఒకటేనా!

భారతమందలి వర్ణసాంకర్యము, వివాహవ్యవస్థ, రాజనీతి యుద్ధతంత్రము ఇత్యాదులు చూచి అవి సమాజము అవ్యవస్థితముగా ఉన్న దశను సూచించుచున్నవనియు; రామాయణమందలి దృఢమైన ధర్మ పాలన, నిబద్ధమైన వర్ణవ్యవస్థ, ఏకపత్నీవ్రతము, రాజనీతి ఇత్యాదులు అవ్యవస్థను దాటి సువ్యవస్థితమైన స్థితికి సమాజము పరిణమించిన విషయమును సూచించుచున్నవని. కానీ ఈ మాటనే ఇటునుంచి అటు త్రిప్పి చెప్పినచో ఏమగును? త్రేతాయుగమున ధర్మబద్ధత, ఋజువర్తన వర్ణాశ్రమధర్మపాలన ఇత్యాదులు చక్కగా జరిగెననియు, అట్లు జరుగుటకు ఆనాటి సమాజము అల్పసంఖ్యాకమై ఒత్తిడి తక్కువై ప్రకృతి సంపద ప్రజలకు విరివిగా లబ్ధమగుచుండినదై పరిస్థితులు అనుకూలముగా ఉండుటచేత అట్టి ధర్మనియమములు తు చ తప్పకుండా పాటింపబడుటకు వీలాయెననియు, భారతకాలము అనగా ద్వాపరము వచ్చునాటికి లోకమున జనబాహుళ్యము పెరిగి, క్లేశము లెక్కువై, మనఃప్రవృత్తులు కూడా అందుచేత వక్రములై తద్ద్వారా వర్ణసాంకర్యము, రాజనీతి యుద్ధ తంత్రములందు కుటిలత, ఇత్యాదులు పొడసూపెనని యెందు కనరాదు? అసలు భారతమునందు అనేక సందర్భములందు వర్ణింపబడిన యుగధర్మ క్రమము కూడా దీని కనుగుణముగానే ఉన్నది కదా? పైగా—రామాయణమున వసిష్ఠ విశ్వామిత్ర వివాద ఘట్టము

మొదలైన కొలదిచోట్ల మాత్రమే బ్రాహ్మణాధిపత్యము వ్యంగ్యముగా చెప్పబడగా భారతమున ప్రతిపేజీ యందును వాచ్యముగా బ్రాహ్మణాగ్రగణ్యత ఉద్ఘాటింపబడినది. భారతమున ఈ ధోరణి అత్యంత వాచ్యముగను బహుళముగను కనుపించుట భారతకాలమున అట్టి అతిప్రబల ప్రచారము అవసర మయినట్లు ఊహింపవలసి వచ్చుచున్నది. వర్ణాశ్రమ ధర్మచ్యుతి కలుగనిచో అట్టి అవసర మెట్లు వచ్చును. కనుక ఈ మతస్థులవాదము అపసవ్యముగా ఉన్నది ద్వాపరము ముందు త్రేతాయుగము తర్వాత అన్న ట్లున్నది. మన గ్రంథములు, మన సంప్రదాయము, కృతత్రేతాద్వాపర కలియుగములని క్రమము చెప్పి ధర్మచ్యుతికి ఉత్తరోత్తర క్రమము చెప్పినవి.

భారతమున వాల్మీకిపేరు లేదు. కనుక భారతము రామాయణమున కంటె పూర్వగ్రంథ మనిరి. వాల్మీకి పేరు భారతమున అనేకమార్లు ప్రసక్తమగుటచేత దీనిని గురించి విస్తరించి చెప్పవలసిన పని లేదు.

కనుక ఈ వాదము అసత్య మనుకొనవలెను.

# రామాయణము భారతమునకంటె పూర్వగ్రంథ మనుటకు నూతన హేతువులు

సంస్కృత వాఙ్మయమున వాల్మీకి శ్లోకావిర్భావమునకు ప్రథమ కర్త యని రామాయణావతారికలందు చెప్పబడినది. "పాదబద్ధోఽక్షర సమ స్తంత్రీలయ సమన్వితః, శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా" (బాల. 2 స. 18 శ్లో) అందులోనూ "మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమా" ఇత్యాది ప్రసిద్ధ శ్లోకమే లోకంబున ప్రథమ శ్లోకమని పేర్కొనబడినది — ఇదే సత్యమైనచో రామాయణీయ శ్లోకములవంటి శ్లోకములే నూటికి తొంబదిపాళ్ళు గల మహాభారతము రామాయణము తర్వాతనే వ్రాయబడియుండ వలెను గదా.

కాని భారతమే తొలుత వ్రాయబడి తర్వాత రామాయణము వ్రాయబడి రామాయణమునందు వాల్మీకి ప్రథమ శ్లోకకర్త యని రామాయణోత్కర్ష కొరకు అసత్యము వ్రాయబడెనేమో? అని ఒక ప్రశ్న:-- రామాయణావతారికలు వ్రాసినవారు వాల్మీకి కంటె అన్యులైనను, వారు సామాన్యులుగాక ఋషికల్పులే అయి ఉందురు. ముఖ్యముగ మొదటి రెండు సర్గలు (బాలకాండలో) వ్రాసినవారు వాల్మీకికి అతి సన్నిహితులై ఆయన మర్మములను తన్ముఖతః గ్రహించిన శిష్యులో లేక ప్రశిష్యులో అయిఉందు రనుకొనవచ్చును. లేనిచో ఆ భాగములు, భాషలోను, భావములోను, వాల్మీకీయ రచన యొక్క ముఖ్య లక్షణమైన గంగాలహరివంటి స్వచ్ఛతలోను, ప్రధాన గ్రంథములో ఎట్లు సహజముగ ఇమిడిపో గలిగియున్నవి? అట్టి అవతారికా కర్తలు నేటివరకు భుక్తి ముక్తి ప్రదాయక మని భావింపబడుచున్న

రామాయణమున అసత్యము వ్రాసియుందు రనుకొనుట సహేతుక మైన ఆలోచనగా తోచుటలేదు. కనుక వారు వాస్తవమే వ్రాసి యుందురు. శ్లోక సమాకీర్ణమైన భారతమువంటి యొక్క ఉద్గ్రంథము పూర్వమే ఉండగా ఆ తర్వాత వచ్చిన రామాయణమును వ్రాసినవాడే మొదట శ్లోకమును కనిపెట్టెను అని రామాయణావతారికలు వ్రాసినవారు వ్రాయుదురనుకొనుట న్యాయము కాదు. రామాయణ కర్తను ఉత్కర్షించుటకు కూడా అట్లు అసత్యము చెప్పుదురనుకొనుటకు వీలులేదు. ముఖ్యముగా గుర్తింపవలసిన దేమనగా రామాయణా వతారికా కర్తలు కేవలము రామాయణోత్కర్ష కొరకే వాల్మీకి ప్రథమ శ్లోకకర్తయని అసత్యము వ్రాసినచో భారత రామాయణముల యొక్క ఔన్నత్యమును గురించి భేదాభిప్రాయము లానా డుండె ననియు ఒకదాని పక్షమువారు మరొకదానిని కించపరచు ప్రయత్న ములు చేయుచుండి రనియు అనుకొనవలసి వచ్చును. కాని అట్టి పరిస్థితులు భారత రామాయణములమధ్య లేవుగదా? రెండును అనా దిగా భారతీయులకు పరమ పవిత్రములైన గ్రంథములే. అందుచేత ఎవ్వ రును ఒకదానిని కించపరచి మరొకదానిని యుత్కర్షించుటకు ప్రయత్నిం చి యుండరు. ఒకవేళ అట్టిస్పర్ధలే ఉండెడి వనుకొన్నచో, రామాయణ మున ఈ అసత్యము చేర్పబడగానే, దానిని ఖండించుచుగానీ లేక భారత కర్తయే మొదటి శ్లోకకర్తయని ఉద్ఘాటించుచుగానీ భారత మున ఆ పక్షమువారు చేర్చియుందురుగదా. భారతమున ఆ ప్రస్తావనయే లేదే ?—

మరొక చిత్రమైనది-భారతమును భారతావతారికలు ఎంతగానో ఉగ్గడించు చుండగా రామాయణావతారికలు రామాయణము నందు భారత మంతుకూడా ఉగ్గడింపవు. భారతావతారికలు భారతమును ఇతి హాసమనియు పురాణమనియు వేదమే అనియు అనేకమార్లు వర్ణించును.

"ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా...తస్యాఖ్యాన వరిష్ఠస్య...సూక్ష్మార్థ న్యాయయుక్తస్య వేదార్థై ర్భూషితస్యచ భారతస్య ఇతిహాసస్య పుణ్యాం గ్రంథార్థసంయుతాం సంహితాం శ్రోతు మనసః—" (సంభవపర్వము) వ్యాసుడే తన భారతము కావ్యమని బ్రహ్మతో చెప్పుకొనెను. దానిని "కృతం మయేదం భగవన్ కావ్యం పరమపూజితం బ్రహ్మన్ వేదరహస్యంచ యచ్చాన్యత్ స్థాపితం మయా సాంగోపనిషదాంచైవ వేదానాం విస్తరక్రియా ఇతిహాస పురాణానాం ఉన్మేషం నిర్మితంచ యత్" అని తనకావ్యమును వర్ణించి స్వోత్కర్ష చేసికొనెను. బ్రహ్మ, నీవు కావ్యమన్నావు కనుక అది కావ్యమగును అని చెప్పెను. (త్వయాచ కావ్య మిత్యుక్తం తస్మాత్ కావ్యం భవిష్యతి) కాని వాల్మీకి తనకావ్యమును గురించి ఏమియు చెప్పుకొనలేదు. బ్రహ్మయే దానిని కావ్యమనెను. "పురాణపూర్ణచంద్రేణ శ్రుతిజ్యోత్స్నాః ప్రకాశితాః ...ఇతిహాస ప్రదీపేన మోహావరణ ఘాతినా" అనియు భారతము వర్ణింపబడినది. "భారత స్యేతిహాసస్య శ్రూయతాం పర్వసంగ్రహః అని ఒక చోట— "అర్థశాస్త్ర మిదం ప్రోక్తం ధర్మశాస్త్ర మిదం మహత్ కామశాస్త్ర మిదం ప్రోక్తం వ్యాసే నామితబుద్ధినా" ఇట్లున్నదా భారతస్తుతి-ఒకచోట వేదములను భారతమును త్రాసులో ఇరువైపుల పెట్టి తూచగా భారతమున్న భాగము బరువుచే క్రిందికి పోగా వేదములు తేలిపోయినవని అట్టి గురుత్వముచేత భారతమునకు ఆపేరు వచ్చెననియు భారతగౌరవమును స్థాపింప జూచినవి "ఏకతః చతురో వేదాన్ భారతంచైత దేకతః పురా కిల సురై స్సర్వై స్సమేత్య తులయా ధృతం—చతుర్భ్య స్సరహ స్యేభ్యో హ్యధికం యదా, తదా ప్రభృతి లోకేస్మిన్ మహాభారత ముచ్యతే, మహత్వేచ గురుత్వేచ ధ్రియమాణం యతోధికం—".

భారత గౌరవ ప్రతిష్ఠాపన కొరకు తదవతారికా కర్తలు ఇంత చులకనైన పద్ధతికి దిగజారిన వారైరి. రామాయణావతారిక లం

దిట్టి పద్ధతి వర్ణన లెచ్చటను లేవు. రామాయణమున అతి సంగ్రహము గాను అతి క్వాచిత్కముగాను ఎక్కడో "ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితం యః పఠేత్ రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే" (బాల 1 స. 98శ్లో) అని చెప్పబడగా, భారతమున దాని మహిమ ఎన్నిసార్లో ఎన్నో శ్లోకాలలోనో ఉత్కర్షింపబడినది. రామాయణము మోక్షప్రదమని అవతారికలలో లేదు. "ధర్మకామార్థసహితం" (బాల. 5స 4 శ్లో) అని వర్ణింపబడెనేగాని పెద్దపెద్ద మాటలలో ఘనస్తుతులు చేయబడలేదు. కాని భారతమున ఇట్టివి కొల్లలుగా గలవు. ఉదాహరణకు అంశావతరణపర్వ మందలి 62 వ అధ్యాయమున 16 నుంచి 20 శ్లోకములవరకు చూచినచో భారతపఠనఫలమును గూర్చి ఎంత ఉగ్గడింపబడెనో విశదమగును. రామాయణ లక్షణమునే రామాయణావతారికలు పాటించినవి. ఆలక్షణము వ్యంగ్యరచన. ఉదాత్త విషయములు వాచ్యము చేయబడవు. వ్యంగ్యార్థము వాచ్యార్థమువలె ప్రత్యక్షముగా ఉండదు. "పరోక్ష ప్రియా వై దేవాః" కనుక దివ్యమైన వ్యంగ్యమార్గ రచనచేత పరోక్ష వస్తువైన మోక్షము పరోక్షముగానే ఉంచబడెను. రామాయణము తదవతారికలలో కావ్యమని యే వర్ణింపబడినది. "నతే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి" (బాల. 2 స. 35 శ్లో) అని బ్రహ్మ రామాయణమును కావ్యమని పేర్కొనెను. "కృత్స్నం రామాయణం కావ్యం ఈశ్వరైః కరవాణ్యహం" (బాల. 2స. 41 శ్లో) "యశస్కరం కావ్య ముదారధీర్మునిః" (బాల-2స. 42 శ్లో) - రామాయణము భారతమువలె పురాణమని వర్ణింపబడలేదు. ఇట్లు రామాయణమును రామాయణావతారికలు చేయు ప్రశంస అతిలఘుప్రమాణముగా ఉండగా, భారతావతారికలందలి భారత ప్రశంస అతిశయోక్తివలె ఉండగా, రామాయణము భారతమున కంటె ఉత్కృష్టగ్రంథ మగుటకు రామాయణావతారికలు అట్లా ఉండవలెను? కనుక ఆ రెండవతారికలను బట్టి ఉత్కర్ష కొరకు రామాయ

ణము భారతముతో పోటీపడినట్లు కనుపించదు. రామాయణావతారికా రచనాపద్ధతి మితభాషిత్వమువలె ఉండి లోకమున రామాయణముపై గౌరవవిశ్వాసములను సంపాదించునదిగా ఉన్నది. భారతావతారిక లట్లు లేవనికాదుగానీ, అంత ఉదాత్తముగా లేవనియే తాత్పర్యము. రామాయణావతారికలు వ్రాసినవారు మహర్షు లనుటకు అవకాశముండగా భారతావతారికలు వ్రాసినవారు అట్టివా రనుటకు అవకాశములేదు. సూతుడు భారతమును శౌనకాదిఋషులకు చెప్పెనని అవతారికలందు కలదు. వ్యాసునినుండి వైశంపాయనుడు, వైశంపాయనునినుండి సౌతి, ఇట్లు భారత కథాకథనకర్తృత్వము హిమాలయమునుండి పాతాళమునకు గంగవలె దిగజారినది (పాతాళమందలిది కూడా గంగయే) సౌతి వాల్మీకి శిష్యులైన భరద్వాజాదులవంటివాడు కాదు, చివరకు వైశంపాయనతుల్యుడును కాడు. అతడు రెండవ లేక మూడవ తరగతి వాడు. తుదకు భారతరచనము సౌతి చేసినదికూడా కాదేమో. కారణము-రోమహర్షణపుత్ర ఉగ్రశ్రవాః సౌతిః పౌరాణికః నైమిశారణ్యే శౌనకస్య కులపతే ర్ద్వాదశవార్షికే సత్రే సుఖాసీనాన్ అభ్యగచ్ఛత్ బ్రహ్మర్షీన్" ఇట్లు సౌతి చెప్పెనని అవతారికలందు చెప్పబడుటచేత, సౌతికంటె అన్యు డెవడో సౌతి చెప్పెనని చెప్పుచున్నాడు. (సౌతికంటె ఇవతలికాలమువాడైన అట్టి భారతకర్త భారతమందే అనేక సార్లు ప్రసక్తమైన వాల్మీకికంటె పూర్వుడెట్లగును ?) కనుక భారతావతారికలకు రామాయణావతారికలకు ఉదాత్తతయందు తారతమ్యము కలదు. రామాయణమందేది వ్యంగ్యముగా ఉన్నదో భారతమున అది వాచ్యము చేయబడెను.

మరొకటి-భారతము రామాయణమునకంటె పూర్వగ్రంథమే అయి ఉండి, రామాయణము వచ్చిన అతిదీర్ఘకాలమునకు భారతరామాయణములు రెండును అతిప్రాచీనములుగా గోచరించి వాటి పౌర్వాపర్యములు అవిదితములై యున్నకాలమున, రామాయణము యొక్క

అత్యధిక రామణీయకము చేత ఆకర్షింపబడినవారు దానికి అవతారికలు వ్రాయ నేర్చుచు, వాల్మీకి యొక్క శ్లోకరచనా సాఫల్యమును, నిసర్గ రమణీయతను ప్రశంసించు ఉత్సాహములో వాల్మీకియే ప్రథమశ్లోకకర్త అనియుందురేమో ? అంతమాత్రమున అనగా శ్లోకకర్తృత్వ మను మాటచేతనే రామాయణము భారతమునకంటె మొదటి గ్రంథ మెట్లగును ? అని ప్రశ్న రావచ్చును.

అట్లయినచో-అవతారికా రచనాకాలము నాటికి రామాయణ భారతములకు రెంటికిని అవతారికలు లేకుండెనా లేక భారతమునకు మొదట ఉండి తర్వాత రామాయణమునకు వచ్చెనా ? లేక రామాయణమునకే మొదట వచ్చెనా ? ఇట్టి ప్రశ్నలు వచ్చును.

రామాయణమునకు అవతారికలు వ్రాయునాటికి భారతమునకు అవతారికలు లేవు, తదనంతరమే వ్రాయబడెను అనుకొన్నచో, రామాయణావతారికలందలి వాల్మీకి శ్లోకకర్తృత్వము అసత్యమైనచో ఆనంతరములైన భారతావతారికలు దానిని ఖండించియుండెడివి. అట్లుగాక భారతావతారికలే రామాయణావతారికల కంటె ముందే వచ్చె నను కొన్నచో వ్యాసుడు ప్రథమశ్లోకనిర్మాత అయినచో దానిని భారతావతారికలు ప్రస్తావించియుండెడివి. ఎందుచేతననగా శ్లోకావిర్భావము అత్యంత ప్రధానమైన సంఘటన. వ్యాసుని మహిమ లెన్నో భారతావతారికలలో వర్ణించినవారు ఇంతప్రధానవిషయమును వదలుదురా ? ఏమో ఎందుచేతనో దానిని అంతప్రధానముగా భారతావతారికా కర్తలు ఎంచక పోవుటచేతనే ప్రస్తావించలేదనుకోగూడదా ? వాల్మీకీయమని చెప్పబడు అనుష్టుప్‌శ్లోకము తత్పూర్వమే వేదములందు అతి స్వల్పభేదముతో అనేకచోట్ల ప్రయుక్తమై యుండుటచేత వ్యాసుడు తొలుత భారతమున దానిని వాడినప్పుడు అవతారికా కర్తలకు వైదికచ్ఛందస్సునే అవలంబించెనని అది వింతగా తోచలేదేమో ? ఇట్లెందు

కనుకొనరాదు-అన్నచో దానికి చాలా వ్యాఘాతములు వచ్చుచున్నవి. భారతావతారికలు మొదట వచ్చినచో అప్పటి పరిస్థితిలో అవతారికా సహితమైన భారతము అవతారికా రహితమైన రామాయణము రెండు న్నవన్న మాట. అవతారికారహితమైన రామాయణము అనగా వాల్మీకీయమైన ప్రధానగ్రంథము బహుశః బాలకాండలో 5 పంచమసర్గనుంచి అనగా "సర్వ పూర్వ మియం యేషా మాసీత్ కృత్స్నా వసుంధరా" శ్లోకమునుంచి ప్రారంభము కావచ్చును. (అదే అని తర్వాత నిష్కర్ష చేసి చెప్పగలను) అట్టి ప్రధానగ్రంథములో రామాయణ మహిమను గురించిగాని వాల్మీకిని గురించిగాని ఏమియు లేదు" ధర్మకామార్థ సహితం శ్రోతవ్య మనసూయయా" అన్న ముక్క ఒక్కటి తప్ప. కానీ ఆనాటికి రామాయణముతోపాటు ఉన్నదనుకొనవలసిన భారత మెట్లు న్నది. అవతారికాసహితమై అవతారికలందు వ్యాసమహిమ వర్ణనలు భారతమాహాత్మ్య వర్ణనలు నిబిడీకృతమై ధగద్ధగాయమానముగా ఉన్నది. ఇట్టి రెంటిని చూచినవారు భారతమునకంటె రామాయణము గొప్పదని ప్రాచీనమైనదని ఎట్లు భావింతురు? అవతారికలున్నవనగా ఆ గ్రంథమును గురించి ఆ గ్రంథకర్తను గురించి ఒక సంప్రదాయము నెలకొనియున్న దన్న మాట; ఈ వాదమును బట్టి అట్టి సంప్రదాయము ఆనాటికి రామాయాణమునకు లేదన్న మాట. అటువంటి పరిస్థితులలో రామాయణావతారికా కర్తలు వ్యాసుని వదలి వాల్మీకిని ప్రథమశ్లోకకర్త యని ఒక అసత్యము చెప్పుట సుభవించు ననుకొనుట న్యాయమా ? కనుక ఇట్లెంత సునిశిత వితర్కము చేసినను చివరకు తేలు సమంజసార్థము రామాయణావతారికలందలి వాల్మీకి యొక్క ప్రథమశ్లోకకర్తృత్వము అసత్యము కాజాలదు. ఆమాట సత్యమైనచో రామాయణమే భారతమునకంటె మొదట వచ్చిన గ్రంథమగును.

రామాయణకర్తయగు వాల్మీకి మహర్షి పేరును, రామాయణము యొక్క పేరును భారతమున ప్రసక్తములైనవి. కాని భారత

కర్త పేరుగాని, భారతము యొక్క పేరుగాని రామాయణమున ప్రసక్తములు కాలేదు

ఆస్తీకపర్వమున 55 అధ్యా. న ఆస్తీకుడు జనమేజయుని ప్రశంసించుచు అతనిని " వాల్మీకివత్తే నిభృతం సువీర్యం, వసిష్ఠవత్తే నియతశ్చ కోపః" అనును అనగా నీవు వాల్మీకివలె జితేంద్రియుడవు.

తీర్థయాత్రాపర్వమున నారదుడు ధర్మరాజుకు తీర్థయాత్రా ఫలములను గురించి విస్తారముగా చెప్పెను. అచ్చట "ఋషిముఖ్యాః సదా యత్ర వాల్మీకి స్త్వథ కశ్యపః, ఆత్రేయః కుండజఠరో విశ్వామిత్రో౽థ గౌతమః......శౌనక స్సహపుత్రేణ వ్యాసశ్చ తపతాం వరః...ఏతే ఋషివరాః సర్వే త్వత్ప్రతీక్షా స్తపోధనాః ఏభి స్సహ మహారాజ తీర్థా న్యేతా న్యనువ్రజ.........ఓ ధర్మరాజా నీవు తీర్థయాత్రలు సేవింపుము. వాల్మీకి కశ్యపాదులు ఎచ్చట నీకొరకు నిరీక్షించుచుందురో ఆతీర్థములకు ఈ నీ భార్యాసోదరులతో కలసి వెడలుము... ఇందులో ఒక విమర్శ అవసరము-వాల్మీకియేగాక సహపుత్రేణ వ్యాసశ్చ అని చెప్పబడెను. అది వ్యాసవాల్మీకుల నిరువురిని కలిపి వారి తర్వాత వారైన ఎవరో చేర్చియుండవచ్చును అనుట కవకాశము కలదు అనగా వాల్మీకిపేరు మూలగ్రంథమున ఉండి తర్వాత వ్యాసశబ్దమే ప్రక్షిప్తమై యుండవచ్చును. కాదని నిష్కర్ష చేయుట ఎట్లు? వాల్మీకివ్యాసుల పేర్లు రెండు ఉండగా ఒకటే ప్రక్షిప్తమనుటమాత్ర మెట్లు? అనగా, దానికి సమాధానము:—గ్రంథమందు వాల్మీకిపేరు అనేక పర్యాయములు వచ్చినది. వాల్మీకిపేరు ప్రస్తావింపబడినటువంటి సందర్భములం దన్నిటియందును వ్యాసునిపేరు రాలేదు. "వాల్మీకిశ్చ మహాతపాః శమీకః సత్యవాక్"(భారత.సభా7-16) "అసితో దేవలస్తాత వాల్మీకిశ్చ మహాతపాః" (భార.శాంతి 207-4) అని మరికొన్ని. పైగా వ్యాసుడు భారతకథలోని పాత్రగా ఉన్నాడు. కనుక వ్యాసునిపేరు

వచ్చిన సందర్భములకును వాల్మీకిపేరు వచ్చిన సందర్భములకును, పరి శీలించినచో భేదమున్నది. వాల్మీకిపేరు ఋషులందరిని గురించి చెప్పు చోట్ల వచ్చెను. కనుక అవి వ్యాసునిపేరు వచ్చిన సందర్భములవంటివి కావు అట్లు వాల్మీకిపేరు వచ్చినచోట్ల మరెచ్చటను రాక ఈ ఒక్కచ్చో టనే వ్యాసునిపేరు వచ్చుటచేత వ్యాసశబ్దమే ప్రక్షిప్తము కావలెను. పైగా సహపుత్రేణ వ్యాసశ్చ అనుచోట "శౌనక స్సహపుత్రేణ వ్యాసశ్చ" అనబడినది. శౌనకుడు వ్యాసునికన్న అర్వాచీనుడు. సౌతి ఈ శౌనకాదులకే భారతమును ఉపన్యసించెను. శౌనకునిపేరు అందుం డుటచేత శౌనకసౌతులకు అర్వాచీనులైన వారెవరో శౌనక స్సహ పుత్రేణ వ్యాసశ్చ తపతాం వరః" అను నీ ఒక్క పాదమును చేర్చియుం దురు (సౌతికూడా భారత రచయిత కాడు. సౌతి చెప్పెనని మరెవడో చెప్పినట్లు కదా గ్రంథము ప్రారంభ మగుచున్నది) కనుక ఈశ్లోకమం దలి సందర్భమును బట్టి వ్యాసుని పేర్కొను శౌనకాదిపాదము ఆశ్లోక ములందు ప్రక్షిప్తము కావలెను-మరొక సందేహము రావచ్చును. ధర్మ రాజు కొరకు వాల్మీక్యాదిఋషులు ఆతీర్థము దగ్గర నిరీక్షించుచుండు రనబడెను గదా, అప్పటికి వాల్మీకి భారతపురుషులకు సమకాలికుడే గదా? అనవచ్చును అట్లనుట పొరపాటు. దానిని వ్యావహారిక సత్య ముగా తీసుకొనరాదు. "గంగాయమునయోర్మధ్యే యే వసంతి తే మే ప్రసన్నాత్మానః చిరంజీవితం వర్ధయంతి" అన్నట్లు నదీతీరములందు ఋషులు దేవతలు ఉందురని మనవారి విశ్వాసము. వాల్మీకి తదితర ఋషులు ధర్మజునికై ఆతీర్థమున నిరీక్షించుచుందు రనగా అంతియేగాని అన్యముగాదు.

ఇట్లు భారతమున వాల్మీకిపేరు పలుమార్లు ప్రసక్తమాయెను. కానీ ఆవాల్మీకియే ఈరామాయణమును వ్రాసినట్లు భారతమున లేదు గదా? అనవచ్చును. దానికి సమాధానము—రామాయణమును వ్రాసినవాడు వాల్మీకి కాడని ఎవ్వరును సందేహించుటలేదు. అట్లో

రామాయణకర్త యగు వాల్మీకి యొకడు భారతమున పలుమార్లు ప్రస్తావింపబడిన వాల్మీకి మరొకడు అనుకొన్నచో వాల్మీకి యను పేరు గలవారు అనేకులు గలరని అర్థము. భారతమున పేర్కొనిన ఋషి సమూహమందలివారు ప్రసిద్ధులు. వారికథలు వివరములు అచ్చటచ్చట గలవు. వేదోపనిషత్తులు, రామాయణ భారతములు, పురాణములు చదివిన వారికి వాల్మీకి యని మరొక ఋషిని ప్రత్యేకము పేర్కొని వానిని గురించి వివరించిన సందర్భ మెచ్చటను వచ్చినట్లు కానరాదు. కనుక వాల్మీకి యనగా రామాయణకర్త యని యే భావము. రామాయణము వ్రాసిన వాల్మీకి అని చెప్పవలసిన పద్ధతి ఉండగా భారతమున ఊరక వాల్మీకి అని వాడియుండినచో ఈ వాల్మీకి మరొక డనుకొనవచ్చును. అట్టిపద్ధతి లేదుగదా వ్యాసుని పేర్కొన్నప్పుడు భారతకర్త అనబడెనా లేక వసిష్ఠుడు ఇక్ష్వాకువంశీయుల పురోహితు డనబడెనా? ఆ పేర్కొనబడిన ఋషి సమూహమున ఎవ్వరునూ ఎట్టివిశేషణములచేతను వర్ణింపబడలేదుగదా. కనుక ఈవాల్మీకియే రామాయణకర్త అనుకొనుటకు ఎట్టి ఆటంకమును లేదు.

ఇక రామాయణము పేరెట్లు భారతమున ప్రసక్తమాయెనో వివరింతును-తీర్థయాత్రాపర్వమున 147 అ.న దారి కడ్డుగా ఉన్న హనుమంతునితో భీముడు, "హనుమంతుడు" సాగరము దాటినట్లు ఈ గిరిని దాటగలనని బెదిరింపగా, ఎవరయ్యా ఆ హనుమంతుడు అని అడుగగా, భీముడు "భ్రాతా మమ గుణశ్లాఘ్యో బుద్ధిసత్త్వబలాన్వితః రామాయణేఽతివిఖ్యాతః శ్రీమాన్ వానరపుంగవః" (అనగా నా అన్న, గుణశ్లాఘ్యుడు, బుద్ధిసత్త్వబలాన్వితుడు అయిన హనుమంతుడు రామాయణమున అతివిఖ్యాతి గాంచిన కపిశ్రేష్ఠుడు) అనెను.

ఈ రామాయణ ప్రస్తావనాఘట్టము ప్రక్షిప్త మనుకొనుటకు సమంజసమైన హేతువులు లేవు. సౌగంధికాపహరణవృత్తాంతము

భారతకథలోనిదే ననుట నిర్వివాదము. అందే ఈసంఘటన వర్ణింపబడినది. ఈ సంఘటన మాత్రమే ప్రక్షిప్త మందమా దానికి హేతువు లేవి? భీమునికి హనుమ కనుపించినట్లు వ్యాసుడే కల్పింపవచ్చును గదా? కథయందు దేవతలనుకూడా పాత్రలను చేసినవాడు, హంసకు మానుష భాషలు పెట్టి నలోపాఖ్యానము వ్రాసినవాడు ఈ ఘట్టమునందే త్రేతాద్వాపరముల పాత్రలను కలుపుట అసంగతమని ఎట్లు భావించును? కనుక భీమహనుమత్సమాగమ ఘట్టము ప్రక్షిప్త మనుకొనన నక్కరలేదు.

కనుక రామాయణము పేరు తత్కర్తయైన వాల్మీకిపేరు భారతమున ప్రస్తావింపబడినవి-కానీ భారతము పేరుగాని, భారతకర్త యనబడు వ్యాసమహర్షి పేరుగాని రామాయణమున ఎచ్చటను పేర్కొనబడలేదు. భారతమునకంటె రామాయణ మర్వాచీన గ్రంథ మైనచో ఇదెట్లు సంభవించును?

(2) రామాయణకథలోని సీతారామ, రావణ, ఇంద్రజిత్, వాలి సుగ్రీవ హనుమదాది పాత్రలు, రామకథా ఘట్టములు, రామాయణ మందు వర్ణింపబడిన ఉపాఖ్యానములు ఎన్నో భారతమందు సందర్భాను సారముగ వర్ణింపబడినవి. కాని రామాయణమున భారతకథగాని భారతకథలోని పాత్రలుగాని ఏవియు ప్రసక్తములు కాలేదు. భారతమున ప్రసక్తములైన కొన్ని రామాయణ విషయములకు ఉదాహరణలు :—

(i) రామాది పాత్రలు ప్రసక్తములగుట :

సంభవపర్వమున అనుక్రమణికాధ్యాయమందు సంజయుడు ధృతరాష్ట్రునకు లోకఖ్యాతిగాంచిన పూర్వరాజులను గురించి చెప్పుచు వారిలో "రామం దాశరథిం చైవ శశవిందం భగీరథం" అని రాముని చేర్చెను.

55 అధ్యాయమున ఆస్తీకుడు జనమేజయుని "పూర్వరాజుల వలెనే నీవు చేయుయజ్ఞము గొప్పగా భాసించు." నని స్తుతించుచూ "యథా యజ్ఞో దాశరథేశ్చ రాజ్ఞః" అని చెప్పును.

స్వయంవరపర్వము 187 అధ్యాయమున అర్జునుని మెడలో ద్రౌపది పుష్పమాల వేసెనని చెప్పుచు "రామం యథా మైథిలరాజపుత్రీ భైమీ యథా రాజవరం నలం హి......" అనబడినది.

సంభవ పర్వమున 204 అ. న పాండవుల రాజ్యాధికార మంగీక రించుట న్యాయమని భీష్మద్రోణులు చెప్పిన హితము పాటింపుమని ధృతరాష్ట్రునకు చెప్పుచు విదురుడు ఆ యాచార్యు లిర్వురును ధర్మసత్య ములందు దశరథరామగయులకంటె తీసిపోరని చెప్పును. "ధర్మేచాన వరౌ రాజన్ సత్యతాయాంచ భారత, రామాత్ దాశరథేశ్చైవ గయాచ్చైవ న సంశయః"—

అర్జునాభిగమన పర్వము 25 అ న మార్కండేయుడు పాండవులను కలిసినప్పుడు ఆ ఋషి రామనామస్మరణ చేయువాడని చెప్పబడి నది! "సంస్మృత్య రామం మనసా మహాత్మా..." మార్కండేయుడు తనను చూచి నవ్వెననుకొని ధర్మజుడు "ఏల నవ్వితి రని" యడుగగా ఋషి "న తాత హృష్యామి న చ స్మయామి...తవాపదం త్వద్య సమీక్ష్య రామం సత్యవ్రతం దాశరథిం స్మరామి"—(అనగా నీ ఆపద చూచి సత్యవ్రతుడైన దశరథరాముని తలచుకొనుచున్నాను) అనెను.

తీర్థయాత్రా పర్వమున 85 అ. న నారదుడు ధర్మజునికి నీవు మను భగీరథ పురూరవాది రాజులవలె కీర్తి గాంతువని చెప్పుచు, "యథా భగీరథో రాజా యథా రామశ్చ విశ్రుతః" అనెను.

ఆ అధ్యాయమునందే "యత్ర తీర్ణో మహారాజ రామో దాశరథిః పురా" అని శృంగిబేరపురతీర్థము వర్ణింపబడినది (రాముడు పాండవులకంటె పురాతనుడను ఇందలి భావము గుర్తింపవలెను.)

ఆ పర్వమునందే 113 అ. న సీత రామునికివలె ఋష్యశృంగునికి శాంత పరిచర్య చేయుచుండెను అని చెప్పబడినది "యథా సీతా దాశరథే ర్మహాత్మనో......తథా శాంతా ఋష్యశృంగం పర్యచరన్ నరేంద్ర..."

హిడింబవధ పర్వమున 154 అ. న ఘటోత్కచుడు జన్మించి, కుంతికి తండ్రులకు నమస్కరించి "కింకరో మ్యహ మార్యాణాం" అని అడుగగా కుంతి "జ్యేష్ఠఃపుత్రోసిపంచానాం సాహాయ్యం కురు పుత్రక" అనెను. దానికి ఘటోత్కచుడు సరే ననుచు, "యథాహి రావణో లోకే ఇంద్రజిచ్చ మహాబలః వర్ష్మవీర్యసమో లోకే విశిష్ట శ్చాభవం నృషు, అనును. (రావణ ఇంద్రజిత్తులవలె విశిష్టుడనని తన ప్రతాపమును గురించి చెప్పెను)

వనపర్వాంతర్గత కిర్మీరవధపర్వమున భీమసేన కిర్మీరులకు వృక్షములతో యుద్ధ మాయెననుచు "వాలి సుగ్రీవయో ర్భ్రాత్రో ర్యథా స్త్రీకాంక్షిణో పురా" అనబడెను. (పూర్వము వాలి సుగ్రీవులకువలె భీమసేనకిర్మీరులకు యుద్ధము జరిగెను.)

వనపర్వమందలి 25 అధ్యాయమున మార్కండేయుడు వనవాసము చేయుచున్న పాండవులను చూచి వారిని రామునితో పోల్చి వర్ణించును—"స చాపి రాజా సహ లక్ష్మణేన, వనే నివాసం పితు రేవ శాసనాత్, ధన్వీ చరన్ పార్థ మయైవ దృష్టో, గిరేః పురా ఋష్యమూకస్య సానౌ—సహస్రనేత్రప్రతిమో మహాత్మా యమస్య నేతా నము

చేశ్చ హంతా పితు ర్నిదేశాత్ అనఘః స్వధర్మం, వాసం వనే దాశరథి శ్చకార"

(ii) రామాయణ కథా భాగములు కొన్ని :—

లోమశుడు ధర్మరాజుకు వన పర్వమున తీర్థమాహాత్మ్యములు వర్ణించుచు భృగుతీర్థ మహిమ చెప్పెను. పరశురాముడు విష్ణుస్వరూపుడైన శ్రీరామునితో కలహించి తనతేజము కోల్పోయినవాడై పితృదేవతలు చెప్పగా ఈ తీర్థమును సేవించెనని అచ్చట కలదు. కనుక రామాయణ బాలకాండమందలి శ్రీరామ పరశురాముల సంఘర్షణ భారతమున కలదు. అయితే అది భారతమున కించిద్భేదముతో కలదు.

సౌగంధికాహరణ వృత్తాంతమునందు (వనపర్వము 146 అ) భీముడు హనుమంతుని కలిసినప్పుడు హనుమంతుడు రామకథ సంక్షేప సంగ్రహముగా చెప్పెను. అందులో హనుమంతుడు "త దిహాప్సరస స్తాత గంధర్వాశ్చ సదా తస్యా నఘ, వీరస్య చరితం గాయంతో రమయంతి మాం" అనును అనగా గంధర్వులు అప్సరసలు రామచరితమును పాడుచుందురట.

ఇక రామోపాఖ్యానమే, దుష్యంత నలోపాఖ్యానములంత విస్తారముగా, వనపర్వమున మార్కండేయ మహర్షిచే చెప్పబడినది.

ఏవి ఎట్లున్నను సౌగంధికాహరణ రామోపాఖ్యానములు ప్రక్షిప్తము లనుటకు వీలుగాదు. ఒకటి కథలోని భాగము, రెండవది రామాయణమునకే మూలమని భ్రమ కల్పించినది—ఇవి కొన్ని మచ్చున కిచ్చిన ఉదాహరణలు మాత్రమే.

(iii) రామాయణమం దానుషంగికముగా వచ్చిన కథలు :—

తీర్థయాత్రాపర్వమున 113 అ. న ఋష్యశృంగుని కథ వర్ణింపబడినది. లోమపాదుడను అంగదేశాధిపతి తన దేశమందలి అనావృష్టిబాధ నివారించుటకై బ్రాహ్మణుల ఉపదేశానుసారముగా విభాండక మహర్షి పుత్రుడైన బ్రహ్మవేత్తయైన ఋష్యశృంగుని వారకాంతల సహాయమున తన రాజ్యమునకు తెప్పింపగా రాజ్యమున వర్షములు కురియును. లోమపాదుడు తనకూతురగు శాంతను ఋష్యశృంగునకు ఇచ్చి వివాహము చేయును. లోమపాదునకు దశరథుడు స్నేహితుడని చెప్పబడినది. ఈ కథ రామాయణ భారతములందు సమానముగా ఉన్నది. రామాయణమున రోమపాద అనియు భారతమున లోమపాద అనియు ఉండుటే మార్పు. (రెండింట శాంత రోమపాదుని కూతురని యుండగా, దశరథుని కూతురని ప్రవాదము కలదు! గ్రిఫిట విభీషణపుత్రి యనబడినట్లు ఉత్తర రామచరిత్రలో "కన్యాం దశరథో రాజా శాంతాం నామ వ్యజీజనత్ అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ తాం దదౌ")

ఆపర్వమందే 108 వ అధ్యాయమున, రామాయణ బాలకాండ మందలి గంగావతరణము భగీరథ ప్రయత్నము వర్ణింపబడినవి.

ఆదిపర్వమున (చైత్రరథపర్వము) 174 అ. న విశ్వామిత్ర వసిష్ఠుల కలహము రామాయణమున వర్ణింపబడినరీతిగా కలదు. "ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలం" అనునది కూడా కలదు కొలది మార్పులు ఉత్తర భాగమున కలవు—ఇవి కొన్ని యుదాహరణములు.

ఈ విధముగా రామాయణము, రామాయణకర్త రామాయణ పాత్రలు, రామాయణ కథ, కథా భాగములు, రామాయణమందలి ఆనుషంగిక కథనములు ఎన్నో భారతమున కనుపించుటయు, అట్లు భారతకథగాని, భారతకర్తగాని, భారతముగాని రామాయణమున

పేర్కొనబడకపోవుట చేతను రామాయణమే భారతమునకంటె పూర్వ గ్రంథ మనుకొనవలెను.

రామాయణము భారతమునకంటె పూర్వ గ్రంథమనుటకు మరొక నిదర్శనము కలదు - రామాయణ కాలమునకు అథర్వణవేదము లేదు. కనుక రామాయణమున నాలుగు వేదము లను మాటయు, అథర్వణవేద మను మాటయు ఎచ్చటను లేదు. రామాయణ కాలమునాటికి వేద వేతృత్వము, త్రయీ వేతృత్వమే. రాముడు హనుమంతుని వాక్సంస్కారమును వర్ణించుచు "నానృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః నా సామవేద విదుషః శక్య మేవం విభాషితుం" (కిష్కిం.2-28) అనెను. కనుక రామాయణానంతర కాలమందే చతుర్వేద పారంగ తత్వము ప్రసిద్ధమైనది. రామాయణ కాలము నాటికి అథర్వణ వేదము లేదన్నచో ఆ మంత్రములు తర్వాత పుట్టినవని యర్థము కాదు. అవి ఋగ్వేదకాలమందే యుండవచ్చును. రామాయణ కాలమునకు ఆ మంత్ర గ్రామము అథర్వ శిరస్సులని పిలువబడుచుండెను. అతి ప్రాచీనమైన తైత్తిరీయోపనిషత్తునందవి ఎట్లున్నవో చూడుడు"... స ష పురుషవిధ ఏవ ... తస్య యజురేవ శిరః, ఋక్ దక్షిణః పక్షః. సామోత్తరః పక్షః, ఆదేశ ఆత్మా. అథర్వాంగి రసః పుచ్ఛం ప్రతిష్ఠా" (బ్రహ్మవల్లి) అథర్వశిరోమంత్రములకే అథర్వాంగిరస మంత్రములనియు పేరు. ఈ మంత్రసముచ్చయ మానాటికే వేద ప్రతిపత్తికి అర్హములని భావింపబడుచుండినట్లు వాటి ప్రాధాన్యమును తైత్తరీయ మంత్రము సూచించును. వానినినే. బహుశః మరికొన్ని అర్వాచీనములను చేర్చి, వ్యాసుడు చతుర్థవేదము చేసెను. రామాయణమున అథర్వశిరస్సు లను మాటయే ప్రయోగింపబడినది. "అథర్వ శిరసి ప్రోక్తైః మంత్రైః స్సిద్ధాం విధానతః" (బాల.15-2)

భారతమునందు కూడా అథర్వశిరస్ అను పేరుతో అథర్వణ మంత్ర సముదాయము పేర్కొనబడినది గానీ అట్టి సందర్భములు క్వాచి

త్కముగానే ఉన్నవి. దుష్యంతుడు కణ్వాశ్రమము ప్రవేశించు నప్పుడు "మధురై స్సామగీతై శ్చ ఋషిభి ర్నియతవ్రతైః భారుండ సామగీతాభి రథర్వశిరసోద్గతైః" (సంభవపర్వ. 70 అధ్యా) కానీ దాని క్రిందనే "యతాత్మభిః సునియతైః శుశుభే స తదాశ్రమః అధర్వవేద ప్రవరాః పాకయజ్ఞీయసామగాః" అని వెంటనే అధర్వవేదము పేరును వచ్చినది ఇది ప్రక్షిప్తభాగము కాదు.

వ్యాసుడే ఇట్లు వేదవిభజన చేసి వేదములు నాల్గొనర్చెనని భారతమే అనేకసార్లు చెప్పుచున్నది. సత్యవతి భీష్మునికి చెప్పుట- "కన్యాపుత్రో మమపురా ద్వైపాయన ఇతి శ్రుతః, యోవ్యవస్య వేదాం శ్చతురస్తపసా భగవాన్ ఋషిః లోకే వ్యాసత్వ మాపేదే కార్ష్ణ్యాత్ కృష్ణత్వమేవచ-" (సంభ-104అ) ఉపరిచరవసు వృత్తాంత కథనసం దును "వివ్యాసవేదాన్ యస్మాత్ తస్మాత్ వ్యాస ఇతి స్మృతః. వేదాన్ అధ్యాపయామాస మహాభారత పంచమాన్" (అంశావతరణ పర్వం 63-అ.)

భారతము నాటికి నాల్గు వేదములు వచ్చినవి కనుకనే భారతము పంచమవేద మనబడెను. వ్యాసు లెందరున్నను ఒక్కటిమాత్రము స్పష్టముగా ఉన్నది. భారతకర్త యనబడిన వ్యాసుడు, వైశంపాయనాది శిష్యులు గలవాడనియు, సాత్యవతేయుడనియు. అతడే వేద విభజనచేసెననియు భారతమందే కలదు- వేద విభజన చేసిన మహాపురుషుడే సకల వేదార్థ కోశమైన భారతమును చేసి యుండునని అనుకొనుట సహేతుకమే. కనుక భారత రచన వేద చతుష్టయమును పేర్కొనని రామాయణ రచనకు తర్వాతనే కావలెను. పంచమ వేద మనబడిన భారతమునకు తర్వాతనే రామాయణము వచ్చినచో రామాయణావతారికలందు రామాయణమును క్లుప్తముగా వేదముతో సమానమని ఊరకున్న చాలునా? అపారమగు భారత ప్రశస్తిముందు

రామాయణ మొక గ్రంథముగా నిలువగలిగి యుండునా? అట్లుగాక వేద సమ్మిశమగు రామాయణ మప్పటికే జగత్ప్రసిద్ధముగా ఉండుట చేతనే భారతము పంచమ వేదమని వర్ణింపబడవలసి వచ్చెననుకొనుటయే సమంజసము.

మరొక నిదర్శనము - రామాయణమున పురాణములు పేర్కొనబడలేదు. కానీ భారతమున పురాణములు పౌరాణికులు పేర్కొనబడిరి. "రోమ హర్షణ పుత్రః ఉగ్రశ్రవాః పౌరాణికః నైమి శారణ్యే...అని భారతము ప్రారంభించును. కనుక భారతకథాకథకుడే పౌరాణికు డనబడెను. భారతమే పురాణ మనబడెను. "ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా" (సంభవ.ప.) కొన్ని పురాణ ప్రసక్తి వచ్చిన ఉదాహరణలు :— "ఇతిహాస పురాణానాం ఉన్మేషం నిర్మితంచ యత్"-"పురాణ పూర్ణచంద్రేణ శ్రుతి జ్యోత్స్నాః ప్రకాశితాః"-"విద్వద్భిః కథ్యతే లోకే పురాణే కవిసత్తమైః" "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్"-పౌరాణికులు పేర్కొన బడిన ఉదాహరణలు-"పౌరాణికో వేదవాన్ పురస్తాత్" (ఆస్తీక.ప. 54అ.) "శైజాశ్చభగవద్భక్తాః సూతాః పౌరాణికాశ్చయే." (అర్జున వనగమన. ప.21౩అ) కానీ రామాయణమున మూల గ్రంథమందు గాని అవతారికలందు గాని పురాణములు పౌరాణికులు పేర్కొనబడ లేదు.

(బాలకాండ నవమ సర్గలో "ఋత్విగ్భి రుపదిష్టోయం పురావృత్తోమయాశ్రుతః" అనుచోట "పురాణే అను శబ్దముతో మరొక వాక్యము గోరక్‌పూర్ ప్రతిలో ఉన్నది. కానీ అది సాధు పాఠము కాదు. నేను పశ్చిమోత్తర ప్రతి, గోరక్‌పూరు వారి ప్రతి, దాక్షిణాత్య ప్రతి చూచితిని. వానిలో పాఠభేదములున్నవి గాని, సాధారణముగ దాక్షిణాత్య ప్రతిలోని పాఠములే సమంజసములుగను అర్థవంత

ములుగను ఉన్నవి.) అన్నిటికంటె ప్రాచీనమనబడు వాయు పురాణము కూడా వేద విభజనను గురించి చెప్పుచుండుటచేత పురాణములన్నియు రామాయణము తరువాతివే.

మరొక నిదర్శనము-భారతమున విష్ణువుయొక్క అవతారములు చెప్పబడినవి. కాని రామాయణమున ఇంద్రప్రాశస్త్యమేగాని విష్ణు ప్రాశస్త్యము లేకపోవుట చేతను, రాముడు విష్ణ్వవతారమని చెప్పు భాగములు ప్రక్షిప్తములని స్పష్టముగా విశద మగుచుండుటచేతను, రామాయణమున అన్యత్ర అవతారముల ప్రసక్తి ఎచ్చటను లేకపోవుట చేతను రామాయణము భారతమునకు పూర్వగ్రంథ మనుకొనవలెను. (రాముడు విష్ణ్వవతారమని చెప్పు భాగములు ప్రక్షిప్తములని స్థలాంతర మున ప్రత్యేకముగ వివరింతును చూ. అశ్వమేధ విషయము).

విష్ణువు వామనుడుగా పుట్టుట, క్షీరసాగరమథనవేళ కూర్మ రూపము ధరించుట అనునవి రామాయణమున పేర్కొనబడినవి. అందులో వామన పుట్టము, మామూలుగా భారత భాగవత పురాణము లందున్నట్లు లేదు. దేవతలు రాక్షసుల బాధలు భరించలేక బ్రహ్మతో మొరపెట్టుకొని, బ్రహ్మ పురస్సరులై విష్ణుదేవుని ప్రార్థించి ఆయనచే అభయమునొందుట భారత పౌరాణిక పద్ధతి. ఇందు విష్ణువు దేవతలకంటె అధికుడు. కాని రామాయణమున వామన కథ అట్లు లేదు. అది వేదపద్ధతి ప్రకారమున్నది. వేదమున విష్ణువు అధికుడు కాదు. దేవతలు విష్ణువును తరచుగా దేవకార్యమునకు నియోగించు చుందురు. ఆయన అట్టి కార్యమును దేవ నియోగము చొప్పున చేయుచుండువాడు. వైదిక దేవతలు అగ్ని పురస్సరులు. కాని పౌరాణిక దేవతలు బ్రహ్మ పురస్సరులు. రామాయణమున చూడుడు.

బలిచే ఇంద్రుడు దేవతలు నిర్జితులైన తర్వాత బలి యాగము చేయుచుండగా అగ్ని పురస్సరులై దేవతలు విష్ణువు తపస్సు చేయుచున్న సిద్ధాశ్రమునకు వచ్చిరి. "బలేస్తు యజమానస్యదేవా స్సాగ్ని పురోగమాః. సమాగమ్యస్వయం చైవ విష్ణు మూచు మహాశ్రమే" (బాల 29న శ్లో) బ్రహ్మాపురస్సరులై దేవతలు గారు వీరు; వీరు అగ్నిపురస్సరులు స్వయం సమాగమ్య అనుటచే ఎవ్వరును సామాన్యముగా కాక అని వారు వారే స్వయముగా విష్ణువు దగ్గరకు వచ్చిరి అని అర్థము; అనగా విష్ణువు కంటె దేవతలే అధికులు; విష్ణువును తమ వద్దకు పిలిపించుకొని కార్యము చెప్పువారు. ఊచుః అనుట విష్ణువును ప్రార్థించుటగాదు. ఈ శ్లోకము వేదమందలి పరిస్థితిని బట్టి వ్రాయబడినది. కనుక అతి ప్రాచీనము. దేవతలు విష్ణువుకు ఇట్లు చెప్పిరి-"స త్వం సురహితార్థాయ మాయా యోగ ముపాగతః వామనత్వం గతో విష్ణో కురు కల్యాణముత్తమం." అనగా దేవహితార్థమై మాయాయోగముచేత వామనుడవై కల్యాణ క్షేమ నెరింపుము అని దేవతలు విష్ణువును ఆజ్ఞాపించుచున్నారు. మరొక ముఖ్యమైనది- వామనత్వము విష్ణువు మాయాయోగముచేత పొందవలెనట! అదికూడా దేవతలే నిర్దేశించిరి. ఈ కారణముచేత మూలగాథ ఇంతే ఉండగా అదితికి కశ్యపునకు వామనుడు పుట్టుట అనునది తర్వాత చేర్చబడినది కావలెను. మొత్తము మీద ఈ ఉపాఖ్యానము భారత భాగవతాదులందు వర్ణింపబడినట్లు అవతార పద్ధతిలో లేదు. పౌరాణిక పద్ధతికి దూరమై వైదిక పద్ధతి ననుసరించి యున్నది..

రామాయణ బాలకాండాంతర్గతమైన విష్ణువు యొక్క కూర్మరూపధారణాది కథ ప్రక్షిప్తముగా ఉన్నది. బహుశః భారత రచనకు పూర్వమే ప్రక్షిప్తమై యుండవచ్చును-కానీ ఏది ఎట్లున్నను రామాయణ కాలమునకు విష్ణువునకు ఆధిక్యము లేకపోవుట చేత, అవతార భావమే రామాయణమున అప్రాగ్యముగా ఉన్నది. కూర్మరూపధారణ కథ కూడా అవతారమను భావముతో చెప్పబడినట్లు తోచదు.

భారతమున ఇట్లుకాదు. అప్పటికి అవతార మనుభావము సుస్పష్ట రూపము దాల్చియున్నది. నేడున్న యవతారములన్నీ ఆనాడు లేకపోవచ్చును. కాని విష్ణువు ఈ ఈ అవతారములెత్తెనని అనేక మార్లు భారతమున అవతారముల లి ఇవ్వబడినది. కొన్ని ఉదాహరణలు:- వికతాకద్రువలు సముద్రమును చూచి నప్పుడు (ఆస్తీక పర్వము 21 అధ్యా) "గాం నిచతా భగవతా గోవిందే నామితతేజసా వరాహ రూపిణా చాంతః క్షోభిత జలావిలం" -(వరాహరూపమెత్తిన విష్ణువుచేత క్షోభితమైన దీ సముద్రము).

వనపర్వమున (83 అధ్యా) "తతో గచ్ఛేత ధర్మజ్ఞ వారాహం తీర్థముత్తమం, విష్ణుర్వారాహరూపేణ పూర్వం యత్ర స్థితో౽భవత్" అని కలదు.

వనపర్వాంతర్గత తీర్థయాత్రా పర్వమున 102 అధ్యాయము నందు:—కాలకేయాసురులచే ముల్లోకములు బాధింపబడుచుండగా భరింపలేక దేవతలు రక్షింపుమని విష్ణువును ప్రార్థింపగా అతడు అగస్త్యుడు దీనికి సమర్థుడని ఉపాయము చెప్పును. అచ్చట దేవతలు చేసిన విష్ణుస్తుతియందు విష్ణ్వవతారవర్ణన కలదు "త్వయా భూమిః పురానష్టా సముద్రాత్పుష్కరేక్షణ, వారాహం వపురాశ్రిత్య జగదర్థే సముద్ధృతా, ఆదిదైత్యో మహావీర్యో హిరణ్యకశిపుః పురా, నారసింహం వపుః కృత్వా సూదితః పురుషోత్తమ, అవధ్యస్సర్వభూతానాం బలి శ్చాపి మహాసురః వామనం వపురాశ్రిత్య త్రైలోక్యాత్ భ్రంశిత స్త్వయా, అసురశ్చ మహేష్వాసో జంభ ఇత్యభివిశ్రుతః యజ్ఞక్షోభకరః క్రూరః త్వయైవ వినిపాతితః"-ఇత్యాది. ఈ స్తోత్రమున వరాహ నారసింహ వామనావతారములు మూడే కలవు. చివర జంభాసురుడు నీచేత నే చచ్చెనని చెప్పబడెను. ఇది అవతారముకాదు. ఈ జంభాసురు డెవరో-జంభాసు

రుని చంపినవాడు ఇంద్రుడు-కానీ ఇది విష్ణుస్తోత్రము. భారతమున మరొక జంభాసురుడు అర్జునునితో యుద్ధము చేసి కృష్ణునిచే చంపబడెను. కానీ ఈ లిస్టులో కృష్ణావతారము పేర్కొనబడలేదు. కనుక ఇది దీర్ఘముగా చింతించవలసిన విషయము, మొత్తము మీద ఈ స్తోత్రము స్వరూపస్వభావములచేత అతిప్రాచీనమై భారతమందలిదే ననియు ప్రక్షిప్తముకాదనియు చెప్పకయే చెప్పుచున్నది.

వనపర్వ 190 అధ్యాయమున మార్కండేయుడు ధర్మజునికి కలియుగ విశేషాలు వర్ణించుచు "కల్కివిష్ణుయశానామ ద్విజః కాలప్రచోదితః ఉత్పత్స్యతే మహావీర్యో మహాబుద్ధి పరాక్రమః" అని చెప్పను. ఇది ప్రక్షిప్తమేమో ?

వనపర్వమున జయద్రథ విమోక్షణ ఘట్టమున ఇట్టిదే మరొకటి వచ్చును. పాండవులచే అవమానము పొంది దుఃఖార్తుడై జయద్రథుడు శివుని గూర్చి ఘోర తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమైనప్పుడు అతడు పాండవులను జయించునట్లు వరమిమ్మని కోరెను. శివుడు అది సాధ్యము కాదనియు అందును అర్జునుడు సాక్షాత్తు నారాయణుడైన కృష్ణునితో కూడినవాడు గాన అనివార్యుడనియు చెప్పుచూ నారాయణుని మహిమ వర్ణించుచు విష్ణువుయొక్క అవతారములువర్ణించును. ఆ అవతారములును వరాహ నారసింహ వామనము లను మూడే. అయితే ఇచ్చట కొంత విస్తృతముగా వర్ణింపబడినవి (వనపర్వం 273 అధ్యాయం)

చిత్రమేమిటనగా-శ్రీరామ కృష్ణులను గూడా భారతము విష్ణ్వవతారములనియే చెప్పును. కానీ వారిని ఈ అవతారపు జాబితాలం దెచ్చటను లేదు.

శ్రీరాముడు విష్ణువని చెప్పిన ఉదాహరణలు :—
"విష్ణుః స్వేన శరీరేణ రావణస్య వధాయ వై
పశ్యామ స్తమయో ధ్యాయాం జాతందాశరథిం తతః"
(లోమశుడు ధర్మజునకు చెప్పుట-వనపర్వం. 99 అధ్యా)
అచ్చటనే పరశురామ శ్రీరాముల సమాగమము వర్ణింపబడెనది.

పరశురాముని ధర్షణకు కుపితుడై రాముడు తన విశ్వరూపము నాతనికి చూపును. అది—

"తతోరామశరీరేవై రామః పశ్యతి భార్గవ
ఆదిత్యాస వసూన్ రుద్రాన్ సాధ్యాంశ్చ సమరుద్గణాన్
పితరోజాఃవేదాశ్చనక్షత్రాణి గ్రహాస్తథా
గంధర్వారాక్షసా యక్షా నద్యస్తీర్థాని యానిచ
ఋషయో వాలఖిల్యాశ్చ బ్రహ్మభూతాస్సనాతనాః
దేవర్షయశ్చ కార్త్స్న్యేన సముద్రాః పర్వతాస్తథా
వేదాశ్చ సోపనిషదో వషట్కారైః మహాధ్వరైః
చేతోమంతి చ సామాని ధనుర్వేదశ్చ భారత
మేఘబృందాని వర్షాణి విద్యుతశ్చ యుధిష్ఠిర
తతః స భగవాన్ విష్ణుస్తం వై బాణం ముమోచ హ."
ఇది అర్జునునికి కృష్ణుడు చూపిన విశ్వరూపము వంటిదే గదా !

సౌగంధికాహరణ ఘట్టమున భీమునకు హనుమంతుడు రామ కథ వినిపించెను. అందు రాముడు విష్ణ్వవతారమని చెప్పబడెను. "అథ దాశరథి ర్వీరో రామోనామ మహాబలః విష్ణుర్మానుషరూపేణ చచార వసుధాతలం" అచ్చటనే కొంచె మవతల హనుమ రాముని గూర్చి చెప్పిన యొక రమణీయమైన శ్లోకము." రామాభిధానం విష్ణుం హి జగద్ హృదయనందనం సీతావక్త్రారవిందార్కం దశాస్య ధ్వాంత భాస్కరం"—

భారతమందలి రామోపాఖ్యానము నందును రాముడు విష్ణువే యని చెప్పబడెను. బ్రహ్మా దేవతలకు, తదర్థమవ తీర్ణోఒసౌ మన్ని యోగాచ్చతుర్భుజః విష్ణుః ప్రహరతాం శ్రేష్ఠః స సంగ్రే ప్యతి" (రామోపాఖ్యానం. 27ర ల).

భారతమున ఇట్లి విష్ణ్వవతారమని చెప్పబడిన రాముని. రామాయణము భారతానంతర గ్రంథమే అయినచో తత్పూర్వమే భారత ప్రతిపాదితమై లోక పూజితమై యున్న రాముని విష్ణుత్వమును తొలగించి కేవలమొక మానవుడుగా చిత్రించుటకు సాహసించునా? కేవలము మానవుడుగా కాదన్నను, కనీసము రాముడు దేవుడను భావము గుప్తము చేయబడెను గదా. పూర్వమే దేవుడని రూఢియైన వానిని నరుడా అనునా కాదా అను సందేహము వచ్చునట్టి రీతిగా చిత్రించుట ఆ ప్రాచీన కాలమున సాధ్యమా? కనుక రామాయణమే భారతమున కంటె పూర్వ గ్రంథము కావలెను.

బహుశః రామునకు విష్ణుత్వము భారతకాలమున ఆపాదింపబడు చుండెనేమో! కానీ అప్పటికి ఇంకను అవతారస్థానము రాలేదు. అటి కాలమున భారతము వచ్చి యుండును.

కనుక (1) రామాయణమున అవతారములు లేకుండి భారతము నందుండుటచేతను, (భారతమందున్న అవతారములు కూడా నేటివలె పదిగాక మూడే) (2) రామాయణమున రాముడు దేవుడుగా చిత్రింపబడక భారతమున విష్ణ్వవతారమని చెప్పబడుట చేతను రామాయణమే భారతమున కంటె పూర్వ గ్రంథమని తెలియుచున్నది.

భారతమున కృష్ణుడు విష్ణువని స్పష్టముగా చెప్పబడెను. కృష్ణుడనేక సందర్భములందు చక్రము నుపయోగించును. కానీ రాముడు

రామాయణము మూలగ్రంథమున విష్ణువని చెప్పబడలేదు గదా కేవల మొక మానవ మాత్రుడుగానే చిత్రింపబడెను.

— వెనుక అవతారములను గురించి ఉదహరించిన విషయముల చేత రామాయణము అవతార భావము లేని కాలమునకు చెందినదిగాను భారతము అవతార భావము ఏర్పడిన కాలమునకు చెందినదిగాను భావించుటయే సమంజసము.

మరొక నిదర్శనము :— నేడు మనకు తెలిసిన గరుత్మంతుని కథకు మూలము భారతమే (ఈ విషయమీ గ్రంథమందే అన్యత్ర వివరించితిని. చూడుడు) గరుత్మంతుడు రామాయణమున అనేకసార్లు పేర్కొనబడెను; కాని గరుత్మంతునికి సంబంధించిన కొన్ని సంగతులు ముక్కలు ముక్కలుగా అక్కడక్కడ చెప్పబడెను. వాటికి కథారూపము లేదు. చూడుడు-(అరణ్యకాండ. 14 స-6 నుంచి 32 శ్లో) రాముడు భయంకర పరాక్రమము మహాకాయము కలిగిన జటాయువును కలిసినప్పుడు జటాయువు తన కులగోత్రములు చెప్పుచు తన వంశ క్రమము వివరించెను. కశ్యప ప్రజాపతి దక్షప్రజాపతి కూతుళ్ళ నెనిమిది మందిని వివాహ మాడెను. అందులో అదితికి ఆదిత్యులు, వసువులు, రుద్రులు, అశ్వినులు ఇత్యాది దేవతలు జన్మించిరి. దితి దైత్యులను కనెను. కాళికకు నరకుడు కాలకుడు పుట్టిరి. తామ్రకు క్రౌంచి, భాసి శ్యేని ధృతరాష్ట్రి శుకి అను కన్యలు పుట్టిరి. (ఆ కన్యలకు మరల సంతానము కలిగెను. అందులో ఆయిదవ కన్యయైన శుకికి నత వినతలు పుట్టిరి.) క్రోధవశ జింకలు కోతులు పసుగులు పులులు ఇత్యాది సంతానమునకు కారణ మాయెను. (ఈ జంతుజాల మంతయు క్రోధవశ కూతుళ్ళ సంతానము) క్రోధవశ కూతుళ్ళలో ఒకతె కద్రువ. తర్వాత కశ్యపుని భార్య మనువు బ్రాహ్మణ క్షత్రియాది చాతుర్వర్ణ్య మానవులను

కనెను! మరొక భార్యయగు అనలకు వృక్షములు పుట్టెను. ఇదె అంతయు రామాయణ కాలమునాడు సృష్టిజాలము యొక్క క్రమము మును గురించి మానవునికి కలుగుచుండిన ఆలోచనలు, విజ్ఞానము. మన డార్విన్ సిద్ధాంతము వంటిది. (ఇట్టిదే చాలా మార్పులతో భారతమున సంభవ పర్వములో 66 వ అధ్యాయమున గజిబిజిగా చెప్పబడి యున్నది.) ఇందులో మనకు కావలసినది-రామాయణము ప్రకారము కశ్యపుని భార్యయగు తామ్రకు పుట్టిన శుకి యొక్క కూతురు వినత: అనగా కశ్యపుని మనుమరాలు వినత. కశ్యపుని భార్యయగు క్రోధవశకు పుట్టిన కూతురు కద్రువ: అనగా కద్రువ కశ్యపుని కూతురు.

ఇట్లు రామాయణమున కశ్యపుని కూతురైన కద్రువ కశ్యపుని మనుమరాలైన వినత, భారతమునందు కద్రువ కశ్యపుని మొదటి భార్యగాను వినత కశ్యపుని రెండవ భార్యగాను చెప్పబడినది—రామాయణమున కద్రువ సంతానము ధరణిని మోయు వేయి తలల పామొక్కటే అని చెప్పగా భారతమున ఆమెకు వేయి పాములు కలిగినట్లు చెప్పబడినది. వినత సంతానము గరుడుడు అరుణుడు అని కలదు. గరుడుడు పెద్దవాడు, అరుణుడు చిన్నవాడు—కాని భారతమున వినతకు పెద్ద కొడుకు అనూరుడనువాడు రెండవ కొడుకు గరుడుడు (ఆస్తీక పర్వమందలి 16 వ అధ్యాయము చూడుడు)

రామాయణమున మరొకచోట గరుత్మంతుని విషయము కలదు. (అరణ్యకాండలో 33 స-27 నుంచి 36 శ్లో) రావణుడు సీతాపహరణార్థము వచ్చుచు అడవులు, నదులు, కొండలు నగరములు చూచెను అని చెప్పుచు ఒక మహాన్యగ్రోధవృక్షమును చూచెను అని చెప్పబడినది. దానిని వర్ణించుటకు గరుత్మంతుని వృత్తాంతము తేబడినది. అది—గరుత్మంతుడు గజకచ్ఛపముల దినుటకై ఈ న్యగ్రోధవృక్షశాఖపై

వ్రాలెను. గరుడుని భారమును సహించలేక ఆ కొమ్మ విరిగెను. క్రింద తపస్సు చేసుకొనుచుండిన వాలఖిల్యాది మహర్షుల మీద ఆ కొమ్మ పడునేమో యని ఆ ఋషులమీద దయచేత దాని నొక కాలితోను గజకచ్ఛపముల నొక కాలితోను తీసుకొని పోయెను. గజ కచ్ఛపములను తిని ఆ కొమ్మతో నిషాదులను చంపి భుజించెననియు, మహామునులను విడిపించి సంతోషించెననియు గలదు. ఆ సంతోషముతో మహేంద్ర గృహమును భేదించి యమృతము తెచ్చెను—ఇట్లున్న దీ కథనము-పరిశీలించినచో ఇందు కొన్ని విశేషములు కలవు. భారతమున వాలఖిల్యాదులు కొమ్మకు వ్రేలుచుండిరని కలదు. రామాయణమున అట్లు లేదు. భారతమున ఆ కొమ్మను, గరుడుడు, ఋషులు వ్రేలు చుండగానే ముక్కున కరిపించుకుని తీసుకొని పోవుచుండగా, తండ్రియగు కశ్యపుడు ప్రార్థించుటచేత వాలఖిల్యాదులు ఆ కొమ్మను విడిచిపోదురు. అంతట ఆ కొమ్మను గరుడుడు నిర్జన పర్వతముపై విడుచును. రామాయణమునం దిచ్చట కశ్యపుని పేరు రాదు.

మరొకటి—జాంబవంతుడు హనుమంతుని సముద్రలంఘనము చేయుమని ఉద్బోధించుచు తన్మహిమ వర్ణించు సందర్భమున "అరిష్ట నేమినః పుత్రో వైనతేయో మహాబలః *రుత్మానితి విఖ్యాత ఉత్తమ స్సర్వపక్షిణాం" (కిష్కిం. 66 స. 4 శ్లో) అని కలదు. దీనిచేత గరుడుడు అరిష్టనేమి యనువాని కుమారుడని అర్థము. వ్యాఖ్యాతలైన గోవిందరాజ మహేశ్వర తీర్థు లిర్వురు, అరిష్టనేమినః పుత్రః అనగా కాశ్యపస్య పుత్రః అని చెప్పిరి. (అరిష్టనేమేః - నకారాంతత్వమార్షం: వేదమున అరిష్ట నేమిః అనియే ఉన్నది "స్వస్తినః తార్ క్ష్యో అరిష్టనేమిః—") కశ్యప శబ్దము దాక్షిణాత్య ప్రతులందు కాశ్యపః అని కలదు. కాని ఔత్తరాహ ప్రతులందు కశ్యప అనియే ఉన్నది. కాశ్యప అనుట అపశబ్ద ప్రయోగము. [మార్కండేయ పురాణము కశ్యపుని మరీచి కొడుకన్ని

చెప్పి "కశ్యప స్తస్య పుత్రోఽభూత్ కశ్యపానాత్ స కశ్యపః" అనెను. కశ్యపానము చేత అనగా సురాపానము చేత కశ్యపుడని శబ్ద వ్యుత్పత్తి వివరించినది.]

కాని అరిష్ట నేమి అనగా కశ్యపుడని అరిష్టనేమి పుత్రుడనగా కశ్యప పుత్రుడనియు వ్యాఖ్యాతలు చెప్పిన అర్థము రామాయణ విషమమున తప్పు! రామాయణము అరిష్టనేమి కశ్యపులు ఇరువురు వేర్వేరు ప్రజాపతులుగా పేర్కొన్నది. చూడుడు—" "పూర్వకాలే మహాబాహో! యే ప్రజాపతయోఽభవన్, తాన్మే నిగదిత స్సర్వా నాదితశ్శృణు రాఘవ!, కర్దమః ప్రథమ స్తేషాం విక్రీత స్తదనంతరః శేషశ్చ సంశ్రయ శ్చైవ బహుపుత్రశ్చ వీర్యవాన్, స్థాణుర్మరీచి రత్రిశ్చ కతు శ్చైవ మహాబలః, పుల స్త్యశ్చాంగిరా శ్చైవ ప్రచేతాః పులహ స్తథా దక్షోవివస్వానపరోఽరిష్టనేమిశ్చ రాఘవ!. కశ్యపశ్చ మహాతేజా స్తేషా మాసీచ్చ పశ్చిమః" (అరణ్య. 14 స. 6,7,8,9)

కనుక కశ్యపుడనువాడు రామాయణము వర్ణించిన ప్రజాపతులందు చివరివాడు. కానీ వ్యాఖ్యాతలు ఇచ్చట తత్పూర్వోక్త అరిష్టనేమి శబ్దమును కాశ్యపశ్చ అనుదానితో అన్వయించి అరిష్టనేమి యను నామాంతరముగల కశ్యపుని కొడుకు గరుడుడు అని చెప్పిరి. ఇట్లు అరిష్టనేమి కశ్యప శబ్దములు ఒక్కరికే అన్వయించుట అసాధువు. ఇచ్చట ఎవరు ప్రజాపతులైరో వారిని మొదటినుంచి (ఆదితః) చెప్పెదను వినుము అనుచున్నాడు (జటాయువు). కర్దమః ప్రథమ స్తేషాం అని ప్రారంభించెను. కర్దముడు మొదటివాడు ఇట్లు ప్రథమః, తదనంతరః, అపరః అను పదములు వాడుచు కశ్యపుడు పశ్చిమః అనగా చరమః అంత్యః అని చెప్పబడినది. పైగా అరిష్టనేమిశ్చ కశ్యపశ్చ అని సముచ్చయార్థకమైన 'చ' రెండు పేర్లకు చివర చేర్చబడినది. అందు

చేత అరిష్టనేమి వేరు కశ్యపుడు వేరు అనుట స్పష్టము. కనుక రామాయణమున గరుత్మంతుడు అరిష్టనేమి యను ప్రజాపతి పుత్రుడే గానీ కశ్యపుని పుత్రుడు కాడు—శబ్ద కల్ప ద్రుమమున అరిష్టనేమి శబ్దమునకు "స్వనామాఖ్యాతః ప్రజాపతిః" అనిచెప్పి యథా రామాయణే అని ఈ శ్లోకమే ఉదహరింపబడినది.

కానీ ఈ విషయము భారతమునను తదనంతర గ్రంథములందును పరిపరి విధములుగా ఉన్నది. మహాభారతమున మోక్షధర్మ పర్వమున కశ్యపుడను నామాంతరముగల అరిష్టనేమి మరీచి కొడుకు అని చెప్ప బడినది. బహుశః ఇదియే గోవింద రాజ మహేశ్వర తీర్థులకు ఆధార మై యుండును.

తదితర అనేక విషయములందువలె ఈ విషయమున రామాయణ మునకు భారతాది అన్యగ్రంథములకు చాల వ్యత్యాసము కలదు. భారతమునకు తదన్య గ్రంథములకు అట్లే వ్యత్యాసము గలదు. అరిష్ట నేమి, కశ్యపుని నామాంతరమని చెప్పిన భారతమే అంశావతార పర్వ మున అరిష్టనేమి తార్క్ష్యుడను ఒక ఋషి పేరని చెప్పెను. మరొకచోట తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ అను ఇర్వురు భిన్నులు వైనతేయులలోని వారని చెప్పినది, అనగా వినత సంతానమని అర్థము. కానీ హరివంశ మున అరిష్టనేమి తార్క్ష్య శబ్దములు గరుడుని పేర్లుగా చెప్పబడినవి. వాచస్పత్యము అరిష్టనేమి అనగా గరుత్మంతుడని చెప్పుచున్నది. శబ్ద కల్పద్రుమము గరుడుని పేరని చెప్పుచు ఒక ప్రజాపతి పేరని కూడా చెప్పుచున్నది. వేదము తార్క్ష్య అరిష్టనేమి శబ్దములను గరుత్మంతునికే వర్తింపజేయుచున్నది. "స్వస్తినఃఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః, స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు" (ఋగ్వే. 1మండ. 648 మంత్ర).

ప్రజాపతు లెవరు ఎందరు అను ప్రశ్నకు అనేక సమాధానములు కలవు. రామాయణమున ప్రజాపతులు 17 మంది అని చెప్పబడినది. ఆహ్నికతత్త్వమను గ్రంథమున 10 అని కలదు. మహాభారతమున 21 అని కలదు. కాని ఈ రెండు జాబితాలందును అరిష్టనేమి పేరు లేదు! నవబ్రహ్మలను వారిని ప్రజాపతు లందురు. అందును కొందరి విషయమున మతభేదము కలదు. ఈ విషయ మిట్లున్నది.

కాని ముఖ్యముగా గుర్తించవలసినది-ఈ గ్రంథములన్నిటి కంటె రామాయణ మందలి విషయము విలక్షణముగా ఉన్నది. ఆ విషయ మన్య గ్రంథములం దెచ్చటను లేదు.

కనుక రామాయణమున గరుడుని తండ్రి కశ్యపుడు కాదు; అరిష్టనేమియను ఒక ప్రజాపతి గరుడుని తండ్రి. ఈ విషయములన్నియు రామాయణము భారతాది గ్రంథములకంటె ప్రాచీనమని సూచించుచున్నవి.

ఈ రామాయణమందలి వృత్తాంత శకలములను సమీకరించినచో ఒక కథా రూపము రాదు. గరుడుడు దేవలోకమునుంచి యమృతము తెచ్చెనని కలదే కాని ఎందుకు తేవలసి వచ్చెనో రామాయణమున లేదు. కనుక ఈ విషయమునకు భారతమందలి గరుడ కథకు అల్ప సంబంధమే కలదు. ఈ రెంటిని పోల్చి చూచినచో రామాయణమందలి భిన్న తంతు శకలములు తీసుకొని భారతకర్త ఒక కథగా అల్లెనని తోచును (వేద సహాయముతో).

భారతమే మొదటి గ్రంథమైనచో భారతమందు స్పష్టముగా సమగ్రముగా ఉన్న కథను తర్వాత వచ్చిన దనుకొను రామాయణము ఇట్లు ముక్కలు ముక్కలుగాను వ్యత్యస్తము గాను చేయునా? (రామాయణము భారతము ననుసరించి వచ్చిన దనుచున్నారు గదా) రామా

యణ భారతములందలి గరుడ వృత్తాంతము సేకరించి పరిశీలించినచో రామాయణమే భారతమునకంటె పూర్వగ్రంథమని విశదమగును.

ఇంకొక నిదర్శనము-రామాయణమున హిరణ్యాకశిపుని పేరొక చోట వచ్చును-రాముని పై ఆశ వదలుకొనుమని రావణుడు సీతకు చెప్పుచు "నచాపి మమ హస్తాత్త్వాం ప్రాప్తుమర్హతి రాఘవః, హిరణ్యాకశిపుః కీర్తిం ఇంద్ర హస్తగతామివ" (సుందర. కాం. 20 స-శ్లో) అనెను (ఇంద్రహస్తగతమైన కీర్తిని హిరణ్యాకశిపుడు పొందలేనట్లు నా చేత జిక్కిన నిన్ను రాఘువుడు పొందలేడు) ఇది బహుచిత్రమైన మాట-ఇంద్రుడు దేవత, హిరణ్యాకశిపుడు రాక్షసుడు. అట్టి హిరణ్యాకశిపునకు రాముడు పోల్చబడెను, రావణుడు తనను ఇంద్రునికి పోల్చుకొనెను-ఇంతకు దప్ప మరెచ్చటను హిరణ్యాకశిపుని ప్రశంస రాదు. బాలకాండలో 29 సర్గలో వామనవృత్తాంత కథనమునందు కూడా బలిచక్రవర్తి వైరోచని అని మాత్రమే చెప్పబడెను. కాని విరోచనుడు ప్రహ్లాదపుత్రుడను పౌరాణిక విషయము రామాయణమున లేదు; భారతమందును లేదు. రామాయణమున నారసింహావతారవిషయమే లేదు.

ఇక భారతమందు—అనేక సార్లు హిరణ్యాకశిపు, ప్రహ్లాద నారసింహుల మాట వచ్చినది. సంభవపర్వములో 65 అధ్యాయమున "ఏక ఏవ దితేః పుత్రో హిరణ్యాకశిపుః స్మృతః, నామ్నా ఖ్యాతస్తు తస్యేమే పంచపుత్రా మహాత్మనః, ప్రహ్లాదః పూర్వజస్తేషాం......ప్రహ్లాదస్య త్రయః పుత్రాః......విరోచనశ్చ...విరోచనస్యపుత్రోఽభూత్ బలిరేకః ప్రతాపవాన్..." ఇంద్రప్రస్థపురమందున్న పాండవుల కడకు నారదుడు వచ్చి హితము ఉపదేశించుచు సుందోప సుందుల కథ చెప్పెను. తద్కథా ప్రారంభమున (ఆది-రాజ్యలంభ పర్వము 208 అధ్యా) "మహాసుర స్యాన్వవాయే హిరణ్యకశిపోః పురా, నికుంభోనామ దైత్యేంద్ర స్తేజస్వీ బలవానభూత్" అనివచ్చును: వనపర్వము 102; 278

అధ్యాయములందు నృసింహ హిరణ్య కశిపులు పేర్కొనబడిరి. ఈ విధముగా భారతమందు హిరణ్యకశిపుని వృత్తాంతము మంత విస్తృతముగా లబ్ధమగుచున్నది.

రామాయణమున నృసింహావతారమే లేకపోవుట చేతను హిరణ్యకశిపుని పేరు మాత్రమే ఒక్కచోట ప్రసక్తమగుట చేతను; భారతమందట్లుగాక నేడు మనము ఎరిగిన హిరణ్యకశిపుని కథ మూడు వంతు లుండుట చేతను,రామాయణమే భారతమునకంటె పూర్వ గ్రంథ మనుకొన వచ్చును.

మరొక ముఖ్యమైన నిదర్శనము చూపుచున్నాను:—

రామాయణమున బాలకాండమున దశరథుడు పుత్రసంతానార్థము అశ్వమేధయాగము చేయదలచెను. బ్రాహ్మణోత్తములతో తన అభీష్టము తెల్పుచు దశరథుడు "మమలాలప్యమానస్య పుత్రార్థం నాస్తివై సుఖం, తదహంహయమేధేనయక్ష్యామీతి మతిర్మమ" (8 స. 8 శ్లో) అనెను. తర్వాత ఆ యాగనిర్వహణార్థము ఋష్యశృంగుడు అంగ దేశమునుండి తీసుకొని రాబడెను. ఆ ఋష్యశృంగుని యాగము ప్రారంభించుమని కోరుచు దశరథుడిట్లనెను "తతః ప్రసాద్య శిరసా తం విప్రం దేవవర్ణినం, యజ్ఞాయ వరయామాస సంతానార్థం కులస్యవై.—తథేతిచ సరాజానం ఉవాచచ సుసత్కృతః సంభారాస్సంభ్రియంతాం తే తురగశ్చవిముచ్యతాం" (12స. 202 శ్లో) ఆ విధంగా ఋష్యశృంగుడు దశరథునికి పుత్రసంతానము కలుగుట కొరకై అశ్వమేధయాగము చేయనారంభించెను. 13 వ సర్గలో యాగమునకు వలయు ప్రయత్నములు ప్రారంభింపబడినవి. అక్కడకూడా 1 వ శ్లోకములో ప్రసవార్థంగతో యష్టుం హయమేధేన వీర్యవాన్". అనబడినది.

ఈ విధముగా రామాయణమున దశరథుడు పుత్రసంతానము కొరకు అశ్వమేధయాగము చేసెనని కలదు. 14వ సర్గలో అశ్వమే

మేధము పూర్తియగును. అందలి 55 శ్లోకము "తతః ప్రీతమనా రాజా ప్రాప్యయజ్ఞ మనుత్తం పాపాపహం స్వర్నయనం దుష్కరం పార్థివర్ష భైః" అనగా రాజులకును దుర్లభమైన హయమేధము చేసి దశరథుడు సంతుష్టు డాయెను, అని చెప్పుచున్నది. ఇట్లు పుత్రసంతానార్థము అశ్వమేధము చేయబడగా దాని ఫలము పుత్రసంతానము దశరథునిచే పొందబడవలెను గదా?

అట్టి ఫలమిచ్చు అశ్వమేధము చేసిన తర్వాత మరల దశరథుడు ఋష్యశృంగుని నాకు వంశ వృద్ధియగు పనిచేయు మని అడిగినట్లును అతడు సరేయని పుత్రకామేష్టి చేసినట్లును అందు ప్రాజాపత్యపురుషు డొక డుపాయన మిచ్చినట్లును, దానిని త్రావి దశరథుని ముగ్గురు రాణులు గర్భవతులైనట్లును 16వ సర్గయందు చెప్పబడినది - ఇప్పుడు వచ్చు ప్రశ్న :— పుత్ర సంతానార్థము తత్ఫల మిచ్చు అశ్వమేధయాగము చేసిన తర్వాత మరల పుత్రకామేష్టి యేల చేయవలెను-

ఈ పుత్రకామేష్టి చేయు కథా భాగము 15,16,17 సర్గలలో అన్య విషయములతో కలిపి అల్లిన కల్పనా వస్తువు. ఈ మూడు సర్గల లోనే, పుత్రకామేష్టి జరుగుచుండగా హవిర్భాగములకై సమావేశమైన దేవతలు బ్రహ్మతో రావణవధను గురించి ఆలోచించుట అంత విష్ణువును వారు దశరథ పుత్రుడవై జన్మించి రావణుని వధింపుమని కోరుట, రామునకు సహాయముగా దేవజాతులు కోతులుగా జన్మింపు డని బ్రహ్మ చెప్పుట ఇత్యాది విషయములన్నియు చెప్పబడినవి. ఈ విషయములు చెప్పబడి 17వ సర్గ ముగియగానే 18వ సర్గ "నివృత్తేతు క్రతౌ తస్మిన్ హయమేధే మహాత్మనః, ప్రతిగృహ్యా మరాభాగాన్ ప్రతిజగ్ము ర్యథాగతం" అను శ్లోకముతో ప్రారంభించును. (అనగా అశ్వమేధము పూర్తికాగానే దేవతలు వారివారి హవిర్భాగములు తీసి

కొని వెళ్ళిపోయిరి.) 17వ సర్గలో పుత్రకామేష్టికి దేవతలు వచ్చిర అని చెప్పి 18వ సర్గలో అశ్వమేధము పూర్తి కాగానే దేవతలు హవిర్భాగములు తీసుకొని వెళ్ళిరనుట ఎట్లు పొసగును? 16 సర్గలో పుత్రకామేష్టి పిదప "తతస్తు తాం ప్రాశ్య తదుత్తమస్త్రియో మహీపతేః ఉత్తమ పాయసం పృథక్...చిరణే గర్భాన్ ప్రతిపేదిరే తదా (31 శ్లో)అనగా ఆ పాయసము త్రాగి దశరథుని రాణులు గర్భవతులైరి. అనిచెప్పి మరల 18వ సర్గలో " తతోయజ్ఞే సమాప్తేతు ఋతూనాం షట్సమత్యయుః తతశ్చ ద్వాదశేమాసే...కౌసల్యాఽజనయత్ రామం సర్వలక్షణసంయుతం" (8 శ్లో) అనగా యజ్ఞము ముగిసిన సంవత్సరమునకు కౌసల్య రాముని కనెను అని చెప్పబడినది.

దీని నంతయు జాగ్రతగ పరిశీలించినచో 15,16,17 సర్గలు ప్రక్షిప్తములనియు, మూలగ్రంథమున అశ్వమేధయాగమే దశరథునిచే పుత్రసంతానార్థము చేయబడినట్లు రచింపబడియుండగా, తర్వాతవారెవరో రాముడు విష్ణ్వవతారమని చెప్పుటకు పుత్రకామేష్టి, పాయసము, విష్ణ్వంశ భాగములు, ఇత్యాదులన్నిటిని చొప్పించిరని స్పష్టముగా తెలుచున్నది.

కనుక రామాదులజననము రామాయణ మూలగ్రంథమున అశ్వమేధ యాగముచే సంభవించినట్లు కలదు. తత్కారణముగా పుత్రకామేష్టివృత్తాంతము ప్రక్షిప్తము.

ఇది ఇట్లుండగా మనకు ప్రకృతము కావలసిన ముఖ్యమైన విషయము.

అశ్వమేధయాగము రామాయణమున పుత్రసంతానార్థము చేయబడినట్లు చెప్పబడగా, భారతమున అది రాజులచే సార్వభౌమత్వము నార్జించుటకై చేయబడుచుండినట్లు కలదు. కురుక్షేత్ర యుద్ధము

ముగిసి పాండవులు సింహాసనాధిష్ఠితులైన పిమ్మట వారిచే అశ్వమేధ యాగము చేయబడినది. (భారతమున అశ్వమేధపర్వము కలదు).

అనగా రామాయణ రచనాకాలమునాటివారికి పుత్రసంతానార్థమే అశ్వమేధము చేయుట తెలియును. తర్వాత కాలక్రమమున ఆ యాగము సార్వభౌమత్వముకొరకు రాజశ్రేష్ఠులచే చేయబడునదిగా పరిణమించెను. అట్టి కాలమున భారతము వ్రాయబడినట్లు విశదమగుచున్నది. రామాయణముయొక్క ఉత్తరకాండలో రాముడు అశ్వమేధయాగము చేసెనని యుండుటచేత ఉత్తరకాండ వాల్మీకీయము కాదను సిద్ధాంతమునకు అది ఉపబలకమగు నొక నిదర్శన మగుచున్నది.

పట్టాభిషేకానంతరము జరిగె ననబడిన సీతావిసర్జన వృత్తాంతము వ్యాసుని రామోపాఖ్యానములోకూడా లేదు. కనుక ఉత్తరకాండ భారతముతర్వాత వచ్చెననుకొనవలెను. పైగా వ్యాసరామోపాఖ్యానమందలి పూర్వభాగమైన రావణాదుల జన్మవృత్తాంతములే ఉత్తరకాండలోని వస్తువు.

జాన్‌డాసన్ తన క్లాసికల్‌డిక్షనరీలో అశ్వమేధము వైదిక కాలములో సంతానార్థము జరుపుచుండబడిన యాగమనియు, అది భారత కాలమున సార్వభౌమత్వసిద్ధికై రాజులచే చేయబడెననియు వివరించెను. (28 పేజీ).

ఈ అశ్వమేధయాగవిషయముచేత రామాయణము భారతమునకంటె పూర్వగ్రంథమని విశదమగుచున్నది.

మరొక నిదర్శనము- రామాయణమున నారదునివర్ణనకు భారతమున నారదునివర్ణనకు ఎంతో భేదము కలదు. రామాయణ నారదుడు తపస్స్వాధ్యాయనిరతుడు, వాగ్విదాంవరుడు, ఇంతే.

మరెచ్చుటను నారదుని ప్రశంస రామాయణమున రాదు. రామాయణమున ప్రధానగ్రంథమున వామదేవ జాబాలి శరభంగ అగస్త్య వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులు పేర్కొనబడిరి. వీరు ఇక్ష్వాకుల నాటివారు అతి ప్రాచీనులు కనుక వాల్మీకికి పూర్వులు. కాని నారదుడు వాల్మీకికి సమకాలికుడు కనుకనే అవతారికలు వ్రాసిన భరద్వాజాది వాల్మీకి శిష్యులో ఎవరో "నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవం." అని చెప్పగలిగిరి. మొత్తముమీద వాల్మీకి నారదునికి సమకాలికు డను కొనుటలో (రామాయణమువంటి ప్రాచీనగ్రంథము చేత) అసమంజసత్వ ముండదు.

కాని అట్టినారదుడు భారతమున మరొకవిధముగా పరిణమించిన రూపముతో కనిపించును. (ఆదిపర్వం 207 అధ్యా ఇంద్రప్రస్థపురమున రాజ్యాధిష్ఠితులై యున్న పాండవులను చూచుటకు యాదృచ్ఛికముగా నారదుడు వచ్చెనట- ఆ వర్ణన చూడుడు—

నారద స్త్వథ దేవర్షి రాజగామ యదృచ్ఛయా, పథా నక్షత్ర జుష్టేన సుపర్ణచరితేన చ...నభస్థలేన దివ్యేన దుర్లభేన తపస్వినాం సర్వ వేదాంతగో విప్రః సర్వవిద్యాసు పారగః, పరేణ తపసా యుక్తో బ్రాహ్మేణ తపసా వృతః, నయే నీతౌ చ నిరతో విశ్రుతశ్చ మహా మునిః...ధర్మేణాధిగత స్సర్వై ర్దేవ దానవమానుషైః,...ఋక్సామ యజుషాం వేత్తా న్యాయవృత్తాంతకోవిదః, ఋజు రారోహవాన్ శుక్లో భూయిష్ఠ పథికోఽనఘః. శ్లక్ష్ణయా శిఖయోపేతః సంపన్నః పరమత్విషా, అవదాతే చ సూక్ష్మే చ దివ్యే చ రుచిరే శుభే, మహేంద్ర దత్తే మహతీ బిభ్రత్ పరమవాససీ, ...సంహితాయాం చ సర్వేషాం స్థితస్యోః స్థితస్య చ, ద్విపదస్య చ ధర్మస్య క్రమధర్మస్య పారగః, గాథా సామానుధర్మజ్ఞః సామ్నాం పరమవల్గునాం,... ఛేత్తా నిగమ సంశయాన్, అర్థనిర్వచనే నిత్యం సంశయచ్ఛిదసంశయః,...నానాధర్మ

విశారదః, లోపేనాగమధర్మేణ సంక్రమేణ వృత్తిషు, ఏకశబ్దాంశ్చ నానార్థా నేకార్థాంశ్చ పృథక్ శ్రుతీన్, పృథక్ అర్థాభిధానాంశ్చ ప్రయోగాణా మవేక్షితా, ప్రమాణభూతో లోకస్య సర్వాధికరణేషు చ, సర్వవర్ణ వికారేషు నిత్యం సకలపూజితః. స్వరేఽస్వరే చ వివిధే వృత్తేషు వివిధేషు చ, సమస్థానేషు సర్వేషు సమామ్నాయేషు ధాతుషు, ఉద్దేశ్యానాం సమాఖ్యాతా సర్వ మాఖ్యాత ముద్దిశన్,... ఆత్మనే చ పరస్మై చ సర్వసంస్కారయోగవాన్, ఏషాం స్వరాణాం వేత్తాచ బోద్ధా చ వచనస్వరాన్, విజ్ఞాతా చోక్తవాక్యానాం ఏకతాం బహుతాం తథా, బోద్ధా హి పరమార్థాశ్చ వివిధాంశ్చ వ్యతిక్రమాన్, అభేదతశ్చ బహుశో బహుశ శ్చాపి భేదతః వచనానాం చ వివిధా నాదేశాంశ్చ సమీక్షితా. నానార్థకుశల స్తత్ర, తద్ధితేషు చ సర్వశః, పరిభూషయితా వాచాం వర్ణతః స్వరతోఽర్థతః, ప్రత్యయాంశ్చ సమాఖ్యాతానియతంప్రతిధాతుకం, పంచాక్షరజాతాని స్వరసంజ్ఞాని యానిచ, త మాగతం ఋషిం దృష్ట్వా...!!" నారదుడు గొప్ప వ్యాకరణ పండితుడుకూడా అన్నమాట! అందులోను ఆత్మనేపద పరస్మైపద స్వరభేదము లెరుగునట! మొత్తముమీద భారతకాలమునాటి మానవ విజ్ఞానము దీనిని బట్టి విశదమగుచున్నది.

రామాయణ నారదుడుకూడా దేవర్షి, "ఆకాశచారి, యథావత్ పూజిత స్తేన దేవర్షి ర్నారద స్తథా అపృష్ట్వై వాభ్యనుజ్ఞాతః స జగామ విహాయసం" (బా. 2స. 2.శ్లో) కాని రామాయణ నారదునివర్ణన అతిసంక్షిప్తమై ప్రాచీనతను సూచించుచున్నది. భారతనారదవర్ణన అతిదీర్ఘమై ఆనంతరకాల ధోరణి ననుసరించి పౌరాణికపద్ధతికి దగ్గరగా ఉన్నది. కనుక ఇది కూడా రామాయణము భారతమునకంటె పురాతనమైనదని సూచించును.

మరొక నిదర్శనము:- రామాయణమున చాతుర్వర్ణ వ్యవస్థయే పేర్కొనబడెను. భారతమున వర్ణసాంకర్యమువలన కలిగిన నానావిధ

వర్ణవికారములు కూడా పేర్కొనబడెను. దశరథుడు చేయు అశ్వమేధమునకు నాల్గువర్ణములవారు ఆహ్వానించబడిరట- "బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాం శ్చైవ సహస్రశః సమానయస్వ సత్కృత్య సర్వదేశేషు మానవాన్." ఇట్లెన్నోపట్ల గలదు - భారతమున వర్ణవికారములు పేర్కొనబడినవి - (ఆదిపర్వము 207 అ) ఇంద్రప్రస్థపురమున రాజ్యాధిష్ఠితులై యున్న పాండవులను చూచుటకు వచ్చిన నారదుడు "ప్రమాణభూతో లోకస్య సర్వాధికరణేషు చ సర్వవర్ణవికారేషు నిత్యం సకలపూజితః..." కనుక భారతకాలమున వర్ణ వికారము లున్నట్లేగదా ?

ఇట్లు రామాయణమున నాల్గువర్ణములే పేర్కొనబడి భారతమున వర్ణవికారములు కూడా పేర్కొనబడుటచేత రామాయణ రచనాకాలము భారతరచనాకాలమునకంటె పూర్వమని తేలుచున్నది.

మరొకటి- రామాయణమున కృత త్రేతా ద్వాపర కలియుగములను కాలవిభజన కనుపించదు. "యుగాంత కాలాగ్నిరివ" అని యుగశబ్దము వాడబడెనుగాని, అది కృతత్రేతాదులను తెల్పుటకు వాడినట్లు తోచదు. మాస ఋతు అయనములవరకే కాలవిభజన ఉన్నట్లు తోచుచున్నది. కాని భారతమున కలదు. ఇదియును రామాయణ ప్రాచీనతను సూచించుచున్నది.

మరొకటి- రామాయణమునందు భారతమునందువలె తీర్థక్షేత్ర మాహాత్మ్యములు వర్ణింపబడలేదు. భారతమందలి వనపర్వమున వచ్చు తీర్థమాహాత్మ్య వర్ణనలు మూడువంతులు మూలగ్రంథ మందలివేగాని ప్రక్షిప్తము లనుకొనుటకు వీలుకాదు. కారణము- ఈ మాహాత్మ్య కథనములో వచ్చువిషయములు అతి పురాతన రూపము గలవై పురాణములందలి కథనములకంటె పూర్వములుగ్గా కనుపించుచున్నవి. ఉదా-

లోమశుడు ధర్మజునకు చెప్పిన తీర్థమాహాత్మ్య ప్రసంగములందు వనపర్వ 102 అధ్యాయమున విష్ణువుయొక్క అవతారములు వర్ణింపబడినవి (వీనిని గురించి స్థలాంతరమున విపులముగ చర్చించితిని) ఆ అవతారములు అతి ప్రాచీనములు; పురాణములకన్న పూర్వములు కనుక ఈ సంద ర్భము మూల భారతమందలిదే అనుకొనవచ్చును.

పైగా భారతముయొక్క పరమార్థము వేదశాస్త్రములయొక్క ఉపబృంహణమే కనుక తీర్థమాహాత్మ్యముల వర్ణనలు భారతమునం దుండుట సహజమే.

"కృతం మయేదం భగవన్ కావ్యం పరమపూజితం, బ్రహ్మన్ వేదరహస్యం చ యచ్చాన్యత్ స్థాపితం మయా, సాంగోపనిషదాం చైవ వేదానాం విస్తరక్రియా, ఇతిహాసపురాణానాం ఉన్మేషం నిర్మితం చ యత్." (సంభవపర్వం 1. అధ్యా) "ఇదం హి వేదైః స్సమితం పవిత్ర మపి చోత్తమం, శ్రావ్యాణా ముత్తమం చేదం పురాణం ఋషి సంస్తుతం...ఇహ మంత్రపదం యుక్తం ధర్మం చానేకదర్శనం... తీర్థానాం నామపుణ్యానాం దేశానాం చేహ కీర్తనం—" "కృష్ణ ద్వైపాయనే నేదం కృతం పుణ్యాచికీర్షుణా!- (ఆదిపర్వం 62 అధ్యా) అని వర్ణింపబడిన భారతమునందు తీర్థమాహాత్మ్యాదు లున్నచో ఆశ్చర్యపడ నక్కరలేదు. ఆశ్చర్యపడి అవి అన్నియు ప్రక్షిప్తములని భ్రమపడ నక్కరలేదు.

కనుక భారతమందు తీర్థమాహాత్మ్యవర్ణనలు కలవు. కానీ అట్టివి రామాయణమున లేవు. రామాయణమునందును దీర్ఘమాహాత్మ్యములు వర్ణించుటకు వీలైన ఘట్టములు బోలెడు కలవు. బాలకాండలో విశ్వామిత్రుడు మిథిల కేగుచు రామలక్ష్మణులకు దారిలో కనుపించిన నదులు, అరణ్యములు, పట్టణములు, ఆశ్రమపదములు మొదలైనవానిని వర్ణించుచు పోవును. కాని వాటిని పవిత్రములు పాపఘ్నములు అని

కొన్నిచోట్ల చెప్పను, కొన్నిచోట్ల చెప్పలేదు. ముఖ్యముగా గుర్తించ వలసినది, వాటిని గూర్చి రాము డడుగుట విశ్వామిత్రుడు చెప్పుట కేవలము పిల్లలు కుతూహలముతో అడుగగా పెద్దవారు కథలు చెప్పి నట్లుండును. ఉదా॥ గంగావతరణ, సిద్ధాశ్రమవర్ణనలు—కాని భారత మున అవి పుణ్యాచింతతో చెప్పబడి వినువారికి సత్ఫలము నిచ్చునట్లు పురాణపద్ధతిలో కథనము సాగును. జాగ్రతగా పరిశీలించినచో తీర్థ మాహాత్మ్యములు వర్ణించుట లేనికాలమునకు చెందినది రామాయణము గను తీర్థమాహాత్మ్యములు వర్ణించుటవచ్చినకాలమునకు చెందినది భారత ము గను కనిపించును. కనుక భారతమునకంటె రామాయణమే పురా తన మనుకొనవలెను.

మరొకటి-రామాయణమున దేవతాధ్యానములు కలవు; భారత మునను కలవు. కానీ వానికి వీనికి ఎంతో భేదము కలదు. రామాయణ ధ్యానములకు ఉదాహరణలు కొన్ని-

"స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే
భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిం"
(సుందర. 1 స-8 శ్లో.)

"వసూన్ రుద్రాం స్తథాదిత్యా నశ్వినౌ మరుతోపి చ
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః
(సుందర. 13 స-56 శ్లో)

"నమోస్తు రామాయ సలక్ష్మణాయ,
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో,
నమోస్తు చంద్రార్కమరుద్గణేభ్యః-"
.. (సుందర. 13 స-59 శ్లో)

"బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవా శ్చైవ, దిశన్తు మే సిద్ధిమగ్నిశ్చ వాయుశ్చ పురుహూతశ్చ వజ్రభృత్ వరుణః పాశహ స్తశ్చ సోమాదిత్యౌ తథైవచ, అశ్వినౌచ మహాత్మానౌ మరుతః శర్వ ఏవచ"
(సుందర. 13 స-65,66 శ్లో)

సాధారణముగా రామాయణములో ధ్యానింపబడుదేవతలు పైన చెప్పబడినవారే. (ముఖ్యముగా గుర్తింపవలసినది) ఎచ్చటను విష్ణువు ధ్యానింపబడలేదు.

రామాయణదేవతలు కేవలము వైదికదేవతలే. కానీ భారత దేవతలు వైదికదేవతలు కారు. అచ్చటచ్చట వైదికదేవతల ధ్యాన మున్నప్పటికిని, భారతమున నారాయణస్తోత్ర మధికము. అనేకసార్లు కృష్ణుడు నారాయణుడని స్తుతింపబడెను. అవతారస్తోత్రములు గలవు. భారత దేవతలందు వైదికత కంటె పౌరాణికతే కలదు. కాని రామాయణదేవతలందు కేవలము వైదికతే కలదు. పైగా రామాయణమున ధ్యానపద్ధతి, భారతమున స్తోత్రపద్ధతి కలవు. గ్రంథవిస్తరభీతిచే ఉదహరించుటలేదు. ఇట్లు సూక్ష్మపరిశీలన చేసినచో రామాయణము భారతమునకంటె పూర్వకాలమునకు చెందినదని విశదమగును.

మరొక ముఖ్యమైనది - రామాయణమందలి విష్ణువునకు భారతమందలి విష్ణువునకు భేదము కలదు. రామాయణ విష్ణువునకు శంఖ చక్ర గదా ఖడ్గ లక్ష్మీ కౌస్తుభ శ్రీవత్సాది లాంచనములు లేవు. అతడు కేవలము మూడుపాదములచే మూడు లోకము లాక్రమించినవాడే. ("ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్, సమూహ మహ్యమస్య పాంసురే-త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః అతో ధర్మాణి ధారయన్-") కానీ భారతవిష్ణువు చతుర్భుజుడు, శంఖచక్రాదిలాంఛనోపేతుడు. ఇతడే అనంతర కాలమున పౌరాణికవిష్ణు వాయెను. ఈకారణము చేత గూడా రామాయణము భారతమునకంటె ప్రాచీనగ్రంథమని గ్రహింపవచ్చును.

మరొకటి- రామాయణకాలమునకు దిక్పాలకు లను భావ మావిర్భవించినట్లు లేదు. కనుకనే ఈమాట రామాయణమున ఎచ్చటను లేదు. కిష్కింధకాండలో వానరులను నాల్గుదిక్కులకు పంపునప్పుడు సుగ్రీవుడు ఆనాల్గు దిక్కులందు ఇంద్ర యమ వరుణకుబేరు లున్నట్లు చెప్పబడెనేగాని అది వారిపురాణకాలమునాటి దిక్పాలకత్వముగా తోచదు. ఇదే క్రమముగా పౌరాణిక దిక్పాలకత్వమునకు హేతువై యుండును. భారతమున దిక్పాలురు గలరు. కాని వారికి భారతము నాటికి దిక్పాలు రను పేరు రాలేదు. వారిని లోకపాలు రనుచున్నట్లే భారతము సూచించుచున్నది. కొందరు ప్రధానమైన వైదికదేవతలు రామాయణ కాలముననే, తర్వాత లోకపాలు రనబడినవారుగా పరిణమించుచుండిరి. ఉదా - యమకుబేరాదులు (వేదమున కుబేరుడు వైశ్రవణుడనబడెను.) రామాయణమున లోకపాలు రను పేరు వారికిఅప్పటికి రాలేదు. రామాయణమున "లోకపాలోపమం నాథ మకామయత మేదినీ" (అయో. 1 స-33 శ్లో)అని రాముడు వర్ణింపబడెను. ఈ వాక్యమే మరల రామున కన్వయించుచు అయో. 2 స-49 శ్లో-న కలదు. ఇంతకుమించి ఈశబ్దము మరెచ్చటను లేకపోవుటచేత దీనియర్థ మేమిటో నిర్ణయించుట కష్టము. వ్యాఖ్యాతలు దిక్పాలురని వ్రాసిరిగాని వారి కాధారము భారతమే కావలెను. కానీ రామాయణీయశబ్దమున కర్థము చెప్పుటకు భారతము నాధారము చేసుకొనుట నిర్దుష్టమార్గము కాజాలదు. రాముడు లోకపాలోపము డనగా రాముడు లోకపాలునివంటివాడనిగాని లోకపాలుర వంటివా డనిగాని కావచ్చును. కాని ఏకవచనమా బహువచనమా అని నిర్ణయించుట కష్టము. కనుక రామాయణ మందలి లోకపాలభావము సాముదాయకమా లేక వైయుక్తికమా చెప్పలేము. పైగా లోకపాలు డెవడు అనుటకును సమాధానము దొరకదు. సీతను సురసుతోపమా అనియు రాముని ఇంద్రసమానుడనియు బహువారములు వర్ణించుటచేత రామాయణీయ లోకపాలశబ్దమునకు

ఇంద్రుడు లేక దేవత లేక దేవతలు అనికాని అర్థము కావచ్చును. కనుక రామాయణమున లోకపాలః అనగా దేవతలకు సామాన్యార్థమునగానీ లేక ఇంద్రునికిగాని వర్తించు శబ్దమై యుండును- అంతేకాని భారతమందు వాడిన అర్థమున రామాయణమున ఆ శబ్దము వాడిబడినట్లు భావించుట సమంజసము గాదు-కాని ఈశబ్దమే భారతమున ప్రముఖ దేవతలైన ఇంద్రాగ్నియమాదులకు వాడబడియుండును. కనుక భారతమందే లోకపాలురని కొందరుపర్వడియుందురు. కాని వారికింకను ప్రత్యేక దిక్కులు నిర్దేశింపబడలేదు. అట్టి దిక్పాలకభావము పౌరాణికమే. కనుక వైదికదేవతలనుంచి యమకుబేరాదులు రామాయణకాలమున రాగా, అట్టివారిలో మరికొందరు చేర్చబడి భారతకాలమున లోకపాలు రనబడిరి. పురాణకాలమున వారికి దిక్కులు నియమింపబడి వారు దిక్పాలకులైరి.

భారతమున తొలుత ప్రత్యేకముగ ఒక్కొకదేవత లోకపాలుడని వర్ణింపబడినట్లును, లోకపాలు రని సాముదాయకముగ పేర్కొనబడినట్లును కనుపించుచున్నది. ఉదా॥- ఖాండవ దహనఘట్టమున (ఆదిపర్వ 224 అధ్యా) "ఏవ ముక్తః స భగవాన్ ధూమకేతు ర్హుతాశనః, చింతయామాస వరుణం లోకపాలం దిదృక్షయా."-త మబ్రవీత్ ధూమకేతుః ప్రతిగృహ్య జలేశ్వరం, చతుర్థం లోకపాలానాం ప్రతిగృహ్య జలేశ్వరం"- అచ్చటనే మందపాలునికథలో "ప్రతిశ్రుతం తథా చేతి జ్వలనేన మహాత్మనా లోకపాలోనతాం వాచ ముక్త్వా మిథ్యా కరిష్యతి." నలోపాఖ్యానమున అడుగడుగున ఈ లోకపాలశబ్దము కథావశమున వచ్చుచుండును. నారదుడు దేవలోకమున కేగి అచ్చట ఇంద్రునికి దమయంతిసౌందర్యమును వర్ణించుచుండగా కుతూహలముచేత సభలోనిలోకపాలురు వినుటకు దగ్గరకు వచ్చిరట- అప్పుడు "ఏతస్మిన్ కథ్యమానే తు లోకపాలాశ్చ సాగ్నికాః ఆజగ్ము ర్దేవరాజస్య సమీప మమరోత్తమాః!! ఇట్లెన్నోచోట్ల వచ్చును. రామోపాఖ్యానమున (274 అధ్యా) "లోకపాలోపమాన్ పుత్రాన్ ఏకైకస్యాయథేప్సితాన్!!

ఈ లోకపాలురకుకూడా ఒక నియతసంఖ్య ఉన్నట్లు లేదు. ఒక ప్పుడు వారు నలుగురు మరొకప్పుడు ఆరుగురు. నలోపాఖ్యానమున లోకపాలు రనగా ఇంద్రాగ్ని యమవరుణులు. రామోపాఖ్యానమున" శక్ర శ్చాగ్నిశ్చ వాయుశ్చ యమో వరుణ ఏవ చ యక్షాధిపశ్చ భగ వాన్" అని వారు ప్రధానముగా పేర్కొనబడిరి. కానీ జాన్ డాసన్ తన క్లాసికల్ డిక్షనరీలో లోకపాలు రెనిమిదిమంది అనికూడా చెప్పెను (180 పే) భారతమున సభాపర్వమున నారదుడు లోకపాలురసభలను వర్ణించును.

ఈవిషయము నంతటిని చూచినచో రామాయణమే భారతపురా ణములకంటె పూర్వగ్రంథమని విశదమగును.

మరొక నిదర్శనము - రామాయణమునందలి అస్త్రములను భారతమునందలి అస్త్రములను పరిశీలించినచో చాలా మార్పులు కను పించును. రామాయణముకాలమునాటికి తెలిసినయస్త్రములన్నియువిశ్వా మిత్రుడు రామున కిచ్చినట్లు బాలకాండ 27 సర్గలో కలదు. "ప్రీత్యా పరమయా యుక్త స్సదా మ్యస్త్రాణి సర్వశః." (2శ్లో)అని విశ్వామిత్రు డనెను అట్లని ఆగునఇచ్చెననిన అస్త్రముల జాబితాలో చక్రములు ముస లములు గదలు ఖడ్గములు కలవు. (27 స. బాలకాండ)ఇట్లే మరొక జాబితా 56 స. లో విశ్వామిత్రుడు వసిష్ఠునిపై ప్రయోగించెనని చెప్ప బడినది. అస్త్రము లిచ్చెనని చెప్పబడిన జాబితాలో ఉన్నవి కనుక ముసల గదా ఖడ్గాదులుకూడా రామాయణకాలమున అస్త్రములుగా నుండె ననియే భావించవలెను

యుద్ధకాండలో 69 సర్గ. 31 శ్లో. మహాపార్శ్వుడు గద ధరించి గదాపాణియగు కుబేరునివలె ప్రకాశించెనని చెప్పబడెను. "మహా పార్శ్వో మహాకాయః గదా మస్థాయ వీర్యవాన్ విరరాజ గదా

పాణిః కుబేర ఇవ సంయుగే." ఆసందర్భమును పరిశీలించినచో ఆ గద ప్రయోగోపసంహార మంత్రయుక్తముగా తోచును. కుబేరుడు దివ్యుడు; అతడు ధరించు గద ఒక దివ్యమగు అస్త్రముగాక మామూలు ఇనుపగుదియ వంటి దగునా. మంత్రశక్తిచేత తృణమైనను బ్రహ్మాస్త్రమగునుగదా.

(యుద్ధకాండ 80 సర్గ. 30 శ్లోకంనుంచి) మకరాక్షుడు రాముని పై శూలమును ప్రయోగించెనట - అది-"త త్తిష్ఠద్వసుధాం రక్షః శ్శూలం జగ్రాహ పాణినా, త్రాసనం సర్వభూతానాం యుగాంతాగ్ని సమప్రభం - విభ్రామ్య తు మహచ్ఛూలం ప్రజ్వాల్య త్తన్నిశాచరః, స క్రోధా త్ప్రాహిణోత్ తస్మై రాఘవాయ మహాహవే." యుగాంతాగ్ని సమప్రభమై జ్వలించుచున్నశూలము మంత్రపూర్వకమైనదిగాక వట్టి ఈటెవంటి దగునా ?

(యుద్ధకాండ. 111 స. 29 శ్లో. నుంచి) రావణుడు లక్ష్మణునిపై ప్రయోగించిన శక్తి ఇట్లు వర్ణింపబడినది. "ఇ త్యేవ ముక్త్వా తాం శక్తి మష్టఘంటాం మహాస్వనాం, మయేన మాయావిహితా మమోఘాం శత్రుఘాతినీం" ఈ అష్టఘంటాయుతము మాయావిహితమైన శక్తి అస్త్రముగాక శస్త్రమగునా.

(14 సర్గ. 20 శ్లో)రావణుడు రామునిపై విసరినశూల మిట్లు వర్ణింపబడినది— "త ద్రావణకరా న్ముక్తం విద్యు జ్జ్వాలాసమాకులం అష్టఘంటం మహానాదం వియద్గతమశోభత." ఇట్లు విద్యు జ్జ్వాలాసమన్వితమైనశూలము అస్త్రముగాక మరేదగును ?

కాని భారతమున గదా ముసల శూలాదులు మంత్రపూర్వకములుగావు. అవి అస్త్రములుగాక వట్టి శస్త్రములు అనగా ఆయుధములు. పై రామాయణ మందలి అస్త్రముల జాబితాలోని తామస, సౌమన,

సంవర్త మౌసల సత్య శిశిర, సుదామనభగాద్యస్త్రములు భారతమున లేనే లేవు.

రామాయణకాలమున ప్రయోగింపబడు అస్త్రమంత్రములు కాలధర్మముచేత, అభ్యసించు సమర్థులులేక ప్రశిథిలములై పోగా భారత కాలమున మిగిలినవే భారతమందు పేర్కొనబడియుండును. మంత్రములు శిథిలమైపోవుట కాలక్రమమున సంభవించు ధర్మచ్యుతిచేతనే గదా? ధర్మ చ్యుతి కృత త్రేతా ద్వాపర కలియుగములందు ఉత్తరోత్తరక్రమముగానే గదా సంభవించుట

కనుక రామాయణమందలి గదా ముసల శూలాద్యస్త్రములు భారతమున శస్త్రములుగా నుండుటచేతను, రామాయణమందలి అనేక అస్త్రములు భారతమున కనుపించకపోవుటచేతను, రామాయణరచనా కాలము భారతరచనాకాలమునకు పూర్వమే అనుకొనవలెను.

మరొకటి - రామాయణమున రాముడు శరభంగాశ్రమమునకు వెళ్ళునప్పటికి అచ్చటి కప్పుడే ఇంద్రుడు వచ్చి శరభంగాశ్రమమును ప్రవేశించెను. ఇంద్రుని పచ్చని గుఱ్ఱములు, రథము, దేవతాపరివారము ఇత్యాదులను రాముడు పోల్చుకొని అత డింద్రుడనియు, పూర్వము ఏవి ఇంద్రుని గుఱ్ఱములని వింటిమో అవే ఇవి యనియు లక్ష్మణునికి వర్ణించి చెప్పును, "యే హయాః పురుహూతస్య పురా శక్రస్య న శ్శ్రుతాః అంతరిక్షగతా దివ్యా స్త ఇమే హరయో ధ్రువం" (అరణ్య 5స.14శ్లో) ఆ వర్ణించు పద్ధతి అంతయు అధికులనుగురించి అనధికులు వర్ణించురీతిగా ఉండును. తర్వాత ఇంద్రుడు శరభంగునితో మాట్లాడి పోవుచు "రాముడు లోనికి వచ్చుటకు ముందే నేను వెళ్ళెదను. ముందు రాముడు నిష్ఠను జరుపుగాక; తర్వాత అతడు నన్ను చూచుట కర్హు డగును" అని చెప్పును." ఇహోపయా త్యసౌ రామో యావ న్మాం

నాభిభాషతే, నిష్ఠాం నయతు తావత్తు తతో మాం ద్రష్టు మర్హతి" (అరణ్య-5.స.22శ్లో) రాముడు విష్ణ్వవతారమైనచో ఇంద్రు డిట్లు చెప్పునా? అట్లు రాముని చూచియు రామునితో మాట్లాడక ఇంద్రుడు వెళ్ళుట రామాయణమందే సాధ్యమగునుగాని భారతమున కాదు. భారతకృష్ణుని శివుడు బ్రహ్మ మొదలైన దేవతలు పరమేశ్వరుడని స్తుతించారు. కనుక ఈ రామాయణవిషయము తద్గ్రంథము భారత మునకంటె ప్రాచీనమని సూచించును.

రామాయణమున ప్రసక్తములైన శాస్త్రములపేర్లు, శాస్త్ర విషయములు భారతమందు ప్రసక్తమైనవి పోల్చబడినచో ఈ రెండు గ్రంథముల పౌర్వాపర్యములు విశదమగును. బాలకాండమున అరణ్య కాండమున ఇట్టివర్ణనలు కలవు. కాని అతిక్లుప్తముగానే ఉన్నవి. "న నాస్తికో నానృతకో..." అని (బాల.6స.14శ్లో) అయోధ్యాపుర వాసులను వర్ణించుసందర్భమున చెప్పబడినది. కనుక ఆనాటికి నాస్తికులు కొందరున్నట్లే, దశరథుడుచేసిన అశ్వమేధయాగమునకువచ్చిన పండితులు హేతువాదములు చేసిరట. "కర్మాంతరే తదా విప్రాః హేతువాదాన్ బహూనపి..." (బాల.14స.17శ్లో) నాస్తికమతమునకు హేతువాదము సమీపముగా నుండును; హేతువాదము న్యాయశాస్త్రమునకు దగ్గరగా నుండును. వైదికదృష్టిలో న్యాయశాస్త్రమునకు ఉత్కృష్టత లేదు. ఉదా. దేవీభాగవతప్రథమాధ్యాయమున- 'సాత్త్వికం తత్ర వేదాంతం మీమాంసా రాజసమ్మితం తామసం న్యాయశాస్త్రం చ హేతువాదాభి యంత్రితం" అని కలదు. కనుక న్యాయశాస్త్రమునకు హేతువాదము నకు గౌరవము తక్కువ. కనుకనే ఆ అశ్వమేధయాగమునకు వచ్చిన పండితులు, కర్మాంతరే, మధ్య మధ్య విరామసమయములందు హేతు వాదములు సల్పుచుండిరి, అనగా అవి వినోదప్రాయములని తాత్ప ర్యము. కనుక రామాయణకాలమున హేతువాదములు కలవే కానీ

ఆ పద్ధతులు ఒక శాస్త్రరూపము ధరించి న్యాయమని పేరుపొందినట్లు తోచదు. కనుకనే అరణ్యకాండలో జటాయువు రావణుని వారించుచు న్యాయశాస్త్రసిద్ధమైన హేతువు ఉండగా ఎట్లు వేదము అప్రధృష్యమో అట్లు నేనుండగా నీవు సీతను తీసుకొనిపోలేవు ("న శక్త స్త్వం బలా ద్ధర్తుం వై దేహీం మమ పశ్యతః హేతుభి ర్న్యాయసంసిద్ధై ర్ధ్రువాం వేద శ్రుతీమివ." 50స-21శ్లో) అనుమాట వాల్మీకీయము కాదనిపించు చున్నది. వేదశ్రుతీ మివ అను శబ్దయోజనకూడా ఆర్షముగా తోచదు. కనుక ఈ శ్లోకము ప్రక్షిప్తమే కావలయును.

మరొకచోట రామాయణమున లోకాయతిక శబ్దము కలదు. అయోధ్యాకాండలో (100 స. 38శ్లో) "కచ్చి న్న లోకాయతికాన్ బ్రాహ్మణాంస్తాత! సేవసే, అనర్థకుశలా హ్యేతే బాలాః పండిత మానినః"(అనగా నాస్తికులగు బ్రాహ్మణులను సేవించవుగదా, వారు పండితమ్మన్యులైనబాలకులు. వారు అనర్థములు కలిగించుటలో ప్రవీణులు) అని రాముడు తనను చిత్రకూటమందు దర్శింప వచ్చిన భరతుని ప్రశ్నించును. ఈ నాస్తికులు పసివారట! నాటికి నేటికి కాల మెంత సమానముగా ఉన్నది. సాధారణముగ నాస్తికత్వము పసివారినే ఆకర్షించును.

భరతుడు రాజై అయోధ్యను పాలించుచున్నా డను భ్రమతో రాముడు భరతుని కుశలప్రశ్న లడుగుచు, రాజధర్మముల నన్నిటినీ సక్రమముగా నిర్వహించుచున్నావా అని ఎన్నియో వివరము లడుగును. దాదాపు ఇట్టివి 60,70 శ్లోకములు కలవు. అందులో ఏ ఏ ధర్మములు రాజు పాటించవలెనో అవి చాలా వివరముగా పేర్కొనబడినవి. అధికారమునందున్న రాజులకు అట్టి ధర్మములందు ప్రామాణిక బుద్ధి ఏర్పడుటకు వాల్మీకి అనంతరము వారు ఈ ధర్మములను అప్పుడప్పుడు ఇచ్చట చేర్చియుందురు, అట్లుకానిచో ఇంత దీర్ఘకాలము కేవలము ప్రథమ ప్రశ్నలకే రాముడు వినియోగించుట అసందర్భమున

చాల అనౌచిత్యముగా ఉన్నది. కథనమందు ఔచిత్యమును పాటించుటలో అద్వితీయుడైన వాల్మీకి ఇంత విస్తారమైన ఈ కచ్చిదధ్యాయమును రామ భరతులమధ్య ఒక గోడవలె పెట్టునా? అందుననూ, అట్టి అత్యంతభావోద్రేకమునకు ఆటపట్టయిన ఆ సన్నివేశమునందు ఇది అసంభవము. వాల్మీకి ఎట్టి సూక్ష్మమైన సుకుమారమైన నాటకీయ దృశ్యములు భావించిన మహానుభావుడోగదా! ఒకచోట (అరణ్యకాండమున) రాముడు పరిపరివిధముల సీతకై విలపించుచు గిరినిర్ఝర లతాదుల నుద్దేశించి మాట్లాడుచు యున్మత్తునివలె బాలకునివలె రోదనము చేయుచుండగా లక్ష్మణుడు అన్న నోదార్చుచు కర్తవ్యము బోధించుచు రాముని ఉద్బుద్ధుని చేయును. అప్పుడు లక్ష్మణుడు "శ్రూయతే నరశార్దూల! న త్వం శోచితు మర్హసి, నష్టాయా మపి వైదేహ్యాం హృతాయా మపి చానఘ! శోచితుం నార్హసే వీర యథా ఽన్యః ప్రాకృత స్తథా. "(66స.13శ్లో) ఓ పురుషోత్తముడవైన రామా, సీత అపహరింపబడినను చచ్చినను సరే నీవు దుఃఖించదగదు: అని నిష్కర్షగా చెప్పినప్పుడు రాముడు ఒక్కసారిగా ప్రబుద్ధుడగును. వెంటనే తనను నిగ్రహించుకొని ధనుస్సుపై చిబుకముంచి ఆనుకుని లక్ష్మణా మరి కర్తవ్యమేమిటి? అనిఅడుగును "అవష్టభ్య ధను శ్చిత్రం రామో లక్ష్మణ మబ్రవీత్. కింకరిష్యావహే వత్స! క్వ వాగచ్ఛావ లక్ష్మణ!" (67స-2శ్లో) అవష్టభ్య ధను శ్చిత్రం అని మన కండ్లకు ఒక చిత్తరువు కట్టగల మహాకవి ఈకచ్చిదధ్యాయము వ్రాయునా. పైగా మరొకటి చూడుడు" కచ్చిన్న ముచ్యతే చోరో ధనలోభా న్నరర్షభ" (100స.57శ్లోఅయోధ్య) డబ్బు తీసుకొని చోరులను విడిచి పెట్టవుగదా అని రామునంతటివాడు భరతు నంతటివానిని అడిగినట్లు గలదా ప్రశ్నపరంపరలో- ఇంత యనౌచిత్యము వాల్మీకి చేయునని వాల్మీకిని చదివిన ఎంతటి యప్రగల్భుడైనను అనుకొనడు.

కనుక తాత్పర్య మేమనగా- న్యాయశాస్త్రము లోకాయతికులు పేర్కొనబడిన శ్లోకములుఈ అధ్యాయమును ప్రక్షిప్తము లనుకొన

వచ్చును. అందుచేత నా నిశ్చితాభిప్రాయము రామాయణకాలమునకు నాస్తికు లుందురేమో గాని న్యాయశాస్త్ర లోకాయతములు లేవని యే. కాని అవి భారతమందు కలవు. నారదుని పాండిత్య వర్ణనను ఉదహరించిన శ్లోకములందు అతడు న్యాయవృత్తాంతకోవిదః అనబడెను. దుష్యంతుడు కణ్వాశ్రమమునకు వెళ్ళునప్పుడు ఆవర్ణన కూడా చూడుడు (కణ్వాశ్రమము) "యజ్ఞ విద్యాంగవిద్భిశ్చ యజుర్విద్భిశ్చ శోభితం.... భారుండసామగీతాభి రథర్వశిరసోద్గతైః, యతాత్మభిః సునియతైః శుశుభే స తదాశ్రమః అథర్వవేదప్రవరాః పాకయజ్ఞీయ సామగాః, సంహితా మీరయంతి స్మ పదక్రమయుతాం తు తే, శబ్దసంస్కార సంయుక్తై ర్బ్రువద్భి శ్చాపరై ర్ద్విజైః, నాదితః స బభౌ శ్రీమాన్ బ్రహ్మలోక ఇవాపరః. యజ్ఞసంస్తరవద్భిశ్చ క్రమశిక్షావిశారదైః న్యాయతత్త్వాత్మవిజ్ఞానసంపన్నై ర్వేదపారగైః, నానావాక్య సమాహార సమవాయ విశారదైః, విశేషకార్యవిద్భిశ్చ మోక్షధర్మపరాయణైః, స్థాపనాక్షేప సిద్ధాంత పరమార్థజ్ఞతాం గతైః, శబ్దచ్ఛందో నిరుక్తజ్ఞైః కాలజ్ఞాన విశారదైః, ద్రవ్యకర్మగుణజ్ఞైశ్చ కార్యకారణ వేదిభిః, పక్షివానర రుతజ్ఞైశ్చ వ్యాసగ్రన్థసమాశ్రితైః, నానాశాస్త్రేషు ముఖ్యైశ్చ శుశ్రావ స్వన మీరితం, లోకాయతికముఖ్యైశ్చ సమన్తాదనునాదితః..." (సంభవ.70అధ్యా).

ఇవన్నియు సమగ్రముగా ఆలోచించి చూచినట్లయినచో, భారతకాలమున వ్యవహారమందున్న శాస్త్రములు రామాయణకాలమున ప్రాథమికదశయం దుండినట్లు స్ఫురించును. అందుచేత రామాయణరచనాకాలము భారతరచనాకాలమునకు పూర్వ మనుకొనవలెను.

రామాయణ రచనాకాలమునకు ఛందస్సు చాల పరిమితదశలో ఉన్నట్లు స్ఫురించును. (ఇది వైదికచ్ఛందస్సుమాట కాదు) వాల్మీకి వేదములందలి అనుష్టుప్‌ను తీసుకొని రామాయణమునంతయు

వ్రాసెను "రరాసభూమ్ని ర్న తతాపభానుః;" "గాయంతి కేచిత్ నృత్యంతి కేచిత్" ఇత్యాది వృత్తములు కూడా గ్రంథమున కలవు. కాని అవి సకృత్తు. సర్గాంతసూచకములగు భిన్నవృత్తము లెన్నో లేవు; కొలది గానే కలవు. అందులోను అన్నియు వాల్మీకీయము లనుటకు వీలుకాదు. సర్గవిభజన వాల్మీకి చేసినట్లు లేదు. కథయందు భిన్నపట్టముల సమాప్తిని సూచించుటకు మాత్రమే వాల్మీకి అనుష్టుప్పును మార్చి అన్య వృత్తములను కొన్నింటిని వాడియుండును. కానీ ఈ సర్గవిభజన వాల్మీకీయముగా తోచదు. వివిధ ప్రాంతము లందు వివిధసర్గ లుండుటచేతను సర్గల సంఖ్యయు ప్రాంతప్రాంతమునకు భిన్నముగా ఉండుటచేతను, ఈ సర్గవిభజన సర్గల నామములు అవాల్మీకీయము లనుకొనవలెను. ఉదా. దాక్షిణాత్య సుందరకాండయందు 68 సర్గ లుండగా పశ్చిమోత్తరదేశమున కొన్ని ప్రతులందు 103 సర్గలు కొన్నిట 99 కొన్నిట 100 కనుపించుచున్నవి. పశ్చిమోత్తరప్రతియందలి సుందర కాండ సంపాతివచనము విని అంగదాదివానరులు మహేంద్రపర్వతము నెక్కిన పట్టునుండి ప్రారంభించును "ఆఖ్యాతే గృధ్రరాజేన సముత్పత్య ప్లవంగమాః సహితాః ప్రీతిసంహృష్టాః సింహనాదం వినేదిరే-" ఇది దాక్షిణాత్య కిష్కింధకాండయొక్క ఉత్తరభాగమం దున్నది. అట్లే పశ్చిమోత్తరప్రతిలోని సుందరకాండ సేతు బంధనము తర్వాత ఘట్టముతో ముగియును. "ఆశ్వాస్య చ తదా సర్వే స్వేషు సైన్యేషు రేమిరే, పారే తస్య సముద్రస్య గదాపాణి ర్విభీషణః పరేషాం ప్రతిఘాతార్థం అతిష్ఠత్ సహబాంధవైః-" ఈ శ్లోకము దాక్షిణాత్య యుద్ధకాండమందలి పూర్వభాగమందు కలదు. అనగా పశ్చిమోత్తర ప్రతిలోని సుందరకాండ, దాక్షిణాత్య కిష్కింధకాండలోని కొంత ఉత్తరభాగమును దాక్షిణాత్య యుద్ధకాండ లోని కొంత పూర్వభాగమును కలిపి చేసినది. కనుక కాండవిభజన కూడా వాల్మీకీయము కాదు. పశ్చిమోత్తరప్రతిలో సుందరకాండకు యుద్ధకాండకు మధ్య లంకాకాండ అని ఒకటి కలదు!

ప్రకృత మనుసరామః కనుక రామాయణమున ఛందస్సు అతి పరిమితముగా ఉండగా భారతమున విస్తారమై నానావిధములైన వృత్తములతో ఒప్పారుచున్నది. వాటినన్నిటిని వివరించి గ్రంథము పెంచుట అనవసరము. ప్రత్యేకముగ ఒక ఉద్గ్రంథము వ్రాయుటకు తగినంత సామగ్రి కలదు. కనుక రామాయణరచనాకాలము భారతరచనా కాలమునకు పూర్వమేనని ఈ రెండు గ్రంథములందలి ఛందః పరిణామ క్రమము సూచించును.

మరింత ముఖ్యమైనది-భారతమున వచనము కలదు. రామాయణమున లేదు. "రోమహర్షణ పుత్ర ఉగ్రశ్రవాః సౌతిః పౌరాణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతేః ద్వాదశవార్షికే సత్రే" అని భారతము వచనముతోనే ప్రారంభించును. ప్రధానగ్రంథమందును అనేకసార్లు వచనము వచ్చును. ఆదిపర్వమున పౌష్యపర్వాదులు విరివిగా వచన సమ్మిశ్రితములై యున్నవి. వనపర్వాంతర్గత మార్కండేయ సమస్యాపర్వములోని 195నుంచి 199 అధ్యాయమువరకు విస్తారముగ వచనమయముగా ఉన్నది. (1) "ఇద మన్య చ్ఛ్రూయతాం యయాతిర్నాహుషో రాజా రాజ్యస్థః పౌర జనావృత ఆసాంచక్రే గుర్వర్థీబ్రాహ్మణ ఉపేత్య అబ్రవీత్; భో రాజన్..." (2)" దేవానాం కథాసంజాతా మహీతలం గత్వా మహీపతిం శిబి మౌశీనరం సాధ్వేనం శిబిం జిజ్ఞాస్యామ ఇతి ఏవం భో ఇత్యుక్త్వా అగ్నీంద్రా వుపతిష్ఠేతాం. అగ్నిః కపోతరూపేణ త మభ్యధావత్ ఆమిషార్థం, ఇంద్రః శ్యేన రూపేణ అథ కపోతో రాజ్ఞో దివ్యాసనాసీనస్య ఉత్సంగం న్యపతత్..." ఇవి కొన్ని ఉదాహరణలు-

పద్యముతర్వాతనే గద్యము వాఙ్మయమున ఆవిర్భవించెను. వేదమునందును ఇంతే యని విజ్ఞు లెరిగినదే. కనుక రామాయణమున వచనము లేకపోవుటచేతను, భారతమున ఉండుటచేతను రామాయణమే భారతమునకంటె పూర్వమనుకొనవలెను.

రామాయణభారతముల పౌర్వాపర్యములను వాటియొక్క భాషచేత నిర్ణయింపబూనుట వివేకయుక్తమైన పని కాదు. భారత రామాయణభాషలలో వ్యాకరణరీత్యా ఏదేని భేద మున్నదా అనిచూచి నచో అట్టి దేదియు లేదు. రామాయణముయొక్క పశ్చిమోత్తర ప్రతిని ప్రకటించిన డి. ఏ. వి కాలేజి (లాహోరు) పరిశోధనశాఖవారు ఉపోద్ఘాతములో "It is generally recognized that the epic. sanskrit of Ramayana and Mahabharatha and for the mat-rater of that, Panas, is a unit in it self from the point of viewr of grammar and syntax——" అనిరని వెనుక చెప్పితిని

రామాయణమునందు ఒకచోట వ్యాకరణము పేర్కొనబడెను. రాముడు హనుమంతుని సంభాషణను ప్రశంసించుచు, "నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతం బహుధా వ్యాహరతానేన న కించి దపశబ్దితం" (కిష్కింధ కాండ) అనెను. కానీ భారతమందలి నారద వర్ణనలో లభ్యమగు నన్నివివరములు వ్యాకరణమునుగురించి రామాయణమునం దెచ్చటను లేవు. కనుక ఆనాటి వ్యాకరణ స్వరూపము కేవల మూహ్యామే. ఆనాడు బ్రాహ్మణులు సంస్కృతము మాట్లాడెడి వారట, "ధారయన్ బ్రాహ్మణం రూపం ఇల్వలః సంస్కృతం వదన్" (అరణ్యకాండ 11స 57 శ్లో) అని వాతాపి ఇల్వలుల కథలో చెప్పబడి నది. మరొకచోట "యది వాచం ప్రదాస్యామి ద్విజాతి రివ సంస్కృతం, రావణం మన్యమానా సా సీతా భీతా భవిష్యతి" (సుందర, 30స. 18 శ్లో) అనబడినది. ఇంతకుదప్ప ధాతువులను ఆత్మనేపద పరస్మైపద స్వరభేదములను ఇత్యాది వివరములనుగురించి భారత నారదవర్ణనలో పేర్కొనినట్లు రామాయణమున ఎచ్చటను పేర్కొనబడ లేదు. కాని రామాయణభారతముల భాషను పరిశీలించినచో వ్యాకరణవిషయమున ఎట్టి హెచ్చుతగ్గులు లేకపోవుట విశదమే.

ఆరోజులలో మూడు తరగతుల భాష యుండినట్లు ఊహింప వచ్చును. ఒకటి గ్రాంథికము. మరొకటి శిష్టవ్యావహారికము, మరొకటి గ్రామ్యము. గ్రాంథికభాష వేదములందలిది, వ్యావహారికభాష సంస్కృతము, అది శిష్టవ్యవహారమున ఉండెడిది, అశిష్టులైన అనాగరకులందు గ్రామ్యములైన ప్రాకృతాదులు వ్యవహృతము లగుచుండెడివి.

గ్రాంథికభాషకే ఎప్పుడును సుస్థిరమైన గౌరవము. వ్యావహారిక భాష గ్రాంథికస్థానము సంతరించుకున్నతర్వాత క్రమముగ అదియును గ్రాంథికమై గౌరవము పొందును. అనగా శిష్టజనామోదము పొందును. కానీ గ్రాంథికభాషను వదలి వ్యవహారభాషలో వ్రాయుటకు కొంత సాహసము కావలెను. అట్లు వ్రాయువాడు మహానుభావు డయినచో ఆగ్రంథమునకు గౌరవము వచ్చును.

రామాయణరచనాకాలమునకు పూర్వము వైదికభాషయందే గ్రంథరచన సాగుచుండియుండును. అట్టివి యుపనిషద్బ్రాహ్మణాదులై యుండును. కానీ శాస్త్ర విషయములను రమణీయమైన పద్ధతిలో చెప్పుటకు కావ్య ముదయించెను. అట్లు శాస్త్రవిషయములను పరమార్థదృష్టితో రమణీయముగా చెప్పుటకు మొదట వ్యావహారికభాష నవలంబించి గ్రంథరచన చేసినవాడు వాల్మీకిమహర్షియై యుండును. ఈపద్ధతి తర్వాతివారిచే కావ్యపద్ధతియని పేర్కొనబడియుండును.

ఇంత రమణీయమైన కవిత్వము ఒక్కసారిగా ఎట్లు లోకమున వెలువడును? తత్పూర్వమే ఈ మార్గ మశేషగ్రంథకర్తలచే త్రొక్కబడి యుండును. అట్లు ప్రహతమైనమార్గమునే వాల్మీకి గైకొనియుండునని యొకయూహచేయువారు లేకపోలేదు. వాల్మీకికి పూర్వము ఎవరో ఒకరుండిరని కనుగొని వీరికి చూపినచో, వాడును అకస్మాత్తుగా ఎట్లు వచ్చును వాడికి పూర్వమే ఎందరో వ్రాసియుందురు అందురు. ఇట్టి,

దృక్పథమునకు ఈవాదమునకు అంతముండదు. ఎవడో ఒకడు మొదటి వాడుండవలెనుగదా, ఆమొదటివాడే ఈవాల్మీకి అని నా మనవి.

మొదట వ్యావహారిక భాషలో వాల్మీకి రామాయణమును వ్రాయగా, ఆ గ్రంథము లోకోత్తరకీర్తి గడించి వేదోపబృంహణమునకు ఒక ఉత్కృష్టసాధనముగా లోకమున ప్రతిష్ఠ పొందగా అనంతరకాలమున వ్యాసుడో ఎవరో భారతమును ఆమార్గము ననుసరించి వ్రాసియుందురు. కనుకనే సుప్రతిష్ఠితమైన ఒక గ్రంథముతో భారతము తన ప్రతిష్ఠ కొరకు పోటీపడినట్లు అవతారికలందు ప్రబలమైన సాక్ష్యము గలదు.

రామాయణము వేద మనబడగా భారతము వేదములకంటె బరువైన దనబడినది. (గ్రంథావతారవృత్తాంతము) "య ఇదం శ్రావయేద్విద్వాన్ యే చేదం శృణుయు ర్నరాః తే బ్రహ్మణః స్థాన మేత్య ప్రాప్నుయు ర్దేవతుల్యతాం" (ఆదిపర్వం 62 అధ్యా.) అని ప్రారంభించి అనేకవిధములైన జనులకు భారతపారాయణము అనేకవిధములైన ఫలముల నిచ్చునని విస్తారముగా వర్ణింపబడినది. అచ్చటనే "శ్రావయే ద్బ్రాహ్మణాన్ శ్రాద్ధే యశ్చేమం పాద మంతతః అక్షయ్య తస్య తచ్ఛ్రాద్ధం ఉపావ ర్తేత్ పితౄ నిహ" అని శ్రాద్ధసమయములందు పఠింపదగినదిగా పేర్కొనబడెను. కాని ఎన్ని చెప్పినను ఎంతచెప్పినను భారతమును దేశములో ఎవ్వరును పారాయణముచేయరు. ఎక్కడో ఎవడోచేయుననినచో అదిచాలదు. పారాయణ మన్నచో రామాయణమే గైకొందురు. భారతమే పూర్వగ్రంథమైనచో అట్టి ప్రాచీనగ్రంథము నన్ను పారాయణము చేయండో అని లోకమునకు ఘోషించుచుండగా దానిని వదలి అంతగా ఘోషించని బహుశః అసలు ఘోషించని రామాయణమును పారాయణము చేయుట తటస్థించునా !

బహుశః భారతము సౌతిప్రోక్త మగుటచేత మహర్షిప్రోక్తము కాదని యెంచి రామాయణమునకు ఇచ్చునంత స్థానము భారతమునకు

దేశమున ఇవ్వబడుటలేదేమో. వాస్తవముగా చూచినచో భారతకర్తృత్వము ఎప్పటికిని నిర్ణయించుటకు వీలుకానిదిగానే ఉండవలసియుండును. భారతమును వ్యాసుడు వ్రాసెననుటకు వీలులేదు. కారణము జనమేజయుడు యజ్ఞను చేయుచుండగా అచ్చటికి శిష్యసమేతుడై వ్యాసుడు వచ్చెనట. జనమేజయుడు తన తాతముత్తాతల వీరగాథలు చెప్పుమనగా వ్యాసుడు తనశిష్యుడైన వైశంపాయనునిచెప్పుమనెనట; వైశంపాయనుడు చెప్పుచుండగా సౌతి విని నైమిశారణ్యమునకు వచ్చి శౌనకాదులకు చెప్పెనట, అని మరొక డెవడో భారతము చెప్పుచున్నాడు; సౌతికూడా కాదు కనుక ఎవరు భారతమును వ్రాసినట్లు ?

కానీ రామాయణమున ఇట్లు లేదు. ఈ చెప్పబోవుముఖ్యవిషయము నెందరు గుర్తించిరో ఎరుగను! రామాయణము యొక్క మొదటి నాల్గు సర్గలు తీసివేసినచో ఐదవసర్గనుంచి రామాయణమూల గ్రంథము ప్రారంభించునని యు అక్కడినుండియే వాల్మీకీయమనియు నిష్కర్షగా చెప్పవచ్చును.

తొలి నాల్గుసర్గలందు నారదుడు వాల్మీకికి రామకథ చెప్పుట, తర్వాత క్రౌంచవధ, బ్రహ్మాగమనము, వాల్మీకీయ రామాయణమును కుశలవులు గానము చేయుటఇత్యాదులు చెప్పబడెను. ఐదవసర్గలో ప్రథమ శ్లోకమునుండి కథ ప్రారంభింపబడును "సర్వా పూర్వ మియం యేషాం ఆసీత్ కృత్స్నా వసుంధరా ప్రజాపతి ముపాదాయ నృపాణాం జయశాలినాం (1) యేషాం స సగరోనామ సాగరో యేన ఖానితః షష్టిః పుత్రసహస్రాణి యం యాంతం పర్యవారయన్ (2) ఇక్ష్వాకూణాం ఇదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనాం మహ దుత్పన్న మాఖ్యానం రామాయణమితి శ్రుతం 3) తదిదం వర్తయిష్యామి సర్వం నిఖిల మాదితః ధర్మకామార్థసహితం శ్రోతవ్య మనసూయయా (4) "అను మొదటి నాల్గుశ్లోకములు పరిశీలించినచో చిత్రముగా ఉండును!

ఈ నాల్గు శ్లోకములతర్వాత అయోధ్యపురవర్ణన ఇత్యాది విషయములతో కథ సాగును. కాని ఆ ప్రారంభ మెంత మహోదాత్తముగా ఉన్నది! "ఈ సర్వభూమండలము పూర్వమే, జయశాలురైన రాజులదో, ఎవరిలోనివాడైన సగరచక్రవర్తిచే సముద్రము త్రవ్వింపబడి సాగరమని పేరుపొందెనో ఆ మహాత్ములైన ఇక్ష్వాకు రాజుల వంశమందు రామాయణమని ప్రసిద్ధమైన మహదాఖ్యానము ఉత్పన్నమాయెను." అని ఆ ప్రారంభము రామాయణమునకు ఒక మహోన్నతమైన సింహద్వారమువలె నున్నది. బహుశః కాళిదాసు కాలమునకు ఇదే రామాయణమూలగ్రంథ ప్రారంభమనియు, అక్కడి నుంచే వాల్మీకీయ మనియు జగద్విదితమై యుండెడిదేమో. లేనిచో ఆయన తన రఘువంశమును ఈ పద్ధతిలోనే ప్రారంభించునా? వాల్మీకీయ ప్రారంభము చూచినచో కాళిదాసీయము దాని కనుకృతియని చప్పున స్ఫురించును. "ఆసముద్రక్షితీశానాం ఆనాకరథవర్త్మనాం యథావిధి హుతాగ్నీనాం ...త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణాం యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినాం... రఘూణా మన్వయం వక్ష్యే..." అని కావ్యమును ప్రారంభించిన కాళిదాసుకాలమున రామాయణప్రారంభము "సర్వా పూర్వ మియం యేషా మాసీత్ కృత్స్నా వసుంధరా" అను శ్లోకమునుంచే అని ప్రసిద్ధమైయుండు ననుకొనుట సమంజసము.

ఈ నాల్గు శ్లోకములలో నాల్గవదైన శ్లోకమున "త దిదం వర్తయిష్యామి" అనబడినది. అనగా అట్టి రామాయణమని ప్రసిద్ధి పొందిన ఆ యాఖ్యానమును నేను వర్తయిష్యామి లోకమున ప్రవర్తిల్ల జేసెదను, అనబడినది. 1,2,3,4 సర్గలందు గ్రంథకర్తనుగురించి రచన ప్రథమ పురుషక్రియలతో సాగగా, ఈ 5వ సర్గయందే ఈ ఉత్తమ పురుషక్రియ ప్రయోగింపబడినది. మరి ఈ వర్తయిష్యామి అనిన కర్త ఎవరు? వాల్మీకి యని మనకు సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్నది;

మనకంటె వాల్మీకికి సన్నిహితులైన రామాయణావతారికాకారులు కర్త వాల్మీకి యని చెప్పుచున్నారు. కాదన్నవారు నాటినుండి నేటి వరకు లేరు.

కాని భారతవిషయమున ఇట్లు లేదు. ఆ గ్రంథ మెవరివాక్కో ఎందరివాక్కో ఏ వా క్కెపటిదో ఇద మిద్ధముగా ఎప్పటికిని చెప్పుటకు వీలుగాదు. వేదమంత్రము లే యే ఋషులచే ప్రోక్తములైనవో వారిపేర్లు చెప్పబడినవి; అట్లే రామాయణమును. భారతవిషయముననే చిక్కు వచ్చినది. రామాయణ భారతముల పౌర్వాపర్యములను కేవలము భాషచేత నిర్ణయింపజూచుటకంటె ఆ భాషను వాడిన పద్ధతిని ఉభయగ్రంథములందు పరిశీలించి దానిపై ఊహింపబూనుట సమంజసముగా ఉండును.

రామాయణ భాష వాడిన పద్ధతిలో అనుస్యూతముగ ఒకానొక వ్యంగ్యలక్షణము కలదు. ఒక నిగ్రహము ఒక నిగూఢత ఒక విధమైన గాంభీర్యము ఆభాష నెచ్చటను విడనాడదు. ఇది రామాయణ భాషను గురించి ప్రధానముగ చెప్పవలసిన విషయము. రాముడింద్రుడో విష్ణువో ఎవరో మహానుభావుడని సూచనమాత్రమే చేయుచు ఆపరమార్థమును వాచ్యము చేయక కథనము నిర్వహించుటకు వలసిన రీతిగ భాషను వాడుట వాల్మీకీయపద్ధతి. కడుపులో ఒక సముద్రమంత అభిప్రాయము దాగియుండును; పైకి ఆపాతముగ ఏమియు గోచరించదు. శబ్దములూ వాని వాచ్యార్థములూ లలితములై మంజులములై ప్రమత్తులైన పాఠకులను గికురించును. ఇది ధ్వనిమార్గము.

రామాయణకథకే రహస్యార్థము కలదని అవతారికలు చెప్పును. "రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః రామస్య సహ సౌమిత్రేః..." అనబడినది. ఇట్లు వస్తువు భాష రెండును వ్యంగ్య

భావ విలసితములయి ఉండుట రామాయణ ప్రధానలక్షణము. ఇది వేదపద్ధతి. వేదమునకు వ్యంగ్యార్థము కలదేగాని, వాచ్యార్థము లేదు. బ్రహ్మమేధయా, మధుమేధయా అనినప్పుడు ఆ రెండవదానికి వాచ్యార్థము చెప్పుకొన్న చో సరిపోవునా? వేదమంతయు ఇట్లే యుండును. రామాయణ భాషాలక్షణ మిట్లుండుటచేత రామాయణము వేదమునకు అతిసన్నిహితము - అనగా భాషాప్రయోగ విధానమున.

కాని భారత మట్లు కాదు. భారతభాష వాచ్యార్థప్రధానమై యుండును. మంత్రయోగ వేదాంత శాస్త్రవిషయములను రామాయణము కథలో కలిపి హనుమదాకాశమగమనాది కథారూపములుగా చెప్పెను. కాని భారతము శాస్త్రవిషయములను నిర్నిగూఢముగ వాచ్యముగ వర్ణించును. సనత్సుజాతీయము. భగవద్గీత, యక్షప్రశ్నలు ఇత్యాదులు ఉదాహరణములు. అచ్చటచ్చట రామాయణభాషాపద్ధతులు వాడబడి యుండవచ్చును గాక, కానీ భారత భాష వాచ్యార్థ ప్రధానము. ఇదే తర్వాత పురాణ రచనకు ఒరవడి ఆయెను.

కనుక రామాయణభాష వేదమునకు సన్నిహితముగా నుండి పౌరాణికభాషకు దూరముగా ఉండగా భారతభాష పౌరాణికభాషకు సన్నిహితమై వేదభాషకు దూరముగా నున్నది. ఈ కారణముచేత కూడా రామాయణము భారతమునకంటె ప్రాచీన మనుకొన వచ్చును.

---

# శాకుంతలమందలి నాందీ శ్లోకము దేవీ స్తోత్రమే.

(అనుబంధము - 67 పేజీ)

జగత్ప్రసిద్ధమగు అభిజ్ఞానశాకుంతలమున గల నాందీశ్లోకమును ఇంతవరకు కేవలము ఈశ్వరస్తోత్రముగనే భావించుచున్నారు. కాని దానిలో పరమ రమణీయమగు మంత్రశాస్త్రార్థ ప్రతీతి గలదు! కవి కాళీవర ప్రసాద లబ్ధకవితాధౌరేయుడనిగదా ప్రశస్తి. ఈ శ్లోకమున ఆ మహానుభావుడు మాతృకాస్తోత్రమును చేసెను. ఆ చిత్రమైన ఉదంతమును వివరింతును:

"యా సృష్టి స్స్రష్టు రాద్యా, వహతి విధిహుతం యా హవి
ర్యా చ హోత్రీ,
యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య
విశ్వం,
యా మాహుః సర్వభూతప్రకృతి రితి, యయా ప్రాణినః
ప్రాణవంతః,
ప్రత్యక్షాభిః ప్రసన్న స్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః"

అర్థము:— ఎవతె స్రష్టయొక్క ఆద్య సృష్టియో, ఎవతె విధిహుతమైన హవిస్సును వహించునో, ఎవతె హోత్రియో, ఎవతెలిద్దరు కాలమును విధింతురో. ఎవతె శ్రుతివిషయ గుణయో, ఎవతె విశ్వమును వ్యాపించియుండునో, ఎవతెను సర్వభూతప్రకృతి యందురో, ఎవతె చేత ప్రాణులు ప్రాణివంతములగునో— ఆ ఎనిమిది ప్రత్యక్షతనువుల చేత ప్రపన్నుడైన ఈశుడు మిమ్ములను రక్షించుగాత—ఇదీ శ్లోకము.

కనుక బాహిరముగా కనుపించుచుండుటచేత ఇప్పుడు చెప్పబడుచున్న అర్థము—అష్ట తనువుల చేత ప్రపన్నుడై ఈశుడు మిమ్ములను

రక్షించుగాత అని. అష్టతనువు లేవి?—— జలం వహ్ని స్తథా యష్టా. సూర్యచంద్రమసౌ తథా. ఆకాశం వాయు రవనీ మూర్త యోష్టా పినాకినః." జలవహ్నియష్ట సూర్యచంద్ర ఆకాశవాయు అవని అను ఎనిమిది మూర్తులు గలవాడు అష్టమూర్తి——ఈశ్వరుడు. మనశ్లోకమునందు "యా సృష్టిః స్రష్టురాద్యా" అనగా జలము,"యా విధిహుతం హవి ర్వహతి అనగావహ్ని."యా చ హోత్రీ"అనగా యజమానుడు. "యే ద్వే కాలం విధత్తః" అనగా సూర్యచంద్రులు,"శ్రుతివిషయగుణా యాస్థితా వ్యాప్య విశ్వం" అనగా ఆకాశము, "యా మాహుః సర్వభూతప్రకృతి రితి" అనగా అవని. "యయా ప్రాణివంతః" అనగా వాయువు-ఈఎనిమిది ఈశ్వరుని మూర్తులు గనుక——ఆయన అష్టమూర్తి, అయితే శ్లోకమున 'యా, యే' యామ్. యయా (ఎవతె) అని స్త్రీలింగ మెందుకు వాడబడినది? 'తాభి రష్టాభి స్తనుభిః ప్రపన్నః ఈశః అవతు వః——ఇందు తనుః అనుశబ్దము సంస్కృతమున ధేనుః ఇత్యాదిశబ్దముల వలె స్త్రీలింగము. కనుక ఒక్కొక్కతనువునుగూర్చి చెప్పునప్పుడు, 'యా, యే, యామ్, యయా' అని స్త్రీలింగ సర్వనామము, వాడబడినది (ఎవతె, ఎవతెలిద్దరు, ఎవతెను, ఎవతెచేత——అట్టితనువులు) అని సమాధానము.

కానీ ఇందు ఎన్ని విపర్యయము లున్నవో పరిశీలించిన గోచరించును. అష్టమూర్తులు పైన చెప్పిన 'జలం వహ్ని' శ్లోకమునందలి క్రమముతో చెప్పబడినవని చెప్పుదురు. అట్లే తన నిఘంటువునం దిట్లే చెప్పెను. కానీ ఆ క్రమము కాళిదాస శ్లోకమున లేదు. శ్రుతి విషయగుణ ఇత్యాది పై అనుష్టుప్ శ్లోకక్రమ ప్రకారము ఆకాశ మగును. ఆ తర్వాత వచ్చు సర్వభూతప్రకృతికి ఆ క్రమమే అయినచో వాయు వని చెప్పవలెను. కాని పృథ్విని సర్వభూత ప్రకృతి అని చెప్పవచ్చునేగాని వాయువును గాదు. తర్వాత, 'యయా ప్రాణినః ప్రాణవంతః' పై క్రమము చొప్పున పృథ్వికి వర్తించును. కానీ అది చెల్లదు. వాయువు

నకే సరిపోవును. జగత్ప్రాణః శ్వసనః శబ్దములు ప్రమాణములు (శ్వసప్రాణనే), "శ్రుతి విషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వం" అను నది ఆకాశమునకే వర్తించుచున్నను రెండు విభిన్నములైన విశేషణము లగుచున్నవి. (శ్రుతివిషయగుణా అనగా "శబ్దగుణం" స్థితా వ్యాప్య విశ్వం అనగా "వ్యోమం") ఈ రెండును విశేషార్థ స్ఫోరకములుగా ఉన్నవి, ఆకాశమును మాత్రమే చెప్పునవి కావు.

మరొకటి ముఖ్యమైనది— యా సృష్టిః స్రష్టురాద్యా అనగా జలమనుట పొసగదు. జల మనుటకున్న ప్రమాణములు క్వాచిత్కములు "అయం పూర్వ మపః సృష్ట్వా తాసు వీర్య మపాసృజత్" అని ఒకటి. కానీ స్రష్టయొక్క ఆద్యసృష్టి జలముగాదు, మరియు పంచభూతములు ఆద్యసృష్టి కాదు. శ్రుతులందు ఆగమశాస్త్రములందు ప్రతిపాదింపబడిన సృష్టిక్రమమున కిది విరుద్ధము, "ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః" ఇతి తైత్తరీయే— కనుక పంచభూతములందు ఆద్యసృష్టి ఆకాశము. కానీ ఆకాశాది పంచ భూతములకు పూర్వము మనస్సు, తత్పూర్వము బుద్ధి, తత్పూర్వము అహంకారము తత్పూర్వము మహత్తు, తత్పూర్వము అవ్యక్తము అనగా యోనిచక్రస్వరూపఅయిన పరాశక్తి, తత్పూర్వము ఆత్మ. తైత్తరీ యమునందు పంచభూత పూర్వదశలు గర్భితములు, ఈ విషయమును కఠోపనిషత్తు వ్యక్తము చేయును. "ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః, అర్థేభ్యశ్చ పరం మనః, మనసశ్చ పరాబుద్ధిః, బుద్ధేః పరతరంమహాః, మహతః పరమవ్యక్తం, అవ్యక్తాత్ పురుషః పరం, పురుషాత్ నపరం కించిత్, సా కాష్ఠా సాపరా గతిః" కామకళావిలాసాది తంత్రగ్రంథము లిట్లే చెప్పుచున్నవి. కనుక ఎట్లును "యా సృష్టిః స్రష్టు రాద్యా" జలము గాదు.

మరి ఇట్టివ్యత్యాసము లెందుకు వచ్చుచున్నవి? శ్లోకమునందలి యా సృష్ట్యాద్యర్థములు అష్టతనువుల కన్వయింపవా? అనగా అష్టతనువుల కన్వయించును. కానీ కేవల మష్టతనువులకే అన్వయించునవి కావు— అని నా మతము, అష్టతనువులకే అన్వయించునవి అయినచో, ఈ భాగమునందు భాష మరింత సుస్పష్టముగను, అతివ్యాప్తిలక్షణ రహితముగను ఉండెడిది. అంతయు మన శ్లోకమునందలి విషయమే అయిన శ్రీదక్షిణామూర్తి స్తోత్రశ్లోకము నొకదానిని చూడుడు!

"భూరంభాంస్యనలోఽనిలోఽంబర మహర్నాథో హిమాంశుః
పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్.
.................................
తస్మై—శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా
మూర్తయే."

వస్తువు ఉభయత్ర ఒక్కటే. అయినను ఈ శ్లోకము సుస్పష్టముగను, అర్థాంతరమున కవకాశ మివ్వనిదిగను ఉన్నది. మన శ్లోకమున ధ్వని ఉద్దిష్టము కాకున్నచో అదీ ఇట్లే ఉండెడిది. అప్పుడు వెనుక చూపబడిన వ్యత్యాసములకు తావుండెడిదిగాదు. కానీ ఇప్పుడు అర్థాంతర స్ఫూర్తికి తావుండుటచేత ఇట్టి వైఖరిని కవి బుద్ధిపూర్వకముగ పెట్టెననుకొనవలెను. కనుక ఇందు ధ్వని గలదు.

మన శ్లోకమందలి యాది పూర్వక విశేషణములు అష్టతనువుల కన్వయమగును. మరియు ఆ విశేషణములు చెప్పు విశేషార్థములు, లక్షణములుగా గలిగినట్టియు, యాశబ్దాన్వయమున కనువై ఈశః శబ్దలక్షితవస్తువునకువలె అష్టతనువులు గలిగినట్టియు వస్తు వేదయిన ఉన్నచో దానికికూడా వర్తించును. అనగా యాదిపూర్వకవిశేషణము

అన్నియు అష్టతనువులకేగాక మరొకస్త్రీలింగలక్షితయగు దానికి గూడా చెల్లును. ఆ వస్తువు ఏది? పరాభట్టారికయగు "త్రిపురసుందరి యే" అని సమాధానము. ఇది ఎట్లు?

శాకుంతల శ్లోకము ఒక కవియొక్క సాధారణమగు ఊహపై గాక శాస్త్ర సిద్ధాంతము పై నాధారపడియున్నది. అది తెలిసినచో ఈ శ్లోక మెట్లుద్భవించినదో తెలియగలదు. (1) పంచభూతాద్యష్టతన్వాత్మకమగు సృష్టి సమాహారమున శక్తియే అనియును (2) శక్తిశివుని తనువనియును. (3) శివశక్తులు అభిన్నములు లింగరహితములు అనియును (4) అటిశక్తి అభేదముచేత అష్టమూర్తిమత్వాది సర్వశివ లక్షణములు కలిగియున్నదనియును—నిగమాగమములు సిద్ధాంతము చేసినవి.

కనుకనే శక్తిని సమయ అందురు "సమయా నామ శంభునా సామ్యం పంచ విధం యాతీతి సమయా— అత ఉభయోస్సమ ప్రాధాన్యేనైవ సామ్యం విజ్ఞేయం పంచ విధ సామ్యంతు అధిష్ఠాన సామ్యం. అవస్థాన సామ్యం, అనుష్ఠాన సామ్యం, రూపసామ్యం" (లక్ష్మీధరవ్యాఖ్య 41 శ్లో).

ఇది శాస్త్రశిఖరమందున్న అచ్ఛసూత్రము. ఇది క్రిందకు జారి సామాన్యరూపము ధరించినదశలో శివు డష్టమూర్తియని మాత్రమే చెప్పును. ఈ సామాన్య రూపము భూరంభాంస్యనలేత్యాది శ్లోకమున గలదు. కానీ మన శ్లోకము అచ్ఛ శాస్త్రమునే చెప్పును. ఈ సిద్ధాంతము నందలి ప్రథమాంశమును సౌందర్యలహరి ఇట్లు చెప్పును;

"మనస్త్వం వ్యోమంత్వం మరుదసి మరుత్సారథి రసి,
త్వ మాపస్త్వం భూమిస్త్వయి పరిణతాయాం నహి పరం,
త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా,
చిదానందాకారం శివయువతి భావేన బిభృషే"

ఇంతకన్న ఉత్కృష్టమైన ప్రమాణముండబోదు. అట్లే ద్వితీయాంశమునకు "శరీరం త్వం శంభోః..." అని ఆ గ్రంథమే చెప్పును. ఈ విషయమునే గీతాకారుడు "భూమి రాపోఽనలో వాయుః ఖంమనో బుద్ధి రేవచ, అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టథా" ఇత్యాదిగా చెప్పెను.

నిగమాగమములకు పరమార్థమైయున్న ఈ శాస్త్రవిషయమునే మన శ్లోకము చెప్పుచున్నది. అందును ప్రథమాంశమైనశక్తి యొక్క సర్వకర్తృత్వమును ప్రతిపాదించుటయే దేవ్యుపాసకుడగు కాళిదాసునియొక్క ఆశయము. కనుకనే ఈ విషయము తన జగత్ప్రసిద్ధమగు నాటకము యొక్క ఆరంభమున నాందీశ్లోకమునకు వస్తువుగా గైకొనెను. అందుచే ఈ శ్లోకమున తను శబ్ద ప్రయోగము వచ్చినది. ఈ శబ్దము యొక్క విశిష్టత ముందుముందు మరింత విశదము చేయబడును.

కనుక శాస్త్రవేత్తయగు కాళిదాసు తత్ స్పృహతో మూడు విషయములను ప్రతిపాదించు బుద్ధిగలవాడై ఈ శ్లోకమును నిర్మించెను.

ఒకటి; పరాశక్తిసర్వకర్త్రి;— ఈ పక్షమున శ్లోకమంతయు శక్తిపరముగా అన్వయమగును. అప్పుడు యాదిపూర్వక విశేషణము లన్నియు శాస్త్రోక్త వివిధ శక్తి లక్షణములను ధ్వనింప జేయును. ఈశః శబ్దము ప్రతిబింబ మాత్రత్వముచేత శక్తినే ప్రతిపాదించునట్టి శాస్త్రము ఇందు నిక్షిప్తమై ఉన్నది.

రెండు: పరాశక్తి శివుని తనువు అని; —ఈ పక్షమున యాది పూర్వకవిశేషణములు అష్టమూర్తులను వ్యష్టిగా ప్రతిపాదించి, యాది సర్వనామములచేతను తనుశబ్దముచేతను సమిష్టిగా శక్తిని ధ్వనింపజేసి

అట్టి శక్తిచేత ప్రపన్నుడైన శివుడు అని అన్వయమును ఇచ్చును. అనగా అట్టితనువు లేనిచో శివుడు కార్యసమర్థుడు గాడనియు, కనుక మరల శక్తియే సర్వకర్త్రియనియును ధ్వని.

మూడవది: శివశక్తులు అభిన్నములనియును కనుక అష్టమూర్తి యగు శివుడు మిమ్ములను రక్షించుగాక— అను సామాన్యార్థమునకు అన్వయమగును.

ఈ శ్లోక మిట్లు త్రివిధాన్వయములకు అనుకూలమగు నిర్మాణ మును గలిగి కవ్యుద్దిష్ట పరమార్థమగు దేవీస్తోత్రమును ప్రధానముగా ప్రతిపాదించునదై ఉన్నది. క్రమముగ నీ అన్వయము లెట్లు ఇందు గలవో వివరింతును:—

శివశక్తు లభిన్న మనిగదా సిద్ధాంతము—"న శివేన వినా దేవీ దేవ్యా చ న వినా శివః, నైచయో రంతరం నాస్తి, చంద్రచంద్రికయో రివ" మంత్రశాస్త్ర గ్రంథములందు శివునికి చెప్పు విశేషణములన్నియు శక్తికిని చెప్పబడినవి. "త్రిణయనాయైనమః, ఆత్మవిద్యాయైనమః, నిర్గుణాయైనమః, తత్త్వమస్యర్థ స్వరూపిణ్యైనమః. బ్రహ్మాణేనమః, ఇట్లు చెప్పుచు లలితా సహస్రనామావళి ఆమెను 'అష్టమూర్తయే నమః' అనును. ఇక ఇంతకంటె ప్రమాణము కావలెనా? ఈశ్వరునకేగాక శక్తికి కూడా అష్టమూర్తుల విశేషణము వర్తించును. అట్లయినచో ఈ శ్లోకము ఈశునేగాక శక్తినిగూడా ప్రతిపాదించినట్లే యగునుగదా! అట్లే అగును. అట్లయినచో ఆ పక్షమున అన్వయ మెట్లు?

వెనుకటివలెనే తనువిశేషములు వివరించి అట్టి జలాది తనువుల చేత ప్రపన్నుడైన సా ఈశః అనగా శక్తిః, అవతు వః అనవలెను. ఈశః ప్రపన్నః పుంలింగ శబ్దములుగదా, ఇ దెట్లు అనినచో — వినుడు. యస్యాస్సా ఈశః అష్టాభిః తనుభిః ప్రపన్నః అవతు వః అనునట్టి భాషా

పద్ధతి నిగమాగమసంప్రదాయము. ఈ విషయము నతిజాగ్రతగా అనుస రింపవలెను ఎందుకనగా మన శ్లోకరహస్యమంతయు ఈ సంప్రదాయము మీదనే ఆధారపడియున్నది. "న త్వ మంబ పురుషో న చాంగనా చిత్స్వరూపిణి న షండతాపి తే నాపిభర్తృరపి తే త్రిలింగతా త్వాం వినా న తదపి స్ఫురేదిదం"

శివశక్తులకు లింగవ్యత్యయము చేసి చెప్పుట శ్రౌత భాషయందును తంత్రములందును గలదు. "తత్సత్యం స ఆత్మా" అని శ్రుతి. ఇందు సత్యం నపుంసకలింగము, సః పుంలింగము. అట్లే "అవ్యక్తాత్ పురుషః పరం పురుషాన్న పరంకించిత్ సా కాష్ఠా సా పరాగతిః" వెనుకటి వాక్యమునందెట్లు పున్నపుంసకలింగములు ఏకవస్తువునకే వాడబడినవో అట్లే ఈ రెండవ శ్రుతి వాక్యమున గూడా పురుషః అను పుంలింగశబ్దమునకు సా అను స్త్రీలింగసర్వనామము వాడబడినది. ఇక తంత్రగ్రంథములందలి ఉదాహరణ— కామకళా విలాసమున ద్వితీయ శ్లోకము.

"సా జయతి శక్తి రాద్యా నిజ సుఖమయరూప నిత్యనిరుపమాకారా భావిచరాచరబీజం శివరూపవిమర్శనిర్మలాదర్శః" ఇందు శక్తిఃఆద్యా అనునవి స్త్రీలింగశబ్దములు. ఈ రెండును సా యను స్త్రీలింగ సర్వనామము చేత వివక్షితమైనవి. కనుక ఇందు కర్త స్త్రీలింగమునందున్నది మిగిలిన నిత్యనిరుపమాకారేత్యాదులు సా యను స్త్రీలింగ లక్షితమైన శక్తికి విశేషణములు. తత్సంబంధ విశేషణములు స్త్రీ లింగమునందే ఉండవలెనుగదా? కాని ఈ 'సాజయతి' శ్లోకమున భిన్నలింగములు వాడబడినవి. "నిత్యనిరుపమాకారా" స్త్రీలింగము, "భావిచరాచరబీజం" నపుంసక లింగము, "నిర్మలాదర్శః" పుంలింగము. ఇట్లు మూడులింగములును ఒక్క వస్తువునకే వాడబడినవి. కనుక శివశక్తులను గూర్చి చెప్పునప్పుడు నామరూపాత్మకజగద్వస్తుజాలమున కన్వయించు లింగరూపభాషామర్యాద

పాటింపబడదు. ఈ విషయమునకు ఆధారము నిగమాగమసిద్ధాంతము. —తత్ప్రకారము శివశక్తులకు లింగభేదము లేదు. మఱియు లింగమే లేదు. "నైవ స్త్రీ న పుమానేషః, నైవచాయం నపుంసకః యద్యచ్ఛరీర మాదత్తే తేన తేన సయుజ్యతే." ఇతి శ్రుతిః మరొకటి "ఏకో రుద్రస్య సర్వ భూతేషు గూఢో, మాయారుద్రో సకలో నిష్కలశ్చ, స ఏవ దేవీ న చ తద్విభిన్నా . . ." స ఏవదేవీ నచతద్విభిన్నా అనునది ముఖ్యముగా గుర్తింపవలెను. "త్వం స్త్రీ త్వం పుమాన్" అని బృహదారణ్యకము నందును ఒక టెట్టిదే గలదు. ఇక తంత్రగ్రంథములందును ఇంతే.— "స్త్రీ రూపాం చింతయేత్ దేవీం పుంరూపాం వా విచింతయేత్ అథవా నిష్కలాం ధ్యాయేత్ సచ్చిదానంద విగ్రహాం" ఈ ప్రమాణములు చాలు ననుకొందును–'శివశక్త్యైక్యస్వరూపిణ్యైనమః నిర్ద్వైతాయైనమః (ల. స. నా).

కాళిదాసు వ్యాసవాల్మీకుల కోవకు చెందిన వాడు. కాళీకటాక్ష సంపన్నుడు; సత్సంప్రదాయ విదుడు. నిగమాగమభాషా లక్షణ మెరిగిన వాడు. కనుక అట్టి సంప్రదాయ విషయమును చెప్పునప్పుడు సంప్ర దాయ భాషనే వాడెను. ఇదీ రహస్యము! ఇప్పుడు మన శ్లోకము నన్వ యింతును' యాసృష్టిః స్రష్టురాద్యా . . . . యయా ప్రాణినః ప్రాణ వంతః సా ప్రత్యక్షాభిః తాభిః అష్టాభిః ప్రపన్నః ఈశః అవతు వః"— ఈ అన్వయము వెనుక చూపిన ప్రమాణములచేత నిర్దుష్టమే గాక సంప్రదాయపునీతము.

ఈ సందర్భమున ఈశః అనుట యేల అని మరొక సందేహము రావచ్చును. దానికి - తంత్రశాస్త్ర గ్రంథ పరిపాటి ఒకటి గలదు. ఈశః అనునది సగుణబ్రహ్మము. స్తుతికి సగుణ బ్రహ్మమే స్వీకరింప వలెను. ఆత్మవస్తువైన నిర్గుణ బ్రహ్మము ఉపాస్యము కాదుగనుక, "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" కన్నుక అట్టిది ఉపా

సనకు అలవిగాదు. కనుక ఉపాస్యము ఇష్టఫలప్రాపకాద్యఖిలక్రియా సమర్థమయిన సగుణ బ్రహ్మమునే ఉపాసకులు గై కొనవలెను 'అవా జ్మానసగమ్యం తం శ్రుతిరోబ్ధయితుంసదా, జీవ మీశం జగద్వ్యాపిన మాశ్రిత్య ప్రబోధయేత్", అని ప్రమాణము. అట్టి సగుణబ్రహ్మ శక్తి. మన శ్లోకమునందు స్తుతింపబడిన ఈశః ఎవరోగాదు శక్తియే. ఈ శాస్త్ర విషయమును తెలిసికొనినగాని శ్లోకతత్త్వము బోధపడదు. తంత్రశాస్త్ర గ్రంథములందు మేరుతుల్యమగు కామకళావిలాసమున ఆరంభ శ్లోకము నకు మనశ్లోకము మూడు మూర్తులా పోలియుండును. ఆశ్లోకము- "సకల భువనోదయస్థితి లయమయ లీలా వినోదనోద్యుక్తః, అంతర్లీన విమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః" - ఉభయశ్లోకములందు తనువు ప్రసక్తమైనది. ఒకచోట "అవతు" అనగా మరొకచోట "పాతు" అనబడినది. ఒకచోట ఈశః అనగా మరొకచోట మహేశః అనబడినది. శ్లోకపద్ధతి అంతయు ఒక్కటే, శాస్త్ర విషయ మొక్కటే, ఇక ఉన్న కించిద్భేదమును చెప్పి స్వారస్య మెరిగింతును. తంత్రశ్లోకమున ప్రకాశమాత్రతనుప్రపన్నుడై సర్వనియామకత్వ ధర్మములు గలిగిన సదాశివుడు స్తుతింపబడెను. ఇతడు కేవలము శుద్ధసత్త్వ ప్రధానయగు పరాశక్తి సహితుడు సృష్టి స్థితిలయ కార్యోద్యుక్తుడు, కామేశ్వరుడు. కానీ మన కావ్యశ్లోకమున ప్రత్యక్షతను ప్రపన్నుడైన ఈశ్వరుడు స్తుతింపబడెను. ఈ ఈశ్వరుడెవడు ఆమహేశ్వరుడెవడు? శుద్ధసత్త్వప్రధానయగు పరాశక్తియందు ప్రతి ఫలించిన నిర్గుణ బ్రహ్మముయొక్క ప్రతిబింబము సదాశివుడు. ఇతడు సంకల్పమాత్ర స్థితియందున్నవాడు. ఈ సదాశివుడే వెనుకటి తంత్ర శ్లోకమునందలి మహేశుడు. ఇక ఈ సదాశివుడు మరల పరాశక్తి యందు ప్రతిఫలింపగా తోచిన ప్రతిబింబము ఈశ్వరుడు. ఇతడు సమష్టి శరీరమైన బ్రహ్మాండమున కధిపతి. ఈ సమిష్టి శరీరమే మన శాకుంతల శ్లోకమందలి అష్టతనువులు. కనుకనే మన శ్లోకమున ఈశః అనుపదము

వచ్చినది. ఇది అతి ముఖ్యముగా గుర్తింపవలసిన సంగతి. కానీ ఇచ్చట గ్రహింపవలసిన సూత్రమేమిటనగా శాకుంతల శ్లోకమందలి ఈశ్వరుడును కామకళా విలాసీయ శ్లోకమందలి మహేశుడును ప్రతిబింబములు మాత్రమే ప్రతిబింబము లేమి చేయగలవు? పోనీ, ఈ ప్రతిబింబములకు బింబమైన నిర్గుణబ్రహ్మమేదైన చేయగలదా? "నచేదేవందేవో నఖలు కుశలఃస్పందితుమపి." ఇవి ఏవి ఏమీ చేయలేవు, కనుక ఏదైనా చేయబడినది అనినచో పారిశేష్యాత్ శక్తియే అనుకొనవలెను. 'సర్వకర్త్ర్యై నమః'. ఈశ్వరసదాశివులు పంచబ్రహ్మలలోనివారు. పరాశక్తి పంచబ్రహ్మాసనాసీనగా ఉన్నప్పుడే వారు వ్యాపారసమర్థులగుచున్నారు. తద్విరహితులైనప్పుడు వారిని తంత్రములు పంచప్రేతము లనుచున్నవి. కనుక ఈశః అనిస్తుతించినను మహేశః అనిస్తుతించినను ఆస్తోత్రము సర్వాధారమైన పరాశక్తికే చెందుచున్నది. "సర్వాధారాయై నమః." కనుక శాకుంతలశ్లోకము కామకళా కళావిలాసీయ శ్లోకపద్ధతి ననుసరించి నిర్మింపబడినదని గ్రహింపవలెను. 'కారయిత్ర్యైనమః' ఈశ్వరత్వ విధాయిన్యై నమః, సకలాధిష్ఠానాయై నమః, కనుక మన శ్లోకమున ఈశశబ్దముయాదృచ్ఛికముగా సామాన్య వాచకముగా ప్రయోగింపబడలేదని గ్రహింపబడినచో నేను కృతార్థుడనయినట్లే. ఈ శ్లోకమున ఏదియును యాదృచ్ఛికముగా ప్రయోగింపబడలేదు. అంతయు సాభిప్రాయముగనే ఉన్నది. అన్నిశబ్దములు శాస్త్రపరిమళ భరితములు.

ఈ విధముగా అష్టతను ప్రసన్నుడైన సా ఈశః అవతు వః.

ఇక రెండవ విషయము. ఈ విశేషణములన్నియు శక్తికి విశేషణములు.

"యా సృష్టిః స్రష్టురాద్యా" శక్తి ఎట్లు? జల మనుటకంటె శక్తియనుటకే శ్రౌతవాఙ్మయమున ఎక్కువ బలమున్నది. శ్రుతులు

ఆద్యస్సృష్టి శక్తి అనుచున్నవి. "త దేవ సౌమ్యైక మగ్ర ఆసీత్, సం నిత్యం...ఏక మే వాద్వితీయం బ్రహ్మ..." తస్మిన్ మరుశు క్తికాస్థాణు స్ఫటికాదౌజల రౌప్యపురుష రేఖాదివ లోహితా శుక్ల కృష్ణ గుణమయీ గుణసామ్యా నిర్వాచ్యా మూలప్రకృతిరాసీత్" ఇతి పైంగలో పని షత్. "ఆత్మానంద్వేధా విభజ్య స్త్రీపుంభావ మాపన్నః" అని బృహ దారణ్యకను. కామ కళావిలాసీయ ద్వితీయ శ్లోకమునకు చిద్వల్లీ వ్యాఖ్య చూడుడు. అందు "త్రిభ్య స్తేజోభిన్నాదభ్యః పురాభూతా త్రిపురేతి" "తేజోభిన్నాదిభ్యః పూర్వస త్త్వమేవహి సర్వ తత్త్వాత్మికాంచస్వం బ్రహ్మణః" మరొక చోట "సర్వపూర్వ వర్తిన్వం." ఆవ్యాఖ్య చూపిం చిన వామకేశ్వరతంత్రీయవాక్యము "త్రిపురా పరమాశక్తి రాద్యా జాతా మహేశ్వరీ..." ఇందలి జాతా అనుమాటగాని పూర్వవ్యాఖ్యా గత భూతేతి క్రియగాని ఆమె సృష్టింపబడినట్లు చెప్పుచున్నవి. కనుక ఆమెయే ఆద్యస్సృష్టి. ఈమె ఆద్యస్సృష్టియైనచో ఆమె ఆదిమధ్యాంత రహితయని శాస్త్రము చెప్పుచున్నదిగదా! అదెట్లు? అన్నచో, ఇచ్చట కార్యకారణ సంబంధ మున్నను ఈ ఆద్య శక్తి అట్టి సంబం ధము లేనిది అని తాత్పర్యము-'కార్యకారణనిర్ముక్తాయై నమః'.

కనుక "యా సృష్టిః స్రష్టురాద్యా" అనుచో సృష్టి యతి శక్తి రాద్యా" అని గ్రహింపవలెను.

వేదవ్యాస ప్రణీతమైన దేవీభాగవతము దీనికి ప్రమాణము. ఆందా ఋషి గ్రంథారంభమున రచించిన నమస్క్రియా రూపకమైన శ్లోకము ఇట్లున్నది "సర్వే చైతన్య రూపాం తా మాద్యాం విద్యాంచ ధీమహి" ఛందము గాయత్రి దీనికి నీలకంఠవ్యాఖ్య ఆద్యాం అనాదిభూతాం- ఇంతకంటె ఉత్తమోత్తమ ప్రమాణము నుండదు - ఈ పద్ధతిలో వ్రాయుట ఈ కవికి అలవాటని అతని మేఘసందేశమందలి "సృష్టి రాద్యేవధాతుః" అను శ్లోకఖండము చూపును. శాకుంతలమునందే

ఇట్టిది మరొకటి కలదు. "స్త్రీ స్వస్తికేస్మి రవపరాప్రగిభాతి సా మే, ధాతు ర్వఘుత్వమనుచింత్య స్వపుశ్చ తిస్య్యా" ఆ పద్ధతిని ఎవదు వాల్మీకిమహర్షి నుంచి గ్రైకొనినట్లు తోచుచున్నది. సుందర కాండ- "త్వాంకృతోవ్వపర తం మన్యే రూపకర్తా స విశ్వసృట్.

(శ్రీ) సూక్తమున శ్రీమహాలక్ష్మీధ్యానమున బాలార్కకోటి ప్రతిభాం త్రినేత్రాం ... హామాద్యాం ... శ్వరీం ... స్వజాయై నమః (లసనా).

ఇక రెండవ విశేషణము- "వహతి ... హవిః" అనగా శక్తి. శక్తి అగ్నియే. అగ్నిషోములు శివశక్తులు, తన్మిథున కృత్యసంజనితమే సూర్యబింబము. శివుడైన అగ్ని శివశక్త్యభేద చేత శక్తియగును. "శశి తపన వైశ్వానరమయీం" సౌందర్యలహరి. "దహనేందు విగ్రహోభాతి" అని కామకళావిలాసము. త్రయ్యైనమః'

'యాచహోత్రీ'-హోత అనగా యజమానుడు శక్తియే. 'యజ మాన స్వరూపిణ్యైనమః. స్వాహాయైనమః, యజ్ఞరూపాయై నమః యజ్ఞకర్త్ర్యైనమః'.

"యే ద్వే కాలం విధత్తః-ఇది చంద్ర సూర్యులకు గదా వర్తిం చును?" "తపనశశి వైశ్వానరమయీంచేత శక్తికి వర్తించును.చంద్రుడు శక్తియే. "చంద్రాంహిరణ్మయీంలక్ష్మీం" - 'కలానిధయే నమః, కలావత్యైనమః, చంద్రనిభాయైనమః" "సూర్యుడుకూడా శక్తియే. 'మిత్రరూపిణ్యైనమః "సూర్యాంహిరణ్మయీం" 'తమోపహాయై నమః, కాలహంత్ర్యైనమః, దేశకాలాపరిచ్ఛిన్నాయైనమః.

"శ్రుతి విషయగుణా"- శ్రుతులకు విషయమైన గుణములు గలది అని ధ్వన్యర్థము. కవి విశేషార్థము నుద్దేశింపకపోయినచో ఇట్టి

శబ్ద జాల మక్కరలేదు. మరొకటి - శ్రుతులు అనగా శ్రవణములకు విషయము కావలెనన్నచో సగుణమే కావలెను. లేనిచో "యచ్ఛ్రోత్రేణ నశ్రుణోతి" అగును. కనుక ఇచ్చట శ్రుతులకు నిగమములను ధ్వని ఉద్దేశింపబడినది. వస్తువు శక్తియగు సగుణబ్రహ్మమును గురించియే. నాత్రసంశయః 'శ్రుతి సంస్తుతవైభవాయై నమః'

'యాస్థితా వ్యాప్యవిశ్వం'- ధ్వనిపక్షమున యా' దీప దేహళి న్యాయమున శ్రుతేత్యాదికిని దీనికిని వర్తించును. "యాస్థితా వ్యాప్య విశ్వం" శక్తియే. 'వ్యాపిన్యైనమః. సర్వాంతర్యామిన్యైనమః.

"యామాహుః సర్వభూత ప్రకృతి రితి"- శక్తియే ప్రకృతి. "తస్మిన్ మూలప్రకృతి రాసీత్" అని శ్రుతి. ప్రకృత్యైనమః' అని లక్ష్మీస్తోత్రనామములం దున్నది. 'మూల ప్రకృత్యైనమః' సర్వాధారాయైనమః.'

"యయా ప్రాణినః ప్రాణవంతః" - శక్తికి 'ప్రాణదాత్ర్యై నమః,' ప్రాణరూపిణ్యైనమః, ప్రాణమునిచ్చునది 'చైతన్యము చేతనా రూపాయై నమః.'

ఇట్టి లక్షణములు కలిగిన సా శక్తిః ప్రత్యక్షాభిః తాభిః అష్టాభిః తనుభిః ప్రపన్నః ఈశః అవతు వః.

ఇక మూడవవిషయము. ఇట్లు కవి, శక్తి ప్రసక్తి నుద్దేశింపక పోయినచో ఇందు తను శబ్దమేల గైకొనవలెను? తను శబ్దము స్త్రీలింగము కనుక 'యా యేయామ్ యయా'లు వచ్చినవిగదా అని మన వారనుకొనుట. అట్లయిన తను శబ్దమేల గొనవలెను? శరీరాది శబ్దములున్నవిగదా? వాటి నేల గైకొనలేదు? ఏదో ఒక శబ్దమును తీసికొనవలెను గదా కనుక తను శబ్దమును తీసికొనెనందుమా, అట్లేని, తను

శబ్దము నపుంసక లింగమునందును ఉన్నదికదా! అట్టి నపుంసక లింగశబ్ద మును కూడా గైకొనక స్త్రీలింగ శబ్దమునే ఏల గైకొనెను ఇంకా యాదృచ్ఛికమే సాభిప్రాయముగాదు అనుకొన్నచో అట్టివాడు కాళి దాసు జోలికి పోవుట అపచారము "యాసృష్టిః స్రష్టు రాద్యా" అను నది స్త్రీలింగ లక్షితమైన శక్తిని స్ఫురింపజేయుచు నను కొనుటకు మరొక ముఖ్యమైన కారణమున్నది. ఈ కవియే వ్రాసిన మేఘ సందేశము యొక్క ఉత్తర మేఘములోని 21 శ్లోకములో యక్షుడు తన ప్రియను వర్ణించిన పద్ధతి సౌందర్యాహారి శ్లోకములను జ్ఞప్తికి తెచ్చును. అందు ఆమెను, "యా తత్ర స్యా ద్యువతివిషయే సృష్టి రాద్యేవ ధాతుః" అనగా ధాతయొక్క ఆద్యసృష్టియనెను. జాగ్రతగా చూచినచో ఈ రెండు శ్లోకములందలి రెండు వాక్యములును సర్వథా ఒకటేనని గ్రహింపవచ్చును. మేఘ సందేశ వాక్యము "యువతి విషయే" కనుక శాకుంతల వాక్యము కూడా "యువతివిషయే" అనుకొనవలెను.

ఈ శ్లోక మొక పద్మవ్యూహము వంటిది. స్థూలముగ ఆకారమున రెండు మూర్తులు గోచరించును. ఒకటి "యా సృష్టిః" నుండి యయా ప్రాణినః" వరకు ఉన్న శ్లోక భాగము స్త్రీమూర్తిని గలిగిఉన్నది. ఆ తర్వాత వచ్చు భాగము పురుషమూర్తిని గలిగియున్నది. కనుక ఈ శ్లోకరూపము అర్ధనారీశ్వర దైవత్యము. శ్లోక హృదయము నిగ మాగమసారమై, సచ్చిదానందస్వరూపమైన శివశక్త్యభేదసిద్ధాంతము. ఇది శ్రుతిశిఖరనిష్యందమధురుకరి. శ్లోక నిర్మాణవైఖరి శ్రుతి పద్ధతిలో నడచినది. "యామాహుః సర్వభూత ప్రకృతిరితి"-ఇట్లా "తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః" ఇత్యాది శ్రౌతశైలిలో నడిచిపోవును. ఇందేదైన మంత్రము నిక్షిప్తమేమో అని అనుమానము కలుగుచున్నది. విజ్ఞులు పరిశీలింతురుగాక!

శాకుంతలమందు నాందీ శ్లోక మందును భరత వాక్యమందును ఒకే దైవత్యము స్తుతింపబడినట్లు కలదు.

మమాపి చ క్షపయతు నీలలోహితః
పునర్భవం పరిగతశక్తిరాత్మభూః, అని భరత వాక్యము.

అందులో నీల లోహితుడైన శివుడు పరిగత శక్తిః అనబడెను. శక్తి యుక్తుడయిన శివుడని భావము అక్కడెందుకనబడెను. కాళిదాసుచే శాస్త్రము ఎంత చక్కగా గుర్తింపబడినదన్న మాట. బ్రహ్మము ఉపాస్యము కాకపోవుటచేత ఆ మాట చెప్పబడినది. శివ సహ శక్తిః బీజమే నాందీ శ్లోకమున విరిసిన పువ్వువలె ఉన్నది.

ఇట్టి శ్లోకమున శబ్దములు యాదృచ్ఛికముగా అనాయాసత్వమువలె దొర్లినవిగావు. భావము ఏదో ఒక "మానుషానంద" దృష్టితో గైకొన్నది గాదు, భావము బ్రహ్మానందబంధురము, భాష ప్రౌఢగుణ సంపన్నము. దీనిని ఆ మహనీయుడు పరమార్థస్వభావాతో శబ్దసామగ్రిని, భావప్రతిపాదనా పద్ధతిని, భాషా మర్యాదను శాస్త్ర సంప్రదాయమును నుండి గైకొని విజ్ఞుడు గనుక ఇట్లు రూపొందించెను. నేను చెప్పినదంతయు కాళిదాసు శ్లోకమునందు దర్శించిన దానినే నేను చూపించితి. శాస్త్ర విషయములు ఉపనిషత్, ప్రమాణములు స్పష్టము చేయును. నేనే చెప్పుటచేత ఈ అపూర్వవృత్తాంతము అప్రామాణికము కానక్కర లేదు. సత్య మప్రమేయముగదా! కాళిదాస పద్యములన్నియు ఇట్టి జాగ్రతతో ఒప్పియుండును. కనుక మనసు కూడా అట్టి జాగ్రత్తతోనే ఆ మహాకవిని సేవించిన ఫలముండును. లేకపోయినను ఉండదు!



* ఈ వ్యాసాన్ని అనుకరిస్తూ ఒకడు. పరాభవ సంవత్సర ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ఒక వ్యాసాన్ని ప్రకటించాడు.

# కొన్ని ముఖ్యమైన అచ్చుతప్పులు

| పేజీ | తప్పు | సవరణ |
|---|---|---|
| 37,38 లో | కర్త అని ఉన్నచోట్ల | కర్మ |
| 39 | బుద్ధిం నిపతితామివ | బుద్ధిం నిపతితామివ |
| 40 | ఆమె స్మృతి, బుద్ధి | ఆమె స్మృతి, బుద్ధి |
| 58 | (2 వాక్యము మొదట "కనుక" లేదు.) | |
| 59 | 1 వాక్యము సీత | పీత |
| 60 | వరా, వరా } 3 వాక్యము | వరా |
| 109 | తస్మైయ | తస్యైయ |
| 115 | వరం కవీనాం | పరం కవీనాం |
| 116 | ద్విజ నిషేవితః | ద్విజ సంఘ నిషేవితః |
| 119 | ఫలన్భిశ్చ | ఫలవద్భిశ్చ |
| 120 | వత్రవరై | పత్రవర్ణై |
| 159 | విప్రు | పిప్రు |
| 166 | 2 వాక్యము–రావణునకు | రామునకు |
| 247 | ప్రసన్న | ప్రపన్న |
| 257 | సర్వేచైతస్య | సర్వస్మైతస్య |